# రాయచూరుయుద్ధము.

( చరిత్రాత్మకమగు నవల. )

గ్రంథకర్త

కేతవరపు వేంకటశాస్త్రిగారు.



రెండవకూర్పు

ప్రకాశకుఁడు

కేతవరపు అచ్యుతరావు.

విశాఖపట్టణము.

1938

 [వెల 1-8-0

ఆంధ్రమహాశయులారా!

మజ్జనకులు కేతవరపు వేంకటశాస్త్రిగారు రచించిన "రాయచూరుయుద్ధము" అనుచరిత్ర విషయికో నవల, చాలకాలము క్రిందట విజ్ఞాన చంద్రికా గ్రంథ మండలి వారుముద్రింపించి ప్రకటించిరి. ఆ పుస్తకములన్నియు వ్యయమగుట చేతను విజ్ఞానచంద్రికా గ్రంథమండలివారు మరల ముద్రింపంచకపోవుట చేతను,తత్తనయుఁడనగు నేను, విజ్ఞాన చంద్రికా గ్రంథ మండలి వారి యనుమతిని బడసి మరల ముద్రింపించితిని. కావున యాంధ్రసోదరు లందరు నన్ను ప్రోత్సాహింతురని నమ్ముచు న్నాను.

ఇట్లు తత్తనూజుఁడు,
కేతవరపు అచ్యుతరావు,
ప్రకాశకుఁడు.

విశాఖపట్టణము.
1–7–1938



# రాయచూరు యుద్ధము.

## భూమిక

ఈ రచియింపఁబోవు గ్రంథంబున స్వీకృతంబగు కథాంశము ౧౬ వ శతాబ్ద ప్రారంభ మ్మొదలిది. ఇక్కథాంశము కేవల మాంధ్రదేశంబునకు సంబంధించిన దగుటచేఁ బదాఱవ శతాబ్దారంభంబున నాంధ్రదేశస్థితి యెట్లున్నదో, తద్దేశంబునం గల భాగంబు లెవ్వరిచేఁ బరిపాలితంబు లగుచున్నవియో, తెలియఁ జేయుట యత్యావశ్యకము. మనము వర్ణించు కథాకాలము నాఁటికిఁ గృష్ణానది కుత్తరంబున నున్న బహమనీరాజ్యంబు నైదుభాగంబులు చేసికొని యైదుగురు మహమ్మదీయ ప్రభువులు పాలించుచుండిరి. అందు బేదరురాజ్యంబునుఅమీరు బెరీద్‌షాహా యను మహమ్మదీయ ప్రభువు పాలించుచుండెను. బుర్హాన్ నిజాంషాహా యను మ్లేచ్ఛనాయకుఁ డహమన్నగరంబును రాజధానిగాఁ జేసికొని కొంతభాగంబు నేలుచుండెను. ఇస్మాయిల్ ఆదెల్‌షాహా యను మహమ్మదీయప్రభువు విజాపురరాజ్యంబును, ఇమాద్‌షాహా వరాధ దేశంబును నిరర్గళంబుగ నేలుచుండిరి. కులీకుతుబ్‌షాహి యను తురుష్కనాథుండు గోలకొండ రాజ్యంబును బరిపాలించుచుండెను. అల్లాయుద్దీనుకాలంబున మహమ్మదీయులకధీనమైన మహారాష్ట్రదేశము మన కథాకాలము నాఁటికిఁ బారతంత్ర్యంబునందే యుండెను. పూర్వసముద్ర ప్రాంత మంతయు గజపతుల పాలనం బందుండెను. ఇంతేకాక

బలాఢ్యులైన సేనానాయకులు సమయము లభించినప్పుడు తమ ప్రభువులను ధిక్కరించి తమ పాలనము క్రిందనున్న దేశంబును స్వాధీనంబు గావించుకొని పాలించుచుండిరి. ఓరుగంటి రాజుల యొద్ద సేనాధిపతులుగా నున్న రెడ్లు కొండవీడు ప్రాంతము స్వాధీనపఱచుకొని పాలించుచుండిరి. ఉదయగిరి, చంద్రగిరి, పెనుకొండ, వినుకొండ, బెల్లముకొండ, నాగార్జునకొండ, కొండపల్లి, తంగేడు, కేతవరము మొదలగు దుర్గంబు లొకొక్కప్పుడు స్వతంత్రంబులై, మఱియొకప్పుడు మహారాజ్యాధిపతులకు వశంబు లయియుండెడివి. ఆకాలంబున తుంగభద్రానదీతీరంబున నున్న విజయనగరంబును రాజధానిగాఁ జేసికొనియాంధ్ర దేశంబునం గొంతయుఁ, గృష్ణానదికి దక్షిణంబుననున్న భూభాగం బంతయునుఁ, గృష్ణదేవరాయ లుద్దండ పరాక్రమంబుతోఁ బాలించుచుండెను. ఆంధ్రరాజ్యం బనెడి నాటకంబున ముఖ్యభాగంబును బ్రదర్శించి లోకంబు నానందింపఁజేయుటకు [illegible] రాజ నటుండు విజయనగర రంగంబునఁ బ్రవేశించెను. ఇతండు విద్యలం దును, నాయుధవిద్యలందును జాలినంత పరిశ్రమచేసి పాండిత్య ప్రతాపంబులం దసమానుండయి, ఆంధ్రభాషాభివృద్ధి గలిగించి "యాంధ్ర భోజుం" డని వన్నెకెక్కినట్లు, ప్రతాపాతిశయంబున వైరివీర సంహారంబుగావించి 'మూరురాయరగండ'డాది బిరుద పదంబులంది వాసిగాంచి, నిజకీర్తి చంద్రబింబకాంతి సంతతుల దిగంతంబుల వఱకు వ్యాపింపఁజేసెను. ఇమ్మహాత్ముని కాలంబున నాంధ్రభాష యత్యున్నత దశఁగాంచి మిక్కిలి ప్రఖ్యాతి

వహించెను. పెక్కం డ్రాంధ్రకవిచంద్రు లీరాజశేఖరునాశ్రయించి తమోనుదంబు లగు కృతిచంద్రికల లోకంబునంగప్పి, యెల్లఱకును మానసోల్లాసంబు కలిగించి తమ ధవళకీర్తుల నజరామ రంబుగఁజేసి మించిరి. ఇమ్మహీకాంతుని కాలంబున మహాగ్రథంబులవలెఁ గట్టడంబులును నిర్మితంబులై కవుల శిల్పంబులవలె శిల్పుల శిల్పంబులును వర్థిల్లి పూర్వుల యౌన్నత్యం బిప్పటివారికిఁ దెలియఁజేయుచుండెను. ఈధరాకాంతుని జీవితకాలము పదాఱవ శతాబ్దంబునకే కాక తక్కిన శతాబ్దంబులకుఁగూడ నలంకారంబు వంటిది. ఇతండు నభోమండల మధ్యంబున వెలుంగు మార్తాండుని చందంబున విజయనగరంబునఁ జండప్రతాపము తోఁ బ్రకాశించుచు, వైరి వీరుల పీచంబడంచి పెక్కుదుర్గంబు లాక్రమించి “రాజ్యంబు వీరభోజ్యం”బను వాక్యంబును సార్థకపఱిచెను. ఇతఁడు ౧౫౧౫ వ సంవత్సరంబున దిగ్విజయంబునకై నిర్గమించి యుదయగిర్యాది దుర్గంబుల జయించి తద్దుర్గాధిపతులలోఁ గొందఱఁజంపి వేఱొకకొందఱ బందీకృతులంగావించి విజయనగరంబునకుఁ గొనిపోయెను. ఇతండు కృష్ణకుత్తరంబున నున్న మహమ్మదీయప్రభువులకుఁ బ్రక్కలోని బల్లెమువలె సంచరించి భయంకరుఁడై యుండెను. ఒక్కొక్కప్పుడమ్మహమ్మదీయ పుంగవులతో సంగరంబు సలిపి జయంబుచెంది ప్రఖ్యాతుం డగుచుండె. కావునఁ గాకతీయమహీపతుల కాలంబున నలుగడలం దాండవించిన సంగ్రామనటుండు మగుడఁ గాళ్ళకు గజ్జెలుగట్టి

మహామోదంబున వర్తింపఁజొచ్చె. ఇట్లు ప్రవర్తిల్లిన సంగరంబులలో రాయచూరుదుర్గంబునుగూర్చి రాయలకు నాదిల్‌షాహకును సంభవించిన సంగరం బొక్కటి సుప్రసిద్ధమైనది. ఈ రాయచూరు యుద్ధమునుగూర్చి మీరు చదువుదురు.



# రాయచూరుయుద్ధము.

## మొదటి ప్రకరణము.

### ఒక నూతనపురుషుఁడు.

క్రీస్తుశకము ౧౫౨౦ వ సంవత్సర మేతెంచినది. మొదటి నెల కడచి రెండవ నెల వచ్చినది. చాంద్రమానంబుచే నది మాఘమాసము. అది సమశీతోష్ణములు కలదగుటచే జనంబుల కత్యంత సుఖదాయకంబయి యుండెను. దివాసమయంబున దివాకరుని ప్రభాజాలంబున శైత్యబాధ తొలంగించుకొను చున్నను, నిశాసమయములందు గజచర్మంబులవంటి దృఢతర వస్త్రంబులు గప్పుకొన్నను వడవడ వడఁకించుచు దవడలు దగ్గఱపడునట్లు చేయు చలిలేదు. పవటియందును నిశాసమయ మందును భయంకరంబగు ఘర్మంబు నొడలించి, తాళవృంతంబుల సాయంసమయంబున వారించినను నివారితంబులుగాని చెమ్మటల గల్గించు వేడిమిలేదు. ఇందుచే నాకాలంబు సౌఖ్యాకరంబని వేఱుచెప్ప నక్కఱలేదు. శీతం బతిక్రాంతంబగుటచేతను నవయవంబులు సంకోచించుకొని తజ్జనితంబగు శ్రమంబు, పడ వలసిన సమయంబు కాకపోవుటచేతను, దృఢతర వస్త్రంబులు సంపాదింపలేని బీదవారు సైతము నిద్రాసుఖంబు ననుభవించు

మహామోదంబున నర్తింపఁజొచ్చె. ఇట్లు ప్రవర్తిల్లిన సంగరంబులలో రాయచూరుదుర్గంబునుగూర్చి రామరాజునకు నాదిల్‌షాహకును సంభవించిన సంగరం బొక్కటి సుప్రసిద్ధమైనది. ఈ రాయచూరు యుద్ధమునుగూర్చి మీరు చదువుదురు.



---

బ్రహ్మశ్రీ శతావధానులు, శ్రీ తిరుపతి వేంకటేశ్వరకవులుచే

ర చిం ప బ డి న

# శ్రవణానందము

వెల రు. 0—12—0.

దొరకువారు:

శ్రీ తిరుపతి వేంకటేశ్వర బుక్‌డిపో,

రా జ మం డ్రి.

# రాయచూరు యుద్ధము.

## మొదటి ప్రకరణము.

### ఒక నూతనపురుషుఁడు.

క్రీస్తుశకము ౧౫౨౦ న సంవత్సర మేతెంచినది. మొదటి నెల కడచి రెండవ నెల వచ్చినది. చాంద్రమానంబుచే నది మాఘమాసము. అది సమశీతోష్ణములు కలదగుటచే జనంబుల కత్యంత సుఖదాయకంబయి యుండెను. దివాసమయంబున దివాకరుని ప్రభాజాలంబున శైత్యబాధ తొలంగించు కొను చున్నను, నిశాసమయములందు గజచర్మంబులనంటి దృఢతర వస్త్రంబులు గప్పుకొన్నను వడవడ వడఁకించుచు దవడలు దగ్గఱపడునట్లు చేయు చలిలేదు. పగటియందును నిశాసమయ మందును భయంకరంబగు ఘర్మంబు నొడలించి, తాళవృంతం బుల సాయంసమయంబున వారించినను నివారితంబులుగాని చెమ్మటల గల్గించు వేడిలేదు. ఇందుచే నాకాలంబు సౌఖ్యాకరంబని వేఱుచెప్ప నక్కఱలేదు. శీతం బతిక్రాంతంబగుటచేతను నవయవంబులు సంకోచించుకొని తజ్జనితంబగు శ్రమంబు, పడ వలసిన సమయంబు కాకపోవుటచేతను, దృఢతర వస్త్రంబులు సంపాదింపలేని బీదవారు సైతము నిద్రాసుఖంబు ననుభవించు

చుండిరి. భానుండు నభోమండలంబు నలంకరించినప్పు డెండ వేఁడిమివలన యాతాయాత జనంబులకు బడలికలిడ దని యున్నను, నక్కాలంబున శీతంబులగు వాతపోతంబులు మెల్ల మెల్లఁగా ప్రసరించు చుండుటచే నవి జనంబులకుఁ బీడాకరం బులు కాలేదు. వేకువఁజామునం 'దింకను జలిబాధ కొంచెము కలుగుచుండినను, నది వలిపంపు వసనంబును సుఁగిడినంత మా త్రంబుననే తొలంగింపఁ బడుటచే దానివలనఁ బ్రాణులకు శ్రమం బనిపింపలేదు. కావున గ్రీష్మశీతకాలంబు లందువలెఁగాక ప్రాణు లెచ్చట నిద్రించినను సుఖనిద్రచెందుచుండె. కృషీవలులు శర త్కాలాంతంబునఁ గోసి కుప్పలుగా నిక్షేపరిచేలు నూర్చి ధాన్యం బులను గొనివచ్చి గృహంబులంజేర్చి గృహనామంబుల సార్థక పఱుచుచుండిరి. ఇట్లు చేరిన ధాన్యాదులంజూచి యమితానంద భరితురాండ్రయి గృహిణులు గృహపతులంజేరి తమ కలంకారం బులు చేయింపవలయు నని పీడించుచుండిరి.' మాఘాది పంచకం బంతయు శుభకార్యంబులకు యుక్తంబే యైనను జలాది సమృద్ధి మిక్కుటంబుగాఁ గలిగియుండునని శిశిరఋతువునందే యాచ రింపఁ జూచుచుందురు. కావున గృహస్థులు శుభకార్యంబు లొనర్పఁ బ్రయత్నించుచుండిరి. కొందఱు గృహస్థులున్నత పదవి ననుభవించి కాలక్రమంబున ధనాదుల గోలుపోయినను, బూర్వపు గొప్పతనంబు వదలలేక తమ పుత్త్రీ పుత్త్రుల యుద్వాహంబులు మహావైభవంబుతోఁ జేయఁదలంచి పైతృ కంబులగు భూముల విక్రయింప వర్తకుల సమీపంబున కరుగు

చుండిరి. నిర్ధనులగు విప్రోత్తములు యాగసంకల్పంబు జేసికొని ధనంబునకై కనంబడినవారి నెల్ల యాచింపఁ దొడంగిరి. ఇట్లు జనంబులు శుభకార్యాసక్తులై మోదంబునఁ గాలంబు పుచ్చు చుండిరి.

సౌఖ్యదాయకంబగు నిట్టి మాఘమాసంబున నొకనాఁటి సాయంకాలంబున మువ్వురు మనుష్యులు తుంగభద్రానదీ తీరంబున నున్న మార్గంబుప్రక్క నిలుచుండిరి. ఆమార్గము చెట్ల చే గ్రమ్మఁబడి యుండెను. చీకటులు దట్టముగాఁ గప్పి యుం డుటచే నాత్రోవ మఱింత గాఢాంధకార బంధురంబయి యుం డెను. వారి కరతలంబు లందుఁ గరవాలంబులు వెలయుచుండెను. ఆమువ్వురిలో నొకనిపేరు ప్రతాపరాయుఁడు; రెండవవాని పేరు మహేశ్వర పాత్రుఁడు; మూఁడవవాని పేరు రుద్రదేవుండు. వీరి నామంబులఁబట్టి యున్నతకుల సంభూతు లయినట్లు తోఁచు చున్నది. కాని వారి ప్రవర్తనంబు లెట్టివో తెలిసికొనుట కష్టము. వారట్టి సమయంబున నట్టి విషమ మార్గంబునం గత్తులు ధరించి యుండుట నాలోచింప వారు దొంగలో రాజద్రోహులో, యైయుందురని తోఁచకమానదు. వారు దృఢతర గాత్రులై యుద్ధంబులం దాఱితేఱిన వారివలె నుండిరి. వారిట్లు సంభా షించిరి.

ప్ర:-మిత్రమా! విజయనగర రాజ్యంబునకు మంత్రియైన తిమ్మరుసు నెఱుంగుదువా? అతఁడు మహాబుద్ధిశాలి, రాజ్య తంత్రంబులందు వానిని మించినవాఁడు మఱియొకఁడు లేఁడుసుమీ!

ప్రతా:-ప్రహరేశ్వరపాత్రా! నే నీప్రాంతంబునకుఁ గ్రొత్తవాఁడను. అందుచే నతనిచరిత్రంబు నాకు సుంతేనియుం దెలియదు. అయినను గొప్పవాఁడని వినియున్నాను.

ప్ర:-కృష్ణదేవరాయలకుఁ బ్రధానమంత్రియగునతం డప్రతిమ ప్రతిభావంతుం డగుటయేకాక, నిరుపమాన ప్రతాపవంతుం డనియుం జెప్పవచ్చును. కృష్ణరాయల పరాక్రమంబునకు నతని ప్రతిభావిశేషము తోడగు చుండుటచేతనే యాసార్వభౌముని కసంఖ్యాకంబులగు జయంబులు గలుగుచున్నవి. దేహబలంబునకుఁదోడు బుద్ధిబలంబుండినచో బంగారంబునకుఁ బరిమళం బబ్బినట్లుండదుగదా? రుద్రదేవా! ఇందులకు నీవేమందువు?

రు:-నీవన్నది సత్యం బని నిక్కంబుగా నక్కాణింపఁగలను. అదృష్టమన్న నతనిదే యదృష్టము. మొదట నితండు కడు బీదవాఁడై యుండి, గుత్తి, చంద్రగిరి, మొదలగు దుర్గంబులందు మాధుకరవృత్తిచే జీవించుచు జదువుకొని విద్వాంసుండై తద్దుర్గాధీశ్వరుల నాశ్రయించి తన ప్రతిభావిశేషంబుచే వారిని సంతసింపఁజేసియింతవాఁ డయ్యెనఁట. అతని యదృష్ట మెచ్చటినుండి యెచ్చటికిఁ దెచ్చినదో చూడుము.

ప్ర:-వీనిపేరు చిరకాలంబునుండి వినవచ్చుచున్నది. ఎంతకాలంబునుండి వీఁడీ మంత్రి పదంబును జేకొనియుండు?

రు:-నరసరాజుకాలంబున మంత్రి పదంబు నం దితఁ డభిషిక్తుఁ డయ్యె. ఇప్పటి కిరువురి ప్రభువులం జూచినాఁడు. ఇఁక నెందఱిం జూచునో?

ప్రతా:-ఇంక నెవ్వరిని జూడఁజాలను. చూచిన నొకవేళఁ బ్రేత
రాజుం జూచునేమో? మహాబుద్ధిమంతుఁ డయిన రామయ
మంత్రియతనితో నెప్పుడు విరోధంబు పూనెనో, నాఁడె చచ్చె
నని నిశ్చయింపవచ్చును. రామయమంత్రి యూవలించిన ప్రేవులు
లెక్కపెట్టఁ జాలినవాఁడు. అతనిముం దెవ్వరి యాటలును సాగ
నేరవు. అతనియెత్తులకుఁ దగిన యెత్తులు వేసెడివాఁడు మఱొ
క్కండు లేఁడు.

ప్ర:-అట్లనకుము. ఈతిమ్మరుసును సామాన్య పురుషుండు కాఁడు.
రామయమంత్రి యెత్తిన యెత్తులకుఁ దగిన యెత్తు లెత్తఁజాలిన
వాఁడీ మంత్రి పుంగవుఁ డొకరుండె. నాఁడు రామయమంత్రి
యితని నెట్లు పొగడెనో చూడుము.

రు:-అని కృతయుగంబు నాఁటి మాటలు. తిమ్మరుసు ముసలివాఁ
డగుచున్నాఁడు. ఇప్పు డతనికి వెనుకటిప్రజ్ఞ యుండు టెక్కడ?
చాణిక్యసింహంబుగా మన్నెత్తులు ఫలించు టెక్కడ?

ప్ర:-అది కాదు. నీ యూహ తప్పు. లోకంబునఁ దక్కిన వారికిఁ
ప్రజ్ఞ ముదుసలి తనంబునందు నశించునేమో? కాని యిమ్మంత్రి
పుంగవునకుఁ గాలంబు గడచిన కొలందిని లోకానుభవంబునఁ
బెంపఁబడి ప్రతిభ చేవలు దేఱుచున్నది. ముదిరిన కొలందిని
జెట్టు చేవలు దేఱుచుండు టెఱుంగుదువా? అట్లె?

ప్రతా: ఈ రాజమంత్రులవలనఁ బెక్కువంశంబు లంతంబు
లొందుచున్నవి. వీరిం జంపువారెవ్వరును ధరాతలంబున
నుదయింపకున్నారు?

ప్ర:-దానికేమి? మనము వచ్చిన కార్యంబు గూర్చి యాలోచిం
పుఁడు. ఆదుష్టాత్ముం డీ మార్గంబున వచ్చునన్న నమ్మకము
మీ కున్నదా?

రు:- లేకేమి? వాఁడు తప్పక యిమ్మార్గంబుననే వచ్చును. సంశ
యంబు లేదు. చెట్లు పట్టమ్మగానుండి మన ప్రతి నోరులకు
దెలియనీకుండఁ గాపాడును. గాన యీస్థలమే మన కనుకూలం
బయినది. వాఁడు మార్గంబునఁ బోవుచుండఁగా జంపి యీ
చెట్లలోనికిఁబోయి చేరవచ్చును. అట్లయిన మనల బ్రహ్మ
యైనం బట్టుకొనఁజాలఁడు.

ప్ర:-నీవన్నట్లు యీస్థలంబు మన కనుకూలమైనదే యున్నది. వాఁడు
పరాక్రమంబున నసామాన్యుఁడు. త్వరపడి కార్యంబు చెఱచి
కొంటిమేని యతఁడే మనల యమసదనంబున కనుపును.
మొదటవాఁడీ మార్గంబునఁ బోవునప్పుడు నిస్తుల నిస్త్రింశం
బొకటి వానిహస్తంబున నున్నది. కావున మన మప్రమత్తుల
మైయుండి కార్యంబు చెడనీయరాదు. అంతియకాక వీఁడు
యుద్ధంబులం దాఱితేఱినవాఁడఁట. ఇతండు సేనాధిపత్యంబు
వహించి పెక్కంటి దుర్గంబుల స్వాధీనంబు గావించుకొన్న
యుదార పరాక్రమవంతుఁడట. కావున వీనిని సామాన్యుగా
నెంచరాదు.

ప్ర:-ఓయీ! పిచ్చిమాటలాడెద వేల? మన దెబ్బ తగిలినపిమ్మట
వీఁడు జీవించు టెక్కడ? విజయనగర రాజ్యమ్మునకు వీఁడు
ముఖ్యుఁడు. వీనిం గడతేర్చినచో విజయనగర రాజ్యము స్వయ

ముగానే నశించును. కుంకటివే రూఢ దీసిన వృక్షంబు తనంతటఁ దానే చచ్చుచున్నది. ఘనమ్మీ చేయుదుమేని లోకుల కుపకారంబు చేసిన వార మగుదుము. ఈచీకటిలో మన మాకస్మికంబుగ బోయి వానిం దాసించితి మేని నవలీల తుదముట్టింప గలుగుదుము.

రు-వానింజంప నాలోచించుటకే మున్నది? వాఁడసహాయుండై వచ్చుచున్నాఁడు. మనము వెనుకనుండి నిశ్శబ్దంబుగఁ జని యతఁ డధిష్ఠించిన హయంబు కాళ్ళు నఱుకుదము. అప్పుడు వాఁడశ్వంబుతోడ ధరాతలంబున బడును. తోడనే మన మాతని పైఁబడి ఖండింపవచ్చును. ఇందులకు సందేహంబు లేదు. నేటితో వానికి లోకంబున ఋణంబు చెల్లినది. నిశ్శబ్దంబుగా నుండుఁడు ఎవ్వరో వచ్చుచున్నట్లున్నది.

అంత వారందఱును నిశ్శబ్దముగా నుండిరి. ఆ సమయంబున నొక పురుషుండుత్తుంగ తురంగ మారూఢుండై విజయనగరంబునకు బోవుచు నామార్గంబున వచ్చుచుండెను. అతండు దాల్చిన వస్త్రాభరణాదులం జూచిన నసాధారణ పురుషుండని తెలియకపోదు. అతని శిరంబున శిరస్త్రాణం బుండుటచేఁ గేశపాశంబునుం బట్టి వయస్తారతమ్యంబును నిర్ణయింప వీలులేదు. కాని యాతని మొగంబున నున్న వళులచే నంత్యావస్థ యం దున్నాఁడని నిశ్చయంబుగా జెప్పవచ్చును. అతండంతిమదశయందున్నను శరీరదార్ఢ్యమంతగా దఱుగలేదు. అతండు ధరించిన చిహ్నంబులవలన నున్నతాధికారంబునందున్నట్టు పోల్పవచ్చు. అతఁడు మొదట

వెక్కుండ్ర సేవకులతో నేగినను వారు కార్యాంతరంబున నియుక్తు లగుటచే నిస్సహాయుండై వచ్చుచుండెను. నాఁడు కృష్ణపక్ష చతుర్థి యగుటచే నిశాముఖంబు తిమిరంబుల కాలవాలమై యుండెను. ఆ మార్గంబున కిరుప్రక్కలందును, జిన్నచిన్న పర్వతంబులును, సాంద్రంబుగఁ ముండ్ల పొదలును బొదలియుండుటచే శ్రోత్రవారి కదిభయజనకంబై యుండును. కాని యిప్పురుషుం డమ్మార్గంబునకు జిరపరిచితుండగుటచే నిర్భయంబుగ బోవుచుం డెను. ఇంతియకాక యీ మార్గంబున బోవువార లెప్పుడును, జోరులవలనఁ గాని, రాజద్రోహులవలనఁ గాని, క్రూరమృగంబు లవలనఁ గాని, యెట్టియాపదలును జెంది యుండకపోవుటచే జనం బులు నిశీథంబునం దయినను విచ్చలవిడిగా సంచరించుచుండిరి. ఆ మార్గంబట్టి నిరపాయం బయిన దగుట నమ్మను జోత్తముండు సుంతేనియు జంకులేనివాఁడై తన వారువంబును వివిధ గతులఁ బర్వెత్తించుచు నశ్వారోహణ చాతుర్యంబును జూపుచుండెను. ఇతం డాచెట్లలోనుండి పోవుచుండఁగా, జూచి వెనుకటి పురుషులు వెంబడించి వచ్చుచుండిరి. ఈపురుషుఁడన్యమనస్కుండై పోవు చుండుటచే వెనుక వచ్చుచున్నవారిం జూడలేదో, చూచినను బాటసారులని భావించెనో, కాని యతం డప్పురుషులం జూచి భయంబునఁ దత్తఱపాటొందినట్లుగనుపడలేదు. అంతనప్పురుషు లతనిం జాసిరి. ఒకఁడు తననిశాతకర వాలంబును దీసి యీ సైంధవ రాజంబు వెనుకటి కాలిపైఁగొట్టెను. ఆ ఘాతంబునకు దాని కాలు భగ్నము కావలసినదే కాని గుఱికొంచెము తప్పుటచే

ఖడ్గాగ్రంబు మాత్రమే తగిలి గాయము పడునట్లు చేసెను. అందుచే వాడనుకొన్నంత పని జరుగక పోవుటయే కాక హయంబును మఱింత రయ గతి నవలంబించునట్లు చేసెను. తనహయంబునట్లు పరుగిడఁజేసినకారణంబును గనుకొనుటకై తురంగంబునునిలిపి వెను కకుఁజూచుచుండ నమ్ముగ్గురిలో నొక్కఁడు దగ్గఱఁ గదిసి కృపాణకా లంబులో గుఱ్ఱముకాళ్ళను ఖండించివైచెను. ఆహయము కదలలేక నేలపైఁ గూలెను. అంతట నే యాపురుషుండా మృత్యువును దప్పించి కొనినంచి చివ్వునలేచి, కత్తిదూసి, యారంభముఖ మారుతవేగమునకు దాసి వచ్చుచున్న యాఘ్రాములల నెదుర్కొని పోరసాగెను. అతఁడు వయస్సు మీఱినవాఁడయినను సింహకిశోరంబు చాడ్పున లాఘవోపేతుండై వారు కొట్టుచున్న ప్రహారంబులం దప్పించుకొనుచు వారిలో నొకని భుజంబుపైఁ గొట్టెను. ఆ ముదుసలివాని పరాక్రమంబునకు వారు మెచ్చుకొనుచుఁ, దడ సినఁ గార్యంబు చెడునని తలంచి, ధైర్యంబు తెచ్చికొని వారిలో నొకఁడు సన్నుపకొలంది నొక దెబ్బకొట్టెను. ఆ దెబ్బతో నతని చేత నున్న ఖడ్గంబూడి క్రిందఁబడుటయే కాక నుదిప్రక్క నొ క్కింత గాయంబు గూడఁదగిలెను. ఆతం డాయుధంబును వెదకి తీసికొను నంతలో నొకండు వెనుకనుండివచ్చి పట్టుకొని క్రిందఁ బడవైచెను. వెంటనే మఱియొకండువచ్చి యతని కాళ్లదిమి పట్టెను. ఆపురుషుండు వారి పట్టు తప్పించుకొనవలెనని తన బలం బంతయును వినియోగించెను. కాని లాభంబు లేకపోయె అంత మూఁడవవాఁడు వచ్చి, కరవాలంబు కేలఁ గీలించి చంపుటకు

సిద్ధంబుగానుండెను. అదిచూచి యా పురుషుండు 'ఓరీ! మీరు వీరులవలెఁ గన్పట్టుచున్నారు. అయినను నిరాయుధుండగు వాని జంపుట వీర ధర్మంబుగాదను వాక్యంబును పాటింపకపోవుట మిగుల విచారకరంబుగా నున్నది. నిష్కారణంబుగా నన్నేలచం పెదరు? మీరు ధనాదుల నపేక్షింతురేని నా యాభరణంబుల నిచ్చెదను. నాబలంబు లంతకంటెను గలిగనేని నాకొక ఖడ్గంబునిచ్చి మీలో నొకండు ద్వంద్వయుద్ధం బొనర్పుఁడు.' అని ధర్మయుక్తంబుగాఁ బలికెను. అంత వారిలో నొకండు 'యింత ప్రసంగంబులో నేటికి కాలంబు వ్యర్థపుచ్చుచున్నాఁడవు. ఇట్లు చేసిన మూర్ఖుని లెక్కింపక, వచ్చి సాయుధుడగురని వీనితలంపు, నీవింకఁ దడయక వీని తలం దెగవ్రేయుము. లేనిచో నీవువచ్చి వీనిం బట్టుకొనుము. నేనా పనిని నిశ్శంకంబుగా నిర్వహించెదను.' అని గంభీరంబుగాఁ బలికెను.

అంత రుద్రదేవుండు వారిం జూచి "ఓయా! నేను వీర వంశంబునఁ బుట్టి యిట్టి కష్టడి కృత్యంబు సేయఁ జాలను. నిరాయుధునిం జంప నామనం బొప్పకున్నది. కావున బంధించికొని పోవుట యుక్తంబని తలంచెద" అని పలికెను.

'నీ వీర ధర్మంబు కాలినట్లేయున్నది. ఇట్టివాఁడ వేటికి కార్యంబున కియ్యకొంటివి? వీని నిప్పుడు బ్రదుకనిచ్చితిమేని ప్రమాదంబు వాటిల్లు. నీకట్టి సంకోచంబున్నచో నిటురమ్ము. తడయకుము. వీఁడుదయనీయుఁడు కాఁడు. నిరంకుశ ప్రతాపం బుతో నాబంధువులం గూర్చి మా దుర్గంబును వశంబు గావిం

చుకొన్న కఠిన హృదయుండు. నీవు వచ్చి పట్టుకొందువేని కిప్పుడు మనకుండ నొక్క వ్రేటునఁ దల ఖండించి నా యసికాహారంబు గావించి నాకసి దీర్చుకొందును. రమ్ము. త్వరపడుము.' అని ప్రహారేశ్వర పాత్రుండనియె.

ఆవాక్యంబులు విని ధైర్యంబువహించి రుద్రదేవుండు తానే యప్పని యొనరింప నిశ్చయించి మంత్రి పుంగవుం డేమియో ప్రార్థించుచున్నను, వినక యతని శిరంబును ఖండింప సిద్ధంబుగ నుండెను.

'ఓరీ క్రూరకర్ములారా! విడువుఁడు. విడువుఁడు. శూరులైనఁ బరాక్రమవంతులై పోరుఁడు.-చోరులైనవారి నట్టేవిడిచిపర్వుఁడు. లేనిచో మిమ్ముల నిప్పుడే కృతాంతనిశాంతంబునకతిథులగాఁ జేసెదను'అనెడి గంభీర వచనంబులతో నొక్క పురుషుండు ప్రత్యక్షంబయ్యె. అతనింగాంచి వారు నివ్వెఱపడుచుఁ జూచుచుండిరి. ఆపురుషుండు తెప్పపాటు కాలంబులో వచ్చి యారుద్రదేవుని చేతిపై నొకదెబ్బగొట్టి వెనుకకుఁ ద్రోసివైచెను. ఆత్రోపును వాఁడాపుకొనలేక నేలపైఁగూలియుఁ జివ్వునలేచి వీనిపై కివచ్చెను. రుద్రదేవుండు క్రిందఁబడి లేచునంతలోఁ దక్కిన యిర్వురి గర్వంబడంగునట్లు చెఱియొక దెబ్బగొట్టి త్రోసివైచెను. అంత వారిద్దఱు దద్దయుం ద్వరపడి తమ తమ యాయుధంబులను దాల్చి యప్పీర్వుని పైఁబడిరి. ఆనూతన వీరుం డుద్దామ పరాక్రమంబుతో నమ్మువ్వురితోను బోరాటంబు సలుపుచుండెను. అంతలో నమ్మొదుసలివాఁడు చివ్వునలేచి క్రొత్తవాని సాయంబున నేనుఁ

గంత బలంబు గలవాఁడై ---- -----ఁక ఖడ్గంబుదాల్చి వారిలో నొక్కని డీకొని యుద్ధంబు సల్పుచుండె. వారట్లు కొంతవడి యుద్ధంబుచేసి యానూతన వీరుని ప్రతాపంబున కోర్వలేక జీవితాశులై పర్వెడఁజొచ్చిరి. ఆవీరుండు వారినట్లు తఱిమివచ్చి యావృద్ధునకుమాఱుఁగా దానత్తనితో సమరంబుచేసి వానిశరీరంబు రక్తసిక్తంబుగాఁ జేసెను. అంత రుద్రదేవుండును, దన పరాక్రమం బాతనిచెంతఁ బనికిరాదని తెలిసికొని కాలికి బుద్ధి చెప్పి పలాయితుండయ్యె. ఆవీరుండాచోరులం బాఱఁదోలి వచ్చుటయు నవృద్ధుఁ డాతనియందు బద్ధాదరుండై యెదురుచని, యానందంబు పట్టఁజాలక కౌఁగలించుకొని యతనింజూచి "ఓవీరాగ్రేసరా! ఇంత పరోపకార శీలత్వంబును, నింతనిరుపమాన ప్రతాపంబును గల నీవెవండవు? ఎచ్చటికిఁ బోవుచు, నాపాలిటి భాగ్యదేవత చందంబున నిచ్చటికివచ్చితివి? ప్రాణదానంబుగావించి పున్నెంబుగట్టు నీవృత్తాంతంబును సాంతంబుగాఁజెప్పి కర్ణానంద మొనరింపు" మని యత్యాదరంబు సూచించుచుఁ బలికెను.

"అయ్యా! నాయుదంతంబును దరువాతం జెప్పెదను మీగాయంబులనుండి రక్తధార లవ్వారిగఁ దొరఁగుచుండెను వెంటనే వానికిఁదగిన మందువేసి కట్టుకట్టనిచో రక్తక్షయంబగుటచేఁ బ్రమాదంబు వాటిల్లు. కావున మనమిక్కడఁ దడయక పురంబును జేరుటమంచిది. మీరు స్వస్థులైనపిమ్మట నన్నుం గూర్చి వినఁగలరు." అని యావీరుండు త్వరపెట్టసాగెను.

"వీరో త్తమా! నీవనినట్లే చేయుదము. నీవిప్పట్టున మన్మం దిరంబునకు వచ్చి రెండు దినంబులైననుండి నాయిచ్చునాతిథేయ సత్కారంబులరిది నీవొనర్చిన యుపకారంబునకుఁ బ్రత్యుపకారం బొనరించి చూపిన నాకృతజ్ఞతను గాంచి యానందించి నన్ను ఋణవిముక్తునిగాఁ జేయుము." అని యావీరుని నియ్యకొలిపి యావృద్ధు డతనితోఁ బురంబునకు బోవుచుండెను.

ఆవీరుం డతని వెంబడించిపోవుచు, నావిజయనగరంబున నున్నవారిలో నతఁడొక ధనికుండని భావించి "ఓమహనీయా! మిమ్ముల నడ్డగించినవారు సామాన్య చోరులుగారు. వారి పరాక్రమంబుచూడ మహావీరులవలెఁ గన్పట్టుచున్నారు. మీరేదే నపకారంబుచేసి యుండుటచే దాని వారు సహింపలేక తమకసి దీర్చుకొన నిట్లు చేసియుందురు. ఇప్పటి నేలెడి చక్రవర్తి ధర్మ పాలనాశీలుండనియు, నతని యమాత్యపుంగవుండు మహాప్రతిభావంతుడనియు, విన్నవాఁడను. ఇట్లుండ నీపురప్రాంతంబుననే యిట్టి నిశాముఖంబుననే యిట్టి ఘోరకృత్యంబులు ప్రవర్తిల్లుచుండుట కడుంగడు శోచనీయము. ఇట్టి దుర్గతుల నివారించి సాధు జనులఁబ్రోచుట రాజయిన వానికి విహితకృత్యంబుగదా?" అని వచించెను.

"వీరవరేణ్యా! నీవన్నది సత్యమే. ఆరాజమంత్రులు నీవు విన్నట్లు సద్గుణవంతులే. ప్రజానురంజకులే. చంద్రబింబము సుజన స్తోత్ర పాత్రమే. దాని ద్వేషించువస్తువులు లోకంబున నెన్ని లేవు? ఆరాజమంత్రుల రాజ్యపరిపాలనంబు నాహ్లాదకరంబే యైనను

గొందఱి ద్వేషంబునకు గుఱియగుచున్నది. ఆరాజమంత్రి పరిపా
లనా సూర్యమండలంబుచేఁ బ్రకాశితం బగుచున్న మండలంబున
రాజద్రోహంబు లనెడిధ్వాంతంబు లుండునని వారెన్నండును
దలంచియుండరు. ఇఁకమీాద వారూరకుండక యిట్టి దుర్గతులను
క్షణకాలంబులోనే తొలంగింపఁ గలుగుదురు.” అని సంభాషిం
చుచుఁ గొంతదూరంబు నడిచి యెదుట గన్నులవిందై కానవ
చ్చుచున్న విజయనగరంబును బ్రవేశించిరి.

---

## రెండవ ప్రకరణము

### విజయనగరము

దక్షిణ హిందూస్థానంబునం గల మహానదులలోఁ దుంగ
భద్రానది యొకటి యని చెప్పవచ్చును. ఆ నది పడమటి కనుమ
లలో నుద్భవించి యీాశాన్యదిక్కుగాఁ బ్రవహించి కృష్ణానదిం
గలియు చున్నది. తత్తీరంబునంగల పురంబులలో విజయనగరంబు
తలమానికంబు వంటిదని నిశ్చయంబుగాఁ జెప్పవచ్చును. అప్పు
రంబు గొంతకాలము హిందూదేశంబుననే కాక లాతి విలాతు
లందుఁ గూడ బ్రఖ్యాతిగాంచి పూర్వఖండవాసుల చేతనే కాక
పశ్చిమఖండవాసులచేతఁ గూడ నిండు మనంబులతోఁ గొండాడఁ
బడియుండెను.దానికి విద్యాపురం బని నామాంతరంబుగలదు.
ఏ మహానుభావుండు దీనికొసాహాయ్యంబున విద్యాసాగరంబుల

సులభంబుగఁ దరించెనో, యే మహామతి నిజధర్మాను రక్తియం దును, స్వదేశభక్తియందును, వైరాగ్య సంపత్తి యందువలనే రాజ్యస్థాపనంబందును, రాజకీయ వ్యవహారంబు లందును నిరుప మానుండని వాసిగాంచెనో, యే పరోపకారి దురవగాహంబు లగు వేదాంతాది శాస్త్రంబు లనెడి గహనంబు లందుఁ జక్కని గ్రంథమార్గంబు లేర్పఱిచి మందబుద్ధులు బుద్ధిమంతుల నుపై తమువానిలో నిస్సంశయంబుగా సంచరింపజేసెనో, యట్టి విద్యారణ్యులవారి యుపదేశంబువలన నప్పురంబును హరిహరరాయలు నిర్మించెను. ఆ నగరపు చుట్టుకొలత యిరువదియైదు మైళ్ళుండెను. దానికిఁ జుట్టును గొండలు గలవు. ఆ కొండలకు మధ్య బల్లపు ప్రదేశ మ్మున్నచోట బలాఢ్యము లగు గోడలు కట్టబడియున్నవి. ఆ నగర మిట్టి పర్వత దుర్గంబు నడుమనుండుటచేవైరి వీరుల కభేద్యంబై యుండెను. అవ్వీటిని జుట్టి, ముట్టి యున్న పర్వత పంక్తికిఁ గొన్ని మార్గంబులు గలవు. అవి తప్ప నగరంబులోని కరుగుటకు వేఱు మార్గంబులు లేవు. పురవాసుల గమనాగమనంబుల కనుకూలంబు లగు నా ద్వారంబులు బలాఢ్యంబు లగు కవాటంబులచేసంబద్ధం బు లగుట వలన వైరి వీరులకుఁ బ్రతికూలంబు లయి పోలు పాఱు చుండెను.

ఈ మహానగరమున కేడు ప్రాకారంబులు కలవు. అందుకే మొదటి మూడు ప్రాకారంబులందును, గృషీవలుల యిం డ్లును, సస్యంబులును, బూవులతోటలును, గలవు. ఈదుర్గంబు నకు నైఋతి దిక్కున నాలుగు చదరపుమైళ్ళ వైశాల్యంబుగల

తటాకం బొకటి నిర్మలజలపూరితంబై నేత్రానంద కరంబై యుండె. కృషీవలులు తజ్జలంబులు గొనివచ్చి నానావిధ సస్యంబులను ఫలంబులను పండించుచుందురు. అది మొద లేడవ ప్రాకారంబువఱకును గల ప్రదేశంబంతయును, సామాన్య జనంబుల మందిరంబుల చేతను, నంగడి వీధుల చేతను, దేవళంబుల చేతను, నిండియుండెను. ఏడవ దానిలో రాయలయాస్థానంబును సౌందర్య నిధానంబు లగు నున్నత సౌధంబులును, మంత్రుల మందిరంబులును, సేనానాయకుల భవనంబులును, టంకసాల యును దనరారు చుండెను. మొదటి మూడు దుర్గంబు లందే కాక తక్కిన వానియందుఁ గూడ బాలగచ్చుచేయబడిన కాలి గొట్టంబుల వలన జలంబు ప్రవహించి మిగుల సమృద్ధి కొలుపు చుండెను. ఆ పురంబునఁ బెక్కులు దేవాలయంబులు గలవు. వానిలో విఠ్ఠలస్వామి యాలయంబును, విరూపాక్షాలయంబును సుప్రసిద్ధంబులు. అమ్మహానగరంబు సప్త ప్రాకారంబులచే విభక్తంబై యేడు నగరంబులవలెఁ గానవచ్చుచుండెను. ఆ మహానగరము ముప్పదిలక్షల జనసంఖ్య గలిగి సంపదుల్లసితంబై యలరారుచుండెను. వానిలోఁ బదునొకండు లక్షల జనులు సైనికులై యుండిరి.

వెనుకటి పురుషు లిర్వురును దన్మహానగరమూ మొదటి ప్రాకార ద్వారంబును జేరిరి. కాని యామీఁద నావృద్ధుండు రక్తక్షయం బగుటచేతను, గాయపుబాధ మిక్కుటంబగుటచేతను నడువలేకపోయెను. అంత నప్పురుషుండు ద్వారపాలకులలో

నొక్కనిఁ బిలిచి యేమియో చెప్పి పంపి నాలుగుబారలు నడుచునప్పటి కుత్తుంగహయంబులఁ బూనిచిన బండియొకటివారి కభిముఖముగా వచ్చె. అంతనతఁడా నూతన పురుషునితో నాశకట మధిరోహించి పోవుచుండెను. ఆనూతన పురుషుఁ డావృక్షుని గొప్పతనంబున కచ్చెరు వందుచు, మార్గంబున కిరుప్రక్కలందున్న వింత వస్తువులను జూచుచుఁ బోవుచుండెను. అప్పటికిఁ జంద్రోదయం బగుటచేఁ దదీయకాంతి సంతతులందుఁ గానవచ్చు సస్యంబులును, నూతన నిర్మితంబు లగు దేవాలయంబుల చందంబున గానవచ్చు వరికుప్పలును, నానావిధ పుష్ప సౌరభంబులను వెల్లి గొలుపు ప్రమదావనంబులును, వరిచేలను నూర్చుచు నతి సంతసంబునఁ గృషీవలులు పాడుచున్న పొలిపదంబులును, నా నూతన పురుషున కమితానందంబు గొలుపుచుండెను. ఆ పురుషుం డట్లు చూచి యానందించుచుండ నూతన ప్రాకారంబు నతిక్రమించె., వారొక వీథిఁ జొచ్చిరి.

ఆ వీథి కిరుపార్శ్వంబులందును, సుందరమందిరంబులును నున్నత సౌధంబులును, నా వెన్నెలలో ధగధగ లాడుచు నేత్రానందకరంబులై విరాజిల్లుచుండెను. ఆ వీథిలో నున్నతంబగు దేవాలయంబొకటి యుండె. మూక మూకలుగా వచ్చి యందున్న యనంతశయన స్వామిని సందర్శించి యిష్టాలాపంబు లాడుకొనుచుఁ దమ తమ మందిరంబుల కరుగుచున్న పురవాసు లెందఱో వారికిఁ గానవచ్చిరి. ఆ జనంబుల ప్రవర్తనంబులను, నా నగరంబునం గల వింత వింత వస్తువులను, నంగడివీథుల తీరును

జూచుచు, మఱికొంత దవ్వేగెను. అవ్వృద్ధున కదిచిరకాలపరిచితం
బగుటచేఁ దన మనంబును వాని పొంతఁబోనీయక దీర్ఘాలోచన
మందుఁ బొందు పఱిచి పోవుచుండెను. వీరుకొంత దూరంబేగఁగా,
నాకాశంబు నొరయుచు, సుధామయంబగుటచే నచ్చంద్రికలో
ధగధగలాడుచు, దీపావళీ శోభితంబై యున్న మహోన్నత సౌధం
బొకటి కనులపండువు లొనరించె. దానిం జూచి యాయద్వితీయ
భవనంబు చక్రవర్తిదై యుండు నని నిశ్చయించుకొని దానిపొంతకు
నీక్షించుచుఁ గొంత దవ్వేచనఁగా నాశకటమొక సౌధరాజంబు
చెంత నిలువఁబడెను. ఆసౌధ మపూర్వశోభాద్యోతమానంబై
రాజమందిరంబునకు ద్వితీయంబై, బహుపరిచారకావృతమై,
దీపావళీ విరాజితంబై యలరారుచుండెను. ఆ శకట మచ్చట
నిలుచునప్పటికిఁ గరదీపికలఁ దాల్చిన పరిచారకు లెదురుగాఁ
బోయిరి. అంత వారిరువురును బండి దిగివచ్చుచుండ నదివఱ
కతని సందర్శనంబు గావించుకొనవచ్చిన మహా పురుషులును,
ఉన్నతోద్యోగులును, నెదురుచని నమస్కారంబులు గావించిరి.
కాని తొంటివలె నప్పురుషుండు మాటలాడమికిఁ గారణంబేమో
యని యూహింపఁ జొచ్చిరి. అంత నక్కరదీపికా కాంతులలో
రక్తసిక్తంబులైన యతని వసనంబులు చూపఱ కత్యాశ్చర్యంబు
గలిగించె. అయినఁ దత్కారణంబడుగ నొక్కఁడేనియు సాహ
సింపఁ జాలఁడయ్యె. అచ్చటికి వచ్చిన మహాపురుషుల సంభాష
ణంబు వలనను, వారావృద్ధునికిఁ జేయు నసమానగౌరవంబు వల
నను, నావీరుండతని రాయల మంత్రినిగా భావించి, తన తొల్లింటి

యభిప్రాయంబు మార్చికొని, తానా రాజమంత్రుల పాలసంబు నునిందించి నందులకు డెందంబునఁ గుంద నారంభించెను. ఉన్న తాకారుఁడై యిరువది వత్సరంబుల ప్రాయంబుగలిగి భయంకర ఖడ్గంబునుదాల్చి రక్తసిక్తంబులైన వసనంబులు ధరించి యమ్మం త్రిపుంగవుం డొనర్చు సమాస గౌరవంబుసంజేసి జనాదరణ పాత్రుండయి, బండిదిగి, వచ్చుచున్న యానూతనపురుషుంజూచి యాగతానేకజనులు మఱింత యబ్బురపడఁ జొచ్చిరి. ఆతని వృత్తాంతంబును దెలిసికొనఁ బలుప్రయత్నంబులు సలిపిరి. కాని యవి యన్నియును నిష్ఫలంబులయ్యె. ఆమంత్రి పుంగవుండు సమ స్తజన పరివృతుండై లోపలికేగి యొక విశాలమండపంబునుబ్రవే శించెను. ఆమండపం బున్న తాసన విరాజితంబై, విచిత్రవస్తు సంస్తూయమానంబై కన్నులకు విందుగొలిపె. అదియే మంత్రి వరుండు రాజకీయ వ్యవహారంబులు దీర్చుకొనెడి స్థలంబు.

ఆ తిమ్మరుసా మండపంబు ప్రవేశించు నప్పటి కొక పరి చారకుఁడు తత్కాలానుకూలంబులగు వస్త్రంబులు దెచ్చి యొసంగె. అతఁ డా వస్త్రంబులఁ దాల్చి కూర్చుండఁ దక్కిన వారును గూర్చుండిరి. అప్పు డామంత్రి యానూతన పురుషునిఁ దగిన మందిరంబున విడియింపుఁ డని పరిచారకుల కాజ్ఞాపింపఁగా వారతనిఁ గొనిపోయిరి. రెండుమూడు గాయంబులనుండి రక్త మింకను స్రవించుచుండుటచే నావస్త్రంబులును క్షణంబున రక్త సిక్తంబులయ్యె. అంతలోఁ బరిచారకాహూతుండై వచ్చి క్షతం బులకుఁ గట్టుకట్టి వైద్యుం డొక వంక నిలువఁబడి యుండెను.

లలని జుట్టిముట్టి కూర్చుండిన మహా పురుషు లందఱును, మం త్రిపుంగవున కట్టి యపకారం బొనర్చినవా రెవ్వరో • యని పలు విధంబుల యోచింపసాగిరి. ఈవార్త పురంబునఁ దెలియుటచేఁ బౌరులు తండ తండంబులుగావచ్చి యాస్థలం బావరించి తమ మంత్రి యవస్థం జూచుచుండిరి. •రాజకీయ వ్యవహారంబులు ధర్మయుక్తంబుగా నెఱవేర్చుచుఁ, బ్రజానురాగంబున కాలవాలం బయిన యమ్మంత్రిపుంగవున కట్టి భయంకర క్షతంబులు గలిగిరి చిన దుర్మార్గులెవ్వరో యని యూహింపసాగిరి. రామ రాజ్యం బువలెనున్న రాయల రాజ్యంబునం దిట్టి క్రూరకర్మ పరు లుండు టకు మిగుల వగవఁజొచ్చిరి. బుద్ధిబలంబు నందువలెనే దేహ బలంబునందును నిరుపమానుం డయిన యమ్మంత్రి రత్నంబుఁ జూసి పరులట్టి నిర్దయ కృత్యంబొనర్చుట సృగాలంబులు సింగంబు మొగంబున వ్రేలాడెడి జటాచ్ఛటల నూడలాగ సాహసించుట వంటిదే యని యబ్బుర పడఁజొచ్చిరి. మంత్రి కా దురవస్థ గలి గించిన దురాత్ములనుగూర్చి పరస్పరంబుల సంభాషించుట వలన గోలాహలంబుతప్ప మఱియొక లాభంబులేక పోయెను. ఆకోలా హలధ్వనుల్లనివార్యంబులై యొందరు వారెంచినను వారింపఁబడ లేదు. ఆ మంత్రియా కోలాహలంబులు, వారించి వారిని పైకిఁ బంపు శక్తిగలవాఁడే యైనను, దనమీఁది ప్రేమంబున వచ్చి తన నిమిత్తమంత వంతల పాలగుచున్న ప్రజలను గఠినముగా మంద లించుట విరసంబుగా నుండునని యేమియు ననలేదు. అప్పుడు మంత్రి ప్రజలంగాంచి

'ఓ జనులారా! మీరు నాకు సంభవించిన యాపదకుఁ గారణం బేమియో తెలిసికొన నాతురులై యున్నారు. కొందరు రాజద్రోహులు నాకీయుపాయంబు గలిగించిరి. నాతో వచ్చిన నూతనపురుషుం డాసమయంబునకు రానిచో నేని జన్మంబున మిమ్ముఁలఁ జూచియుండను. నాకు సంప్రాప్తమైన యాపదకు డెందంబునఁ గుంది వచ్చి నన్నుఁ జూచి నాయందున్న యనురాగంబును దెల్లంబుగావించినందుల కానందంబు చెందితిని. దైవానుగ్రహంబున నే జీవించితిని కావున నిఁక మీరు మీమందిరంబుల కరుగుఁడు.' అని మృదువుగాఁ జెప్పెను.

అదివిని చూడవచ్చిన జనంబు లనేకవిధంబుల సంభాషించుకొనుచు మంత్రిక్షేమంబును గోరి భగవంతునకు వందనంబు లొసర్చుచుఁ దమ మంత్రి పుంగవుసఁ గాపాడిన యా నూతన పురుషునిఁ గొండాడుచుఁ దమతమ మందిరంబుల కరిగిరి. అంతలో "టకటక" యను నినాదంబులు వీతెంచెను. అదేమియో యని యూహించు చుండఁగా నొక పురుషోత్తముండా మండపంబునకు వచ్చుచుండెను. ఆ పురుషుండు దీర్ఘకాయుండగుటచే నతనివయస్సు నలువది వత్సరంబుల కంటె నొకటి రెండు హెచ్చుగా నుండు నని చూచువారూహింతురు. కాని యోజింప నతని కంత వయస్సుండదు. అతని లోచనంబు లాకర్ణాంతపరీతంబులై భాగ్యదేవతకు నిలయంబులై జనవశీకరణ సమర్థంబులై యొప్పారుచుండెను. అతని బాహువులు దీర్ఘంబులై మాంసలంబులై పరవీరభయంకరంబులై యుండెను. తక్కిన యవయవంబు లన్ని

యు, సౌష్ఠవంబు గలిగి సౌందర్యరసపూర్ణంబు లై యుండెను.
అతఁడు విజయనగర సామ్రాజ్యధురంధరుండగు కృష్ణదేవరాయలే.
అతని పరాక్రమంబు పాండిత్యాతిశయంబువలెనే యనుపమానం
బై సామాన్య కవులకువలెనే మహావీరులకు శ్లాఘనీయం బై
యుండెను. భీమసంగ్రామంబులం దతని కెంత సాహసమో రణేత
రసమయంబులం దంత శాంతము కలదు. ఆపత్కాలంబులం దతని
కెంత ధైర్యమో సంపదలం దతనికంత తాల్మిగలదు. పరస్త్రీల
యెడ సోదరీ భావంబును, దీనజనులయెడఁ గరుణారసంబును,
నాశ్రితులందు వాత్సల్యంబును, నతనికి సహజంబులు. ఆ మహా
మహుని కవిత్వపటుత్వము గంగాప్రవాహంబువలె నిరర్గళం బై
యతని యపారపాండిత్యంబును బ్రకటించుచున్న దని యతండు
రచించిన యాముక్తమాల్యదను జదివినవారి కందరికిని గోచరిం
పకపోదు. అతండు స్వదేశభాషలందు నిరుపమా నాదరంబుంచి,
వానిని మిక్కిలి యభివర్ధించెను. ఆ విద్వత్ప్రభువు స్వయముగా
గ్రంథరచన చేయుటయే కాక పెక్కండ్రు విద్వ
త్కవులచేఁ బెక్కు కావ్యంబుల రచింపఁజేసి
భాషను బోషించి మిక్కిలి ఖ్యాతివహించెను. అతనికి మఱికొన్ని
భాషలువచ్చినను నాంధ్రభాషయం దున్నంత యాదరంబు
వేరొకదానియందు లేదు. కావుననే యతండు తనకావ్యంబున
'దేశభాషలందుఁ దెనుఁగులెస్స' అని పొందించి యున్నాఁడు.
వేయేల? ఈ మహనీయుని కాలంబులోనే యాంధ్రభాషా నటి
మనోహరగ్రంథ కుసుమంబులం దాల్చి నానావిధాలంకార పరి

శోభితయై యతికుతుకంబున నలుగడల నట్టనంబుచేయఁ జొచ్చెను. భోజమహీపాలుని కాలంబున సంస్కృత భాషవర్ధిల్లిన ట్లిమ్మహామహుని కాలంబున నాంధ్రభాష వర్ధిల్లుటచేతనే యతని కాంధ్రభోజుండని బిరుదపదంబు లభించెను.

ఈమహీశుండు మంత్రిభవనంబు ప్రవేశించిన తోడనే తక్కిన వారందఱును లేచి నమస్కరించిరి. అతండా మంత్రి పుంగవునకు వందనంబు లాచరించి తక్కినవారిని గూర్చుండ నియమించి తాను నుచితాసనంబున నధివసించెను. నిరుపమాన గుణాకరుండును, సామ్రాజ్య విభవోపేతుండునునగు కృష్ణదేవ రాయలు తన యుద్యోగి గాయంబులకు గుటియైనంత మాత్రం బున నట్టి రాత్రియందుఁ బరామర్శింపవచ్చుట యసంభావితం బని మీకు సందియంబు గలుగవచ్చును. కాని రాయల తిమ్మ రుసుల చరిత్రంబు విన్నవారి కట్టి సందియంబు దూరాపాస్తం బగునని మాయభిప్రాయంబు. కావున వారలకుఁగల యనుబం ధంబును గూర్చి కొంచెముప్రశంసించుట యప్రస్తుతంబుకాదు. వారలను సామాన్య రాజమంత్రులనుగా భావింపదగదు. ఆ సార్వభౌముండా మంత్రిపుంగవుని బితృసమానునిగా జూచుచుం డెను. ఆ తిమ్మరుసు కృష్ణరాయల కాలంబునందే కాక నరస రాజ వీరనరసింహరాయల కాలంబునందుఁ గూడఁ దన శేముషీ విశేషంబున సామ్రాజ్యం బభివర్ధించి వారి యసమాన గౌరవం బునకుఁ బాత్రుండయ్యెను.

ఇట్లు చిరకాలంబునుండి తమ వంశంబు నాశ్రయించి తమ సామ్రాజ్యంబునపాయంబులనుండి తొలంగించుటయేకాక తన్ను మహాపాయంబులనుండి తప్పించిన మంత్రియం దతని కెంత గౌరవ ముండునో, యెంత భక్తి యుండునో యెవ్వరుచెప్పఁగలరు? కృష్ణ రాయలను సవతితల్లి యగు తిప్పాంబిక తన కుమారుఁ డగు వీర నరసింహరాయనికి సామ్రాజ్యం బిచ్చుటకెంచి కృష్ణరాయలను జంపింప నాజ్ఞాపించెను. వీరనరసింహరాయుని యంతిమకాలంబున నతఁడు తన కుమారుఁ డగు తిమ్మరాజునకు రాజ్యంబు చెందు టకు గృష్ణరాయల కన్నుల దీయింప నాజ్ఞాపించె. ఈరెండపాయం బులును గృష్ణ రాయల కనివార్యంబులై చుట్టుముట్టగా నీ మం త్రిపుంగవుండు తన బుద్ధిచాతుర్యంబున వాని నవలీలయాలించి కాపాడెను. ఇంతేకాక కృష్ణరాయలు పట్టాభిషిక్తుఁడయినప్పుడును నిమ్మహామంత్రి మిక్కిలి తోడు పడెను. తన ప్రాణంబులను గాపాడి తన యంధత్వావస్థను దొలంగించి రాజ్యముచేకూర్చిన మంత్రియం దతని కెంత ప్రేమంబుండునో యెంత గౌరవంబుం డునో యెంత భక్తి యుండునో యెవ్వరుచెప్పగలరు? ఆ సార్వ భౌముండు సామాన్యరాజన్యులవలెఁ గృతఘ్నుండు కాక తన యావజ్జీవంబును నత్యంత గౌరవంబు చూపుచు వర్తించెను. ఇంతేకాక రాయలమ్మంత్రి శిఖామణిని అప్పాజీ (నాయనగారూ) అని పిలుచుచుండెడి వాఁడట! తనకిట్టి మహోపకారంబు లొనర్చిన మంత్రి వర్యున కాపద సంప్రాప్తంబైనట్టువిని చూడవచ్చుట యాశ్చర్యకరంబుకాదు. ఆ కృష్ణదేవరాయలట్లు ప్రవేశించినం

జూచి మంత్రి వరేణ్యుండు చివ్వున లేచి తన ప్రభుభక్తి నివెల్లడి గావించెను. తక్కినవారా రాజేంద్రునకు వందనంబు లొనర్ప నతండును బ్రతివందనంబు సలిపి మంత్రి యొసంగిన యున్నతాసనంబున నాసీనుండయ్యె. తక్కినవారును రాజాను మతిని తమతమ యాసనంబులఁ దిలకించియుండఁగా రాయలు మంత్రి నుద్దేశించి.

"అప్పాజీ! కాలమెంత విపరీతంబుగానున్నది. అసంభావితంబగునిట్టి కార్యంబు నేఁడెట్లు సంభవించె! న్యాయయుక్తంబు గను బ్రజానురంజకంబుగను పాలితం బగుచున్న నారాజ్యంబునం దిట్టి క్రూరకర్మలు గలవా? సూర్యబింబ మఖిలలోకంబునకుఁ దేజంబొసంగి ప్రకాశించుచుండఁగా లోక కంటకంబులగు ధ్వాంతంబు లావరించుట కవకాశమెక్కడ? ధీబలంబునందును దేహబలంబునందును నసమానుండ వయిన నీకే దుష్టకర్మ లిట్టి కట్టిడి కార్యంబాచరించిరి. దర్శనంబుచేతనే మత్తగజంబులకు సైత ముత్తలపాటొనరించు సింహంబును మృగశాబకంబులు చుట్టుముట్టి నొసటిజడలూడలాగి యిక్కట్టులు పెట్టుననుట యత్యద్భుతంబు" అని సవిచారంబుగాఁ బలికెను.

"ఓరాజేంద్రా! మీరట్లు విచారింపనేల? నీ పరిపాలనంబున లోపంబులు లేకపోయినను, నిర్దుష్టంబగు వస్తువునందైనను లోపంబు లెంచెడి కుత్సితస్వభావులు లోకంబునఁ బెక్కురుందురు. చంద్రకాంతి లోకంబున కానంద సంధాయకంబగుచున్నను దాని నిందించు వస్తువు లెన్నెన్ని లేవు. నీవన్నట్లు నేఁడు సింహము మృగశాబకంబులవలన నపాయంబు చెందినది. ఆ సింహమసమర్థమయి

నదికాదు. అయిన నది తనకే మృగంబయినను నపాయంబు గల్గిం పనేరదను ధైర్యంబు గలదగుటచే నిర్భయంబుగా గాఢనిద్ర జెం దినది. అంతఁ గొన్ని తేళ్లాకస్మికంబుగా వచ్చి చుట్టుముట్టి సిం హంబును గొమ్ములతోఁ గ్రుమ్మనారంభించెను. అప్పుడు సిం హంబు మేల్కాని తన ఖరతరనఖరంబులతోఁ జీల్పనారంభించెను. కాని కారణాంతరంబులచేత నఖరంబులు విరిగిపోయెను. పరీక్ష తోఁ గరిచి తప్పించుకొననెంచెను. అవియు నూడిపోయినవి. సిం హము బలిష్టంబయినను నప్పు డేమిచేయఁగలదు? సాధనంబులు లేనప్పు డాసింహంబును నేమిచేసినం జేయఁగలవు గదా? జడలూ డలాగిన నూడలాగును. చంపినచంపును. కత్తి లేని వాని గొత్తి గరిచినదన్న సామెత నెఱుంగవా?" అని దురవస్థా సూచకంబు లగు చూపు లాభూపాలుని మొగముపైకిఁ బఱపి యమాత్యపుం గవుండు వాక్రుచ్చెను.

ఏమేమిట్లా! చంపినం జంపఁగలవా? పీట్లు చంపఁగలవు? వానికట్టి సామర్థ్యంబెక్కడిది? హింసపెట్టవలయుననియే వాని యభిప్రాయంబుకాని వేఱొకతలంపుండియుండదని మానవనా థుండు పలికెను.

"ఓ మహారాజా! మీరట్లు శంకింపందగదు. ఏలచంప లేవు? సామర్థ్యంబు లేదనియా యనుచున్నారు. చలిచీమలు బల వంతమగు సర్పంబును సమయించుచుండలేదా? కుటిల స్వభావం బులుగల మృగంబు లాసింహంబును జంపుటకే వచ్చెను. కాని కార్యమన్యథా వర్తియయ్యెను." అని యమాత్యుం డనియెను.

"అప్పాజీ! వానికిఁజంపఁగలిగినంత సామర్థ్యమ్మును, జంప వలెనన్న తలంపును గలిగినచో సింహము బ్రదికివచ్చుటెట్లు?" అని సందియంబుతో రాజనెను.

"ఓ భూపాలా! సింహముచావవలసినదే కాని వేఱొక పురుష సింహంబువచ్చి తన వాడిగోళ్లతో నాట్రముక్కడి మృగం బుల నొక్కొక్కదానిం జీల్చి సలువంకలకుఁబర్వెత్తఁజేసెను." అని మంత్రిపుంగవుం డనెను.

"ఏమేమీ? మఱియొక పురుషసింహమువచ్చి కాపాడిన దా? అది యీప్రాంతంబులందు వర్తించుసదియా? కాదా? అది యిప్పుడెక్కడ విశ్రమించియున్నది?" అని రాజేంద్రుండాశ్చర్యం బుతోఁ బలికెను.

"ధరణీశ్వరా! అది యీప్రాంతంబునందలిదికాదు. అది తన పరాక్రమ ప్రకటనార్థంబుగాఁబోలు దూరంబునను నీప్రాంతం బునకు వచ్చుచున్నట్టున్నది. నా పాలిట భాగ్యదేవతవలెవచ్చి నాకు మహోపకారంబొనర్చిన దానిని వెంటనేపోనిత్తునా? నేనంత కృతఘ్నుండనుగానే? అది ప్రస్తుత మిచ్చటనే విశ్రమించుచున్నది. సావకాశంబుగా దాని మీచెంతకుఁ బుచ్చెదను." అని మంత్రి పుంగవుం డనెను.

"అప్పాజీ! యుక్తకార్యం బాచరించితివి. పరోపకార శీలముగల యిప్పురుష సింహంబును జూడవలె నన్నతలంపు నా మనంబును బాధించుచున్నది. తప్పక నా చెంతకుఁ బుచ్చుమని చెప్పి యతని నా మంత్రణంబుచేసి సేవక కదంబంబు పరివే

ష్టించి సేవించుచుండఁగాఁ దన శకటం బధిరోహించి తన నివా సంబున కరిగెను.

---

## మూడవ ప్రకరణము



### మల్ల యుద్ధము

సంగ్రామేషు భటేంద్రాణాం । కవీనాంకవి మండలే
దీప్తిర్వాదీప్తిహానిర్వా । ముహూర్తాదేవజాయతే.

విజయనగర రాజవీధిలో నున్న యొక రథ్యావృక్షంబు క్రింద నొకనాఁడు జనసమూహము కూడియుండెను. ఆ జనస మూహంబునుండి గొప్ప కోలాహల ధ్వని యుదయించెను. అది కేవల మట్టహాసములతోఁ గూడియుండెను. అందు బాలకులే కాక పెద్దవాండ్రుకూడఁ గుమి గూడియుండిరి. ఒక్కొక్కపరి వారికరతలధ్వనులును, గేరింతలును వెడలి దిగంతంబులఁ దాక వ్యాపించుచుండెను. బాలురు విచ్చల విడి చెలరేగి యిట్టటు నడయాడుచుండిరి. వీరికింత యానం దము గల్గించినవాఁ డొకవింత మనుష్యుఁడు. వాఁడు ముప్పది వత్సరంబుల ప్రాయంబు గలిగి యేకారణంబుచేతనో పిచ్చివాఁ డాయెను. చేష్టలంబట్టి వానిని బిచ్చివానిగా భావించుచున్నను నాకార లక్షణంబులంబట్టి మహాపురుషుం డని భావింపక మానరు. ఆ యున్మత్తుండా చెట్టుక్రిందఁ గూర్చుండి వింతవింత పాటలు

పాడుచుండెను! జనంబు లిట్లు తన్నుఁ జుట్టుముట్టిన తరువాత వాఁడచ్చోటునుండి కదలిపోవ నారంభించెను. పెద్దవాండ్రు కొందఱు వాని విడిచి తమ కార్యంబు లొనరించుకొనఁ బోయినను పిల్లలు వానిని వదలక చప్పట్లు కొట్టి కేకలు వేయుచు వెంబడించి పోవుచుండిరి. వాఁడట్లు పదిబారల దూరమేగు నప్పటికి వందల కొలంది బాలురు వచ్చి వారిలోఁ గలిసి కోలాహలంబులను మఱింత వృద్ధిపొందించిరి. వాఁడట్లూ రేగుచుండెను. బాలకులును వాని ననుసరించి పోవుచుండిరి. కొంత దవ్వేగు నప్పటి కాపిచ్చి వాని కొక మట్టి మూకుడు గాన వచ్చెను. వాఁడు దానినిఁ దీసి తలపైఁ బెట్టుకొని పిల్లల వైపుచూచి పక్కున నవ్వెను. ఆ పిచ్చివాని వైఖరిని జూచినప్పుడా బాలకులకుఁ గలిగిన సంతోసంబునకుమితిలేదు. బాలురు నవ్వుచున్నకొలందిని వాఁడు పెక్కులు పిచ్చిపనులు చేయుచుండెను. వాఁడు పిచ్చి పనులు చేయుచున్న కొలందిని వారధికంబుగా నవ్వుచుండిరి. వాఁడావేషముతోఁ గొంత దవ్వరుగగా వెలిబూడిద గానవచ్చెను. వాఁడా బూడిదను దీసికొని "త్రియంబకంయజామహే" యనెడి మంత్రమ్మును బఠించుచు, నొడలి యందంతట నలందికొని మఱింత వికృతాకారుండయ్యె. అంత బాలు రూర కుండక "జన్నిదమేది" యని ప్రశ్నించిరి. అదివిని వాఁడు "ఇదిగో జన్నిదము, ఇదిగో జన్నిదము" అని కేకవేయుచు బాటఁ బ్రక్కఁ బడియున్న గుడ్డచీలికను దీసికొని యజ్ఞోపవీత మంత్రంబును జెప్పుకొనుచు మెడలో వేసికొని బాలకులవంక జూచి పకపక నవ్వనారంభించెను. ఇంతకు బూర్వమతం డే జాతివాఁడో తెలిసికొనుట

కష్టమయ్యెను గాని యిప్పటివాని చర్యలం బట్టి బ్రాహ్మణుఁడని నిశ్చయింపదఁగి యుండెను. వాఁడొరులను బాధింపక పోవుట చేతఁ బిల్లలు మిక్కిలి మచ్చికచేసి పరిపరి విధంబుల వానిం గేలి చేయుచుండిరి. వాఁ డితరులను బాధింపక పోవుటం బట్టి రాజ భటులు వాని బంధింపక విచ్చల విడిగాఁ దిరుగనిచ్చిరి. అందుచే వాఁడు నిరర్గళంబుగా నప్పురంబున సంచారంబుచేయుచుండెను. బాలకులును గుంపులు గుంపులుగాఁ గూడి వెఱ్ఱి, పిచ్చి యని కేకలు వేయ నారంభించిరి. వారట్లు చెవులుగింగురు మన్నట్లు కేకలు వేయుచున్నను, వాఁడు దానిని సరకు గొనక వెనుకకుఁ దిరిగిఁ పకపకనవ్వనారంభించెను. వాఁడరుణోదయంబు మొదలు మధ్యాహ్నంబు వఱకును వీధులవెంబడిని సంచరించుచు నచ్చ టచ్చట ధర్మాత్ములు పెట్టిన యన్నంబును గ్రహించియును భుజిం పక కుక్కలకుఁ బాఱవైచుచు, మఱొక్కమారు గాకులకు విడజ ల్లుచునుండెడి వాఁడు. కొందఱు పిల్లలు మిక్కిలి చనువుచేసి చెవులుపట్టుకొని యాడించుచున్నను, సుంతేనియుఁగోపగింపక వర్తిల్లుచుండెను. బాలకు లొకప్పుడు పరిహాసార్థము వైచినరాళ్లు వాని బాధింపఁగా దాళలేక వాఁడు బాలురవెంటఁ బర్వెత్తుచుం డెను. అప్పటి వాని యాగ్రత్యంబును జూచి యపరాధులను బట్టుకొని గట్టిగాఁ జిదుకఁగొట్టు శేమోయని తలంచి వెఱచి పఱచుచుండిరి. కాని పర్వెత్త లేక తనకుఁ జిక్కిన పిల్లలను వాఁడే మియును బాధింపక భుజంబులపై కెక్కించుకొని కొంతదూరంబు నడిచి యచ్చట వారిని నెమ్మదిగా దించుచుండెను. ఆ లోకువఁ

గనిపెట్టి కొందఱు పెంకిపిల్ల లతనిమీఁద గూర్చుండి స్వారిచేయ నారంభించిరి.

ఇట్లు కుఱ్ఱవాండ్రెంత బాధపెట్టినను వాఁడు కొంచెమేని యుఁ గోపింపక వికటహాసంబు చేయుచుండె. కాని యెవ్వరికిని నే హానియునుజేసి యెరుంగడు. ఆయున్మత్తుఁడట్లు పోవుచుం డఁగా నొకఁ బెద్దమైదానముగాన వచ్చెను. దానిమధ్యఁ బెక్కుం డ్రజపంబులు వలయాకారంబుగ మూగియుండిరి. అచ్చటి కింకను బెక్కండ్రు జనులు పోవుచుండిరే కాని యటనుండి యొక్కండును మరలి రాకపోవుటంబట్టి యోజింప నచ్చట జరుగ వలసిన కార్యంబింకను ముగియ లేదని తెలియ వచ్చుచున్నది. అచ్చటికిఁ దప్పురవాస్తవ్యులే కాక గ్రామాంతర వాస్తవ్యులు గూడ నావింతను జూడ వేడుకపడి వచ్చుచుండిరి. కొందరు వీరులు మహోత్సాహులై ఖరతర ఖడ్గంబులం దాల్చిపోవుచుం డిరి. వారి యుత్సాహంబును, వారి దృఢశరీరంబులును, నర్గళ సదృశంబులగు వారి బాహాదండంబులును జూచినచో వారు మహాబలులన్నట్లు తోఁపక మానదు. ఇట్లు పోవుచున్నవారిలో నొక వీరుని నా పిచ్చివాఁడు చూచి వెంబడించినడువఁజొచ్చెను. పిల్లలా పిచ్చివానిని వెంబడించి పోవుచుండిరి. ఆ వీరుండా పురం బునకుఁ గ్రొత్తవాఁడని యెఱింగి కొందరు బెంకిపిల్ల లప్పురుషుని గేలిచేయ నిశ్చయించుకొని సమీపించిరి. కాని యతని మొలను వ్రేలాడుచున్న భయంకర ఖడ్గంబునుజూచి భయపడి కిక్కురు మనకుండ వెనుకకుఁ దిరిగివచ్చిరి. ఆ పిచ్చివాఁడును, వానివెంబ

డీని బాలకులును గిలకిల ధ్వనులుచేయుచుఁ గోతిమూకలవలె వచ్చుచున్నను నప్పురుషుండు నిశ్చలుండై పోయి యాజనసమూహంబును జేరెను. వీరవరేణ్యులు మాత్రమే జన చక్రంబును భేధించుకొని లోపలి కేగుచుండిరి. కాని తక్కిన వారందరును రాజభటులచే నిర్బంధింపఁబడి పైనే నిలిచియుండిరి. వెనుక నున్నవారి కాలోపలి సమాచారంబులు గోచరింపక పోవుటచే వారు సమీపస్థ పాదపంబుల నధిరోహించి చూచుచుండిరి. ఈ నూతన పురుషుండు వీరునివలెఁ గన్పట్టుచున్నను, దక్కినవారివలె లోపలి కరుగకఁ బైనే నిల్చియుండెను. అయిన నితఁడు దీర్ఘకాయుండగుటచే, లోపలఁ బ్రవర్తిల్లు విచిత్రంబులఁ జూడఁదక్కిన వారివలెనే వృక్షాదుల నధిష్ఠింప నవసరంబులేదు. అతండచ్చట బ్రవర్తిల్లు సమాచారంబులను దెలిసికొనఁ గుతూహలుండై యుండెను. ఇంతలో వెఱ్ఱివాఁడువచ్చి వెఱ్ఱి వెఱ్ఱి మాటలు పలుకుచు లోపలి కరుగుచుండెను. వాని నెవ్వరును నాటంకపఱుపలేదు. ఆ నూతన పురుషుండును లోపలి కరుగఁ బ్రయత్నించిన నిర్బంధించువారుండకపోదురు. కాని యతఁడా లోపలఁ బ్రవర్తిల్లెడి సమాచారంబులను జక్కఁగఁ దెలిసికొనకుండ నరుగనిష్టపడలేదు. అప్పుడాతం డచ్చటి వారిని జరుగఁబోవుకార్యాంశంబును గూర్చి ముచ్చటింపఁగా వారిలో నొకఁ డతనింజూచి ' వీరులబలాబలంబులను నాయుధ విద్యాచాతుర్యంబును, జక్కఁగఁ బరీక్షించి కృష్ణదేవరాయలు వారి వారి యోగ్యతలకుఁ దగునట్లు బహుమానంబు లిచ్చునని చెప్పెను.

అది విని యా నూతన పురుషుం డమితా నందంబునొంది తనకుఁ దగిన సమయంబు లభించినదని తలంచి దాను నా వీరుల లో జేర సమకట్టి యట్టె చూచుచుండెను. అంతట మంగళ వాద్య ఘోషంబులు వినవచ్చెను. వానిని విని యాజనంబు లది యే మోయని మునిగాళ్ళపై నిలిచితలలెత్తి చూచుచుండగా నున్నతాశ్వంబులఁ బన్నిన రథంబుపైఁ గూర్చుండి కతిపయ సేవ కులతో రాజాధి రాజచ్చటికి వచ్చి, యున్నతి స్థలంబునఁ దన నిమిత్త మమర్పఁబడిన యాసనం బలంకరించెను.

నాఁడు జరుగ వలసిన పనులు ప్రారంభింపఁ బడియె. మొదటఁ బరీక్షార్థము వచ్చిన వారందఱును గరవాలంబులు దాల్చి సాముచేసిరి. వారట్లు సాముచేయుచుండగాఁ బై వారతని పై రువ్విన ఱాళ్లను దనకుఁ దగుల కుండఁ జేసి కొనవలయును. అట్లు చేసికొన్నవారు కృతార్థు లగుదురు. వారిలో నొకండు మాత్రమే కృతార్థుండయ్యె. పిమ్మట విలునమ్ములు గొని మార్గంబుననున్న లక్ష్యంబును భేదించుట మఱియొక కార్యము. అందులోఁ జాలమంది పరాజయ మందిరి. కాని సాములోఁ గడతేఱిన వాఁడొక్కఁడే యిందులోను జయ మందెను.

అనంతరము చక్రవర్తి యావీరులలో బలవంతులఁ గను. గొన వలయునని తలంచి మల్ల యుద్ధంబున కానతిచ్చె. అంతట నిరువురు పురుషులు పైకివచ్చి తమ బలాతి శయంబులం జూపుచు, విచిత్రగతులతోఁ బోయి చూపఱ కానందంబు గలు

గున్నట్లు పోరాడఁ జొచ్చిరి. వారిలో నొకఁడు రుద్రదేవుండు. రెండవవాఁడు శంకరరెడ్డి. అందులో రుద్రదేవుండు జయంబు నొందెను. ఆతండట్లు గెలిచిన తోడనే ప్రశంసా వచనంబులతోఁ గూడ కరతల ధ్వనులు మిన్ను ముట్టెను. ఈరుద్రదేవుండే యిది వఱకుఁ బ్రవర్తిల్లిన కార్యంబులందు, గృతార్థుండయ్యె గాన కృష్ణ రాయుండులేచి

"ఓ వీరులారా! యిచ్చటనున్న వీరులలో, నీరుద్రదేవుం డన్ని కార్యంబులలోను బ్రథమస్థానం బలంకరించెను. కావున నితనికే బహుమాన మర్పించెదను. ఇందుల కాక్షేపించు వా రున్న మొదల వచ్చి యితని నెదుర్కొనవలయు. లేనిచో నీతనికే బహుమాన మిచ్చెదనని చెప్పెను.

అదివిని వెఱ్ఱివాఁడు లేచి, నే నాక్షేపణంబు చేయు చున్నాను. నే నాక్షేపించు చున్నాను. నేనందఱను మించిన వీరుండను. నాకే బహుమాన మొసంగ వలెనని పలికెను. వాని వచనంబులు విని యందఱును బకపకనవ్వ నారంభించిరి. చక్ర వర్తియును విని మందస్మిత వదనార విందుండయ్యెను. వెఱ్ఱివాఁ డట్లు పలికి యూరకుండక యొకని చేతిలోని కత్తి నూడఁబెఱికి విచిత్రముగాఁ ద్రిప్పుచుఁ జూపఱకు వినోదంబుగల్గించెను. రాజ పుంగవుండది చూచి యాపిచ్చివానికట్టి చాతుర్య మల్లవడిసం దుల కాశ్చర్యంబు చెందెను. అనంతర మతఁడు మగుడవీరుల నుద్దేశించి వెనుకటి వచనంబులే పలికెను. అదివిని యచ్చటి వారందఱును పరస్పర ముఖావలోకనంబుచేసి కొనుచుండిరి.

కాని లోపలికి వచ్చిన వాఁడొక్క రుండునులేఁడు. ఇట్లుండఁగా నాక్రొత్త పురుషుండు జనంబుల నొత్తిగించుకొని లోపలికివచ్చి మహీపాలునిఁ గాంచి నమస్కరించెను. అతఁడుదీర్ఘ కాయుఁ డయినను, బొడుగునకుఁ దగిన స్థౌల్యంబు శరీరంబున కలవడి యుండుటచే వెక్కిరించినట్లుండక చిత్ర ప్రతిమవలెఁ గన్పట్టి సాఁగెను. అతని యవయవంబు లన్నియును, నవవయః పూర్ణం బొలగుటచేతను, వచ్చియు రాని నూనూఁగు మీసంబులు ముఖ చంద్రునకు గళంకత్వ శంకను గలిగించు చుండుటచేతను, నతం డు యౌవన ప్రారంభ దశయందున్నాఁడని నిశ్చయింపవచ్చును. అతండు రాజేంద్రున కభిముఖంబుగా నిలిచి 'ఓమహీపాలా! ఈవీరుండు నన్నుఁ గెల్చునంత పర్యంతంబును నీతండు మీరిచ్చు బహుమాన మందుటకుఁ బాత్రుండుకాఁడు?' అని గంభీరం బుగాఁ బలికెను.

అతని యాకారలక్షణంబుల బొడగాంచుచు నతని వచ నంబులు విన్నప్పు డచ్చటి వారందఱు నతని నిరుపమాన ప్రతా పవంతునిగాఁ భావించి, యతఁడే యన్ని కార్యంబులలోను జయ మంది బహుమాన మందఁజాలిన వాఁడని నిశ్చయించుకొనిరి. ఇదివఱకు జయమందిన రుద్రదేవుండును, నతని వీక్షించి నప్పుడు తన జయంబును గూర్చి సందేహాస్పద మనస్కుండై వెలవెల పోక పోలేదు. అంత రాజానుమతుండయి, యావీరుండు ఖడ్గం బును ద్రిప్ప నారంభించెను. అప్పు డిరువదిమంది యతని పై ఱాలు రువ్వుచుండిరి. అయిన నవి ఖనేల్ ఖనేల్ మని ధ్వని

చేయుచుఁ బ్రఫుల్లిపోవు చుండెనేకాని యొక్కటియైన నతనికి దగులలేదు. దానింజూచి యచ్చటి వారందఱును నబ్బురం బందిరి. కొందఱు వీరు లసూయాగ్రస్తులైరి. పిమ్మట నతండు విలునమ్ములుగొని దూరంబుననున్న లక్ష్యంబును నొక్క బాణంబుచేతనే భేదించి మూఁకలు మెప్పు వడసెను. ఇట్టి కార్యంబులలో రుద్రదేవునికంటె నా నూతన వీరుండే మిక్కిలి నేర్పుతో నిర్వహించెనని రాజేంద్రునకును, దక్కనవారికి దోఁచెను. అయినఁ గొందఱు మాత్సర్య యుక్తులై పరదేశీయునకీ గౌరవంబు నేలఁ జెంద నీయవలెనని తలంచి నిర్దుష్టంబులై ప్రశంసాపాత్రంబులైనను నతం డొనర్చిన క్రియాకలాపంబున లోపంబులనెంచ సమకట్టిరి. అయినను రాజేంద్రుఁడు వారిమాటలను బాటింపలేదు. పదియేట్లయినను మల్లయుద్ధంబున జయమొందిన వారే బహుమానార్హులని తెలుపుటచే వారిరువురు నా యుద్ధంబునకుఁ బూనుకొనిరి. వారిరువురును మత్తకలభంబుల చందంబున నెదుర్కొని భుజాస్ఫాలనంబులను, నూరుస్ఫాలనంబులను గావించి యొడికముతో నొకరి నొకరు పట్టుకొనుచు, వివిధ విచిత్రగతులఁ బోరాడి చూపఱకు హర్షోత్కర్షంబును గలిగించిరి. అచ్చటి వారిలోఁ గొందఱు రుద్రదేవుని పక్షమవలంబించి వాఁడు మీఁదగుచున్నప్పుడు ప్రశంసించుచుఁ, గ్రిందగునప్పుడు విచారంబున వెలవెల పోవుచునుండిరి. ఎవ్వరి నెవ్వరు జయింతురో కనుగొనవలె నన్న కుతూహలంబున జనంబులొకరి నొకరు ద్రోసికొని వచ్చుచు రాజభటుల

నిర్బంధంబునకు లోఁబడలేదు. జనంబులును, రాజేంద్రుండును
రెప్పవేయక చూచుచుండఁగా నా నూతన పురుషుండు కొంత
సేపు పోరి రుద్రదేవునిఁ గ్రిందుచేసెను. అట్లుచేసి యా వీరుండు
మహోత్సాహంబుతో రాజును సమీపించి నమస్కరించి నిలి
చెను. రుద్రదేవుండు పరాభవంబున మోము వంచికొని మాఱు
మ్మాటాడక యొకప్రక్కకుఁబోయి నిలిచెను.

ఆ నూతన పురుషుఁడు జయమొందుటకు సహింపలేక
కొందర తఁడొనర్చినది యన్యాయ యుద్ధంబని వాదింపఁజొచ్చిరి.
కాని యట్టి విద్యలందు నిరుపమాన చాతుర్యంబుగల యా
మహీపాలుండు సరకుగొనక బహుమాన మా నూతనపురుషున
కొసంగెను. తరువాత రాయలు రుద్రదేవుని సామర్థ్యంబును
నుతించి రెండవ బహుమాన మతనికొసంగి "పరాజయంబు నొం
దినను నీవు జేఁతలలో లెక్కింపఁదగినవాఁడ" వని చెప్పి యత
నికిఁ బ్రోత్సాహమొసంగెను. ఆ మహీపాలుండు తక్కిన వీరు
లకు ప్రోత్సాహంబు గల్గింప నర్హ బహుమానంబు లొసంగెను.
తక్కినవారాబహుమానంబుల కానందించిరి కాని రుద్రదే
వుండు తనకు వచ్చెడి బహుమాన మానూతన పురుషుండు
గొనిపోయెను గదా యని మిక్కిలి విచారింపసాగెను. ఆ పిచ్చి
వాఁడును రాజేంద్రుండిచ్చు బహుమానమంది కొని, స్వీకరించిన
మొదటి బహుమానమే స్వీకరింపవలెను. కాని తక్కిన వానితో
నేమి ప్రయోజనంబ" ని వారందఱు చూచుచుండఁగా నేలఁ
బెట్టి కొట్టి లేచిపోయెను. అదిచూచి యచ్చటివారందఱును బక

పక నవ్వనారంభించిరి. పరాజయంబందియు బహుమానము లం. దిన వీరులలోఁ గొందఱా వెఱ్ఱివాని వాక్యంబుల సరకు గొన లేదు. కాని రుద్రదేవుండు చెప్పనంత విచారంబును, నా నూతన పురుషునియందుఁ గ్రోధంబును వహించి యచ్చోటు గదలిపోవు చుండెను. పిచ్చివాఁడు వానిని ఖేంబడించి యొక సక్కెములాడు చుండఁగా దక్కిన జనంబులును బాలురును జప్పటులు గొట్టి నవ్వుచుండిరి. ఆ వీరులకుఁ బరాభవంబుకంటె' వీఁడనుచున్న మాటలే దుస్సహంబులై నవని తలంచికొని విచారంబుతో నిండ్ల కేగిరి. కాని పిచ్చివాని వచనంబులవలన మాత్సర్యంబును వర్ధిం చుకొని యా క్రొత్తవీరునిపై గ్రోధంబు వహించియుండిరి. జనం బులిట్లచ్చోటు గదలిపోవుచుండిరి. అప్పుడు . మహీపాలుండు నూతన వీరుం జూచి యిట్లు సంభాషించెను.

రా:-ఓ వీరవరేణ్యా! నీవున్నత వంశసంభవునివలెఁ గన్పట్టుచు న్నావు. నీ నివాసస్థలం బెచ్చట? నీ పరాక్రమము వర్ణనీయ మైనది.

వీ:-రాజేంద్రా! మా నివాసము కొండపల్లి దుర్గము. వీరనారా యణ గజపతి కుమారుండను. పరాక్రమంబున జీవింపఁగోరి యీప్రాంతంబున కరుదెంచితిని.

రా:-నారాయణ గజపతి పుత్రుండవా? మీ తండ్రివలెనే నీవును నిరుపమాన పరాక్రమ వంతుఁడవు. మేము కొండపల్లిని సాధించినప్పుడు నీజనకుండు చూపిన పరాక్రమం బద్వితీయం బయినది. నీవెప్పు డిచ్చటికి వచ్చితివి? ఎచ్చట విడిసితివి?

వీ:-ఓ సార్వభౌమా! రెండు దినంబులకుఁ బూర్వమే నే నీ పురం బునకు వచ్చితిని. మొన్న మంత్రిపుంగవునకు రాజద్రోహుల వలన సంప్రాప్తమయిన యాపదనుండి నేను రక్షింపఁగా నతఁ డానందించి నన్నాపట్టుననే తన యనికేతనమునకుఁ గొనిపోయెను. అప్పటినుండియు నచ్చటనే యుంటిని. మంత్రిపుంగవుఁ డవ కాశంబు చిక్కమిచే మీదర్శనంబునకు రాలేదు. అందుచే నేనును మిమ్ముఁ దర్శింపలేక పోతిని. కాని యిప్పు డప్రయ త్నంబు గానే నాకిట్టి భాగ్యంబు లభింపఁజేసిన భగవంతునకు వందనంబు లర్పించెదను.

రా:-ఏమేమి! సాంద్రశీతచ్ఛాయను సరస ఫలంబులను, దగిన సమయంబుల నొసంగుచు, నన్నును, నాదేశ ప్రజలనుసంరక్షిం చు చున్న యారసాల సాలము తీవ్రతరంబగు దావాన లార్చు లచే దహింపఁబడుచుండ రయంబునవచ్చియాబాధలుతొలంగి చనునట్లు జీవనంబిచ్చిన ఘనుండవా నీవు? కేవలము మా రసా లంబును రక్షించుటకే వచ్చితివా? లేక కారణాంతర మున్న దియా? ఎట్లయినను మారసాలంబును గాపాడుటకే యిచ్చ టికి వచ్చితివని తలంచెదను.

వీ:-మహీపాలా! ఘనుండెప్పుడును వ్యర్థంబుగాఁ గాలంబు పుచ్చు లేఁడు. జలంబును వర్షించుచునే యుండును. కాని యావర్షము ఫలవంత మగు వసుంధరయందుఁ బడిన నప్పుడే సుజన శ్లాఘాపాత్రంబగుచుండును. కాని యూ షర క్షేత్రంబులం బడినప్పుడు వ్యర్థంబే యగును. అట్లే

యీ వీరుండును, పరోపకారార్థము ప్రతాపంబును జూపు టయే విహిత కృత్యముగా నెంచుకొను చుండును. మీ రాజ్యంబునఁ జూపిన ప్రతాపంబు సుజనస్తోత్ర పాత్రంబగును గాని వ్యర్థంబుగానేరదు. కావున నాపరాక్రమంబున మీ వంటి సార్వభౌముల మెప్పించి మహాకీర్తిసంపాదింప వలయు నని వచ్చితిని. ఇట్టి ఘనులకుఁ గృష్ణభూభృత్తిలక మాశ్రయ మిచ్చినట్లు వేఱొకటి యాశ్రయంబియ్యదు. అందులోకే యిచ్చుటకివచ్చుట. మంత్రి రక్షణం బానుషంగికము.

రా- నీ వాక్యంబులు నాకానందంబు గొలిపినవి. అర్థగంభీరంబు లైన నీ వాక్యంబు లెవ్వనికి సంతసము గొలుపవు? ఈకృష్ణ భూభృద్వరేణ్యము మీవంటి నూతనఘనుల కాశ్రయమిచ్చు టకు మిక్కిలి వేడుకపడుచుండును. నవాంబుదము మొదటఁ జాలినంత వర్షమిచ్చి పర్వతమందున్న దావానలార్చులను జల్లార్చినను, నంతంబునఁదాఁ జల్లార్చిన దావానలంబు కంటెను భయదాయకంబులగు నిర్ఘాతంబులఁ బడవేయుట గలదు. అట్లె నీవును" అని చెప్పఁబోవు చుండగా

వీ:-ఓమహీపాలా: మీయభిప్రాయంబు నాకుఁ దెల్లంబయ్యె. ఆ నవాంబుదమువలె నేనును నాప్రతాపాతిశయంబుజూపి మీ రాజ్యంబునఁగల యుపద్రవంబులఁ దొలంగించుచు నుం డినను, తుదను మీకేదేని ద్రోహంబు జేయుదు నేమో యని భావించు చున్నారు. కాని యీ వీరుండా నవాంబు దంబువలె వివేక శూన్యుండు కాఁడు. ఆశ్రిత శాఖాచ్ఛేదము

చేసికొనునట్టి తెల్వి తక్కువవాఁడు కాఁడు. కావున మీరు సంశయింపక యితని కాశ్రయ మీయవచ్చును.

రా:-నీవాక్యముల కానందించితి. నీవు తప్పక నా చెంత నుండ వచ్చును. ఏ నామంబుచే నలంకృతుండవో చెప్పుము. వినఁ గుతూహలం బగు చున్నది.

వీ:-విజయసింహగజపతి యని యందురు.

రా- ఓ విజయసింహ! నీవు పరాక్రమాతిశయంబు చేతను, మహోపకారంబు చేతను నాకుమిక్కిలి కూర్చువాఁడ వయితివి. మా మంత్రిపుంగవుని రక్షించి నందులకుఁ గానుకగా నీ యుంగరంబునిచ్చుచున్నాఁడను. పుచ్చికొని యానందింపుము. ఇంతేకాక మాయిచ్చు నాతిథ్యంబును గూడ స్వీకరింప మా గృహంబునకు విచ్చేయు"మని పలికి యతనితోఁగూడ శకట మధిరోహించి యంతఃపురాభిముఖుండై పోయెను.

విజయసింహుఁడు నాఁడు తనకట్టి మహాగౌరవంబు లభింపఁజేసి నాదుల కమందానందంబు నొందిన ముకుందుని పదారవిందంబుల డెందంబునను నిల్పి యభినందనంబులు గావించుచు బోవుచుండెను. అనంతరము కృష్ణభూజాని యంతఃపురంబు ప్రవేశించి యవ్వీర వరేణ్యుని నొక సుందర మందిరంబున విడియించి యతనికి సమస్తోపచారంబులను జేయఁ గొందఱ సేవకుల నియమించి, తన నిలయంబున కరిగెను. ఈపురుషసత్తముండు విడిసిన మందిరంబునకు దక్షిణంబునఁ గొంతదూరంబున రాయలసౌధంబును, దానికి దక్షిణంబునఁ బురంధ్రీస్త్రీల యాలయంబులును

గలవు. ఈమందిరంబునకుఁ బశ్చిమంబున మనోహరం బగు నొక ప్రమదావనంబును, నందుగొన్ని యున్నత సౌధంబులును గన్నుల విందొనర్చుచుండె. రాజేంద్రుండును, నంతః పురస్త్రీలును గలిసి పోయి యాప్రమదావనంబున విహరించెడి యాచారంబు గలదు. ఆనాఁటిరాత్రి భృత్యులు తెచ్చి యిచ్చిన పదార్థంబుల సంతృప్తిగా భుజించి సేవకులతో నేదియో ప్రసంగించుచు విజయసింహుండు శయనించి యుండెను. ఆసమయంబున నతిమనోహరములగు సంగీత ధ్వను లరుదెంచి విజయసింహుని కర్ణపథంబున లోనికిఁ జని యతని చిత్తము నాకర్షించెను. అంత విజయసింహుం డా గాన చాతుర్యంబునకు మిగుల సంతసించుచు సేవకునితో నిట్లు ప్రసంగించెను.

'ఆవినవచ్చు సంగీత ధ్వను లతి మనోహరంబుగా నున్నవి. కంఠస్వరము పికస్వరంబువలె మృదుమధురంబై యున్నది. ఆ గానముచేయువారెవ్వరు?'

' మహాప్రభూ! ఆ పాడెడివారు స్త్రీలు. మారాణిగారిని జూచుటకేమో వచ్చినారఁట. నాల్గయిదు దినంబులకు ముందే యిచ్చటికి వచ్చియున్నారు. మా రాణిగారికి మా రాజకుమారికలకును సంగీత ప్రవేశమున్నది. అందుచే వారా క్రొత్తవారిచే బాడింపు చుందురు. '

' వారెవ్వరు? రాణి సందర్శనంబు చేయుటలో వారికిఁ గలుగు ఫలమేమి? ఆ స్త్రీలకు భర్తలు లేరా? లేక ప్రాణనాథ సహితలైయే వచ్చినారా? '

'ఓ వీరవరేణ్యా! వారిలోఁ జక్కఁగా సంగీతము పాడు నది యొక్కర్తుకయే యఁట. ఆమెకుఁ బదాఱువత్సరంబులుమా త్రమే వయస్సఁట. రెండవయామె చెలిమికత్తెయఁట. ఆయువతి కింకను బరిణయంబు కాలేదఁట. రాణిగారి దయను సంపాదించి యేదియో యొక కార్యంబు చక్కఁజేసి కొనుటకై వచ్చినారఁట. మఱి రాజకుమారికలకును నా యువతికిని బ్రాణ స్నేహమని చెప్పు కొందురు.'

విజయసింహుండా వచనంబులు విని యేమేమియో యోజించుకొనుచుండ మగుడ సంగీతధ్వనులు వినవచ్చె. అదివిని విజయసింహుండు, 'సేవకా! విను, విను ఆకంఠధ్వని యెవ్వరిదో యోజించి చెప్పఁగలవా?' అని యాత్రతతో నడిగెను.

'ఓ మహానీయా! అది యాయువతి కంఠధ్వని. మారా జకుమారికల కంఠధ్వనులు గూడ నించు మించుగా నట్లె యుం డును. కాని యభ్యాసంబు తక్కువగుటచే నింత శ్రవణానందజన కంబుగా నుండదు.' అని యా సేవకుఁడు బదులు చెప్పెను.

విజయసింహుం డా మాటలువిని యాగానరసంబును గ్రోలి మగుడ నాసంగీతంబును వినఁ దలంచెను. కాని మరల వినఁబడలేదు. అప్పటికి జాము నడురాత్రి కావచ్చెను. సేవకుఁడు నిద్రించెను, కాని విజయసింహునకు నిద్రపట్టుటలేదు.

అతనిమనంబు దీర్ఘాలోచనామగ్నంబై యుండెను. అట్లుం డ నెట్లు నిద్రవచ్చును? ఆ కంఠధ్వనివలన, బూర్వము తావలచి యున్న యువతీమణి తలంపునకు రాఁగా నామెంగూర్చియే యేమి

యో స్మరించుకొనుచు నతికష్టంబుచే నారాత్రి పుచ్చెను. తెల్ల వారినపిమ్మట నతఁడు శయ్యాతలంబును విడిచి నిత్యకృత్యంబులు నెరవేర్చుకొని కూర్చుండియుండెను. ఆయువతీమణి వృత్తాంతము సేవకు నడిగి తెలిసికొవలె నని యూహించెను. కాని యందు వలన నేమి ప్రమాదంబు సంభవించునో యని విచారించి మిన్న కుండెను. అందువలన నతని డెందము డోలాందోళనము చెందు చుండుటచే నేమిచేయుటకును దోఁచక సేవకుని సాయంబున నాయారామమందు విహరింపఁ దలంపుగొని యా యనుచరు నితోఁ గూడఁబోయెను. ఆ సేవకుఁడు అందలి వింతలను నతనికిఁ జూపసాగెను. కాని మన వీరున కవి సంతసము గొలుపలేదు. అయిన నాసేవకున కనుమానము చెందకుండునట్లు వాఁడుచూపి న వింతలను జూచియుఁ జూడనట్లు చూచుచు, మాటి మాటికిఁ దత్సౌధాగ్రంబునే వీక్షింపసాగెను. అంత నా సౌధోపరి భాగంబున సంచరించుచున్న చంచలాక్షులు కొందరు నేత్రగోచరలైరి. కాని వారిశరీరరంబులు కాంతియందే కాక యదృశ్యమగుటలో కూడ సౌదామినీ లతలతోఁ బూర్ణసామ్యము నొందెను. విజయసింహుఁడు మరల దర్శింపవలెనని గన్నెత్తి చూచెను. కాని యాసుందరాంగు లాపురుషునిఁ జూచుటచేతనో కారణాంతరంబు చేతనో వారు మరల నాతట్టునకు రాలేదు. ఇతనికిఁ గానరాలేదు. విజయసింహుండు వన విహారంబు చాలించి నివాసంబుచేరి భుజించి శయ్యాతలంబునుఁ జేరి సంగీతంబును విన వలెనని బహు జాగరూకతతో వినుచుండెను. కాని నాఁడు శబ్ద

మేమియును వినరాలేదు. ఇఁక సందువిషయమై యాశ వదలు కొనెను. అయిన మనంబు మగిడి రాలేదు. నిద్రపోవలె నని యెంతో ప్రయత్నించెను. కాని యందులకు ఫలము లేకపోయెను. అతఁడు కన్నులను నిమీలించికొని యట్లె శయనించియుండెను. తెల్లవాఱు జామయినది. అంత దన చెంత కెవ్వరో కాంతామణి వచ్చినట్లయ్యెను. అతఁడు కన్నులు తెఱచి నలుగడలు పరికించెను గాని యెవ్వరును గానరాలేదు. అది భ్రాంతియే కాని వేఱుగాదని తలంచి యెట్టకేలకు నిద్రించెను. రాత్రియందు నిద్దుర చక్కఁగాఁ బట్టక పోవుటచే నదియంతయుఁ దెల్లవాఱుజామున నావహించెను. ఆ సమయంబున నొక మందగమన మందగమనంబున వచ్చి యతని యాకారరేఖా విలాసాదులం జూచి, చిరకాలంబున కతండు కన్నులకు విందొనర్చినందుల కమితానందంబు చెంది, మొదట నతని మేల్కొలుప నెంచియు, సేవకులచ్చటనే శయనించియుండుటచే సమయము విపరీతముగా నున్నదని భావించి తాఁదెచ్చిన యుత్తరంబునుమడచి ప్రక్కను వ్రేలాడుచున్న యతని చొక్కాజేబులోవైచి యతిరయంబునం జనియెను. ప్రభాత సమయంబున విజయసింహుండు లేచి తనచొక్కాను తొడుగుకొనుచుండఁగా నది జారిక్రిందఁబడెను. దానిని పైకిఁ దీసి చూడ్కఁగా నాకాగితమందున్న యక్షరంబు లేవియో యతని మనంబు నాకర్షించెను. అంత నతఁడు దాని నత్యాదరంబునఁ దీసికొని చదువుకొనెను. అందులోనున్న విషయమిది. "హృదయ

వల్లభా! ఆనెఱొంది శోకపర్యాయము తప్పక రావలయును. దాసు రాలు ముక్తాంబ"అనియున్నది. అది చదివినప్పు డతనికిఁ గల్గిన యానందంబునకుఁ బారంబులేదు. ఏకురంగాక్షియనెడి సుక్షేత్రంబు ననేయనురాగబీజంబుచిరకాలంబు క్రిందట నేనెలకొనితదీయావయవ సౌందర్యరసంబువలన గ్రమక్రమ్ముంబుగవర్ధిల్లుచు నాపద్వాతూలం బున నున్మూలిత మయ్యెనో. యా యనురాగ బాలవృక్షము మగుడ నాయుత్తరంబువలన నా సుక్షేత్రంబున స్థాపితంబయ్యె. విజయసింహుఁడు సంతోషితస్వాంతుండై మాటిమాటి కాయు త్తరంబును జదువుకొనుచుండెను. దానిని రెండువందల పర్యా యంబులైనఁ బారాయణంబు చేసెను. కాని తృప్తి చెందలేదు. సంతోషదాయకంబు లగునట్టి యుత్తరంబులు తెగిబారెడు పొడుగున్నను, నింకను గొంచెము పొడుగున్నను, నింకను గొం చెము పొడుగుగా నుండవలెననియే కోరుచుండుట కలదు. సార్వ భౌమునివలనఁ దనకు సంప్రాప్తమైన యపూర్వ గౌరవంబునకును చిరకాలంబునకు దన యభిలషితకాంతామణి యుదంతబు విన్నం దులకును విజయసింహుఁ డొక మూల నమితానందంబు నొందు చున్నను, ప్రియకాంతామణి తన పాదంబుల సన్నిధికి వచ్చినప్పు డయినను గన్నులారఁ గాంచలేక పోతిని గదా యన్న విచారంబు వేఱొకమూలఁ జెందకపోలేదుఁ

# నాల్గవ ప్రకరణము

## ఆనెగొంది

'అన్యథాచింతితంకార్యం । దైవ మన్యత్రచింతయేత్'

దక్షిణ హిందూస్థానంబున నోరుగల్లు నగర వైభవము తగ్గి చన్నది మొదలు, విజయనగర వైభవం బతిశయించు నంతవఱకును, నీ మధ్యకాలంబునఁ బ్రఖ్యాతిగాంచినది యానెగొందిపురవరంబు. ఈ యానెగొంది పూర్వము వాలి సుగ్రీవులుండిన కిష్కింధానగరమే యని కొందఱు చరిత్రకారులు చెప్పుచున్నారు. ఈనగరంబును క్రీ॥ 1014 వ మొదలుకొని 1076 వ సంవత్సరము వఱకును నందుఁడనెడి నరేంద్రుండు పరిపాలించె. తరువాత నతని సంతతి వారగు, నన్నమరాజును, రామదేవ రాయలును, ప్రతాపరాయలును, గ్రమ్మఱ నా పురంబును బరిపాలించిరి. ప్రతాపరాయుని కుమారుఁడగు జంబుకేశ్వరుఁ డుత్తర హిందూస్థానంబును బాలించిన మహమ్మదీయ ప్రభువులలో మహాక్రూరుండని ప్రఖ్యాతి వహించిన మహమ్మద్ తోగ్లకును ధిక్కరించి, యానెగొంది రాజ్యంబును నిరపాయంబుగాఁ బరిపాలింప నారంభించెను. కాని యాతురుష్క చక్రవర్తి జంబుకేశ్వరుని నోడించి యానెగొందిని స్వాధీనంబు గావించి యతని యమాత్య ప్రభృతుల నార్వురను బంధించి, ఢిల్లీకిఁ గొనిపోయి కారాగృహబద్ధులంగావించె. అందుల

కానెగొంది ప్రజలు దుఃఖించి పారతంత్ర్య మహార్ణవంబున మునింగి యుండఁజాలక మహమ్మదీయ ప్రభుత్వమును ధిక్కరించి ప్రవర్తింపఁగా నతండేమియుఁ జేయఁజాలక వారిని విముక్తులం గావించి వారిలో మంత్రియగు హరిహరరాయుల. కా రాజ్యం బిచ్చి, యతని తమ్మునికి మంత్రిత్వ మొసంగి, తన కంకితుఁడై యుండునట్లు వాగ్దానంబు గావించికొని పంపివేసెను.

హరిహరరాయులు రాజ్యంబు చేకొనినతరువాత మహమ్మదీయ ప్రభువున కంకితుండై యుండక స్వతంత్రుఁడై తన పరాక్రమంబునఁ బెక్కు దేశంబులు జయించి యానెగొంది రాజ్యంబును వర్ధించి నిరంకుశముగాఁ బరిపాలించెను. ఆయానెగొందె యతని కాలంబునందే మహోన్నతపదవినొందెను. కాని యతఁడు విజయనగరంబును రాజధానిగాఁ జేసికొన్నతరువాత నిది గ్రమంబుగ హీనదశకువచ్చె. అవును మార్తాండ మండల ముదయించి నపిమ్మటఁ జంద్రమండలంబు కాంతి వ్యాపించునెట్లు? చక్రవర్తికి స్థానంబు కాకపోవుటచే నది పూర్వముకంటె నైభవంబునఁ గొంత తఱిగి చన్నను, మన కథాకాలంబు నాఁటికించు మించుగా రెండువందల పదాఱువత్సరంబు లైనను, మిగిలియుండిన పూర్వపు కట్టడంబులు సర్వవినాశకం బగు కాలంబు వలన నక్కడక్కడఁ గొన్ని భాగంబులు శిథిలత్వంబు చెందినను, దొల్లింటి మహోన్నత దశను జూపుచునుఁ దెలుపుచునే యుండెను. కోట గోడ లాకాలంబునాఁటి కింకను సుంతేనియును శిథిలత్వంబు నొందక దృఢతరంబులై బలిష్ఠంబులై యుండెను. ఆకోటలో

నున్న రాజమందిరంబులలో గొన్ని కార్యస్థానంబులుగా నుప యుక్తము లగుచుండెను. మఱికొన్నిటిలో నున్నతోద్యోగస్థ లును రాజబంధువులును, నివసించుచుండిరి. ప్రస్తుతంబున వాస భూతంబులగు మందిరంబులు మాత్రమే చెన్నుదఱుగక యుండెను. కాని తదితర గృహంబులు మూషికరాజులకు విహారస్థానంబులై పెంటలపాలయిచూచుటకు హేయంబులై యుం డెను. ఆమందిరంబులు పూర్వంబున సకలవస్తుసిస్తులంబులై, సుంద రంబులై యెంత యానందంబు గలిగించుచుండెడివో, యిప్పుడవి మలిన పదార్థభూయిష్ఠంబులై యంత భయదాయకంబులై యుం డెను. అందుంగొన్నిటిలో విదేశంబులనుండి ఖైదీలగాఁ దీసికొని రాఁబడిన రాజకుటుంబములు నివసించుచుండెను. ఇట్లైవా రా కోటలో నుండుటచే సార్వభౌముఁడు గొంత సైన్యంబును నియ మించి సంరక్షించుచుండెను. అందువలన నాకోట వైభవంబున దీసిపోయినను, దదంతర్బహిర్భాగంబులకు వచ్చుచుఁ బోయెడి జనంబుల నిర్బంధించుటలోఁ గఠినశాసనంబులు మాత్రము తఱుగ లేదు. ఆపూర్వపుకట్టడంబులలో నొకటి పూర్వపు రాజులకుఁ గార్యాలోచన భవనంబుగా నుపయోగించుచుండెను. ఆమందిరం బు మిగుల విశాలంబై మంత్రభంగంబు గలిగించు గవాక్షస్తంభా దులు లేక యుండెను.

ఒకనాఁటిరాత్రి యాభవనంబునఁ గొందఱు మనుష్యులు ప్రవేశించి ప్రత్యేకాసనంబులందు పవిష్టులై యేదేదియో సంభాషిం చుకొనుచు నెవ్వరికోసమో ప్రతీక్షించుచుండిరి. వారేదియో

రియొక కార్య నిశ్చయంబు చేయ నచ్చుటకి వచ్చినట్లు తోఁచు చున్నది. ఆ మందిర మధ్యంబున మినుకు మినుకు మనెడి చిన్న దీపమొకటి వెలుగుచుండెను. ఆ భవనము విలాశమైన దగుటచే నాచిన్న దీపమందలి ధ్వాంతంబులను విధ్వస్తంబు గావించునంతటి కాంతి కలది కాకుండెను. కావున మూలమూలలం దింకను జీఁకట్లు దట్టంబుగానే వ్యాపించి యుండెను. ఆ మందిరంబునకుం బూర్వమునుండు పెద్దద్వారమే కాక దక్షిణమునై పున మఱియొక చిన్నద్వారముండెను. ఆ చిన్నద్వారమునం బడిపోయినచో నావైపున నున్న మందిరంబులలోనికిఁ బోవును. విదేశాగతములగు రాజకుటుంబములకు వాసభూతంబులైనవి యా మందిరంబులే. ఒకనాఁడు రాత్రి ద్వితీయయామంబు కడచుచుండఁగా నాదక్షిణ ద్వారమునుండి యేఁబదివత్సరంబుల ప్రాయంబు గల యొకపురుషుండును, షోడశవత్సరంబుల వయస్సుగల యువతీమణియును వచ్చి యా మందిరంబు ప్రవేశించి తమకు నిర్దిష్టములగు నాసనంబుల నాసీనులైరి. మూలలందుఁ బరులెవ్వరైన దాగియుండి తమ మంత్రంబును బైటఁబెట్టుదురన్న సందియంబుతో నొకఁడు దీపంబును గొనిపోయి మూలమూలలు పరిశీలించి వచ్చి ద్వారంబుల బంధించి తన యాసనం బలంకరించెను. అనంతరము వారిలో నొకండు మరియొకనిగాంచి, 'ఓ ప్రహరేశ్వరపాత్రా! నీవును ముక్తాంబయును జేసిన వ్యాసంబు ననుసరించి నేను బిజాపుర రాజును సందర్శించి మనస్థితిగతులను దెలియఁజేసి సాయము చేయ వేఁడుకొంటిని. ఆవిజాపురరాజు దయకు పాత్రుఁడైనతో ఫల

ఖానునెడి మహమ్మదీయపేరుని స్నేహంబును సంపాదించుకొని వచ్చితిని. మఱికొందఱు మహమ్మదీయప్రభువులుకూడ మనకు సాయంబుచేయ వాగ్దానం బొసర్చిరి. నీవును నీయువతీమణియును నచ్చుటకే వత్తురేని కార్యం బంతయును జక్కఁబడును. ఇందులకు నీవేమందువు?' అని వివరించి చెప్పెను.

'ఓ రామయామాత్యశేఖరా! నీకంటె బుద్ధిమంతు లెవ్వరును లేరు. నీవేమిచేయుమందువో దానిని జేయనేను సంసిద్ధుం డనై యున్నాఁడను. ఏది యెట్లయినను నీకృష్ణరాయలను జయిం చి కసిదీర్చుకొనుట ముఖ్యకార్యము.' అని ప్రహారేశ్వరుం డనెను.

'ఓమంత్రిపుంగవా! మీ యాలోచన నాకంతయు న్యాయంబు గాఁదోఁపకున్నది. మన మాబీజపురరాజు సాయంబువడసి సార్వ భౌముని జయించి మన యుదయగిరిని స్వాధీనంబు గావించు కొన్నను, మనమొక మహమ్మదీయ ప్రభువునకు లోఁబడి యుండ వలసినచో మనకు సౌఖ్యంబేమికలుగు? హిందువులతో బద్ధవై రంబుగల మహమ్మదీయులతో స్నేహముచేసి యతనికి లోఁబడి యుండుటకంటె ధర్మపాలనాసక్తుఁడగు నొక హిందూ ప్రభువునకు లోఁబడియుండుట సముచిత కార్యంబుకదా? మనమిప్పుడు కోపావిష్టమానసులమై పంతగించి యామహమ్మదీయునిజేరి కృష్ణవసుంధరాధిపతితో నిరోధ మవ లంబింతమనియే యనుకొందము. అప్పుడు మనము జయము పొందలేకున్న నపారదుఃఖంబుల పాలగుదుము. ఒకవేళ జయం

బునొంది మనదుర్గంబును స్వాధీనంబు కానించుకొన్నను, బరా భూతుండైన కృష్ణభూకాంతుండు మారకుండక పక్కలోబల్లెమువలెఁ మెలంగుచుండును. అంతియకాక మనకు రాజ్యంబును స్థిరం బుగా దక్కనీయఁడు. అపారరాజ్యంబుచేతను, నసంఖ్యానీకినుల చేతను నుదారులయిన గజపతియే కృష్ణరాయుని పరాక్రమంబు నకుఁ దాళఁజాలక తనకుమారిక నర్పించి సంధికావించుకొనియె. అట్లుండ నతనితోఁ బ్రతిఘటించి నిలుచుటకు మనమేపాటివారము? కావున నేను మొదట మీకు వాగ్దానంబు చేసియున్నను నిప్పు డాలోచింప సామంబుచేతఁ గార్యంబు సాధించుకొనుట యుక్త మంబని తోఁచుచున్నది.” అని యుదయగిరి దుర్గాధీశ్వరుని పుత్రికయగు ముక్తాంబ పలికెను.

ఆవాక్యంబులువిని ప్రహరేశ్వరపాత్రుం డేమియు సమా ధానంబు చెప్పలేకపోయెను. అంతియకాక చిన్నపిల్లయయినను ముక్తాంబపలుకులే హితదాయకంబులయినవని నిశ్చయింపసాగెను. రామయమంత్రియదివినియామెవచనంబులకత్యాశ్చర్యంబు నొంది “ఓరాజపుత్త్రీ!నీవాక్యమ్ములు మిక్కిలిశ్లాఘాపాత్రంబులై యున్న వి. నీవన్నట్లు సామంబునఁ గార్యంబు నెఱవేఱిన మనకుశ్రేయో దాయకమే. కానిసామంబున మనకార్యంబెప్పటికి నెఱవేఱదు. నీకు ఉదయగిరిదుర్గంబునునీవలయునన్నతలంపు • వారికిలేదు. ఇప్పటి కయిదాఱేండ్లనుండి నీవు వారి దర్శనంబుచేసి వేడుకొను చున్నావు. అందువలన నేమయిన లాభంబుగల్గినదియా? ఆతిమ్మ రుసు మనయెడల మిగులఁ గ్రౌర్యంబు వహించియున్నాఁడు. ఆ

మంత్రిపుంగవుండు చెప్పినదియే యాభూపాలుని సిద్ధాంతము. ఆభూపాలుఁడుపై కీశాంతుఁడైనట్లు గన్పట్టుచున్నను లోపలఁ గఠినత్వము వహించియుండకపోలేదు. రాజులచిత్తము లట్టియుం డును. లోకానుభవంబు చాలకపోవుటచే నీవట్లు వక్కాణించు చుంటివి. కాని మేమాలోచించినదియే యుక్తమార్గము సుమీ అనిరామయమంత్రి చెప్పెను.

ఓమంత్రిపుంగవా! రాజకీయ వ్యవహారంబు మావంటి మందబుద్ధుల కెట్లు తెలియును? నామనంబు నంగిల యభిప్రాయం బును దెల్పితిని గాని యదియే సిద్ధాంతమని వ్రాక్రువ్వలేదు. ముందుముందు మనకు సంభవించెడి లాభనష్టంబులను గూడ నాలోచింపవలయును గదా? కృష్ణదేవరాయలకు మనమంకితుల మై యుండుటకైన నంగీకరించి యుదయగిరిని స్వాధీనము చేసి కొనుట యుక్తకార్యమే. వారు సామంబున నీయరని కదా చెప్పితివి. దానిని నేను విశ్వసింపను. నే నన్నపూర్ణాదేవి దయను సంపాదించి యామెచేఁ జెప్పించితిని. సార్వభౌముండంతఃపురంబు నకు వచ్చినప్పుడు నేనును స్వయముగాఁ బ్రార్థించితిని. అతండు దయార్ద్రహృదయుం డయినట్లు చూపట్టెను. ఇంకనొకటి రెండు పర్యాయంబులు పోయి దర్శించిన కార్యంబు చక్కఁబడునని తోఁచెడిని. ఆశత్రువుతో సంధిచేసికొనుట పౌరుషహీనమైనపని యనియందువేని, గటకపురీశ్వరుఁడంతటివాఁడే రాయలకులోఁబడి సంధిగావించుకొనుచుండ మనము వెనుక దీయనేల? ఇప్పుడు కృష్ణభూకాంతున కంకితులమై యుండ నంగీకరించి నిష్కంటకం

బుగాను, నిస్సపత్నంబుగాను రాజ్యంబేలుకొనుట యుక్తమా, లేక మహమ్మదీయ రాజులసాయంబునఁ గెలిచి కుట్టకేల కుదయగిరి స్వాధీనంబు గావించుకొని మహాబలుఁడయిన శత్రువును హృదయశల్యంబుగా నుంచుకొనుట యుక్తమా? రాజనీతి విశారదుండవయిన నీవే యోజించి చెప్పుము' అని ముక్తాంబ గంభీరంబుగాఁ బలికెను.

ఆ వాక్యంబులువిని రామయమంత్రి యత్యాశ్చర్యంబునుజెందెను. రామయామాత్యుఁ డింతకుఁ బూర్వ మామెతోఁ దఱుచుగా సంభాషింపక పోవుటచే నామె ప్రతిభావిశేషంబును దెలిసికొని యుండలేదు. ముక్తాంబ యంతటి బుద్ధిమంతురాలనియు నంతటి రాజనీతివిశారదురా లనియు నెప్పుడును దలంపలేదు. ఇంతేకాక స్త్రీలు బుద్ధిమతులై యుండరని యాతని నమ్మకము. అందుచే నిప్పుడు ముక్తాంబవచనంబు లధికాశ్చర్యంబును గలిగించెను. ఆమె చెప్పినది యుక్తియుక్తంబుగా నున్నట్లాతోఁచెను. అయిననుఁ దనపంతముకొనసాగించుకొనకుండ నూరకుండుటయు క్తము కాదని నిశ్చయించి, "ఓగుణకదంబా! ముక్తాంబా! నీవాక్యంబులు మిక్కిలి యర్థయుక్తంబులై యున్నవి. నీవాక్యంబుల బూర్వపక్షముచేయునంతటిసామర్థ్యమునాకు లేనట్టే తోఁచుచున్నది. అయిన నా యభిప్రాయంబు దెల్పెదవినుము. మాయాలోచనంబు వలన నెక్కు లాభంబు లున్నవి. అవి సామాన్యులకు దురూహంబులయినవి. అని యెప్పటికైనను గొనసాగునాయని సంశయింపకుము. మా యభిప్రాయంబును సాంతంబుగా వక్కాణించెదను.

సావధాన చిత్తులై యాలకించు యందలి లోపంబులను వివరించి
చెప్పుము. నీమనంబునకుఁ దట్టినట్లు సమాధానంబు లిచ్చెదను.
మన మిప్పుడు దక్షిణ హిందూస్థానంబునఁ జతురంగ సైన్యం
బునందును, నింధుమించుగా రాయల కెనవచ్చు విజాపుర వసుం
ధరాధిపతితో స్నేహంబు గావించుకొని వచ్చితిమి. అతఁడునుఁ
దనదేశ సీమనుండిఁ గృష్ణరాయలవంటి మహాశత్రువు నుంచ
నిష్కంటక యున్మూలింపఁ జూచుచున్నాఁడు. ప్రబలుఁడైన శత్రు
వును వధించుటయే యిప్పటికి ముఖ్యకార్యము. కాన మన మతని
కంకితులమైయుండ వలయునని యెప్పటికిని గోరు
చుని యనుకొనను. విజాపుర రాజునకంత సామర్థ్య మున్నదా
యని సంశయింపకుము. ఈకార్యంబునకుఁ దక్షిణ మహమ్మ
దీయ ప్రభువులుకూడఁ దోడుపడ నంగీకరించి యున్నారు. విజయ
నగరంబున కన్నివిధంబులచేతను దీసిపోని కటకపురాధీశ్వరుండు
ప్రస్తుతము సఖ్యంబుతో వర్తించుచున్నను, సమయము వచ్చిన
ప్పుడు రాయల నున్మూలించుటకే చూచుచున్నాఁడు. ఇంతియ
కాక కర్ణాటకంబున శివసముద్ర దుర్గాధిపతియగు గంగరాజు
రాయలొనర్చిన పరాభవంబును సైపలేక జలంబులంబడి ప్రాణం
బులఁ ద్యజించుట కన్నులారఁ గాంచిన తదీయబంధువులు కృష్ణ
రాయల పొంకమడంచుటకు లోలోపలఁ బ్రయత్నించుచున్నారు.
మనవలెనే యాపత్పయోరాశిని మునుంగుచున్నవారు పెక్కురు
గలరు. వారియాపదలకుఁ గారణము కృష్ణరాయలే. సమానాప
దలోనున్న రాజులనందఱ నేకీభవించు యత్నంబులు సలిపియు

న్నాను. వారందఱు నేకీభవించి విజయనగర సామ్రాజ్యభాను నస్తమింపఁజేసిన హృదయశల్యమువంటి శత్రువు మనకు మిగిలి యుండుటెట్లు? దీనికి నీయాక్షేపణ మేమయిన నున్నదియా??
అని రామయామాత్యుండు పలికెను.

'మంత్రివరా! నాకొక్క- యాక్షేపము తట్టుచున్నది. దుర్నివారతేజంబుతోఁ బ్రకాశించు విజయనగర సామ్రాజ్య చండభాను నస్తమింప సమర్థులే యగుదురో, 'లేక సాహసించి మాఱొ్కని దదీయచండ తేజంబునకు సహింపలేక మాడి బొగ్గగుదురో తెలియఁజాల కున్నాను' అని మందహాసము చేయుచు ముక్తాంబ పలికెను.

'తల్లీ! నీవీ సందియంబును బాయందగును. విజయనగర సామ్రాజ్యభానుని తేజంబునకు ముఖ్య కారకుఁడు తిమ్మరుసు మంత్రిపుంగవుండు. అతని రహస్యమ్ముగాఁ జంపుటకుఁ దగిన యుపాయంబుఁ బన్ని యుంటిని. మనమాతనిం జంపితిమేని నిస్తేజస్కుండయి మాఱొ్కన సులభసాధ్య మైనదాని నెదుర్కొన నెవ్వరు భయపడుదురు? ఎట్లుపాయంబులం బారయుదురు?' అని రామయ మంత్రి పలికెను.

'మంత్రిపుంగవా! ఆ మంత్రిపుంగవునిఁ జంపుట యంత సులభ సాధ్యమా? ఆ కార్య మెట్లు కొనసాగును?' అని ముక్తాంబ ప్రశ్నించె.

''అమ్మా! ముక్తాంబా! నీవట్లు సందియపడ నవసరంబు లేదు. మనరామయమంత్రి ప్రతిభావిశేషము నిరుపమాన మైనది.

దానితోఁ బ్రతిఘటించి నిలుచునట్టిది వేఱొకటి లేదు. నామాట నమ్ముము. ఇతఁ డతనిఁ జంపఁ దలంచెనేని తప్పక చంపఁగలఁడని నమ్ముము. ఈమధ్య నా మంత్రిపుంగవుండు యమనిశాంతమున కరుగవలసినదే కాని వాని యదృష్టవశమున నొకవీరుండు వచ్చి విడిపించుకొనిపోయెను. ఈపర్యాయ మతని ప్రాణంబులు తప్పక పుచ్చుకొందుము. చూడుము.” అని ప్రహరేశ్వరుండు వచించెను.

“వానింజంపి విజయనగర రాజ్యంబును నశింపఁజేయుట వలన మనకు విశేషలాభ మేమయిన నున్నదా?” అని రామయ మంత్రిం జూచి ముక్తాంబపలికెను.

“లేకేమి? వలయునన్ని ఫలితము లున్నవి. మనరాజ్యంబు మనకు సులభముగా వశమగును. అందొకటి మన ప్రబల శత్రువు హతుం డగుట. రెండవది ఏనుగు జచ్చిన నెన్నియో మృగంబులు కడుపార మాంసంబును మెసంగును. అట్లె యీసముదారరాజ్యాధి నాథుండు కూలిన నందఱు దమకు జేతనగు నంత రాజ్యంబును వశంబు గావించుకొందురు. గాన మనము మన రాజ్యమేకాక మఱికొంత రాజ్యంబును గూడ నాక్రమింపవచ్చును. ఇది మూడవది. మీతండ్రిని జంపిన శత్రువును జంపించి పితృఋణంబు దీర్చుకొనుట నాల్గవది. అన్నింటిలోను నిది ముఖ్యఫలంబు గదా?” అని రామయమంత్రి నచ్చు బలికెను.

ముక్తాంబ యీ వాక్యంబులు విని తన జనకుందలంచు కొని, వచ్చుచున్న దుఃఖంబు నతికష్టముచే నడంచుకొని పగసాధించుకొనుటయే ముఖ్యకార్యంబని యెంచి యొకవేళ నికార్యంబు సాధించుకొన వచ్చునని నిశ్చయించి, రామయమంత్రిం జూచి 'మంత్రి పుంగవా! నీవు చెప్పినవేవియును నామనంబు నాకర్షింప లేకపోయెను. గాని నా జనక ఘాతుకుని గూల్చుట యుక్తమని చెప్పిన నీ వాక్యము సముచితముగా నున్నది. నే నిప్పుడేమి చేయవలయునో చెప్పుము.' అని మంత్రి నడిగెను.

'అమ్మా! నీవు విజాపుర రాజ్యంబునకు రావలయును. వచ్చి నీవు నిమిత్తమాత్రవై యుండినం జాలును. కార్యంబంతయును మేమే చక్కంబెట్టుకొందుము. నీవు మాచెంతనుండనిచో మాకంత యుత్సాహంబు గలుగదు. నిన్ను నిరపాయంబుగాదప్పించుకొనిపోయెదను. కావున నీవు మాతో వచ్చుటకు సిద్ధంబుగా నుండుము.' అని రామయ మంత్రి వచించెను.

సర్వకాలంబులందును రక్షక భటులచే రక్షితంబగుచున్న యీదుర్గంబునుండి నిరపాయంబుగాఁ దప్పించుకొని పోఁగలుగుదుమా!' అని ముక్తాంబ యడిగెను.

'అందులకై నీవు చింతింప నక్కరలేదు. నీ వంగీకరించినం జాలును. నవలీల నిన్నుఁ దప్పించుకొని పోఁగలఁడు. రామయమంత్రి కుపాయంబులు వెదకవలసిన యవసరంబు లేదు.' అని ప్రహరేశ్వరుండనియె.

'మంత్రిపుంగవా! మహా ప్రతిభాశాలివైన నీ మాట ద్రోసివేయనే నెపాటిదానను? మీరేమిచేయు మందురో దానిం జేసెదను. అది మనకన్ని విధంబులచేతను లాభకరంబై యుండ వలెనుజుమీ!" అని ముక్తాంబ యనెను.

రామయమంత్రి యందుల కానందించి, ప్రహరేశ్వరుం జూచి, "ఫలోన్ముఖమయిన కార్యంబును జెఱచి నాకు విచారంబు గలిగించితిరి. ఇందులకుఁ బ్రధానుఁడెవఁడు." అని యడిగెను.

"అమాత్యవరా! శత్రువునిఁ జంపదగిన సమయము లభించినది. ఈ రుద్రదేవుండు తడయక వెంటనే ఖడించిన కార్యంబు సఫలమయియుండును. కాని యతఁడట్లొనర్ప లేదు. ఇందులకు గారణము రుద్రదేవుం"డని ప్రతాపరాయుండనెను.

"ఓయమాత్యశేఖరా! సంగరంబులందు శత్రువుల కభిముఖంబుగాఁ బోయి యుద్ధంబొనర్చి కీర్తివహించెడి నాకు నిరాయుధుని జంపుట యుక్తంబుగాఁ దోఁపలేదు. అందుచే మొదట సంకోచించితిని. ఇట్టి కార్యంబులొనర్ప నిదియే ప్రథమపర్యాయము కదా? మీరిఁక నెట్టికార్యంబులకు నియమించినను దప్పక నెఱవేర్చివచ్చెద. నను విశ్వసింపుము. ఆ వీరుండు రానిచో నాఁడే యమ్మంత్రిని జంపియుందును. పోనిండు అతనిని జంపుటకిఁక నవకాశంబు చిక్కదా యేమి? ' అని రుద్రదేవుండు చెప్పెను.

'ఓయీ! అట్లనకుము. ఈమారుచంపుట మిక్కిలి కష్టము. ఆ మంత్రి యిదివఱకేమరియున్నవాఁడు. ఇఁక మీద

వాఁడెన్నియో యుక్తులుపన్ని రాజద్రోహులజాడ దీసి శిక్షింపఁ బ్రయత్నించుచుండును. అయిన నతనిఁ జంపుటకు మఱియొక పరి ప్రయత్నింతము. ఆ నూతన పురుషుఁడు బహుపరాక్రమ శాలి. వానిం దప్పక చంపవలయును.' అని రామయ మంత్రి యనెను.

'మంత్రీశ్వరా! ఆదుర్మార్గునివలననే మనకార్యంబంతయు భగ్నమయినది. ఇంతియ కాక నా కింపు సిద్ధంబుగ నున్న బహుమానంబును వాఁడు పుచ్చుకొనియెను. వానిపేరు విజయ సింహుఁడఁట. ఆ దురాత్ముని జంపకుండిన నాకు నిద్దురపట్టదు.' అని రుద్రదేవుండు చెప్పెను.

'రుద్రదేవా! ఆ విజయసింహుని వధించుట యెంతటి కార్యము? అవలీల నెరవేర్పఁగలము. ఆ యిరువురిని జంపెడి ప్రయత్నంబుపై నుందును. ఇఁక మీరు మీ నిలయంబులకుఁ బోయి ప్రతిదినంబు నేదో సమయంబునవచ్చి నన్నుఁ గలిసికొను చుండుఁ'డని చెప్పి వారిం బంపివేసి రాజపుత్రిని వీడ్కొనిపోయె ను. ప్రహరేశ్వరుండును ముక్తాంబతోఁదన మందిరంబు ప్రవేశిం చెను.ముక్తాంబతన శయ్యాతలంబును జేరెను. కాని నిద్రపట్టలేదు. విజయసింహ వధనుగూర్చి వారుపలికిన పలుకులు నిర్ఘాతపాతం బుల మాడ్కి తాకి యెక్కుడగు సంతాపంబును గల్గించెను. తానా సమయంబున విజయసింహుని పక్షమవలంబించి యే మయినం జెప్పినవారు తన యభిప్రాయంబును దెలిసికొని విప రీతులగుదురని భావించి మాఱుమాటాడక వచ్చి శయనించెను.

ఈ విచారంబు చేతనే యామెకు నిద్రపట్టలేదు. ఆ సమయంబున నామె మానసము వర్షకాలంబున మేఘ కదంబంబునందు బ్రకాశించెడి సౌదామినీ లతవలెఁజలింప నారంభించెను. అంతలో నూరకుండక చిత్తము ద్రవించిపోయెను. కనుదమ్ములనుండి ముత్తెపుకోవవలె వెచ్చని బాష్పబిందుసందోహము గురియఁ జొచ్చెను. ఆముక్తాంబయింతకుఁ బూర్వమే విజయసింహునివరించి యున్నది. విజయసింహుఁడు ఉదయగిరి దుర్గంబున కరిగినప్పుడు వారిరువురును బరస్పరానురాగంబును సంపాదించుకొనిరి. ఇట్లుండఁ గృష్ణభూపాలుం డుదయగిరిని జయించి తద్దుర్గాధిపతి యగు వీరభద్రపాత్రుని జంపి యతని పినతండ్రియగు ప్రహరేశ్వర పాత్రునిఁ జెఱఁగొనివచ్చె. దుర్గాధీశ్వరుని కుమారికయగు ముక్తాంబకుఁ బ్రహరేశ్వరుండు తప్ప సంరక్షకుఁడు లేకపోవుటచేఁ గృష్ణరాయలామెను గూడఁ గొనివచ్చి ప్రహరేశ్వరపాత్రుని చెంత నుంచెను. ముక్తాంబనొంటిగా నుదయగిరియందు విడిచి పెట్టిన నెవరేమి చేయుదురో యనుభయంబున నామెను దెచ్చి యిచ్చటనే యుంచెను. అట్లామెను జాగరూకతతో రక్షించుచు, నామెకు యుక్తవయస్సువచ్చిన పిమ్మటఁ దగిన వరున కిచ్చి పెండ్లి గావించి యుదయగిరివంశము మగుడ నిలువఁ బెట్టవలయు నని తలంచి కృష్ణ భూకాంతుఁ డిట్లొనరించెను. ముక్తాంబ యిచ్చటికి వచ్చి మైదాఱేండ్లు కడచినవి. అప్పటినుండియు విజయసింహ ముక్తాంబలు పరస్పరమును జూచి మాటాడియుండలేదు. అయిన వారల యనురాగం బభివృద్ధి చెందుచునే యుండెను. ముక్తాంబ యిచ్చ

ట నున్నదని యూహించియే విజయ సింహుఁడు సమస్తమును విడిచి యచ్చటికి వచ్చెను. కృష్ణరాయల యంతఃపురంబున కరిగి యతని కుమారికలతో సౌధోపరి భాగంబున విహరించుచు, వన విహారంబు చేయుచున్న విజయసింహుని, గాంచి తానానెగొందికి వచ్చునప్పు డొకయుత్తరమ్ము విజయసింహున కిచ్చి వచ్చెను. తనయిచ్చిన యుత్తరంబును జూచికొని విజయసింహుం డానె గొందెకు వచ్చుననియుఁ దన యభిలషిత కాంతుని సందర్శించి సంభాషించి, తన యనురాగంబును నతనికిఁ దెలుప వచ్చుననియుఁ నూహించుకొనుచు నానందసాగరంబున దోప్పదోగుచుండఁగా విజయసింహవధోద్యోగ కరంబు లయిన వచనంబులు చెవులబడె. అప్పుడామె స్థితియెట్లుండునో యెవరుచెప్పగలరు? వెనుకటి యానంద సాగరము విచార సాగరంబుగా మాఱి పోయెను. మహా బుద్ధి శాలియైన రామయ మంత్రి యెట్లయిన తన హృదయ వల్లభునిఁ జంపక మానఁడని భయమంద సాగెను. తన యుత్తరంబును జూచికొని యానెగొందికి విజయసింహుండు వచ్చుననియు, నప్పుడీ దురాత్ములతనిఁ జంపక విడువరనియు, దన మనోవల్లభుని మర ణంబునకుఁ దానే కారణమయ్యెననియుఁదలంచుకొని మిక్కు టముగా నేడ్వసాగెను. అట్లు కొంతసేపుదుఃఖించి విజయసింహ రక్షణోపాయంబును వెదకుచు నారాత్రి పుచ్చెను.

## అయిదవ ప్రకరణము



### అనురాగ బలము. ౧.

గీ. ఎన్ని యాటంకములు గల్గుచున్న నెంద!
కొంత చెప్పుచునుండిన గీసడించి,
చిత్త మొప్పకు విషయమును, జేరనెంచు
నిను మఱయస్కాంత సన్నిధి నెనయునట్లు.

విజయసింహుఁ డాలేఖం జదువుకొని చెందిన యానందం బును గూర్చి చదువరులు చదివి యున్నారు. అతని మనోవృత్తుల నేక విధంబులు కాఁ జొచ్చెను. కోర్కు లాకసంబును ముట్ట నారంభించెను. ఎప్పు డానెగొంది కేగుదును, నన్నపార ప్రేమంబుతోఁ జూచుచున్న యా క్రొన్నన బోడి వదనచంద్ర బింబంబును జూచి నేనెప్పు డపార సుఖంబు లనుభవింతు• నన్న యాలోచనంబు తప్ప మఱియొక యాలోచన మతనికిఁ గలుగలేదు. పక్షికివలెఁ దనకుఱెక్క లుం డినచో నొక్క క్షణకాలంబులోనే నా ప్రియాలలామ మ్రోల వ్రాలవచ్చును గదాయని తలపోయ నారంభించెను. ప్రహారేశ్వర పాత్రుండు తన్నెఱుంగును గాన నాతనిఁజూడబోవు నెపంబునఁ బోయి నిరపాయంబుగా నా చంచలాక్షిని వీక్షించివచ్చుట యుక్తమని నిశ్చయించెను. అతనిమానసంబు మిక్కిలి త్వరపెట్టు చున్నను, మంత్రి సార్వభౌముల యాజ్ఞనొందకుండ నరుగుట సముచితము కాదని భావించి యొకపరి రాజసౌధంబున కరిగెను.

కృష్ణదేవరాయ లాతనిరాకవిని లోనికి రప్పించి గౌరవించి యాస నంబునఁ గూర్చుండ నియమించి 'ఓవిజయసింహా! నీ కామంది రంబు సౌఖ్యకరంబై యున్నదా? నీ కాహారా దులందులోపంబు గలుగలేదుకదా? నీపరాక్ర మాతిశయంబున జీవించిన మంత్రిపుం గవుండు క్రమక్రమమ్ముగా నారోగ్యస్థితికి వచ్చుచున్నాఁడు. నీవుపోయి చూచితివా?' అని ప్రశ్నచేసెను.

'ఓ మహారాజా! నేఁబ్రతిదినంబును జూచుచుంటిని.మంత్రి పుంగవుం డారోగ్యవంతుఁ డగుచున్నాఁడు.'అనివిజయసింహుండు బదులుచెప్పెను.

'వీరవరేణ్యా! నీప్రవర్తనంబునకును నీసుస్వభావంబున కును నీసుగుణ సంపదకును, నేనును మంత్రియును మిగులసంత సించితిమి.ఇఁకమీఁద నీకునంగరక్షకోద్యోగంబునొసంగ నిశ్చయిం చితిమి. క్రొత్తగా వచ్చిన నీ కాయుద్యోగం బొసంగుట రాజ నీతికి విరుద్ధంబైనను స్థాలీపులాక న్యాయంబున నీచరిత్ర మంత యును శోధించితిమి. కాన నిచ్చుటకు సుంతేనియు సంశయింప లేదు. ఇఁక నీ వీ యుద్యోగంబునందప్రమత్తుఁడవయి ప్రవర్తిం చుచు మాగౌరవంబందుచుండుము. నీ వీ యుద్యోగంబునకంగీ కరింతువా?' అనికృష్ణరాయలు వచించెను.

'ఓ వసుంధరాధిపా! తమ మహానుగ్రహంబు నింతస్వల్ప కాలంబులోనే సంపాదింపఁ గలిగినందులకు మిక్కిలి సంతసించు చున్నవాఁడ. చిరకాలంబునుండి కనుపెట్టుకొని వచ్చుచున్న వారికి మాత్రమే యర్హమైన యీయుద్యోగము నాకిప్ప

డొసంగి నాచరిత్రంబును గౌరవపాత్రంబునుగాఁ జేసినందులకు కెం
తయును గృతజ్ఞుండను. నాకంతంబున జీవము లున్నంతకాల
మును మీకెట్టి యపాయంబును గలుగ దని విశ్వసింపుఁడు.
ఈ నా ప్రాణము మీప్రాణంబునకుఁ బుగోవత్త్రము యుండును.'
అని విజయసింహుండు వినయపూర్వకంబుగాఁ బల్కె.

'విజయసింహా! నీవాక్యంబు లానందంబు గొలిపినవి. నీ
వేదియో యడుగఁ దలఁచి యున్నట్టులున్నది. పలసినదాని నడు
గుము. నిశ్చయంబుగా నేదైనఁ గోర నపేక్షించుచున్నావా?
అని కృష్ణరాయ లడిగెను.

'ఓ వసుంధరాధిపా! బాగుగా గ్రహించితిరి. నిశ్చయ
ముగా నేనొక్క వరంబును గోరికొనుట కిక్కడికి వచ్చితిని' అని
వినయంబుగదుర విజయసింహుండు పలికెను.

"నీవాంఛితం బేమిటో చెప్పుము. అది మిగులఁ గష్ట
సాధ్యం బైనదా యేమి? అసాధ్యమగుదాని వేఁడి చిన్నబుచ్చ
నెంచకుమీ? నీవెంతటి కోర్కె కోరినను నీయఁగలుగుదు నన్న
ధైర్యంబు నాకుఁగలదు. ఏదీ! యడుగుము." అని కృష్ణరాయలు
పరిహాసపూర్వకంబుగఁ బలికెను.

"ఓ మహాప్రభూ! మీ కసాధ్యంబగునది లోకమం
దున్నదా? అట్టిది యుండునని నేననుకొనను. ఆనెగొందిలో నున్న
ప్రహరేశ్వరపాత్రాదులు నాకాప్తులు. వారి నొకమాఱు సంద
ర్శింప డెందంబు కుతూహల పడుచున్నది. అందుల కనుమతి
యొసంగుఁడు ఇదియే నాకోరిక" అని విజయసింహుం డనెను.

"విజయసింహా! ప్రహరేశ్వర పాత్రాదులను జూడవల యునా? ఆదులనగా నెవ్వరు? అచ్చటనున్న ముక్తాంబయా యేమి? ఆమెనుగూడ జూచివత్తువా? ఆయువతికి బరిణయంబు కాలేదు. కాస చూచినఁ జూడవచ్చును." అని మందహాసము చేయుచు రాజపుంగవుం డనెను.

"ఓ వసుంధరాధిపా! సార్వభౌముల యభిప్రాయ మట్లు న్న చో చూచివచ్చెదను. ప్రహరేశ్వరుండు నాకుఁ బరిచి తుండే కాక బంధుకోటిలోని వాఁడు. అతని నొక్కపరిఁ జూచి రావలయు నని నాతలంపు. సెలవిచ్చినఁ బోయివచ్చెదను."అని విజయసింహుండు తన యభిప్రాయంబును గప్పిపుచ్చిపల్కెను.

"ప్రహరేశ్వరపాత్రుండు సామాన్యుండు కాఁడు. వాఁడు రాజద్రోహులలోఁ బ్రథముఁడని వినియున్నాను. వానిపేరువిన్న నాకోపాగ్ని రవులుకొనుచుండును. వానికేథయిన నాలోచనము చెప్పుటకై యేగెదవా? యేమి?" అని రాయ లడిగెను.

"సార్వభౌమా! తమ కట్టి దురభిప్రాయం బున్నచో నే నానెగొందికిఁ బోనేపోను. ప్రహరేశ్వరుం డట్టివాఁడని నాకు నమ్మకములేదు. ఒకవేళ నతఁ డట్టివాఁడయినట్టునాకుఁ దోఁచె నేని మరలింపఁ గలుగుదునని విశ్వసింపుఁడు. వారు మి మ్మెదు ర్కొనుట, శలభంబు లగ్నిని నెదుర్కొనుటయె. చీఁకటులు భానుమంతుని మార్కొనుటయె. శలభధ్వాంతంబులు వహ్ని భానువుల నెదుర్కొనుటవలన బొందెడి లాభంబునె ఖిమ్మెదు

ర్కొనిన రాజద్రోహులును బొందుదు రని విజయసింహుండు పల్కెను.

"విజయసింహా! పరిహాసంబున కంటిని. నిక్కంబని తలంపకుము. నాకట్టి దురభిప్రాయంబులేదు. మామంత్రి భాస్కరుండు దుస్సహతేజస్కుండై జాగరూకుండై యుండినంత కాలంబున్ను రాజద్రోహతిమిరంబు లావరించి బాధించు నన్న భయంబు మాకులేదు. నీవుపోయి రావచ్చును." అని సందేహించుచు రాజనియెను.

"రాజేంద్రా! మీరుసందేహించుచున్నట్లు తోఁచుచున్నది. మీ కట్టి సందేహ ముండినచో నేనచ్చటి కరుగను. సెలవిండు. మీకప్రియంబగు స్థలంబున కరిగి మీమనంబునకు నేనేల విరుద్ధుండను గావలయును?" అని యావీరుం డనియెను.

"ఓయీ! నీవిషయమై నాకు సందేహములేదు. నీవు నిష్కపటుండవని మాహృదయంబుల దృఢవిశ్వాస ముండుటం బట్టియే నీకట్టి యుద్యోగ మిచ్చినారము. మల్లయుద్ధంబున నీవలన బరాభూతులయిన వారందఱు నాపురంబునందే యున్నవారలు. అతనికి వచ్చు బహుమానంబును నీవుకొంటివన్న కోపంబు మనంబున నిడుకొని యున్న ట్లానాటి రుద్రదేవుని ప్రవర్తనమే చెప్పక చెప్పినది. వాఁడు ప్రహరేశ్వరునకుఁ బ్రాణమిత్రుం డని వినియున్నాను. వారివలన నీ కేమయిననపాయంబు వాటిల్లునేమో యని సందియ మందుచున్నాను. అంతకుఁదప్ప వేఱొక సందియములేదు.' అని రాయలు పల్కెను.

'మహారాజా! నాయందు మీ కుద్భూతంబయిన ప్రేమంబు మీ కట్లు తోఁపింపఁజేయుట సముచితమే. ప్రహారేశ్వరుం డెప్పుడును నాకట్టి యపాయంబును గల్గింపఁడు. ఇందు విషయమై తామంత యోజింప నవసరంబు లేదు. సెలవయినఁ బోయివచ్చెదను.' అని విజయసింహుండు సగర్వంబుగా ననియె.

ఆసార్వభౌముం డదివిని ప్రహారేశ్వరపాత్రుం డితనికంత విశ్వాసపాత్రుం డయినచో మనమేల యాటంకము చేయవలయు నని వితర్కించి యతనిం గాంచి "మంచిది. పోయిరమ్ము. నీకర తలంబునఁ గరవాలం బెప్పుడును బరభయంకరంబుగాఁ బ్రకా శించుఁగాక. ఇంతేకాక నీవచ్చటి కరుగుటకు ముం దొకసారి మంత్రిపుంగవుం జూచిపొమ్ము." అని సెలవొసంగి పంపివేసి తన మందిరంబున కరిగెను. అంత నదివఱకు నచ్చటనుండిన పిచ్చి వాఁడు లేచి సేవకులంగాంచి "రాజేంద్రుం డేమని యను చున్నాఁడు? మంత్రి సందర్శనంబు చేయుమనియా? మంచిది. అట్లే చేసెదను. అతండు మంచివాఁడనివిని యున్నాను. నా కేదయిన నుద్యోగమీయకపోవునా?,, అని యాత్రతతో నడిగెను.

'నీ కుద్యోగం బీయని వారెవరు? నీబుద్ధిచాతుర్యంబును, నీసంభాషణ నిపుణత్వంబును, జూచినఁ దప్పక యుద్యోగమిచ్చి తీరును. రాజమంత్రు లిర్వురును నీకు దుర్గాధిపత్యంబు నిచ్చుట కెంచుచున్నారు.,, అని సేవకులు పరిహాస పూర్వకంబుగాఁ బలికిరి.

'వాఁడదివిని పకపక నవ్వుచు, ఇఁక నే నదృష్టవంతుఁడను! నాకిఁక మీఁద గొప్పయధికారంబు లభింపకపోదు. నన్నుఁ జూచి నవ్వుచున్నారా? దుర్గాధిపతి నైనతోడనే వాడి కటారిచే మీ కంఠంబులు ఖండింపకపోవుదునా?' అని పలికి యచ్చటనుండి లేచి చంకలు గొట్టుకొనుచుఁ బర్వెడఁ దొడంగెను. వాఁడు వీధిలోనికి రాఁగానే బాలకులు వెంబడించి, పిచ్చి, వెఱ్ఱి, యనికేకలు వేయఁ జూచి ,ఓరీ! నేనిఁక దుర్గాధిపతి నగుచున్నాను. ఇఁక మీకోఁతి చేష్టల కోర్చువాఁడను గాను,, అని వారింజడిపించుచు వెఱ్ఱిపాటలు.పాడుచు మంత్రి మందిరంబున కరిగెను. వాని నాటంకపెట్టు నాచారంబు లేదు. కావున ద్వారపాలురు వాని నిర్బంధింపలేదు. అందుచే వాఁడు నిరాటంకంబుగా మంత్రి మందిరంబు ప్రవేశించెను. రాజకీయ వ్యవహారమ్ములు నిర్వహించుకొనుట వలన మనంబు బడలిక చెంది నప్పుడు మంత్రిపుంగవుఁడు వానిని క్రీడాసాధనంబుగా నుపయోగించుకొనును. కావున కార్యంబులు చక్కఁబెట్టుకొని విశ్రాంతికై కూర్చుండిన మంత్రి యా పిచ్చి వానింజూచి యిట్లు సంభాషించెను.

మం- శాస్త్రిగారూ! ఏమయినఁ బనియుండి వచ్చినారా? లేక కాలక్షేపార్థము వచ్చినారా?

పి- ఎవ్వరి నేలాగు పిలువవలయునో మీకుఁ దెలియకున్నది! నేనిఁక దుర్గాధిపతి నగుచుండ మీరట్లు పిలుచుట యుక్తకార్యము కాదుసుఁడీ.

మం- ఏమేమీ! దుర్గాధిపత్యంబు వహింప నున్నారా? అట్లయిన క్షమింపుఁడు. మఱి మిమ్మెట్లు పిలువవలయునో, దయచేసి తెలుపునది.

పి- దుర్గాధిపతుల నెట్లు పిలువవలయునో, యట్లె పిలువుఁడు.

మం- దానికేమి? మీరువచ్చిన పనియేమి? చెప్పుడు.

పి- రాజేంద్రుండు మిమ్ముల సందర్శింపు మనియె.

మం:-ఎందులకు?

పి- దుర్గాధిపత్యంబు సంపాదించుటకు.

మ:-మంచిది. నీకుఁ దప్పక యాయధికారం బిచ్చెదము. ఒక్క మాఱు పురాణము చదివి యర్థము చెప్పుదురా!'అని యేమే మో ప్రసంగించుచుండఁగా విజయసింహుఁడరుదెంచి మంత్రికి వందనంబు లొనరించెను.అంతమంత్రి యతని కుచితగౌరవంబు చేసి యర్హాసనాసీనుంజేసి సంతసింపఁజేసె. అప్పుడు విజయసిం హుండు 'ఓమంత్రిపుంగవా! మీకెప్పటి యారోగ్యము కలిగి నదియా? స్వస్థులరై యున్నారా?' అని కుశలప్రశ్న చేసెను.

మ:-వీరవరేణ్యా! స్వస్థుండనై తిని. నీవొనరించిన యుపకార మేప్పటికిని మఱవను సుమీ! నీవు వచ్చినపని యేమి?

వి:-మంత్రిశ్రేష్ఠా! పరులొనర్చిన యుపకారంబు స్వల్పంబైనను దానిఁ గొండంతచేసి మెచ్చుట మహాపురుషలక్షణము. దాని కేమి? రాజానుమతిని మిమ్ముల సందర్శింప వచ్చితిని.

మ:-రాజేమి యానతిచ్చె. నేఁజేయవలసిన పనియేమి. చెప్పుము.

వి:-నే నానెగొంది దుర్గంబున నున్న ప్రహారేశ్వర పాత్రాదులం జూడ ననుమతి నొసంగ వలయు నని కోరితిని. దానికి వా రియ్యకొని మీతోఁ జెప్పి పోవలయునని సెలవిచ్చిరి. అందు లకై వచ్చితిని.

మ:-ఏమేమీ! ఆనెగొందికిఁ బోవలయునా? పోకపోఁజాని కార్య మేమున్నది? ఆప్రహారేశ్వరు నిచ్చటికి రప్పించెదను. నీవు ప్రయాణము మానరాదా?

వి:-ఏమట్లు సందేహించు చున్నారు? మీకును నాయందు విశ్వాస ముదయింపలేదా? నన్ను విశ్వాస ప్రాతునిగా నేల భావింప కున్నారో తెలియకున్నది!

మం:-నీవిషయమై నాకేమియును సందియంబు లేదు. కాని నీ వోడించిన దురాత్ము లానెగొందియం దున్నారు. వారివలన నీ కపాయము మూడుట సిద్ధంబని తలంచు చున్నాను. అంతకుఁ దప్ప మఱియొక విచారంబు లేదు.

వి:-ప్రహారేశ్వర పాత్రుఁడు నాకుఁజుట్టమే కాక మాతండ్రి కాప్త మిత్రుఁడు. అతఁడుండఁగాఁ నాకెట్టి యపాయంబును గలుగ దని నా నమ్మకము.

మం:-అతఁడుండ నితరులవలన నపాయంబు గలుగదనియా యను చున్నావు? నాకునుసట్టినమ్మకమున్నది. కాని యాప్రహా రేశ్వరపాత్రుని వలననే నీకాపదవచ్చియుండునని తలంచెదను.

వి:-మంత్రిపుంగవా! అంతవఱకు వచ్చినప్పుడు నా కరవాలంబు నన్ను రక్షింపక విడువదని నా నమ్మకము.

మంత్రియాతని వచనంబులువిని యేమగునోయని మొదట సందేహించెను. కాని యతండు చూపిన యత్యద్భుత ప్రతాపంబును సంస్మరించుకొని ధైర్యంబు తెచ్చుకొనెను. మఱియును విజయసింహు నచ్చటికిఁ బుచ్చినచో వెనుకటి రాజద్రోహు లతని కపాయము గలిగింపకమాన రనియు, నప్పుడితనిచే వారు చచ్చుటగాని, లేకవారి చరిత్రంబులు తెల్లమగుటగాని సంభవించుననియును, విజయసింహు నానెగొందికిఁ బంపుట లాభకరంబే యనియు నూహించి 'ఓవిజయసింహా! మంచిది. పోయి రమ్ము! అక్కడ నున్నంత కాలంబును జాగరూకుండవై నీకత్తిపై నొక కన్నుంచి వర్తింపుము.' అని చెప్పి పంపివేసెను.

అంతటఁ బిచ్చివాఁడు మంత్రింజూచి, ముందువచ్చిన నా కార్యంబును దీర్చి పంపక వెనుక వచ్చినవారి కార్యంబును జక్కఁజేసి పంపుట న్యాయమా? నాకేయిట్టి పదవి లభించిన నేనిట్టి యన్యాయంబులు చేయనుజుమీ!

మ:-ఈయపరాధము క్షమింపుము. మీకార్యంబింత వేగముగా దీర్పఁబడునదికాదు. రాజేంద్రునితో మాటాడి నీపని చక్కంజేసెదను. నేఁటికిఁబొమ్ము.

పి:-నేఁటికినీళ్ల ధారయే. అయిననుమీ రధికారులు.మీమాటసాగును. గాని మామాటసాగునా!పోనిండు మీయుద్యోగమునాకక్కఱలేదు. ఈవృత్తియే నాకనుకూలంబుగానున్నది.'అనిపలికి పకపకనవ్వి యచ్చోటినుండి కదలిపోయెను. మంత్రియును దనకార్యంబు చూచుకొనుచుండెను.

---

## ఆఱవ ప్రకరణము.

### అనురాగ బలము. ౨.

విజయసింహుం డెంత ధీరుం డయినను, నెంత పరాక్రమవంతుండైనను, నెంత గంభీరుండయినను, నభిలషిత కాంతామణి యందలి ప్రేమాతిశయము పాశతుల్యమై తన్ను బంధించుకొని పోవుచుండ, యుక్తాయుక్త వివేకనిధులగు రాజమంత్రివతంసులు పలికిన వాక్యంబులు బలిష్ఠంబులై వెనుకకు లాగకపోలేదు. అయినను తుదకుఁ బ్రేమానుబంధమే జయించికొని పోవుచుండెను. విజయసింహుండు కార్యాంశంబును నిశ్చయింపఁ జింతింప నారంభించెను. కార్యాకార్యపరిశీలన సమర్థంబగు చిత్తవృత్తియే బుద్ధినాఁబడు. కావున నతనిబుద్ధి ద్వివిధంబై చెఱియొక పక్షమవలంబించి యిట్లు తినవిషఁ(?)దొడంగెను.

'మానవుండెంత బలిష్ఠుండైనను సాహసించి యేకార్యంబునకుఁ జొరకూడదు. చొచ్చినఁ బ్రమాదంబు రాకమానదు. సుందరీమణి సందర్శనాపేక్ష నవలంబించి సమస్తంబునకు మూలంబగు ప్రాణంబుల నుపేక్షించుట తగదు. అని యొకపరి యనుకొనెను.

'నాకాలోచనశక్తి చాలదు. „నసాహస మనారుహ్యా నరో భద్రాణి పశ్యతి„ అను నార్యోక్తివినలేదా? పురుషుని జన్మంబునకు ఫలభూతంబు స్త్రీరత్నంబేకదా? అదట్లుండ నభిల

షిత కాంతామణిని సందర్శించి తదీయ మనోహరాలాపంబులు వీనులవిందుగా వినుటకంటె మానవునకు సౌఖ్యంబేమి కలదు? తాదృశ సౌఖ్యదాయకంబగు సుందరీమణి సందర్శనంబు జేయ లేని వానిజన్మము కాల్పనా? కావున ఎట్లాలోచించినను బోయి ముక్తాంబను సందర్శించుటయె ముఖ్యకార్యము.' అని మరియొక పరి తలంచెను.

'పొరపడుచుంటిని. మానవజన్మంబునకు స్వల్పకాల సౌఖ్యదాయకంబగు స్త్రీ రత్నంబు ఫలంబని వచించుటయే తెల్వి తక్కువను సూచించుచున్నది. మానవుండు బలంబుననో, విద్యాబలంబుననో, ధీబలంబుననో, శాశ్వతకీర్తి నార్జించుకొన వలెను. కీర్తిసమార్జనమే మానవజన్మంబునకు ఫలంబుకాని వేఱొక్కటిలేదు. తాదృశఫలంబనెడి దివ్యరత్నంబునకు యువతీ లలామ భయంకరవహ్ని జ్వాలవంటిదని వచింపవచ్చును. కావున యౌవన మదాంధుఁడనై మహాపాయంబులనెడి క్రూరశార్దూలంబుల మధ్యంబున నున్న లీలావతింజూఁడ బూనుదువేని నేదో యొక శార్దూలంబు మీఁదికిలంఘించి చంపును. అందువలన నుభయభ్రష్టుఁడనగుదును. పిమ్మట నేమిచేయవచ్చునని పశ్చాత్తాపడెను. కాని యింతలోనే ధైర్యము తెచ్చుకొని తనలో తాను సకలకార్యంబులందును దమభార్యలను దోడుగాఁగైకొని ఘనకార్యంబు లాచరించి ప్రఖ్యాతి చెందినవారు లోకంబున నెందఱెందఱు లేరు? స్త్రీల నపేక్షించిన వారంద ఱును జెడి ప్రాణంబులు విడిచిరా? పూర్వచరిత్రంబుల స్మరించు

కొనిన స్త్రీలెంత మహిమగలవారో, భర్తలకెట్టి యుపకారంబు లొనరించిరో తెలియుచున్నది. సావిత్రి యముని మెప్పించి భర్తను బునర్జీవితను జేసికొన్నది. సుమతి తన పతిని నవవయః పరిపూర్ణునిగాఁ జేసికొన్నది. పెక్కండ్రు స్త్రీలు తమ ప్రాణభర్తలకుఁ దోడుపడి ఘనకార్యంబు లాచరించినట్లు మనచరిత్రలు ఘోషింపుచున్నవి. ఇవన్నియు నే నాలోచింపక నోటికివచ్చిన ట్లెల్లఁ బొల్లుమాటలాడుకొననేల?' అనుకొనెను. కాని యింతలో రాజేంద్ర మంత్రిపుంగవులవచనంబులను స్మరింపుకొని పెక్కండ్రు దుర్మార్గు లక్కడ నన్నుఁ దుదముట్టింప సమకట్టి యున్నట్లు వారు చెప్పియున్నారు కదా? మృత్యుముఖంబున కెదురుగఁ బోవుట మెట్టివానికైనం దగునా! బ్రదికియుండిన వేఱొకమార్గంబున నాప్రియురాలి నిచ్చటకు దెప్పించికొని సందర్శించి సంభాషింపకూడదా? ఇట్టి యుపాయంబు లాలోచింప కుండ ముక్తాంబ సన్నిధి కరుగుట మేలగునా? యని యతని మనస్సు దిరిగి యుయ్యాల లూగ జొచ్చె తుద కతఁడు ముక్తాంబ యొక్క బుద్ధి చాతుర్యమును తలఁచుకొని నిజ, నిష్కపట ప్రేమాస్పదుండగు భర్త యుపాయములకుఁ జిక్కియుండఁ జూచి ముక్తాంబ తప్పించునుగాని యూరకుండునా? ఒకవేళ నామెకుఁ గుత్తుకబంటి వచ్చి మరణించెనా ప్రాణప్రియా వియోగంబున విజయసింహుండు మాత్రము జీవింపఁగలఁడా? కావున నేమయినను బోయి ముక్తాంబను సందర్శించుటయే యుక్తకార్యంబు' అని యతఁడు తన మనంబును దృఢపరచుకొని శంకవి

డిచి ఖడ్గపాణియై హయారూఢుండై యానెగొందికిఁ బోయెను.

అతఁ డానెగొందిని ప్రవేశించి పోవుచున్నప్పు డందలి పూర్వపు కట్టడములు తత్పూర్వస్థితి నతనికిఁ దెలిపి యబ్బురంబు గొలిపెను. అతఁడు రాజవీధిని బడి పోవుచున్నప్పుడు తన్ముఖలక్షణాదులం గాంచి యాపురజనులతని మహాపురుషుం డని భావింపఁజొచ్చిరి. ఆమహాపురుషుం డెవఁడో, యెందులకు వచ్చెనో, యని గుజగుజలవోవనివారును, నతని యశ్వారోహణ చాతుర్యమెన్నని వారును, నతఁ డెవఁడో తెలిసికొంద మని నిదానించి చూడనివారును నారాజవీధియం దెవ్వరునులేరు. కొందఱు పెంకిపిల్లలు వెనువెంట వచ్చుచుండ మన పిచ్చివాఁ డతని కెదురుపడి కుశలప్రశ్నముచేసి యేమేమో సంభాషింప నారంభించెను. కాని మన వీరుండు సరకు గొనకముందునకుఁ బోవనారంభించెను. బాలకు లా వీరునిఁ జూచి కొందఱు నవ్వసాగిరి. మఱికొందఱు వెక్కిరింపసాగిరి. మన వీరునియం దెట్టి లోపంబును లేక పోయినను, అట్లు లొనరించుట చిన్న పిల్లలకు నైజము. పిల్ల లెదుటివారి మహాత్వమెట్లు తెలియును? విజయసింహుం డట్లు చని చని మార్గ మధ్యంబునఁ దారసిల్లిన రాజభటుల నడిగి తెలిసికొని ప్రహారేశ్వరుని మందిరంబునకుఁ బోయెను. అచ్చటికిఁ బోవునప్పుడతం డెవండో మహానుభావుఁ డని తలంచి ద్వారపాలురు లోపలికరుగనిచ్చిరి. విజయసింహుండట్లు పోయి యశ్వమువతరించి యచ్చట నున్న యొక చెట్టునకుఁ గట్టిపెట్టి యొక భటునిఁ గాంచి 'ప్రహారేశ్వరపాత్రుఁ డున్నాఁడా! అని యడిగెను. అది విని యాభ

టుఁడు 'అతఁ డిప్పుడింట లేఁడు. కార్యాలయంబునకుఁ బోయి యుండెను. లోపల స్త్రీలు మాత్ర మున్నారు, అని బదులు చెప్పెను. అంత విజయసింహుని సంతతంబును మనంబున సంస్మరించుకొనుచున్న ముక్తాంబ యావచనంబులు విని విజయసింహుండు వచ్చెనని నిశ్చయించి ప్రహరేశ్వరుం డింటలేక పోయినందుల కానందముచెంది ముందుగా నచట సంభవింపఁజెడి ఘోరకృత్యంబు తెలిపి నిరపాయంబగు మార్గంబును యోజించుకొనుట యుక్తమంబని తలపోసి యచ్చటి రక్షకభటునకుఁ గొంతసొమ్ము బహుమానముచేసి యప్పురుషవరేణ్యుని నాలోచనాభవనంబులోనికిఁ గొని రావలయు నని యాజ్ఞాపించెను. ఆరక్షకభటుఁడా బహుమానమంది, సంతసమొంది మాటాడక యెందులకని ప్రశ్నింపక నిముసములో నతని నా భవనంబునఁజేర్చి కవాటంబు బంధించివచ్చి యావృత్తాంతమామెకుఁ దెలిపెను. ఆవృత్తాంతంబును గుప్తంబుగా నుంచునట్లు వానిచే వాగ్దానంబుచేయించి వాని నచ్చట నిలిపి దక్షిణ ద్వారంబువలన నామందిరంబును ప్రవేశించెను. ముక్తాంబ వచ్చుచుండుట చూచి విజయసింహుండు హర్షపులకితాంగుండై మొదట నానందసాగరంబున నీదులాడఁ గడంగెను. కాని యా సుందరీమణి వచ్చి సమీపస్థానంబునఁ గూర్చుండినప్పుడు తదీయవదనలక్షణంబులు పొడగాంచి తన యానందము నొక్కించుక తగ్గించుకొనక పోలేదు. ఇంతకుఁ బూర్వ ముదయగిరి దుర్గంబున నొకచోఁ గూర్చుండి సంభాషించుకొన్నప్పు డున్న మంద

హాస విలసితంబు లగు ముఖ విలాసంబు లిప్పట్టున నేమియుఁ గానరాలేదు. విజయసింహుండది గుఱిుతించి తన ప్రియురా లిట్లుండుటకుఁ గారణమేమై యుండునో యని యోజింప నారంభించెను. ముక్తాంబ విజయసింహుని ముఖమునందలి మార్పును అతని విచారపరీతుం జేయుట తగవు గాదని భావించి ముఖపద్మంబును వికసింపఁజేసి చంచల కటాక్షంబు లతని మొగంబుపైఁ బఱపి, యేదియో సంభాషింప సమకట్టియున్న సమయంబున విజయసింహుఁ డామెతో నిట్లు ప్రసంగించెను.

వి:-రాజపుత్త్రి! సుకుమారగాత్రయైన నీకుఁదనికిన కడగండ్ల దలంచుకొన్న హృదయము నీరగుచున్నది. మీజనకుండు వీరభద్ర పాత్రుండుండిన నీవిదేశంబున నీశత్రుదుర్గంబున నివసించి పడరాని బాధ లనుభవింప వలసిన యవసరం బుండకపోదు గదా! నవనీత సమానమయిన నీహృదయము విపదగ్నిహోత్రుని సంపర్కంబున ద్రవింపకుండ నుంచిన నీ మహిమము వర్ణింపఁదగినది.

ము:-ఓ మహనీయా! మానవుని శ్రేయస్సెల్లకాలంబును నొక్క రీతిగా నుండదు. ఎవరికయినను బూర్వకృతకర్మ మనుభవింపక తీరదు సుమీ! నాకీవిదేశవాస మింతవఱకును దుర్భరంబుగానే యుండెను. కాని సుజన వరేణ్యుండ వగు నీ సందర్శనంబును నేఁడాచరించుటవలనఁ గాఁబోలు నవి యన్నియును విజ్ఞానశాలి కర్మజాలంబు చాట్పున నశించెను. పురాకృత పాపకర్మమువలన నాకు విదేశవాసము సంప్రాప్తించెనని

విచారించుచుండ నీవేల యీ విదేశవాసంబునకు దొరకొం
టివి? ఏమి యవసరంబు?

వి:-అవసరంబు లేకేమి? చిత్తమొకచోటం గాపురము౦డంగా దాను
వేఱొకచోటం గాపురముండుట కష్టంబుగదా! నీకిది యను
భవంబు కాలేదేమో. కాని నాకిది పూర్వానుభవంబు.
కావున [illegible]ంబుకో[illegible] విదేశవాసంబు చేయవలసి
[illegible].

ము:-నీచిత్తమీ విదేశంబునకు రానేల? నీ చిత్తంబు నాకర్షించి
తెచ్చిన మనోహరవస్తువీ విదేశంబునందేది కలదు?

వి:-సుందరీ! విపరీత వచనంబులు పలికెదవేలా? నాచిత్తంబు నీ
విదేశంబునకుం దెచ్చినది భవదీయ సుందరరూపమే కాదా?
నాచిత్తంబునకు నీ సుందరాకార మాధారము. ఆధారం
బులో నాధేయము చనుట యనుభవసిద్ధమే కదా?

ము:-(మందహాసముచేయుచు) ఎందులకీ యసత్యంబులు? ఈ
యైదాఱు వత్సరంబులు నా రూపంబు నాశ్రయించియున్న
నీచిత్తంబును నీవెడంబాసి వర్తించుట మహాభారంబుకదా?

వి:-అవును. మహాభారమే? ఒకదాని తరువాత నొకటి చొప్పున
నాపదలు వచ్చి చుట్టుముట్టుటచే నింతకాలంబును విడిచి
యుండవలసి వచ్చెను. ఏమిచేయుదును? స్వదేశంబున నున్న
ప్పుడే.ప్పుడు ను జిత్తము లేనివాని వలెనే
చరించితిని. కాని కలవానివలెం జరింపలేదు' నాచిత్తంబు నీ
చెంతనుండుటచేతనే నాకు సంభవించిన యాపదలను దొలంగ

ద్రోసికొని వచ్చితిని. వాని నన్నింటి ననుభవింపవలసియే యుండిన నీపాటికి యమలోకంబును ప్రవేశింపనా?

అని చెప్పుచుండ విజయసింహుని కన్నులనుండి యొకటి రెండు బాష్ప బిందువులు నేలకు దొరంగెను. ముక్తాంబ యతని దుస్థితినిజూచి మిగుల విచారించి తన యవ్యాజానురాగం బున్నం దు కానందంబుచెంది యతనింగాంచి 'ఓ వీరవరేణ్యా! నీకు శాత్రవుండయిన కృష్ణభూపాలు నాశ్రయించుట వలన నీశౌర్యంబున కొక కొఱంత కలుగదా? నీకీర్తి చంద్రునకుఁ గళంకము సంభవింపదా? అని యడిగెను'

వి:-సుందరీ! రాజనీతి పద్ధతుల యోజింపఁ గళంకము సంభవింపనేరదు. శత్రువు పరమోచ్చ యందున్నప్పు డెంతటి పరాక్రమవంతుఁ డయిన నెదుర్కొనుట యుక్తముకాదు. ఇప్పుడు విజయనగర సామ్రాజ్యంబనెడి మార్తాండ మండలము నభోమండల మధ్యంబున దుర్నిరీక్ష్యమగు నిండుతేజంబులో విరాజిల్లుచున్నది. దానివంకఁ దేఱి పాఱజూచుటయే యసాధ్యమగుచున్నప్పుడు సమీపించి తార్కొనుట యెట్లు? అట్టి సమయంబున నేదో శీతల భూరుహచ్ఛాయ నాశ్రయించి నిరుపద్రవముగాఁ గాలంబు పుచ్చుటయే మంచిది.

ము:-చక్కఁగా వచించితివి? నాయభిప్రాయంబు నీయభిప్రాయంబుతో నేకీభవించుచున్నది. నేనీ విషయముం గూర్చి యెంత చెప్పినను వినక మదీయ మంత్రి ప్రభృతు లతని మార్కొనఁ

ప్రయత్నించుచున్నారు.

వి:-ఏమీ! కృష్ణభూకాంతుండు మీదుర్గంబు నీకిచ్చుటకు యోజించుచున్నట్లు విని యుంటినే.

ము:-వారి యాలోచనము గగనపదము నంటుచున్నది. విజాపురాది రాజుల సాయంబున విజయనగర రాజ్యతేజః పుంజం బునార్పఁదలంచు చున్నారు.

వి:-అది కలలోనివార్త. దాని గప్పి పుచ్చునంతటి శక్తి లోకంబున మఱియొకనికి లేదు. అందులకుఁ దలంచుట శశవిషాణంబు సాధింప నెంచుటయే.

ము:-నాకది తెలియును. నేనెంత చెప్పినను వారు వినకున్నారు. నాశ్రేయస్సు గోరుచున్న వారిని నిరాకరించుట తగదని యూరకుంటిని. అమాత్యాదుల ప్రయత్నంబు సాగనిచో నప్పుడు సామంబు నుపయోగింపవచ్చును. ఉదారచిత్తుఁడగు చక్రవర్తి నాయపరాధంబును మన్నించి చేరఁదీయక పోఁడు. చక్రవర్తి నీయెడ నెట్లు ప్రవర్తించుచున్నాఁడు?

వి:-సుందరీ! అమ్మహారాజు మహానుగ్రహంబునకుఁ బాత్రుండనైతినని చెప్పుట కానందించుచున్నాను. వారు నన్ను విశేష గౌరవంబుతోఁ జూచుచున్నారు. నాఁడు మంత్రిపుంగవుని రక్షించి నప్పటి నుండియు వారు నన్ను గన్నకుమారునిగా భావించు చున్నారు.

ము- వీరవరేణ్యా! నీ సందర్శనంబు గావించుకొని నీవృత్తాంతము విన్నందుల కమితానందంబు నొందుచున్నాను. నాయందు

నీ కద్భూతంబయిన తోఁటింటి యనురాగం బెట్లున్నదో పరీక్షింపఁ దలంచి రప్పించితి కాని నిన్నిచ్చటికి రప్పించుట యనాలోచిత కృత్యమని యిప్పుడు విచారించుచున్నాను. అయిననిప్పటికి నీవు బయలుదేరిన వేళ మంచిదనియే తలంచుచున్నాను. నేను గొలఁదిదినంబులలో వచ్చి నీతో సావకాశంబుగా సంభాషించెదను. కాన నీవాలస్యంబు చేయక సోత్సాహుండవై విజయనగరంబునకుఁ బొమ్ము. నిన్నెవ్వరును ప్రతిబంధించినను నిలువకుము.

వి- సుందరీమణీ! త్వత్సందర్శన సౌఖ్యం బనుభవింప వలెనని మిక్కిలి ప్రయత్నించి వచ్చియుండ నీవది యోజింపక వెంటనే పంపివేయుట యుచితమా? నీవింత త్వరపెట్టెద వేలా? ఈ దినం బిచ్చటనుండి వఱువాత లేచి పోయెదను. నీ వందుల కంగీకరింపుము.

ము- మనోహరా! నేదురభిప్రాయంబుతోఁ బల్కలేదు. నేనును నీ సందర్శనంబును సతతంబును నా మనంబున గోరుచునే యున్నాను. కాని ముందువచ్చెడి యాపదలకుఁ దలంకి నిన్నిట్లు పయనము చేయుచున్నదానను. ఆపదలఁ గల్గించుకొని వానిం దొలంగించునుపాయం బాలోచించుటకన్న మొట్టమొదటనపాయంబుల రాకుండఁ జేసికొనుటే యుత్తమముగదా? అడుసు త్రొక్కనేల? కాలు గడుగనేల?

వి:-ఏమేమీ! ఆపదలు రాఁదలంచియున్నవా? ఎట్లు రానున్నవో తెలియఁజెప్పుము.

ము:-హృదయేశ్వరా! నీచేఁ బరాభూతులైన దురాత్ములు కొం దఱీ దుర్గంబున నున్నారు. వారు మిగుల గ్రుష్ఠులై యున్నా రఁట. వారునిన్ను బలాత్కారంబునఁ జంపఁ నెంచుచున్నాఁ రఁట. ఈవార్త నేను జెవులార వినియున్నాను. కావునఁ ద్వర పడి విజయనగరంబునకుఁ బోవుట యుక్త కార్యము.

వి:-సుందరీమణీ! సర్వదా నాశ్రేయంబును గోరుచున్న నీవును బ్రహరేశ్వరుండును నుండ నేభయపడనేల? మీరిరువురును నాకు సంభవించెడి యాపదలను దొలంగింపలేరా? నా యప్ర తిమ పరాక్రమమైన దానిఁ దొలంగింపఁ జాలదా?

ము- హృదయవల్లభా! నీకు సంప్రాప్తించు నాపదను దొలఁగించు నంతటి సామర్థ్యము నాకుండునో, లేదో నిశ్చయముగాఁ జెప్పఁజాలను. ప్రహరేశ్వరుండు నీకు విరోధికాక పోయినను నీవిరోధులతో మైత్రినవలంబించి యుండుటచే నీకు సాయ పడునని నమ్మకముగాఁ జెప్పఁజాలను. కపటోపాయధురీణు లగు నీశత్రువు లొనరించెడి యాపదనుండి నీపరాక్రమంబై నను నిన్ను రక్షింపఁగలదనెడి దృఢవిశ్వాసంబు నాకులేదు. కావున సందేహవిషయఫలం బగు కార్యంబునకుఁ గడంగుట కంటె నిశ్చితఫలసిద్ధియగు కార్యంబునకుఁ బూనుటయుక్తము. నామాటవిని వెంటనే పయనంబయి విజయనగరంబున కరుగుము.

వి- ప్రహరేశ్వరుఁడట్టి దురాత్ముల స్నేహ మవలంబించుటచే లోకాపవాదకు గుఱియగుచున్నాఁడు కావుననతఁడు బుద్ధి

మంతుండై నచో నట్టివారితో స్నేహము వదలవలయును, పోనిమ్ము. నన్నే రీతిఁ జంపదలంచి యున్నారు?

ము:-ఏరీతిచే నని యడుగ నేల? వారు వీర ధర్మ మవలంబించి సమర మొనర్పరు. కపటోపాయంబునఁ జంపుదురు. కాన నెవ్వరు ప్రతిబంధించినను నిలువక యీ పురంబు విడిచి పొమ్ము. అది సర్వోత్తమము. ఇంతమాత్రమున నీ శౌర్యంబున కొకలోపము కలుగదు. అని బలాత్కారముచేసి విజయసింహునిఁ బంపివేసెను.

ప్రహారేశ్వరపాత్రుఁడు ముక్తాంబకు సంరక్షకుఁడు. ఆమె కతనియం దెక్కుడు భక్తి గలదు. అతఁడు రాజద్రోహులలో మొదటి వాఁడనియు నెఱుంగును. అయిన నతఁడు రాజద్రోహి యని విజయసింహున కెఱింగించిన ప్రమాదంబు వాటిల్లునని తలంచి యేమియును జెప్పలేదు. తన సంరక్షకుఁడగు ప్రహారేశ్వరుని, దన ప్రాణవల్లభుండగు విజయసింహునిఁ రక్షించుట ముక్తాంబకు విహిత కృత్యము. ఆప్రహారేశ్వరుఁడే విజయసింహునిఁ జంపెడివారిలో ప్రధానుఁడు. తిమ్మరుసును రక్షించిన నాఁడు విజయసింహుఁడొనర్చిన పరాభవమును మదినుంచుకొని తన కసి తీర్చుకొనవలెనని యున్నాఁడు. ప్రహారేశ్వరుఁడే యిట్టిపనిచేయఁ దలంచెనని విజయసింహునితో జెప్పిన నతనికి హాని సంభవింపక తీఱదనియు, చెప్పక పోయిన విజయసింహుండు ప్రహారేశ్వరుని సత్పురుషునిగాఁ దలంచి యచ్చటనుండ నపేక్షించుననియు, నందువలన హాని సంభవించు ననియు

నెంచికొని విజయసింహుండ డచ్చటికి వచ్చినప్పుడు మిక్కిలి విచారము చెందెను. • కాని యట్టియపాయ మెద్దియును దొడరక ముునుపే విజయసింహునిఁ దప్పించి నందులకును, బ్రహారేశ్వరుని దుశ్చరిత్రంబును బైటఁబెట్టు నవసరము సంభవింప నందులకును, నమితానందంబు నొందెను.

## ఏడవ ప్రకరణము.

## ప్రహారేశ్వర పాత్రుఁడు

అభిలషిత కాంతామణియగు ముక్తాంబ సందర్శనం బొచరించి సంభాషించినను, విజయసింహుని మానసము తనివి నొందక యాస్థంబును వదల నిష్టపడకుండెను. అయినను, నాఁడు సంభవింప నున్న యాపదను ముక్తాంబ వలన వినియెట్టకేలకు మనంబును సమాధానపఱిచి ప్రయాణము చేయుచుండెను. రాజమంత్రిపుంగవు లిర్వురును. చెప్పిన వాక్యంబును వినక సాహసించి వచ్చినందుల కపాయంబుఁ బొరయకుండఁ బోవగలినందులకమితానందము నొంది భగవంతున కభివందనంబులు చేయుచు విజయసింహుండు దుర్గ ద్వారంబుదాఁటి పోవుచుండఁగా నొక పురుషుఁ. డతనింగాంచి నిలిచెను. విజయసింహుండు హయంబును నిల్పెను. అప్పుడు వారల కిరువురకు నిట్లు సంభాషణము ప్రవర్తిల్లెను.

పు:-విజయసింహా! నన్ను మఱచితివా యేమి? నేను ప్రహరేశ్వర పాత్రుండను. ఎటనుండి వచ్చుచున్నావు? ఏప్రదేశ మలంకరింతువు? నేఁడిట్టి సుదినంబని భావింపలేక పోతిని సుమీ! మాపురమునకు వచ్చియు నన్నుఁ జూడకుండఁ బోవుట నీకు చితము కాదు.

వి:-ప్రహరేశ్వరపాత్రా! మీ సందర్శనంబు చేయుటకే యీ పురంబునకు వచ్చితిని. మీరింట లేక పోవుటచే మరలి విజయనగరంబున కరుగు చున్నాను. పోనిండు, ఇచ్చటనైన మీసందర్శనంబు లభించినది. చాల సంతసము కలిగినది. మఱియొక పర్యాయ మిచ్చటికి వచ్చి సావకాశంబుగా సంభాషించెదను. నేఁటికి సెలవిండు. పోయి వచ్చెదను.

ప్ర—ఏమేమీ! నేఁడు క్రొత్త మాటలువినుచున్నాను. ఇంతలోనే మేము పరులమయితిమా? మీజనకుండు నాకాప్త మిత్రుఁడు మాయిరువురి హృదయ ధర్మంబులును నెట్లుండునో యాభగవంతునికే తెలియవలెను. సామాన్యులకుఁ దెలియదు. నామిత్రుండు కాలధర్మంబునొందుటవిన్నప్పుడు నాడెందంబు చెందిన కొందల పాటాయరవిందాసనునకేయెఱుక. నా యాప్తమిత్రుని కుమారుండవగు నిన్నుఁ బరామర్శించి మీ జనకునియందునాకుదయించిన ప్రేమంబును వెల్లడింపవలెనన్ని యుల్లంబునం దలంచి నిన్నిచ్చటకు రప్పింపనెన్నియో జతనంబులుసలుపుచుండఁగా గోరని కోరికగా నా మందిరంబునకే నానిమిత్తమే వచ్చి, నా యిచ్చునా తిథ్యంబు నొందకుండ బోవుట యుక్తంబు కాదని

దృఢంబుగాఁ జెప్పఁగలను. నామిత్రపుత్రుండవై, బంధుకోటి లోని వాఁడవునై యున్న నీవు, యోజింపక యిట్టియాసమయంబు నఁ బోవుట యుచితంబుగాదు. రమ్ము. నామందిరంబలంకరింపుము. నాయిచ్చునాతిథ్యం బందుము. నన్నానందింపఁ జేయుము. నీవానందంబు నొందుము.

వి:-ఓ వీరవరేణ్యా! నీవచనంబులమృతకల్పంబులై నాహృదయంబున కమందానందంబు నొందించె. వచనంబులంత మధురంబులై పదార్థంబులు లేమింజేసి నీవచనంబులు నీవిచ్చు నాతిథ్యంబు తృప్తి గొలుపఁ జాలదు. ఇంతియే చాలును. కార్యవేగంబు నీప్రార్థనంబును నిరాకరించుచున్నది. క్షమింపుము. ఇఁక నొకమాఱు మీ మందిరంబునకు వచ్చి మీయిచ్చవచ్చునంత కాలం బుండెదను. నాపై నిందమోపక నాప్రార్థన మాలింపుము. చూడుము. దిననాథుం డస్తగిరి శిఖరంబున మెలఁగుచున్నాఁడు. నాఁకిక సెల వొసంగుము.

ప్ర:-ఓయీ! నీవు మునుపటి విజయసింహుండవు కావు. నీప్రవర్తనంబంతయు మాఱిపోయినది. లేకున్నఁ బెద్దవాఁడ నగు నా వాక్యంబు నతిక్రమింప నెంతువా? లోకానుభవంబున నీకంటె మేటియగు నాబోటి వాని మాటపాలింపకుండుట పాడిగాదు. శ్రేయోదాయకంబును గాదు. నీ కుఁ బెక్కండ్రు శత్రువులున్నట్లువిని యున్నాను. నీవు విజయ నగరంబునకుఁబోవు దారిలో నేదయిన నపాయంబు తొడరునేమోయని వగచుచున్నాను. నిన్నుఁజంపుటకై వారు దృఢ

ప్రయత్నంబులు సలుపుచున్నారఁట. నీ వెంతటి బలాఢ్యుండ వైనను, హాని సంభవింపకపోదు. కావున నేఁటికి నాయింట నాతిథ్యంబునుగొని యుదయంబున లేచిపొమ్ము. నీవుకృష్ణదేవ రాయల దయారసంబున కాలవాలమవయి యుంటివని వినినీ యనుగ్రహంబువలన మాకార్యంబు నెరవేర్చుకొనవలెననినిశ్చ యించుకొంటిని. నా వృత్తాంతం బంతయు నీకుసావకాశముగ విన్నవించుకొనవలసియున్నది. కావున నేఁటికిఁ బ్రయాణంబు మాని నాచెప్పవలసినదాని సాంతముగా విని నీశక్తికొలందిని మాకు సాయము చేయుము.

వి—ఓదయాస్వాంతా! నీ కరుణారసము నాపైఁ బూర్తిగానుండిన నిడుములెట్లు సంభవించును? మార్గంబున శత్రులు నన్నెదు ర్కొందు రన్నతలంకు నాకెన్నండును లేదు. ఈనా కరవా లమే యాయరులను, గిరులను దునుమాడి విడిచిపుచ్చును. మఱియొకమారువచ్చి నీసందర్శనంబు గావించుకొని నీవాక్యం బుల సావకాశంబుగా వినినాచేనగు నుపకారంబు చేసెదను. దారిలో నెదుర్కొనెడి శత్రువు లిచ్చట మాత్రమెదుర్కొని హాని గలిగింపరా యేమి? కాన నా కాజ్ఞ యొసంగుము. పోయెద.

ప్ర—ఓయీ! నీవు తరుణ వయస్కుండవు. నీ కౌద్ధత్యంబు తప్ప నాలోచ నాశక్తి లేదు. నీవు ప్రతాపాతిశయంబున నెట్టి వారి నైన దోరింపఁగలుగుదునని గర్వపడు చుంటివి. నీవిఁక నా గర్వంబును విడుచుటమంచిది. జయాపజయంబులు నిర్ణ

యింప నెవ్వరు సమర్థులు? ఎట్టుండి యెటువచ్చునో పిమ్మట నిమ్మలించిన లాభమేమి? నీ విచటనున్న నెట్టిహానియును సంభవింపదు. బుద్ధిమంతులు నిర్ణీతఫలంబులగు కార్యంబులం దప్ప సందిగ్ధ ఫల కార్యంబుల నాచరింపరు. మార్గమధ్యంబున నున్నప్పుడే నీ క్షేమము సందేహాస్పదముకాని నా యింట నున్నప్పు డట్లు కాదు. చక్రవర్తికి బ్రియ భృత్యుండ వగు నీవు నాయింటికి వచ్చి నప్పుడు నీ కపాయంబు సంభవించిన నన్నపరాధిగా నెంచక మానుదురా? అప్పుడు నాప్రాణంబు లర్పింప వలసినదే కదా! మన్మిత్ర కుమారుండ వగు నీ ప్రాణంబులును, నాప్రాణంబులును గోల్పోవుట కేల ప్రయత్నింతును? నీకెట్టి యపాయంబును గలుగ నీయను. కాన నా వాక్యంబులు నమ్మి నాతోఁ రమ్ము.

ఈవాక్యంబులు విన్నతోడనే విజయసింహుండు కర్తవ్యాంశంబును గుఱించి యోజించుచుండ సుబుద్ధి దుర్బుద్ధు లిట్లు బోధింప దొరకెను.

దుర్బుద్ధి:-విజయసింహా! అతని వాక్యంబు లెంత హృదయ రంజకంబులుగా నున్నవి! అంత యత్యాదరంబును, నంత మిత్రభావమ్మును జూపువాఁడు వేఱొక్కఁ డుండడని ముమ్మాటికి నొక్కి వక్కాణింపఁ గలను. మిత్రసత్తములలో నగ్రేసరుండగు ప్రహారేశ్వరుని శత్రువునిగా నెంచుట తెల్వితక్కువ. అతని మృదుమధుర వచనంబులును, వినయాతిశయంబును,

నిష్కపట ప్రేమంబును నిరుపమానంబులుగదా! దూర్తత మూఁడయిన ప్రహరేశ్వరునియందు నిందారోపణంబుచేసి మహాపాతక మార్జించుకొంటివి. ఇప్పుడైనఁ దెలివిగలిగి, మిత్ర సత్తముఁడగు నతని ప్రార్థన మాలించి కోర్కెతీర్చుట యుక్తకార్యము సుమీ?

సుబుద్ధి:-వీరవరేణ్యా! ప్రహరేశ్వరపాత్రుని వచనంబులు విశ్వాస పాత్రంబులుగావు. అతని వినయంబునకు సంతసింపరాదు. అది మితిమీఱిన వినయమువలెఁ గన్పట్టుచున్నది. 'అతి వినయం ధూర్త లక్షణ' మ్మనిపండితులు వచింప నీవు వినలేదా? ప్రహరేశ్వరుఁడు పయోముఖ విషకుంభము వంటివాఁడు. అతని వాక్యంబులువిని నమ్మి పోదువేని తప్పక చెడిపోదువు. కావున నిలువక పోవుటయె మంచిది. విజయసింహా! మంచి మాటలాడి యింటికిఁ గొనిపోయి వంచనచే జంపిన నేమి చేయుదువు? నీవు నిరుపమాన పరాక్రమవంతుండవు. కావున మార్గంబున దుర్మార్గు లెదిరించిన నవలీలఁ దూలించి ప్రాణంబులఁ గాపాడుకొనఁ గలుగుదువు. కాని కపట స్నేహంబు చేసి చంపిన నేమియుంజేయఁజాలవు. పోనిమ్ము. ముక్తాంబ యేమి చెప్పినదో స్మరింపుము. ఆమె నీకు విపద సంభవించుననియే పంపి వేసినది. లేనిచోఁ జిరకాలంబునుండి నీదర్శనంబున కువ్విళ్లూరుచున్న ముక్తాంబ నిన్నుఁజూచి యానందించుటకు మాఱుగా లేని పోని భయంబులు కల్పించి పంపి వేయునా? కావునఁ బ్రహరేశ్వరుని వాక్యంబులు గ్రాహ్యం

బులు కావు. ఈ స్థలము నివాసయోగ్యముకాదు. ఆ పాత్రుండు విశ్వాస పాత్రుండుకాఁడు. మోమోటంబు విడిచి నడువుము.

దు:-విజయసింహా! సుబుద్ధివచనము గ్రాహ్యముకాదు. నేఁజెప్పిన దెల్లఁ గాదనుట దీనికి స్వాభావికము. ప్రహారేశ్వరుని వాక్యమును జక్కఁగ విమర్శింతు వేని నీకు సుంతేనియు సందేహము కలుగదు. ఎట్టివాఁడైనఁ దనప్రాణము కాపాడికొనఁ బాటుపడునని నమ్మదువుగదా? చక్రవర్తికిఁ బ్రాణప్రియుండగు విజయసింహునిఁ బ్రహారేశ్వరుండు చంపినను, జంపించినను, నతనిప్రాణంబులు దక్కునా? ప్రహారేశ్వరుండు రాయలకుఁ జిక్కియుండుట యెఱుంగుదువా? తనప్రాణంబులు పోవనున్నప్పు డితరుల ప్రాణంబులఁ దీయనెవఁ డిష్టపడును? కావున సందియంబు వదలి నేఁటికిచటనిలువుము. అందువలన నీవు నిరపాయంబుగా నుండుటయే కాక చిరకాలంబునుండి కోరుచున్న త్వత్ప్రియా సహవాసంబుగూడ లభించును. ఇట్టి సుఖ దివసంబును గోల్పోకుము.

విజయసింహుని కా యిరువుర యుపదేశంబులలోను దుర్బుద్ధి యుపదేశమే హితకరంబయినట్టు తట్టినది. తానట్టి సమయమునఁ బయనంబుచేసిన క్షేమము సందేహాస్పదంబగును గాని యటనుండిన నిరపాయమే యగునని నిశ్చయించి యూరకుండెను. అతని భావంబు తెలిసికొని ప్రహారేశ్వరుఁడు నిర్భరానంద భరితుండై 'విజయసింహా! నావాక్యంబునం దొపాటి గుఱియుంచి

నందులకు మిక్కిలి సంతసించితిని. మరలి నాతోరమ్ము.' అనిపలి
కెను. విజయసింహుండందుల కంగీకరించె. ప్రహరేశ్వరుఁ డత
నితోఁ దన మందిరంబున కరిగె. తనకు మగుడఁ బ్రియాదర్శ
నంబు లభించును గదా యని విజయసింహుం డమితానందంబు
నొందుచుండె. వీరిద్దఱు ప్రహరేశ్వరుని మందిరంబునుఁ బ్రవేశిం
చిరి. ముక్తాంబ యారెండవవాని విజయసింహునిగా నెఱింగినప్పుడు
దుస్సహంబగు దుఃఖంబును బొందె. ప్రహరేశ్వరుని వృత్తము
విజయసింహునకు దెలుపకపోవుట గొప్ప తప్పని ముక్తాంబ తెలిసి
కొని మఱింత విచారింప నారంభించెను. ప్రహరేశ్వరు డెప్పుడు
నతనిచెంతనే యుండుటచే రాఁబోవు నపాయంబును, దద్రక్షణో
పాయంబును విజయసింహునకుఁ దెలుప నవకాశము చిక్కక
పోవుటచే మఱింతదుఃఖంబును బొందుచుండెను. ప్రహరేశ్వరుండు
విజయసింహునితో నేమేమో కొంతసేపుసంభాషించి భోజనార్థం
బు లోనికరిగెను. ముక్తాంబ విజయసింహునితో సంభాషింపఁ
దగిన సమయము తనకు లభించుటదుర్ఘటంబని నిశ్చయించి
యేరీతినైనఁ దానే తద్రక్షణంబుచేయవలెనని యోజింపుచుఁ
జీఁకటిలో నిట్టటు నడయాడుచుండెను. ఆసమయంబున నొక
పురుషవ్యక్తి యచ్చటఁ బ్రత్యక్షంబయ్యె. చీఁకటి గాఢముగా
నుండుటచే ముక్తాంబ యతనిగుర్తింప లేకపోయెను. ఆపురుషుండు
నామెను గుర్తింపలేక పోయెను. అంత నప్పురుషుండట్టు వచ్చి
నిలిచిన నిదానించి చూచి 'ఎవరువారని ప్రశ్నించెను. అదివిని
ముక్తాంబ 'నేను ముక్తాంబను. నీవెవండవు? ఎందులకీ సమయం

బున నిట్లు వచ్చినాఁడవు.' అని ప్రశ్నచేసెను.

పు:-చెల్లెలా! ముక్తాంబ! నీ సందర్శనము నాకెట్లులభించునోయని విచారించుచు నిటువచ్చితిని. నేవచ్చిన వేళమంచిది.

ము:-సోదరా! రామరాజా! నీవా? ఎవరోయను కొంటిని. ఇంత చీఁకటిలో నీవిట్లు వచ్చుటకు గారణంబేమి?

రా!-కారణంబును బిమ్మటఁ జెప్పెదను. విజయసింహుం డిచ్చట నున్నాఁడా? క్షేమముతో నుండెనా? వింతలేమియు లేవుగాదా?

ము:-వింతలు లేకేమి? నీవుకోరని కోరికగా వచ్చినావు. నేఁడు నీవు నాకు మహోపకారము చేయవలసియున్నది. అట్లు చేసెద నని వాగ్దానము చేయుము!

రా:-సోదరీ! నీవు చేసిన యుపకారములో సహస్రాంశమైనను నేఁ జేయఁజాలను. నీ వాక్చాతురిచే నారాజపుత్త్రికి నాయం దనురాగం బుదయించునట్లు చేసితివి. మహోపకారిణివైన నీ కెట్టియుపకారంబైనను జేయుదును. రాజద్రోహంబుకానిచో.

ము- వింత మాటలాడితివి. రాజద్రోహమా! ఆమాట నాచెవిని బడరాదు. విజయసింహున కీరాత్రి యొక యపాయము రానున్నది. దానినుండి విజయసింహునిఁ దప్పించి రక్షింప వలయును. కొందరు సహవాసంబునఁ బ్రహరేశ్వరుండు రాజద్రోహులలోఁ జేరినట్టు నీకుఁ దట్టినను, జక్రవర్తికిఁగాని, మంత్రికిఁ గాని తెలుపకుండ నుండవలెను. ఈ రెండుపకారం బులును జేసెదనని వాగ్దానముచేసి నన్నుసంతసింపఁజేయుము.

రా- సోదరీ! నీ వాంఛితంబులు రెండును దప్పక నెఱవేర్చెదను.

కాని నేఁడు నీవును నాకొక యుపకారంబు చేయవలయును. ప్రహారేశ్వర విజయసింహుల సంభాషణంబును వినవలసి యున్నది. అందులకుఁ దగినస్థలంబును జూపుము.

ము:-తప్పక నీకోర్కెను జెల్లించెదను. ఈగదిలోనికెవ్వరునురారు. నీవిందులోఁ గూర్చుండియుండుము. దీనికిఁ బ్రక్కనున్న యరుగుమీఁదనే వారిరువురును శయనించి సంభాషించుకొందురు. కావున నీ విటనుండుము. "అని పలికి యతనిఁగదిలోఁ గూర్చుండఁ బెట్టి కవాటము బంధించితా నచ్చోటు గదలి పోయెను.

అనంతరము ప్రహారేశ్వర విజయసింహులు భుజించి తమకు వేర్వేర సమర్చిన శయనంబులపైఁ గూర్చుండియుండఁగా ముప్పది వత్సరంబుల ప్రాయంబుగల యొక పురుషుం డచ్చటికి వచ్చి ప్రహారేశ్వరుని గుశల ప్రశ్న చేసియతండు సూపిన యాసనంబు పైఁ గూర్చుండి యిట్లు ప్రసంగించె.

పు:-విజయసింహా! నీవు పరాక్రమసింహునివలెఁ గన్పట్టు చున్నావు. వైరిగజంబులపైకి లంఘించి కుంభస్థలంబులు చీల్చుటకు మాఱుగా బాదాక్రాంతుండ వగు చున్నావేలా?

వి:-అవును. వైరులు గంధగజంబులవంటి వారైన నీ వన్నట్లుచేయ వచ్చును. కాని వారును. బలిష్ఠసింహ పరాక్రములే యయి నచో స్నేహ మవలంబించుటయే యుక్తకార్యము.

పు—మిక్కిలి మంచి పనిచేసితివి. బలవత్తరులైన వైరులను నిర్మూలింపఁ గపటస్నేహంబువంటి సాధనంబు వేరొకటిలేదు

చల్లని నీటిప్రవాహము పరత్వంబును భేదించునట్లు వీతిహో
త్రుండు భేదింపలేడు. అట్లె స్నేహమూలంబున శత్రుజాలం
బును నిర్మూలించినట్లు విక్రమంబున నిర్మూలించుట కష్టము.

వి:—నీ విపరీత ప్రసంగము నా కర్థము కాలేదు. చక్రవర్తిని జం
పుటకై నేనీ కృష్ణరాయల స్నేహము నవలంబించితినని తలం
చుచున్నావా?

పు:-నేనొక్కడనే యట్లు తలంపలేదు. రాజనీతి విశారదు లంద
రును నట్లే తలంతురు.

వి:-అది రాజనీతి విశారదుల యభిప్రాయమైనను. దానివలన ఫల
సిద్ధి నిర్ణీతంబయినను, నామనం బెప్పుడు నట్టి మార్గంబునఁ
జనదు. రాజనీతి బహు కుటిలమైనది. దాని నవలంబించినన్ను
విశ్వసించిన విశ్వంభరాధీశ్వరునిఁ జంప నెంచి విశ్వాసఘాతకుం
డను గాను. ఇఁక నీ విషయము నాతోఁ బ్రసంగింప వలదు.

పు:-శౌర్యపూరితంబగు వంశంబున నుద్భవించియు నీ విట్లాడుదాని
వలెమాట్లాడెదవేల? ఏదోయొక విధమున శత్రువునిఁ జంపి
స్వాతంత్ర్య మవలంబింపవలయునని తలంపలేని వానిజన్మంబేల?

వి:-నేనున్నత వంశంబుననే యుదయించితిని. నేశౌర్యవంతుఁడని
వాసిగాంచితి. అయినను బలవత్తరులగు శత్రువుల నెదు
ర్కొనఁ జాలినంత బలము లేనప్పుడు వారికి లోఁబడి తదీయ
విశ్వాసంబునకుఁ బాత్రుండై యసమాన గౌరవంబు నం
దుట యుక్తకార్యము. ఇఁక నీ విందులకై చెప్పవలదు.

పు:-ఓయీ! నా యుపదేశంబు విందువేని నీవు రాజ్యాధిపతివి

వి:-నిశ్చయమే. అది మంచిపని. వారెచ్చట నున్నారో చెప్పఁ
గలవా! వీలయిన నీరాత్రియే పట్టుకొనవచ్చును. ఇచ్చటికి
వచ్చిన దురాత్ముని విడిచిపెట్టుట పొరపాటు.

ప్ర:-పోనిమ్ము. వారిట్టిసమయములందీ పురపార్శ్వంబున నున్న
సైన్యమంతంబునఁ గూడుచుందురు. వారచ్చట నున్నారేమో
చూచివచ్చెదను. నీవిచ్చట నుండుమని చెప్పి యతనిరక్షింప
నిర్ద్వార సేవకుల నియమించి వెడలిపోయెను.

అనంతరము విజయసింహుఁడు తన తల్పంబున శయనించి
సమయము చూచి ముక్తాంబతోఁ బ్రసంగింప నుద్దేశించి యుం
డెను. కాని రక్షక భటులు మేల్కొని భూతముల పగిది కాచికొని
యుండుటచే వీలుచిక్కినది కాదు. అందుచే నతఁడు పలువిధంబుల
విచారింప నారంభించెను. ఆసమయమునఁ ముక్తాంబ రామరాజు
నొద్దకుఁ బోఁగా నతఁ డామెం జూచి "చెల్లెలా! నేను వారి
ప్రసంగము విన్నాను. ప్రహరేశ్వరపాత్రుండు రాజద్రోహి గానట్టు
నే నిశ్చయంబుగాఁ జెప్పగలను. ప్రహరేశ్వరుని మనం బతి నిర్మల
మైనట్లు గంటిని. ఇట్లుండ నితని యందు మామంత్రికేల సందే
హము•పొడమ చున్నదో తెలియకున్నది. ఈపర్యాయము నే
నతని సందియము వాపెదనని పలికెను. ముక్తాంబ యందులకు
సంతసించి రామరాజున కేమియో చెప్పితాను లోపలి కరిగెను.

---

## ఎనిమిదవ ప్రకరణము.

### మోసము

ప్రహారేశ్వరుఁడు విజయసింహుని వీడ్కొని తన మందిరంబు దాఁటగానే కొందఱుమనుష్యు లతని కెదురైరి. అందుల కతఁడు బ్రహ్మానందంబునొంది వారితో నాలోచనా భవనంబున కేగి యచ్చటఁ గూర్చుండి విజయసింహుని సంహరింప నాలోచింప నారంభించెను. ముక్తాంబయును దక్షిణ ద్వారంబు నుండి వచ్చి యొక యాసనంబున గూర్చుండెను. ఆమె విజయసింహునిఁ బ్రేమించినట్లుగాని యామె యతని రక్షింపఁ బాటుపడుచున్నట్లు గాని వారికిఁ దెలియదు. అందుచే వారిట్లు నిస్సందేహముగా సంభాషింప నారంభించిరి.

ప్ర:-రామయామాత్యా! కుందేలు వంటయింటం జొచ్చినట్లు విజయసింహుం డప్రయత్నంబుగానే మనమందిరంబునకు వచ్చెను. వాఁడు విజయనగరాభిముఖుండై పోవు చుండగా నే నెదురుపడి కపట వాక్యంబుల నతని మోసపుచ్చి తీసికొని వచ్చితిని. వీఁడు మనలోఁ జేరునేమో యని నీ వనేక విధంబులఁ బ్రార్థించితివి. కాని సుంతేనియును ఫలంబు లేక పోయెను. కావున నిఁకవాని కుత్తుక నుత్తరించుట యుత్తమ కార్యము.

రా:-ప్రహారేశ్వరా! నీ వచనము సముచితమైనది. వాఁడు మహా పరాక్రమవంతుఁడు. అట్టి వారిని మనలోఁ జేర్చుకొనుట

మన కెంతో లాభకరంబు. అందువలన వాఁడు మనకు శత్రు
వయినను సామంబున మనలోఁ జేర్చుకొనవలెననియే బోధిం
చితిని. వాఁడు నా యుపదేశంబునకుఁ జిక్కలేదు. చిక్కు
వాఁడును గాఁడు. ఇఁక వెనుక ముందు లాలోచింపక యతని
వధించుటే ముఖ్యకార్యము.

ప్ర- మంత్రివరా! ఇట్టి బలవంతులు మనకులభింపక పోరు. నాఁడు
వీఁడు కొట్టినదెబ్బ యిప్పటికిని బాధించుచున్నది. నాయదృష్ట
వశంబున బ్రదికితిని. లేనిచో నాదెబ్బతో నచ్చటనే మృతి
నొందవలసినది. దానికిఁ దగిన ప్రత్యుపకారంబు చేయుటకు
నామనంబు త్వరపడుచున్నది. సెలవైనచో నిప్పుడే వానిని
ఖండించి నాయసి కాహారముగా నొనర్చెదను.

రా- అందుల కాలోచింపనేల? నిద్రించినతోడనే వాని సమీ
పించి యీ యుత్కృష్టఖడ్గంబున దిష్టాంతంబునొందింతము.
పిమ్మట తుండెములు గొనిపోయి మన మందిరంబునకుఁ
బశ్చాద్భాగంబున నున్న కూపంబునం బాఱవేయుదము.
ఆస్థలంబునకు రాజభటు లెవ్వరును బోరు. కావున నా రహ
స్యం బెవ్వరికిం దెలియదు. నాయాలోచన యుక్తమైనదికాదా?

ము- నాకొక్క సందియము పొడముచున్నది. విజయసింహుని
మన మందిరంబునఁ జంపుట ప్రమాదకరము. మనమెంత
గుప్తంబుగా నొనర్చినను నది నల్వురకుం దెలియక మానదు.
నీమందిరంబున నీఘోరకృత్యంబు ప్రవర్తిల్లెనేని యందులకు
నీవే కారకుండవని యోజించి దండనార్హునిగాఁ జేయక మానరు.

మీఁదుమిక్కిలి నేనును దండనార్హ్లను గావలసివచ్చునేమో?
కావునఁ జక్కఁగా నాలోచించి యిక్కార్యంబును జక్కఁ
బెట్టుకొనవలయు.

రా- చిన్నపిల్లయయ్యును ముక్తాంబ చక్కఁగా నుడివినది. దానిని
మనము త్రోసివేయరాదు. విజయసింహుఁడిటకు వచ్చినట్లు
రాయలకును, మంత్రికిని దెలియును. వానినిటఁ జంపితిమేని
ప్రహరేశ్వరుండే యట్టిపని యొనరించెనని వారికిని లోకులకును
దెలియకమానదు. అందువలన మీకపాయంబు రాకతప్పదు.
కాన నిక్కార్యంబును జక్కఁగా నాలోచించియే చేయ
వలయును.

ము- ఆలోచింప నీపగ్యాయమితని నిరపాయంబుగాఁ బోనిచ్చుట
యుచితకార్యము. ఇప్పుడు ముప్పుచెందకుండఁ బోయినందుల
కానందించి మనలవిశ్వసించి పలుమారు మనమందిరంబునకు
వచ్చుచుండును. అట్టిసమయమున వానిదిష్టాంతంబు నొం
దించి మనోరథమును నెఱవేర్చుకొన వచ్చును. ఇది యుక్త
మైనది కాదా?

ప్ర- ముక్తాంబా! ముందు సమయము లభించునని చేఁజిక్కిన
శత్రువుని విడుచుట పాడికాదు. మనకపకారము రాకుండ
• యోజించి యెట్లైన నిప్పట్టునఁ జంపుటయే యుక్తకార్యము.
అని రామయామాత్యుం జూచెను.

రా- ప్రహరేశ్వరా! ముక్తాంబ చెప్పినట్లు విజయసింహుని నిటఁ
జంపుటవలన నీకుఁ బ్రమాదంబు సంభవించుట నిక్కము.

అట్లని వాని నిప్పుడున వదలిపెట్టుట యుక్తంబుకాదు. అందు లకు నేనొక యాలోచనము చెప్పెదను. అట్లు చేయుము. నీవును విజయసింహుండును నొక్కచోటనే శయనించి యుండుఁడు. మీరు నిద్రించిన వెంటనే మేమువచ్చి ముందు గా నిన్నుబంధించి పిమ్మట విజయసింహుని శైవమఠంబు నకుఁ గొనిపోయి వధింతుము. పిమ్మట బద్ధుండైన ప్రహ రేశ్వరుం జూచి జనంబు లతని నిరపరాధునిగా నెంతురు. ఇంతియకాక శత్రువులనుండి విజయసింహునిఁ దప్పింపఁ బ్రయత్నించుటచేఁ బ్రహరేశ్వరునకు బంధనంబు సంప్రాప్త మైనదని మఱింత వగతురు. అట్లుచేసిన మీకేమియును నపా యము రాదు.

అదివిని ముక్తాంబ తెలతెల పోయెను. దానికిఁదగిన యుత్తరంబిచ్చుట కేమియుం దోఁచలేదు. చిత్తంబు తత్తరపడఁ జొచ్చెను. ఇఁక విజయసింహుని రక్షించుటకష్టమే యని వగవ నారంభించెను.

రామయమంత్రి వాక్యంబులు విని ప్రహరేశ్వరాదులు మిక్కిలి సంతసించిరి. ప్రహరేశ్వరుండు తనపని గావింప వారిని వీడ్కొనివచ్చి తన శయనస్థలంబుచేరెను. ముక్తాంబయు విచారం బుతోఁ దన మందిరంబున కరిగెను. రామయామాత్యాదులిటు నచ్చోటు గదలిపోయిరి.

ప్రహరేశ్వరుఁడు తనచెంతకు వచ్చుటచూచి విజయసిం హుఁడు "నీపోయిన కార్యమేమాయె"నని యడిగెను.

'విజయసింహా! నేనాస్థలంబునకుఁ బోయి చూచితిని. వారెవ్వరును రాలేదు. వారి మందిరంబుల కరిగితిని. కాని వారు గ్రామాంతరంబుల కరిగియున్నారఁట! వారు రెండుమూఁడు దినంబులలో వత్తురు. మగుడ నీవొకపరి సావకాశముగా నిచ్చటికి వత్తువేని మనము వారిని దప్పక బంధింపఁ గలుగుదుము. ఇప్పు డిచ్చటికి వచ్చిన యాత్రముచ్చును బంధింపవలసినది. అట్లు చేసిన రాజద్రోహులజాడ లతఁడే చెప్పియుండును. పోనిమ్ము. ఇప్పుడు విచారించిన నేమిలాభము? వారిని బట్టుకొని నీ కప్పగించెడి పని నాయది. ఇప్పటికిఁ జాల రాత్రి కావచ్చినది. కావున నీవిఁక సుఖనిద్ర చేయుము. నేను నిచ్చటనే శయనించెదను. ఈస్థలము శత్రువుల కభేద్యమైనది. విశ్వాసపాత్రులగు భటులు మనల సంరక్షించుచుందురు. ఇక్కడ నున్నంతకాలంబును నీ కపాయంబు సంభవింపనేరదు. హాయిగా నిద్రింపుము.' అని ప్రహారేశ్వరుఁడు పలికెను. ఇరువురును చెఱియొక తల్పంబున శయనించిరి.

విజయసింహుండు ప్రహారేశ్వరుం డొనర్చిన యుపచారంబుల కమందానంద కందళిత హృదయుండైనను, దన ప్రియురాలగు ముక్తాంబ సందర్శనంబైన లభింపకపోయినందున విచారంబునందకపోలేదు. అతఁ డచ్చటికి వచ్చినప్పటినుండియు ముక్తాంబ సందర్శనంబునకై ప్రయత్నించెను. కాని ప్రహారేశ్వరుండును భటులును దన్నెప్పుడును గాచుచుండుటచే వీలు చిక్కినదికాదు. విజయసింహుం డట్లు శయనించి ముక్తాంబ సుందరాకారంబును,

మధురాలాపంబులను, స్మరించుకొనుచు హృదయాంతరంబునుండి వెడలు సంకల్ప పరంపరలచే నాకాశహర్మ్యంబు నిర్మించి యందు విహరించుచు తదీయ సౌఖ్యపారావారంబునఁ దొప్పదోఁగుచుఁ గొంతసేపటికి నిద్రించెను.

ముక్తాంబ యాలోచనభవనంబునుండి వచ్చి విచారపరీతురాలయి సంకేత స్థలంబున కరుగఁగా రామరాజు వచ్చి యెదుట నిలువఁ బడియె. అతనిఁ జూచి ముక్తాంబ యిట్లనియె. ' సోదరా! నేఁడు ఘోరాపద యనివార్యంబై యేతెంచుచున్నది. దాని నడ్డుట కనేక ప్రయత్నంబులు సలిపితిని. అన్నియును వ్యర్థంబులయ్యెను. అందువలన నాడెందము డోలాందోళనమందుచున్నది. విజయసింహుని రక్షించుట మిక్కిలి కష్టసాధ్యమైనట్లు తోఁచుచున్నది. ప్రాణాధిక ప్రియుండగు విజయసింహుని ప్రాణంబులకై న నొసంగ సిద్ధంబుగ నున్నాను. నీ సాహాయ్యము పరిపూర్ణంబుగా నుండిన విజయసింహుని ప్రాణంబులు గాపాడుకోఁ గలనను నమ్మక మున్నది. ఇందులకు నీవేమందువు?' అని విచారంబుతోఁ బలికెను.

'సోదరీ! బాహుబలశాలినై న నే నీచెంతనుండ విజయసింహున కపాయంబు గలిగింప యముండైనను సమర్థుండగునా? అతని గొనిపోవుటకు వచ్చిన యాదురాత్ము నీకరవాలంబునకు బలియిచ్చెద. ఇఁక నీవు విచారింపకుము.' అని ధైర్యంబు గొలుపుచు రామరాజు వచించెను.

‘సోదరా! అవును. నీవు బాహుబలశాలివే. అయిన నీవు నీవంటి బాహుబలశాలులగు పెక్కండ్రతోఁ బోరుసలుపుట కష్టము. విజయసింహుని రక్షణమే ప్రస్తుతము మనకుఁ గర్తవ్యము. కాని రాజద్రోహులను ఖండించుట కాదు. నీవు వారలతోఁ బోరాడు చున్నప్పుడు విజయసింహుని గతి యేమగునో విచారింపుము నేనీకార్యంబునకుఁ బ్రత్యక్షంబుగాఁ గడగితినేని ముందు ముందు పెక్కునష్టంబులు సంభవించు. ఎట్లయిన నీవేయతని రక్షింపవలసి యున్నది. నీవు కొంతమందిని సాయంబుదెచ్చికొని యిచ్చటనే రాజద్రోహుల వారింప నెంతువేని నిదివఱకే ప్రహారేశ్వరునిగూర్చి సందియపడుచున్న సార్వభౌముని వలనఁ బ్రమాదము సంభవింపకతీరదు. కావున విజయసింహుండు శత్రువులకుఁజిక్కకుండ నీ వాపని యొనరింతువేని ప్రహారేశ్వరున కాపద వచ్చును. అతడు శత్రువులకుఁ జిక్కనపిమ్మటనే నీవు వారి నెదిరింతువేని విజయసింహుని ప్రాణంబులను దప్పక కాపాడ గలుగుదునని నిశ్చయించుట కష్టము. విజయసింహుని శైవమఠంబునకుఁ గొనిపోయిన పిమ్మట నీవు ప్రయత్నించినను, గార్యము సందేహాస్పదమే యగును. కావున యుద్ధంబుకాని యుపాయంబున వాని విడిపించుట యుక్తము. దానిచేత విజయసింహుండు జీవించుటయేకాక ప్రహారేశ్వరుండును నిరపాయంబుగా నుండఁ గలండు. నీతో నెవరైన వచ్చియున్నారా? ’ అని ముక్తాంబ ప్రశ్నించెను.

'చెల్లెలా! నాతో నల్వురు సేవకులు వచ్చి యున్నారు. వారి నీ పురంబున నొక చోటనుంచి వచ్చితిని. కాని వారు బల శాలులు కారు.' అని రామరాజనెను.

'సోదరా! సామంబునఁ గార్యంబు జక్కఁ బెట్టుకొను నప్పుడు బలశాలులతోఁ బనియేమి? కొంచెము ధైర్య మవలం బించి యుండినం జాలును. నీవు వారిని వెంటఁ బెట్టుకొని శైవ మఠంబునకు బోయెడి మార్గంబున నున్న రావిచెట్టు వద్దవేచి యుండుము. నే నచ్చటికి వచ్చెదను. పిమ్మట మన కార్యంబు సాధించుకొందము.' అని చెప్పి యతనిఁ బంపివేసి తా' నచ్చట మెలకువతోనే యుండెను.

అప్పటికి రాత్రి రెండు జాము లయినది. పురవాస్తవ్యు లేకాక దుర్గ రక్షక భటులు గూడ నిద్రాసక్తులైరి. ఒక రిద్దరు మెలకువ గలిగియున్నను, రామయమంత్రి ధనంబును దిన్నవార గుటచే నేమియుననలేదు. అందుచే వారు నిర్భయంబుగా దుర్గం బులోనికిఁ బోఁజొచ్చి ప్రహారేశ్వరుడున్న మందిరంబును సమీపిం చిరి. అచ్చటి రక్షకభటులు వారు వచ్చినతోడనే లేచి యెదురు చని 'ఇంతయాలస్యము చేసితిరేల? రండు, రండు' అని పలికి లోపలికిఁ గొనిపోయిరి. అప్పుడు రామయమంత్రి యానతి చొప్పున రుద్రదేవాదులు నిమేష మాత్రంబునఁ బ్రహారేశ్వరుని బంధించి యొక్క పెట్టున విజయసింహుని పైఁ బడిరి. అతండు వెంటనే మెలకువచెంది శక్తికొలందిని దప్పించుకొనఁ బ్రయత్నించెను. కాని బలిష్ఠు లగు నలువురు మనుష్యులు మీఁదఁబడి పట్టుకొను

టచేఁ దన జతనము వితథంబయ్యె. విజయసింహుం డందుల కత్యాశ్చర్యంబునొంది ప్రహారేశ్వరుండు తనకు సాయముజేయు నేమోయని యావంకకుఁ జూచెను. కాని యతండును గర్కశ పాశ బద్ధుండై మూలుగుచుండుటచు దెలిసికొని నిరాశచేసి కొని యెను. క్షణకాలములోనే రాజద్రోహులు తమ కార్యంబును ముగించిరి. అంత విజయసింహుండు వారింజూచి 'ఓరీ! మీరె వ్వరు? ఎందులకై నన్ను బంధించితిరి. నేనే యపరాధం బొనర్చితిని. ఆ ప్రహారేశ్వరుండేమి యొనర్చె? ఇప్పుడు మమ్మేమి చేసెదరు?' అని యడిగెను.

"మేము నీపాలిటి యమదూతలము. యమునికి బలశాలి యగు నొకభటుండు గావలసియున్నాఁడఁట. నిన్నచ్చటికిఁ బుచ్చె దము. నీవు మాకు మహాపరాధం బొనర్చితివి. మంత్రినిరక్షింప మమ్ము జంపనెంచితివి. ఆపాపఫలం బిప్పు డనుభవింపుము. నీ యట్టి దుష్టాత్మున కాశ్రయమిచ్చినవాఁడు కావునఁ బ్రహారేశ్వ రుండును వధ్యుండే' అని వారు బదులుచెప్పిరి.

'ఇప్పుడు మమ్ముల నేమిచేయుదురు? కారాగృహబద్ధుల గావింతురా? లేక వేరొక మార్గము యోజించుచున్నారా?' అని విజయసింహుండడిగెను.

'మాచేతి కరవాలంబులం జూచుచుండియు నట్లు ప్రశ్నిం తువేల? నీవంటి వారీలోకంబున నుండిన భూదేవి భరింపలేదు.' అని వారు పల్కిరి.

'పోనిండు. నన్నేమి చేసినను జేయుఁడు. నాకువిచారము లేదు. కాని నామూలమునఁ బ్రహరేశ్వరుని ప్రాణంబులు దీయుట పాడిగాదు. కావున నతనివిడిచి పుచ్చుఁడు.' అని విజయసింహుండనెను.

'నీ మాటలు మా చెవుల కెక్కవు? మాచేఁ జిక్కినవారిని విడిపింపఁ గృతాంతు నంత వానికిం గుత్తుక బంటి, మీ మంత్రిం బిలిచి కొనుము. వచ్చిరక్షించునేమో?' అని వారు పలికిరి.

'ఓరీ! దురాత్ములారా! మానవాపసదు లగు మీ వలన నుండి తప్పించుటకు మా మంత్రి పుంగవుండు రావలయునా? మీ ప్రాణంబులఁ గొననే నొక్కఁడనే జాలుదును. వీరులరైన కరవాలంబులంబట్టి సంగ్రామ మొనర్పుడు. అప్పుడు కృతాంతుల కెవ్వరతిథు లగుదురో తెలియును. అంతేకాని యిట్టి నీచమార్గంబులం ద్రొక్కుట యేటి వీరధర్మము?' అని విజయసింహుండు వచించెను.

'నీ ప్రగల్భ వచనంబులంగట్టి బెట్టుము. నీ వాక్యంబులు విని రోషంబుచెంది నీకు గత్తినిచ్చి పోరాడుదు మేమోయని తలంచుచున్నావు. కాని మేము నీమాయలో బడువారము కాము. వీరధర్మంబును బాటింప వలెనని మాకు బట్టు దలలేదు. మిమ్ము లం జంపుటయే మాకు బాటింపవలసిన ధర్మము' అని వారు పల్కిరి.

'ఓరీ! నన్నుఁ జంపినఁజంపుఁడు. చావన్న నాకు భయంబు లేదు. నీచాత్ములరగు మీరీలోకంబున నుట్టికట్టుకొని యూఁగ

నూహించుచున్నారు. కావునఁ జావన్న భయపడుదురు. భయ పడిననుఁ జావుతప్పదు. నే నీదినమునఁజచ్చిన రేపు మీరుచత్తురు. న్నాఁడు మీరు పాఱిపోకుండ నిలిచియుందు రేని మిమ్ములఁ జంపి యాలోకంబునకు మీవలన నపాయంబులు గలుగకయే యుం డును. పోనిండు. ఈపాపఫలంబును బరలోకంబున ననుభవింతురు గాని లెండు.' అని విజయసింహుండు నిర్భయంబుగాఁ బలికెను.

'నీ మెట్టవేదాంతము వలన మా మనంబులు విరక్తి చెం దవు.' అనిపలికి రామయమంత్రి తక్కినవారింజూచి 'వీఁడుబద్ధుం డగుటచే వీనిపరాక్రమంబును బద్ధంబయ్యెను. ఇఁక వీని నోటిని బంధించిన వీనివాక్కును బంధింపఁబడును. కావున నట్లులొనర్పుఁ' డని యాజ్ఞాపించెను.

రామయమంత్రి వాక్యంబులువిని సేవకులు బలాత్కా రంబున నోటిని బంధించి వాని బుజములపై వేసికొని తీసికొని పోవుచుండిరి. వాక్కును గాయంబును బంధింపఁ బడుటచే నాస్వా ధీనంబులు కాకపోయినను, విజయసింహుని మానసము స్వేచ్ఛా వర్తియై పరి పరి విధంబులఁ జింతింపసాగెను. ఇఁక దుర్బుద్ధి మాటాడలేదు. విజయసింహుండు ముక్తాంబాదుల యుపదేశం బులు వినకున్నందులకుఁ దగిన దుష్ఫలంబు గలిగెననియు, విచా రింప నారంభించెను. దానా విజయనగరంబునకు వచ్చి తనయసా మాన్య పరాక్రమంబున సత్కీర్తి నార్జింపఁ దలంచుకొన్న తలం పంతయు వ్యర్థమయ్యె ననియు, నిరుపమాన సౌందర్యవంతురా లయిన ముక్తాంబను వివాహమాడి తత్సహవాసంబున నపార

సుఖంబు లనుభవించుచు జన్మంబును సఫలీకరించుకొనవ లెనన్న తనమనోరథంబువితథంబు గావించిన దైవంబును దూరుచు విచారసాగరంబున మునిఁగిపోయెను. కడపటిసారి మందహాస సుందరమైన ముక్తాంబ వదనారవిందంబును దన డెందంబున ధ్యానించు • కొనుచు విజయసింహుండు గన్నుల నిమీలించి యుండ నారాజద్రోహులతని శైవమఠం బునకుఁ గొనిపోయిరి. అది పురంబునఁ కుత్తరంబున దుంగభద్రా నదీతీరంబున నుండెను. ఆమఠము పూర్వ మాంధ్రదేశంబున శైవ మతము మహోన్నత పదవినందినకాలంబున నిర్మింపఁబడిన దగు టచేఁ గాలవశంబున మన కథాకాలము నాఁటికి శిథిలమై, మను ష్యసంచారంబు లేమింజేసి కంటకావృతంబులగు పొదలచేతను, మహోన్నతంబులగు వృక్షంబులచేతను, గ్రిక్కిరిసియుండి యెట్ట వారికిని భయంబు గలిగించుచుండెను. ఆరామయామాత్యాదులు విజయసింహు నచ్చట దింపి తమ్ముఁ గృతకృత్యులనుగాఁ దలంచు కొని సంతసించిరి. రామయమంత్రి వారింజూచి 'మీరిఁక దడ యక విజయసింహుని చిత్రవధగావించి మీకోపంబులు దీర్చికొం' డని యానతిచ్చె. అంత వారును సంతోషితస్వాంతు లయి యాయుధపాణులై యతనిఁ జంప జుట్టును మూగిరి. అంతవారి లోఁగల నాత్మండగు రుద్రదేవుండు తక్కినవారిం జూచి 'ఓయీ! ఒక్క మాటు చంపవలదు. గడియ కొక్కొక్క యవ యవము చొప్పున ఖండింప వలె' నని చెప్పఁగ నతని వచనంబుల కందరు సంతసించి తమకార్యంబును జేయ

సిద్ధపడియుండిరి. అప్పుడు, ‘ అయ్యో ! చచ్చితిని. అయ్యో ! చచ్చితిని. అకటా ! నాకెట్టి దురవస్థ వచ్చినది ! ఓ రామయ మంత్రీ! వేగముగా వచ్చి రక్షింపవేల? నేఁజచ్చినపిమ్మట నీయుపాయంబులు ఫలించినను ఫలమేమి? ఈ చోరులు పెట్టు బాధ సహింపలేకున్నాను. ఓ రుద్రదేవా? నీ యందెంతో ప్రేమతో వర్తించుచుంటిఁ గదా? నీ వయిన సదయ హృదయుండవయి రక్షింపరాదా? ఓ తాతా! ప్రహరేశ్వరపాత్రా! నీవు బంధింపఁబడకయున్నచో నాకీ దుర్దశ రాదుగదా? ’ యనెడి యొక యార్తనినాదము వీతెంచెను. తోడనే ‘ పొడువుఁడు చంపుఁడు కేక లిడుచున్నది. తలఁదెగ వ్రేయుఁడు, తడయకుఁ ’ డనెడి మాటలును వినవచ్చెను.

ఆ వచనంబులు రామయామాత్యుని చెవుల బడినప్పుడు ముక్తాంబ శత్రువులకుఁ జిక్కెనని తలంచి విచార పరీతుఁడై యిరువురు సేవకుల నచటఁ గాపుంచి తక్కిన వారితో ధ్వనియే తెంచిన దిక్కునకుఁ బర్విడెను. తన్నట్టి దుర్దశలో సైతము మఱువక పిలిచి యనురాగంబు చూపిన యువతిని రక్షించుట ముఖ్యమైనదని యెంచి పర్విడ సాగెను. చీఁకటిలో వారి కామార్గము తెలియకపోయినను నా స్త్రీలలామయార్తస్వరము దారిం దెలుపుచునే యుండెను. దొంగలు ముందతిక్రమించినను రామయామాత్యాదులు సరభసంబునఁ బర్విడి సమీపించిరి. ఆ చోరులది చూచి తడసిన యసురులు మిగులుట కష్టంబనియా యువతీలలామ నచ్చట వదలిపెట్టి వా

యు వేగంబునఁ బర్విడిరి. అంత నామెంజూచి సమీపింప రామ యమంత్రి 'అమ్మా! ముక్తాంబా! నీకిట్టి కష్టమెట్లు సంప్రాప్త మయ్యెనో యని విచారించుచున్నాను. రామయమంత్రి ధీ చాతుర్యంబునఁ బాలితవగు నీకిట్టి యిడుము సంభవించుట మిగుల నబ్బురంబును బొడమించుచున్నది.' అని సవిచారంబుగాఁబలికెను.

'మంత్రివరా! నా దురదృష్టంబునకు నీవేమి చేయుదువు? ఆలోచనా భవనమునుండిపోయి శయనించితిని. ప్రహరేశ్వరుండు బద్ధుండగుటచేఁ జోరులు నిరాటంకంబుగాఁ బ్రవేశించి నన్నుఁ దీసి కొనిపోవనారంభించిరి. ఏమిచేయుదును.' అని ముక్తాంబ రోదనముచేయఁదొడఁగె.

'రాజపుత్రీ! ఎంతటి ఘోరాపదవచ్చినది! ఆదుష్టాత్ముల వలన నీకేమియు గాయములు తగులలేదు గదా? ఆదురాత్ము లెవ్వరై యుందురో! అని రామయమంత్రి యడిగెను.

'దైవానుగ్రహంబువలన నాకుఁ గాయంబులు తగుల లేదు. వారెవ్వరో తెలియదు. కాని వారు విజయసింహుని నామోచ్చారణంబును బలుమారు చేసియున్నారు. కావున వారు విజయసింహుని స్నేహితులేమోయని సంశయింపవలసియున్నది. అతఁడు నేఁటి సాయంసమయంబున వచ్చి నాతో విపరీతముగా సంభాషించి తన్ను వరింపవలయుననియు బలాత్కరింప నేనిందించి పంపివేసితిని. వాఁడాకోపంబును మనంబున నుంచుకొని యిట్టిపని చేయించియుండును. వాఁడు మీకుఁ జిక్కియుండుటచే నేను మిమ్ములఁజూడఁ గలిగితిని. కానిచో వాఁడు నన్నదృశ్యురాలినిగా

చేసితీఱును. ఇంతకు నాయదృష్టము బాగున్నది. మీరు వానిని వధించితిరా? లేదా? ముందామాట చెప్పుఁడు.' అని ముక్తాంబ యడిగెను.

'అమ్మా! ఇంకనుఁ జంపలేదు. వానిఁ జంప సిద్ధులమై యుండఁగా నీయాక్రందనం బేతెంచి మా డెందంబులం గలంచి నది. నీకుఁ బ్రమాదంబు వాటిల్లునేమో యని భయపడి యచట నిర్వురం గాపుంచి, పర్విడివచ్చితిమి.' అని రామయమంత్రి బదులుచెప్పె.

'ఆజ్ఞాపించిన నాపురుషులు వాని సంహరింపలేక పోవు దురా? బంధించినవానిఁ జంపుట యేపాటికార్యము?' అని ము క్తాంబ యడిగెను.

'రాజపుత్రీ! అట్లాజ్ఞాపింపలేదు. త్వరపడివచ్చితిమి. అయినను వానిం జంపకుండ విడువము. నీ కపాయము గల్గించిన యాదురాత్ముని నీకన్నులయెదుటనే ఖండించెదము. వచ్చి చూచెదవా? అనుచు నామెను తోడ్కొని వారట్లు బయలు వెడలి శైవమఠంబున కేగిరి. కాని యచ్చట నెవ్వరును లేరు. ఆచుట్టుపట్ల వెదకగా నేవోకొన్ని మొండెములు కానవచ్చెను. అవి విజయసింహునివై యుండవచ్చునని తలంచి నిదానించి చూడఁగా నవి రక్షకభటులమొండెంబులవలెఁ గన్పట్టె. అంత రామయాదులు మిగుల వగవనారంభించిరి. అదిచూచి 'ముక్తాం బ మంత్రివర్యా! కార్యంబు చెడిపోయెను. విజయసింహుని మిత్రులెవ్వరో యతని తప్పించికొని పోయియుందురు. ఇది

యంతయు ఘోరముగా నున్నది. అచ్చటఁ బ్రహారేశ్వరున కేమి యుపాయము మూడినదో? త్వరపడిపోవుదము రండి యని పల్కి వారలతో నింటి కేగెను. అప్పుడు రామయాదులు బద్ధుండై నప్రహారేశ్వరుని సమీపింప నతఁ డానందంబుతో విజయసింహుండు చచ్చెనా? అని ప్రశ్నించె. రామయమంత్రి యతనిబంధనంబులను విప్పి యచ్చటి వృత్తాంతంబును దెలుపఁగా నతఁడు మిగుల విచారింప నారంభించెను. తనప్రయత్నమంతయును వ్యర్థమైనందులకు రామయామాత్యుఁడపారదుఃఖంబు నొందెను. అల్లతఁడు కొంతవడి చింతించి తనరాజపుత్రి కపాయము కలిగించిన విజయసింహునిఁ దప్పక చంపెదనని ప్రతిన చేసెను. అది విని తన తెల్వితక్కువచే మగుడ విజయసింహున కపాయము గల్గించుచున్నానని విచారించుచు ముక్తాంబ తనమందిరంబున కరిగి శయనించెను. అనంతరము రామయమంత్రి విజయసింహుని యాభరణంబులను దీసికొని, మల్లయుద్ధమునాఁడు రాయలిచ్చిన పతకమును, రుద్రదేవున కొసంగి, తక్కినవారికిఁ గొంతధనమ్మును బహుమానముచేసి తానతనియుంగరంబును మిగిల్చికొని యందఱను బంపివేసి. తానును నాస్థలంబు విడిచిపోయెను.

---

# తొమ్మిదవ ప్రకరణము

## పిచ్చివాడు-కోఁతి

సూర్యుండుదయధరాధరకిరీటంబుచందనంబునఁ బోలు పాఱుచుండెను. బాలాతపంబులు సకలదిక్కులందును వ్యాపించి సమస్తవస్తువుల నరుణితంబులుగాఁ జేయుచుండెను. సోమరిపోతులు దక్కఁదక్కిన వారందఱును మేల్కాంచి కాల్యకృత్యంబుల నెఱవేర్చుకొని తమతమకార్యంబులు చక్కఁ జేసికొనఁబోవుచుండిరి. ఇట్టిసమయంబున విజయనగరఘంటాపథంబున నున్న పిప్పలివృక్షంబుచెంత వెనుకటిపిచ్చివాఁడు కూర్చుండి యేమేమియో వెఱ్ఱిచేష్టలు చేయుచుండెను. నేఁడు వానికిఁ దోడుగా నొక వానరంబునుగొనివచ్చెను. సామాన్యంబుగాఁ గోతిచేష్టలే మానవులకు నవ్వు పుట్టించుచుండును. అట్టుండ నీ యున్మత్తుండు దానికిఁదోడై చేయుచేష్ట లెంతసంతసము గొలుపునో వేఱ చెప్పనేల? ఈయున్మత్తుండు మొదటఁ గొంచెము రూపవంతుండైనను, మొగమున మసిపూసికొనుటచేఁ జేష్టలందేకాక రూపమునందుఁగూడఁ గోఁతి కళ వచ్చుచుండెను. ఈవింత చూచుటకై బాలకు లనేకులు వచ్చి వానిఁ జుట్టిముట్టియుండిరి. ఆ బాలకు లూరకుండక యావానరంబుపై ఱాలురువ్వఁగా నదికిలకిలధ్వనులచే నిట్టటు గెంత నారంభించెను. అది చూచి యా యున్మత్తుండు నూరకుండక దానికంటె

నూటింత లెత్తుగా నెగిరి క్రిందఁ బడుచు వెఱ్ఱివెఱ్ఱికేకలు వేయ సాగెను. ఆచిత్రంబునకు బాలురు చప్పట్లు కొట్టుచు బకపక నవ్వుచుండిరి. ఆ యున్మత్తుండొకఁడున్నప్పుడే బాలకులును. వ్యాపారరహితులును వచ్చి మూగుచుండెడి వారు. ఇట్లుండ నన్ని విధంబులచేత వానికెసవచ్చు స్లవంగమిత్రునితో నిష్టగోష్ఠి సలుపుచున్నప్పు డెట్టివింతలు ప్రభవిల్లుచుండునో, వానిం జూడఁ గుతూహలంబున నెందఱువత్తురో వేఱచెప్పవలయునా? ఆ వెఱ్ఱివాడట్లచ్చటఁ గొంతసేపు వినోదము సల్పి యూరేగ బయలు వెడలెను.పిల్లలును దమయుల్లంబుల నుత్సుకత్వం బుద్భవిల్లఁ గర తలధ్వనులొనర్చుచుఁ గేక లిడుచు వాని ననుగమించిపోవుచుం డిరి.

ఆయున్మత్తుం డట్లు చనిచని రాజమందిరంబు ప్రవేశిం చెను. కాని బాలకులు ద్వారపాలకులచేఁ బ్రతిబద్ధులై లోపలి కరుగఁజాలక నిరాశచిత్తంబులతో వెనుకకు మరలిరి. వాఁ డట్లం తఃపురంబు ప్రవేశించి దాసదాసీజనంబులతోఁ బట్టపురాణులు సంతసించునట్లు లావానరముచే నృత్యవంబు చేయించుచు నిట్టట్టు విహరించుచుండెను. వాఁడు తనప్లవంగమిత్రునితో నొనర్చెడి వినోదములఁజూచి సంతసించి కొంద ఱరుగుచుండ మఱికొందరు వచ్చి యాలోపంబును బూర్తి చేయుచుండిరి. మొదట వాఁ డన్న పూర్ణాదేవిమందిరంబున కరిగి యచ్చట గొన్నివినోదముల సల్పి సంతసింపఁజేసెను. అనంతరము తిరుమలదేవిసౌధంబు చెంత కరిగి యనేకవిధంబుల వినోదములు సలిపెను. ఆమెదాసీ

జనంబులును, నామెయును సంతసించి కొన్ని ఫలంబులను బహు మానముచేసి పంపివేసిరి. పిమ్మట వీఁ డనంగసేవభవనంబున కరిగెను.

అనంగసేన వివాహితయగు భార్యకాకపోయినను కృష్ణ దేవరాయ లామెను వివాహితభార్యలకంటె నెక్కుడు ప్రేమం బుతోఁ జూచుచుండెను. ఆమె నీచకులసముద్భూతయైనను దేహసౌందర్యంబుచేతను, నవయువసౌష్ఠవంబుచేతను, సద్గుణసం పదచేతను. నున్నతకుల ప్రసూతలగు యువతీమణులఁగూడ నతి క్రమించుచుండుటం జూచి సరసాగ్రేసరుఁడగు కృష్ణరాయ లామెను ప్రేమించి గౌరవించుచుండెను. ఆమెయు నతని దైవ ముగ భావించి తనపాతివ్రత్యంబునకు సుంతేనియుఁ గొరంత కలు గనీకుండఁ బ్రవర్తించి చక్రవర్తిని సంతసింపఁజేయుచుండెను. ఆ సుందరి చక్రవర్తిచే నంతగౌరవంబు నొందుచున్నను గర్వింపక పట్టపురాణుల నతిగౌరవంబుతోఁ జూచుచు, వారిదయను సం పాదించుకొనెను. వారును నాయువతిని సపత్నిగాఁ జూడక సోద రినివలెఁ బ్రేమించుచుండిరి. ఆమెగుణంబులచేతను, సత్ప్రవర్త నంబుచేతను, రాణులప్రేమంబును, నిరుపమానసౌందర్యకళావిలా ససంపదచే సార్వభౌముని ప్రేమంబును, నంపాదించి వఱలుచుం డెను. ఆయువతీ లలామ వచ్చుచున్న యున్మత్తునిఁ జూచి తనభవ నంబులోనికిఁబిలిపించెను. ఆమె యిట్టిజంతువుల గనుగొనవలెనని మిక్కిలి కుతూహలపడుచుండెను. ఇంతే కాక స్వయముగఁగొన్ని పక్షులను, గొన్ని సాధుమృగంబులను బెంచి వినోదించువేడుక

యామెకు మెండుగాఁగలదు. అంత నావెట్టివాఁ డామెమందిరంబు ప్రవేశించి తనకోఁతినెచ్చెలిని బ్రోత్సాహించి నృత్యంబులు చేయించుచుఁ జేయుచు, వికృతగానంబు లొనర్చుచు, నచ్చటి స్త్రీలలామలను గొంతసేపు వినోదింపఁ జేసెను. అప్పు డనంగసేన సంతోషించి యింకను దనివిసనక లోపలినుండి కొన్ని ఫలంబులఁ దెప్పించి యాకోఁతిని దాను స్వయముగా నాడింప వలెనని తలంచి యాకోఁతి కందియునందనట్లు ఫలమునుబట్టుకొని యది మీఁది కెగురుచున్నకొలందిని దనచేతినిమీఁది కెత్తుచుండెను. ఆకోఁతి యాఫలంబులందలి యాశచే మీఁది కెగిరి క్రిందఁబడుచుండెను. ఆబిత్తరి హస్తం బెత్తినంతయెత్తుగా నెగిరెడిసామర్థ్య మాకోఁతి కున్నను, వెట్టివాఁడు దాని మొలకుఁ గట్టినత్రాటితో వెనుకలాగుచుండుటచే నంతయెత్తుగా నెగురలేకపోవుచుండెను. ఆకోఁతి యట్లాశతో నెగిరిపడుచుండుటఁ జూచి యచ్చటివారందఱును జప్పట్లుగొట్టి పకపకనవ్వ నారంభించిరి. పెక్కు పర్యాయంబులు తన ప్రయత్నము వ్యర్థమగుటచే నావానరంబును మిక్కిలి కోపముపూనియుండెను. అనంగసేన మగుడ దనచేతి నెత్తుగాఁ బట్టుకొనెను. ఆవానర మది చూచి యూరకుండెను గాని తదీయ హస్త ఫలంబులను గైకొనఁ బ్రయత్నింపలేదు. ఆసుందరి దాని నాశగొలుపుటకు దనహస్తంబును క్రిందికిఁ బట్టుకొనెను. ఆకోఁతి చప్పుననెగిరి యామెహస్తంబును బట్టుకొనెను. వెట్టివాఁడును దనచేతనున్నత్రాటిని వదలెను. అందువలన నాకోఁతి యానాతిచేతిపై గూర్చుండి ఫలం

బుల నూడలాగికొనఁ బ్రయత్నించుచుండెను. ఆసుందరి భయంబు
చేఁ దనహస్తకమలంబును విదిల్చెను. కానియూవానరమువదలలేదు.
చేతనున్న ఫలంబులు నేలఁబడవైచిన నాకోఁతియును వదలిపోవు
నేమో, కాని భయాతిశయంబునఁ బరవశయైయున్న యామె
కాపాటియూహ జనింపలేదు. ఆమెచేతిని విదుల్చుచు నిట్టటు
పర్విడ నారంభించెను. స్వభావభీరువులగు స్త్రీలు కోఁతులవంటి
వికృతమృగంబులను దూరదూరంబునం జూచియె మిక్కిలిరోయు
చుందురు. ఇట్లుండ నాకోఁతిరాజువచ్చి బలాత్కారంబునఁ
దత్పాణిగ్రహణంబును జేసినప్పు డాతలోదరికిఁ గలుగు రోఁత
యును, గాతరత్వంబును వర్ణింప నెవ్వరు సమర్థులు? ఆ వానర
మాకాంతకు రవంతేనియు హానిచేయక యామెచేతిని దనచేతు
లతోఁ బట్టుకొనియుండెను. అయినను నాకోఁతి శరీర మామెం
శరీరమునకుఁ దాఁకినప్పు డామె యాకులచిత్తయై భయాతిరేక
జనితరోమాంచకంచుకితగాత్రయై తనచేతిని గట్టిగా జాడించు
చుండెను. ఆకోఁతి వదలలేదు. అదిచూచి వెఱ్ఱివాఁడు పకపక
నవ్వుచుండెను. కాని వచ్చి యాఁకోఁతిని బట్టుకొనఁబోయెను.
తక్కిన స్త్రీజనంబులును భయంబున నలువంకలకును
బర్విడుచుండిరి. కాని యొక్కర్తుకయైనను వచ్చి
విడిపింప లేదు. ఆయనంగసేన యిట్టటు పర్విడునప్పు
డామెయాభరణంబులు కొన్ని నేలఁ బడజొచ్చెను. అమె
చేతినున్న గాజులు ముక్కలై రాలెను. కడ కాపడతి తనచేతిని
సత్తువకొలందిని జాడింప నాప్లవంగము క్రిందఁబడియెను. తోడనే

యాయువతి లోపలికిఁ బోయెను. అంత నాయున్మత్తుండు వచ్చి యాకోఁతిని బట్టుకొని వెఱ్ఱిపాటలుపాడుచు నటనుండి పోవుచుండెను. అప్పు డనంగసేనయును దక్కినయువతులును వచ్చి యచ్చటఁ బడియున్న యాభరణంబులను వెదకుచుండిరి. అవి గచ్చొనర్చిన నేలపైఁ బడుటచేఁ గ్రిందఁబడినవస్తువులన్నియు దొరికెను. కాని వజ్రపుటుంగరంబు మాత్రము కానరాదయ్యె. ఆయుంగరము కానరాకపోవుటచే నాలలన మిగుల విచారింప నారంభించెను. ఆయుంగర మసామాన్యపు వజ్రమాణిక్యంబులతోఁ గూడి మిక్కిలి రాణించుచుండెను. కృష్ణదేవరాయలు విదేశవర్తకులయొద్ద రెండురత్నాంగుళీయంబులను గొనెను. ఆరెండును వేలకొలంది వెలచేయును. అతఁడు వాని వేళ్లనుంచుకొని యనంగసేనమందిరంబునకురాఁగా నాసుదతి వానిజూచి వాని యపూర్వ ప్రభాసంతతికిని, శిల్పచాతుర్యంబునకును, స్వాంతంబున నత్యంతాశ్చర్యంబు చెంది తన సుందరవిలాస సంపదచేతను, మృదుమధుర వాఙ్నిపుణత్వంబుచేతను, స్తుతిపాఠంబులచేతను,నాటపాటలచేతను నా రసికాగ్రేసరుని మెప్పించియొక యుంగరంబును గైకొనియె. ఆయంగుళీయకము నిరుపమానమై, కాంతివంతమై యుండుటచే నామె దక్కిన యలంకారంబులకంటె దాని నెక్కుడు ప్రేమతోఁ జూచుకొనుచు నుండెను. తనజీవితకాలంబున నట్టి యుంగరంబును మఱియొకదాని సంపాదించుట కష్టమని యాచాంపేయగాత్రికిఁ దెలియును. కావున నాయువతి యాయుంగరంబునిమిత్తము జాగరూకురాలయి వెదకుచుండెను. కాని యదొక్కటియె

కానరాలేదు. అచ్చట నున్నవారందఱును దనవారే యగుటచే వారు తస్కరింతురన్న యనుమానములేదు. అడుగుభాగము గచ్చు చేయఁబడియుండుటచే మంటిలోఁ గప్పఁబడిపోయిన దని యూహించుటకును వలనుపడదు. ఆపిచ్చివాఁడు తస్కరించి పోవుచున్నాఁడేమో యని సందియము వొడమఁగావానిఁ బిలిపించెను. ఆయున్మత్తుఁడు వెఱ్ఱిపాటలుపాడుచు గృహప్రాకారము వెలుపలికిఁ బోవుచుఁ బిలువఁబడి మఱిడివచ్చెను. వానిచేత లేదు గాని యాయుంగరము ప్లవంగపుంగవుచేత నుండెను. ఆయుంగరము దానిచేతిలో నున్నదో లేదో వానికిఁ దెలిసినట్లు లేదు. ఆలోచింప నాయంగుళీయకము క్రిందఁబడినప్పు డాశాఖామృగము తినఁదగిన వస్తువని భ్రమపడి తీసికొని యున్నదేమో, అచ్చటికి వచ్చినప్పటి కాకోఁతి యాయుంగరమును గొఱుకుచుండెను. ఒకమారు నాకుచుండెను. మఱియొకమాఱు మూర్కొనుచుండెను. అంతతోనది తృప్తినొందక ఖాదనంబు చేయుచునే యుండెను. అనంగసేన యాయుంగరము ప్లవంగముచేతిలో నున్నట్లు గ్రహించి దానికొక ఫలంబును వైవఁగా నది దాని దీసికొని యుంగరంబును బాఱవైచెను. ఆమందగమన యధికానందంబు జెంది యుంగరంబును గైకొని వేలికి నమర్చుకొని చెలులతో లోపలికేగెను. ఆ యున్మత్తుండును గోఁతిరాజుతో రాజమందిరంబు గడచి వీధిలోనికి వచ్చెను. అంత బాలకులెప్పటి యట్ల చప్పట్లు గొట్టుచు నట్టహాసంబులు చేయుచు, నాపిచ్చివానిని వెంబడించి పోవుచుండిరి. వీ రట్లు పది బారల

దూర మరుగునప్పటికి మదించినయాఁబోతొకటి ఖణేల్ ఖణేల్ మని ఱంకెలు వేయుచు, నామార్గంబునంబడి యభిముఖముగా వచ్చుచుండెను. పాలమీఁగడవంటి వన్నెతోడను, మలిచి పెట్టి నట్లులున్న శృంగంబులతోడను, ముద్దులుమూటగట్టుచున్న మొగంబు తోడను., బొలుపాఱుచున్న యామహోక్షము మిక్కిలి సుందరమై, కైలాసంబునుండి భూమి కవతరించి వచ్చిన నందీశ్వరుని చందంబున నొప్పుచు నేత్రానంద కరంబై యొప్పాఱు చుండెను. ఆబలీవర్దము వచ్చుచున్న యా జనబృందంబును జూచి యుఱ్ఱూత్రి, చెవుల నిక్కించి, నిర్ఘాతధ్వనులవలె ఱంకెలు వేయుచు మెల్లమెల్లఁగా నావంకకు వచ్చుచుండెను. ఆయున్మత్తుండును, నతని వెన్నంటి వచ్చుచున్న బాలకులును, మిక్కిలిగా నినాదంబు లుచేయుచు వచ్చుచుండుటచే నాయాఁబోతుఱంకెలను విన లేదు. అది మిక్కిలి దాపునకు వచ్చెను. అదిచూచి బాలకులు తప్పించుకొని పాఱిపోవుచుండిరి. వారిలోనొకతుంటరిబాలుఁడెఱ్ఱ బట్టబై కెగరవేసి బెదరించెను. అందుల కది రెచ్చిపోయి గంభీరము గాఱంకెలిడుచు నాబాలకులపైఁ బడెను. కాని దానిసమాచారం బు దెలిసికొని బాలకులు వాయువేగ మవలంబించియంతర్ధానంబు చెందిరి. ఆపిచ్చివాఁడును, నాకోఁతియును నచ్చటనే యుండిరి. ఆయున్మత్తుండు పర్విడి తప్పించుకొనఁ దలంచెను. కాని కోఁతి కదలనందున నేమియుఁ జేయఁ జాలక మందముగాఁ బోవుచుం డెను. ఆవెఱ్ఱివాని రూపంబును, నాకోఁతి రూపంబును జూచి యావృషభరాజము మఱింత బెదరి యావంకకుఁ బోయెను.

ఆప్లవంగము త్రాటిని త్రెంచికొని యాయుపప్లవంబును దప్పించు కొన సమీపపాదపంబు నధిరోహించెను. కాని యా పిచ్చివాఁ డెటుపోవుటకును వీలులేక దానికిఁ జిక్కిపోయెను. అంత నాగో రాజము వానివెంట నంటి తఱుముచుండెను. ఆసందడి విని పుర జనులు చేతి పనులువిడిచి పైకివచ్చి, పిచ్చివాఁడు చచ్చె చచ్చెనని కేకలు వేయుచుండిరి. కాని సాహసించి యాఁబోతును మర లించి వాని రక్షింపఁదలంచిన పుణ్యాత్ముండొక్కండును లేక పోయెను. ఆపిచ్చివాఁడట్లు వృషభానుగమ్యమానుండయి కొంత దూరముపర్విడికాలుజారినేలఁబడెను. ఆవృషభమువానిసమీపించి ముట్టెతోఁ ద్రోసివేయుటకు సిద్ధంబుగానుండ నా మందిలో నుండి యొక మహాపురుషుం డతిరయంబున వెడలివచ్చి యొక పురు షుని చేతిలో నున్న యొక దండంబును లాగికొని యావృషభంబు ముట్టెపై నాలుగుమోదులు మోదెను. ఆ మహోక్షమా దెబ్బ లను భరింపలేక మరలిపోయెను. ఆ పిచ్చివాఁడు బ్రదికెను. ఈ సాహసకృత్య మొనరించినవాఁ డెవండని మీరుశంకింతురేమో? నిరుపమాన ధైర్యసాహస పరాక్రమవంతుఁడైన యాపురుషుండు విజయసింహుఁడె. అతండు దైవికంబుగా వీధినిబడిపోవుచుండఁగా నీ యాపద దోతెంచెను. అచ్చటివారందఱునువిజయసింహుని ధైర్యసాహసంబులను గడుంగడు మెచ్చుకొనుచుఁ దమ తమ మందిరంబుల కరిగిరి. విజయసింహుఁడును దన పని నెఱవేర్చికొన బోవుచుండెను. ఆపిచ్చివానికి గాయంబు లేమియును దగులక పోవుటచే వాఁడును దన కోఁతిని బట్టుకొని మగుడ నెప్పటి

యట్లు పోవుచుండెను. విజయసింహుండు, పిచ్చివాఁడును నొక వీథికే పోవుచుండిరి. అంత నేఁబదివత్సరంబుల ప్రాయముగల యొక పురుషుండు వచ్చి పిచ్చివానితో నిట్లు సంభాషించెను.

పు- నీప్రాణంబుల రక్షించినవాని కేదయిన యుపకారము చేయవలదా?

పి- ఏమిచేయుదును? నాయొద్ద నీయుంగర మొకటి మాత్రమే యున్నది. అది వీని కిచ్చుట కిష్టములేదు. నీకిష్టమున్న తీసికొనిపోయి యిచ్చిరమ్ము. పొమ్ము పొమ్ము అని వాని నొత్తుడుచేయ నారంభించెను.

ఆ పురుషుఁడు విజయసింహుని జూసి "ఓ మహాశీయా! నీవు వాని ప్రాణంబులు కాపాడితివి. ఈ యుంగరంబును వాఁడు నీకు బహుమానముగా నిచ్చుచున్నాఁడు పుచ్చుకొనుము. నీవు చేసిన మహోపకారమునకు నిదితగనిదే. అయినను వానికొలంది విచారించి పుచ్చుకొను' మని మఱి మఱి ప్రార్థించి నమీపించి యతని చేతిగ్రేలి కాయుంగరంబును బెట్టి సెలవుగై కొని పోయెను. విజయసింహుండు మొదటవలదని నిషేధించియు వాని నిర్బంధంబువలనఁ బుచ్చికొని పిచ్చివానికిట్టి యుదారబుద్ధి గలుగుట కచ్చెరువందుచు నచ్చోటునుండి కదలిపోయెను.



## పదియవ ప్రకరణము.



### అవధానిగారు.

సామాన్యముగాఁ జిత్తంబులకే కాగ్ర్యత్వమలవడుట మిక్కి లి కష్టము. అది యెంతోకాల మభ్యసించినంగాని యలవడదు. అభ్యసించినను నలవడునని నమ్మకముగాఁ జెప్పలేము. కొంచె మైన నేకాగ్ర్యత్వంబు లేనిచిత్తంబులుగల వారస్థిరులై యొకచో నుండనేరక, యొకపనిని బూర్తిగా ముగింపనేరక యప్పటికప్పుడే నూరుస్థలంబులు మెట్టి నూరుపనులారంభించి పరిత్యజింతురు. కావున విశేషచిత్త చాంచల్యంబుగలవారలే యున్మత్తులగు చున్నారు. వారిమనంబులు చాంచల్యంబునందుఁ దొలకరి మెఱుపు నతిశయించి వర్తించుచుండును. చిత్తచాంచల్యముయొక్క యల్ప త్వాధిక్యములంబట్టి యున్మత్తులలో దరగతుల నేర్పరుపవచ్చును. లోకజ్ఞానంబు పూర్తిగాలేక, నిద్రాభయ త్రపాదుల విసర్జించి దేహాభిమానంబు తొలంగి వర్తించు వారధికమగు చిత్తచాం చల్యము కలవారు. కొందఱు కేవలమును జ్ఞానహీనులుగాక కనఁ బడినవారితోఁ నెల్ల విపరీతముగాను, బూర్వోత్తరసందర్భము లేకుండునట్లుగాను సంభాషించుచు, వికటహాసంబు లొనర్చుచు, వర్తించుచుందురు. వారికిఁ జిత్తచాంచల్యము స్వల్పముగా నుం డునని యూహింపవచ్చును. విజయనగరమునఁ దిరుగుచున్న వెఱ్ఱివాఁ డొకప్పుడు వస్త్రాదులధరించి విరుద్ధ సంభాషణము చేయుచుఁ గొంచెము జ్ఞానమున్నవానివలెఁ జూపట్టుచు, వేఱొ

క్కప్పుడు వస్త్రవిహీనుండై కంటికిఁ గానవచ్చిన మలినపదార్థములఁ దాలిచి తిరుగుచుండుటచే నా పురజనులు వాని యున్మత్తుఁడని సామాన్య దినంబుల సామాన్యముగా నుండి పర్వపుదినంబులలో నధికమగుచుండు నని చెప్పుకొనుచుండిరి. వాని వెఱ్ఱితనము హెచ్చినను దఱిగినను నొకప్పుడును వాఁడు పెఱవారిని బాధించియెఱుంగఁడు. అందువలన బాలకులు మిక్కిలి చనువుగలవారై వాని ననేకవిధంబుల నాడించుచుందురు. వాఁడు దినమున కొక్కొకవేషము వేయుచుండును. కాని యా వేషంబునకై వాఁడు విశేషమగు శ్రమమొందవలసిన యవసరంబులేదు. వానియభిప్రాయంబును దెలిసికొని యందులకు దగిన పరికరముగూర్చి యవలీల వానివేషంబును ముగించుచుందురు. వాఁడొకనాఁడు శుద్ధశ్రోత్రియుని వలెనుండ నిష్టమున్నట్లు బాలకులు తెలిసికొనిరి. వెంటనే యొక బాలకుఁడు విబూదిని దెచ్చి యొడలంతట నలందెను. వేఱొకఁడు పింజలు దీర్చి బట్టకట్టెను. మఱియొకఁడు చినిగినగోనెగుడ్డను జుట్టచుట్టి దర్భాసనంబుగా నేర్పఱిచెను. మఱియొకఁడు ప్రాఁతరుద్రాక్షల మాలను దెచ్చి కంఠమునఁ దవిల్చెను. ఇట్లొకగడియకాలములో వాని శ్రోత్రియ వేషమును ముగించిరి. అనంతరము వానింజూచి మిక్కిలి నవ్వుకొనఁజొచ్చిరి. వీఁడెప్పటియట్లు విజయనగరంబునఁ గ్రుమ్మర నారంభించెను. మొదట రాజమందిరంబున కరిగి యచ్చటఁ గొన్ని వింత లొనర్చుచు, వారలను నవ్వించి మంత్రిభవనంబున కరిగె. వీఁడు నిరపాయములగు వికారచేష్టలుచేసి పూర్వోత్తర

సందర్భములేకుండ వింతవింత కథలనుజెప్పి నవ్వించుచుండుటచే నెవ్వరును నతని రాకను నిర్బంధింపక తమకుఁ దీరిక సంభవించి నప్పుడు వానితో వినోదించి కాలము పుచ్చుచుందురు. వాఁ డేగి నప్పుడు గృహపతు లెద్దియేని పనిచేసి కొనుచున్న చో నది ముగిం చునంత కాలమును బ్రతీక్షించియుండి పిమ్మటఁ దనపంచాంగము విప్పుచుండును. రాజకీయంబు లైనను, నితరంబులైనను గార్య రహస్యంబులు,లోకజ్ఞాన శూన్యుండును,లాభనష్ట వివేకహీనుండు నగు వెఱ్ఱివాఁడు చెంతనున్నప్పుడు సంభాషించినను దమకార్యంబు లంతరాయంబులం బొరయవు. కాన వాఁడున్నను గార్యాంశలం బుల ముచ్చటించుకొనుచునే యుండిరి. ఇప్పుడు చెప్పినమాటఁ దతుత్తరక్షణమునందే మరచిపోయెడి వెఱ్ఱివాఁడు వారి రహ స్యంబును మనంబుననిడుకొనఁగలఁడా? ఉంచుకొని యొక్కరితోఁ జెప్పినను నున్మత్తాలాపంబును బరులు పరిగణింతురా?అట్లు వీఁడు మంత్రి భవనంబు సొచ్చి మనంబున నేదో జపించుచు, రుద్రాక్ష మాలను ద్రిప్పుచుఁ మంత్రి కార్యస్థానంబునకుఁ బోయి యతని సమీపమునఁ గూర్చుండెను. ఆమంత్రిపుంగవుం డెవ్వరితోనో మాటలాడుచుండుటచే నతనివైపు చూడనేలేదు. అంత నావెఱ్ఱి వాఁడు క్రిందఁ దనదర్భాసనంబు వేసికొని కూర్చుండి కన్నులు మూసి రుద్రాక్షమాలఁద్రిప్పుచు జపము చేసికొనుచుండెను. అతిమ్మరు సాపురుషునితో నిట్లు సంభాషించెను.

తి:-రామరాజా! నీ వానెగొందికి బోయి తెచ్చిన వృత్తాంతంబు సాంతముగా వివరింపుమా? వినఁగుతూహలం బగుచున్నది.

రా:-మంత్రిరత్నమా! తమయాజ్ఞను బుష్పంబునువలెఁ దలందాల్చి సూర్యుండపరాంబుధి చేరునప్పటికి నే నారాజమందిరంబును సమీపించి సమయముజూచి లోపలికరుగగా, నాపుణ్యావశంబున ముక్తాంబ ప్రత్యక్షంబయ్యె.

మ:-అవుగాక. అందువలన లాభమేమి? ఆయియ్య రాజద్రోహం బొనర్చు వారిలోఁ బ్రథమురాలే కదా?

రా:-శివశివ! మీరట్లు భావింపరాదు. తదీయసహవాసులనుబట్టి యట్లు యోజించుట యుక్తంబుకాదు. నింబవృక్షకదంబములో, మిక్కిలిరమణీయమై, సుజనశ్లాఘాపాత్రమైయొప్పు కల్పలత యుండవచ్చును. నింబవృక్షసాహచర్యంబువలన దానిగుణంబులు మాఱవు. ఆయువతీమణి ప్రవర్తనంబునిర్దుష్టమైనది. మీరామెప్రవర్తనంబుం జక్కఁగ దిలకించితిరేని తద్గుణగణంబులు గణనీయంబు లని పల్కక మానరు.

మ:-తదీయసహవాసు లనుచున్నావు. ప్రహారేశ్వరాదులు రాజద్రోహులనట్లు తెలిసికొంటివా మేమి?

రా:-అమాత్యపుంగవా! ప్రహారేశ్వరపాత్రుండును రాజద్రోహులలో గణనీయుఁడనినేఁ జెప్పలేను. నా తెచ్చిన వృత్తాంతంబును సాంతముగా విందురేని వ్వారెట్టివారలో మీకే తెలియును. నాకుఁ గృతపరిచితు రాలగుట నామెసాయంబున నొకరహస్యస్థలంబునఁ గూర్చుండి విజయసింహ ప్రహారేశ్వరపాత్రుల సంభాషణంబును జక్కఁగా వినగల్గితిని. వారిరువురును సంభాషించుచుండఁగా నొకనూతనపురుషుండు

వచ్చి విజయసింహునిజూచి, తనతోఁగలిసి చక్రవర్తి శత్రుఁగట్ట ప్రయత్నింపు మనియు, నందువలన నీకుఁ బెద్ద లాభం బుండుననియుఁ బెక్కువిధంబుల బోధించెను. కాని యవి విజయసింహునిమనంబును జలింపఁజేయలేక పోయెను. మహామహీధర మెంతటిమారుతంబు వీచినను జలించునా? విజయసింహుండు క్రుద్ధుండై, “ఇఁకఁ దన చెంత నట్టిప్రసంగ ములను దెచ్చినచో ఖండింతు” నని చెప్పి కసరి తఱిమివేసెను.

మ:- విజయసింహుని మాటకేమి? అట్లుండనిమ్ము. ప్రహరేశ్వ రునిగూర్చి చెప్పుము. వాఁడు రాజద్రోహి యగునా? కాదా?

రా:-అతఁడు రాజద్రోహులలోఁ జేరలేదు. ఇంకను నతఁడే ‘రాజ ద్రోహులనుబట్టి యిచ్చెదను. దండింపఁగలవా?’ అనివిజయ సింహునితో సంభాషించి యతనిఁ బ్రోత్సహించెను. మఱియు నతఁ డారాత్రియే పోయి రాజద్రోహులుచేరెడి స్థలంబులకుఁ బోయి చూచివచ్చెను. కాని వారదృష్టవంతులగుటచే నాఁ డచ్చటికి రాలేదు. వచ్చినచో మనవీరులు వారిని దోంచపక విడుతురా?

మ:-ఇఁక మిగిలియున్న విశేషములేమి?

రా:-విజయసింహప్రహరేశ్వరులు సరసాలాపము లాడికొని కొంత వడికి నిద్రించియుండఁగా నెవ్వరో కొందఱుపురుషులు వచ్చి వారి నిరువురిని బంధించి వారిలో విజయసింహుని జంపుటకు శైవమఠంబునకుఁ గొనిపోయిరి.

మం:-ప్రహరేశ్వరునిఁ గొనిపోలేదా?

రా:-విజయసింహునిఁ జంపుటయే వారికి ముఖ్యకార్యమైనట్టును, వారు విజయసింహుని బంధించు నప్పుడు ప్రతిబంధము చేయ కుండుటకే ప్రహరేశ్వరుని బంధించినట్టును దోఁచుచున్నది.

మ:-విజయసింహుని గతియేమి? నిరపాయుండై వచ్చెనా?

రా- మహాసుకీసిధాను రాలయ్యిన ముక్తాంబ నాసాయంబును బొంది విజయసింహుని రక్షించినది

మ- ఎట్లు రక్షింపఁగలిగె! రాజద్రోహులు లాకెుసంభయడడి పర్వడి రా యేమిఁ?

రా- ఆరాజద్రోహులలోఁ గొందఱు తమలోనొకని వరింపుమని కోరగా నామె మొదటఁ దిరస్కరించెనఁట. కాని వారు విజయసింహుని శైవమఠంబునకుఁ గొనిపోయిచంప నుంకించు సమయములో వారి నామంబులతోఁ బిలిచి 'తాను దొం గలబారిఁ బడినట్టును, వచ్చి రక్షింపకపోయిన మృతినొందు నట్టును నాక్రందనం బొనరించెను. అదివిని వారచ్చోటు విడిచి యామె చెంతకరిగిరి., ఆసమయంబుననేఁ బోయి యచ్చట గా వున్నదురాత్ముల ఖండించి విజయసింహునిఁ దప్పించికొని వచ్చితినిఁ

మం- మంచిది. నాకు మహోపకారం బొనర్చిన విజయసింహుని రక్షించినందులకు మిగుల సంతసించితిని. ముక్తాంబ యిఁక మీాద నపరాధినియైనను క్షమింపఁదగినదే! ఆరాజద్రోహుల నామంబులరసి రాలేకపోతివా? ముక్తాంబ చెప్పనే!

రా- నేను మగుడ ముక్తాంబనుగలిసికొన నవకాశంబు చిక్కలేదు.

నే విజయసింహునితోఁగూడ నిచ్చటి కరుదెంచితిని.

మం— పోనిమ్ము. ముక్తాంబ విజయసింహుని రక్షించుట పరోప కారబుద్ధి చేతనా? లేక వేరొక బుద్ధిచేతనా?

రా- పరోపకారబుద్ధిచేతఁ గాదు. స్వోపకారబుద్ధిచేతనే?

మ- ఏమేమీ? స్వోపకారమా? తనకే యుపకార మొనరించు కొనుటకా! అదెట్లు సరిపడును? వల్లభునిగాఁ జేకొననున్నచో స్వోపకారమే ?

రా- అందులకు సందేహమేమి? ముక్తాంబ విజయసింహుని దప్పక పరిణయమాడును.

మం- వీరికి ప్రేమానుబంధ మెప్పు డలవడినది?

రా- ఉదయగిరియందే వీరియన్యోన్య ప్రేమాంకురము నాటు కొనెను. విజయసింహుండు స్వదేశంబు విడిచివచ్చుట యిందులకే!

మం- ఆనెగొంది కరుగుటలో విజయసింహుని ప్రధానోద్దేశ మిదియా? నేనన్యథా తలంచితిని.

రా- ఇదియే. మనమనుకొనినది భ్రమ.

మం- కావచ్చును. నాఁడు న న్నెదిరించినదురాత్ములలో నొకని కంఠధ్వని ప్రహారేశ్వరుని కంఠధ్వనిని బోలియుండె. అప్పటి నుండియుఁ బ్రహారేశ్వరునిగుఱించి నామనంబు సందేహించు చున్నది. విజయసింహుండు ప్రహారేశ్వరునిఁ జూచివచ్చెదనని చెప్పుటతోడనే యనుమానపడి, యేకజాతీయుఁడగు ప్రహా రేశ్వరునిజూచి నప్పు డీతనిప్రవర్తన మెట్లుండునో తెలిసికొనఁ

గోరెయే నిన్నుఁబంపితిని. విజయసింహుఁడు విశ్వాసార్హుఁడని నాకిప్పటికి నిశ్చయముకలిగినది. ముక్తాంబయు యోగ్యురాలనియే భావింపవచ్చును. కాని ప్రహారేశ్వరుని నిర్దోషునిగాఁ దలంపలేను.

రా- మంత్రివర్యా! ఒకరికంఠమును బోలినకంఠము వేరొకనికుండఁ గూడదా! అంతమాత్రంబున మీరు రక్షింభావింపరాదు. నాఁడచ్చటఁ బ్రవర్తిల్లిన విజయసింహప్రహారేశ్వరుల సంభాషణంబును, రాజద్రోహికృత హితబోధానిరసనంబును, విన్నప్పటినుండియుఁ బ్రహారేశ్వరపాత్రుండు విశ్వాసపాత్రుండనియే భావించుచున్నాను. కాక ప్రహారేశ్వరుఁడు రాజద్రోహుల లోనే చేరినచో నాఁడు విజయసింహునిచేఁ బరాభూతుండయ్యు నిప్పుడాతని నాదరించునా?

మ- కపటాదరము చూపవచ్చును. అయిన నిప్పు డతనినమ్మను. అతనిభావిప్రవర్తనమువలన సమస్తము తెల్లమగును. ఇప్పుడు తెలియనిది మఱొకప్పుడు తెలియవచ్చును. విదియనాఁడు గానరాకపోయినను చంద్రుఁడు తదియనాఁడైనను గనఁబడక పోవునా? దానికేమి? అది యట్లుండనిమ్ము. నిన్ను నేనచ్చటికిఁ బుచ్చుట మిక్కిలి మంచిపనిసుమీ? లేకున్న విజయసింహుండు నిష్కారణముగా మృతినొందును.

రా:-అట్లని నిశ్చయముగాఁజెప్పలేను.మహాశేముషీమంతులగు ముక్తాంబ తనమనోహరుని నేవిధంబుచేతనైన రక్షించుకొనఁ గలుగును? అయినను నా గమనము కొంత యుపకరించిన దనియే చెప్పవచ్చును.

మః-మంచిది. ఇఁక నీ వరుగుము. రాజద్రోహులఁ గనుగొను చుండుము.

అని వా రట్లు పరస్పరము సంభాషించుకొన్నపిమ్మట మంత్రిపుంగవుండు రామరాజును బంపి యూపిచ్చివానిఁ వంకఁ జూచెను. వాఁ డొకమూల నిమీలితనేత్రుండై రుద్రాక్షమాలనుఁ ద్రిప్పుచు నేమేమో జపించుకొనుచు మఱియొకపరి కూర్కుచెంది ప్రక్క కొరుగుచు, మెలకువ గన్నప్పు డెప్పటియట్లు తిన్నఁగాఁ గూర్చుండి జపం బొనర్చుచునుండెను.మంత్రి యతనింగాంచి 'అవ ధానిగారూ! ఈ దివసంబునమీామహాజపంబు తలుగకున్న దేమి?' అని యడిగెను. అంతవాఁడు కన్నులువిచ్చి 'నీవు నాతపంబునకు విఘ్నంబు గావించితివి. నామంత్రంబు మాసిపోయెను. పురుషుఁ డెంత జపించుచున్నను బ్రకృతి స్వాధీనము కానిచో జపం బంత యును వ్యర్థమగును? ప్రకృతియన వేఱుగాలేదు. అది యెల్లెడ లను స్త్రీరూపముగాఁ బరిణమించి యున్నది. ప్రకృతి తనవిచిత్ర పరిణామవిశేషముచే జీవులచిత్తంబుల నాకర్షించుచున్నది, స్త్రీ లును. దమసుందరవిలాసంబుల చేతను. మృదుమధురవచనంబుల చేతను బురుషులను దమచెంతకాకర్షించు కొనుచుందురు. పురుషు లెన్ని బాధలనుభవింపవలసిన ననుభవించి యచ్చటికిఁ బోవుచుం దురు. జీవునికి మాయ స్వాధీనమయిన సమస్తమును సిద్ధించును. అట్లే పురుషునకు స్త్రీవశయై వర్తించిన సర్వమును సమకూడును. జీవునికి మాయ స్వాధీనము కానిచో నది పెక్కు బాములఁ బెట్టు చుండును. అట్లు పురుషునికి స్త్రీ స్వాధీనురాలు కానిచో ననేక

కష్టంబుల గుడుపును. రహస్యంబుల బైటఁబెట్టును. సకల కార్యంబులను జెఱుచుచుండును. నే నాప్రకృతిని స్వాధీనముచేసికో లేకపోతిని. అందువలన నాప్రయత్నమంతయును. వ్యర్థమయ్యెను. నా జపంబును. మంత్రంబునుఁ నేలగలిసినవి. ఇదిగో నాచే వెఱ్ఱి పనుల నెన్నింటినో చేయించుచున్నది. చూడుఁడు.' అని చెప్పి రుద్రాక్షమాలను నేలవేసికొట్టి, తెంపి పాఱవైచి తనకుదానే నెత్తిగొట్టుకొని దర్భాసనంబుగా నుపయోగించుచున్నగోనెను జీల్చి పాఱవైచెను. అనంతరము వాఁడు మంత్రివైపు చూచి పకపకనవ్వి నాకు వశముగాని మాయ నాచే నెట్టిపనులు చేయించుచున్నదో చూడుమని పలికి యటనుండి నాలుగుబారల దూర మేగి మగిడివచ్చి ప్రకృతిమీఁది కోపంబునఁ గార్యంబు చెఱుచుకొనరాదని పల్కి నేలఁబడియున్నరుద్రాక్షల దీసికొని చీల్పఁబడిన గోనెను దీసికొని మరల మంత్రివంకఁజూచి పెద్దపెట్టున నవ్వి వెఱ్ఱి వెఱ్ఱిపాటలు పాడుచు నచ్చోటు గదలిపోయెను.

అనంతరము మంత్రివర్యుండు వానిచేష్టలను జూచి యత్యాశ్చర్యంబు నొందెను. వాని సంభాషణమును విని దాని యభిప్రాయమేమోయని పలువిధంబుల నాలోచించుచు, రామరాజు తనతో నొనర్చిన ప్రసంగమును వీఁడు మనంబులో నుంచికొని యిట్లు పలికియుండునా యని సందేహించుచు, నున్మత్తుని మాటలను సరకుగొనరాదని సందేహనివృత్తి చేసికొని తనపని తానొనరించుకొనుచుండె.

## పదునొకండవ ప్రకరణము

### ఒక వింతవస్తువు.

సూర్యుండు శాంతకిరణుండై పశ్చిమదిశ కరిగెను. సాంధ్యరాగంబు గగనతలంబు నరుణితంబుగాఁజేసి కనులపండువుల నొసఁగుచుండెను. చీఁకటులింకను లోకంబును గప్పలేదు. ఆసమయంబున విజయనగరపు వీధులందు జనంబు లతిసంతసంబున సంచరించుచుండిరి. విహారార్థ మరిగి మగిడి వచ్చుచున్న యువజనంబులచేతను, వస్తువులసంపాదించు కొనునిమిత్తము వచ్చినగృహస్థులచేతను, కార్యాలయంబులనుండి మగిడివచ్చుచున్న యుద్యోగిచయంబుచేతను, నిండియుండిన వీధులను వీధులందు విక్రయార్థంబుంచఁబడిన నానావిధస్వదేశవిదేశవస్తురాసులును, రాసులుగాఁ బోయఁబడిన నానావిధ ధాన్యంబులను దిరుగఁ గొలుచు కొలఁగారపువాండ్ర సంఖ్యాగానంబులును, దత్సంఖ్యాగానంబుల నభివర్ధించునట్లు లెక్కసంబుగొలుపు రొక్కంబును, లెక్కించి టింగుటింగు మనెడినినాదంబులెగయ నాణెంబుచేయు వర్తకులును, వర్తకుల దయారసంబునుసంపాదించిధనంబుగొనవలెననియెంచి మెలుంగెత్తి కరనఖరాగ్రంబులఁ దంబురాలమీటుచు శ్రుతిగలిపి యత్యుత్సాహంబున గానంబుచేయు బిచ్చగాండ్రును, బిచ్చగాండ్రపాటలు గంభీరంబుగాను, మధురంబుగాను వినవచ్చుచున్నను, వినియువిననిచందంబున నటించుచుఁ దమ తమవ్యాపారంబులు చక్కఁజేసికొనుచుఁ, బెద్దయుంబ్రొద్దు నిలువఁ

బెట్టి తుట్టతుద కొకకాన్పైన విడల్పక వెడలగొట్టు పిసిడిగొట్టులును, బిసిడిగొట్టుల ద్రవ్యంబులవలెఁ దమజన్మంబుల నిరర్థకంబులుఁగా జేయుచు, నొక్కొక్క యెడ మూకమూకలుగా జేరి వృథాసంభాషణంబులతోను, గిలకిలమను నినాదంబులతోను గాలంబు పుచ్చుకోడె కాండ్రును, గోడెకాండ్రతో నెకసక్కెములాడి యాడించుకొనుచు, బకపక నవ్వుచు, మరునారసంబుల సీసడించు తీవ్రకటాక్షపాతంబులొక్కొకపరి ప్రయోగించి తదీయాంతఃకరణంబుల నపహరించెడి పుష్పలావికలును, బుష్పలావికల మృదుతరకరతలంబుల కెనవచ్చు నానావిధకుసుమసంతతులచే మనోహరంబుగాఁ గూర్పఁబడి సొబగులీనెడి పుష్పమాలికలును, బుష్పమాలికలఁ గొనివచ్చి నిలువఁబడి సరసాలాపంబు లాడుకొనుచున్న రసికజనులును, గలిగి యప్పుర మ్మమందానందదాయకంబై పొలుపాఱుచుండెను. ఆపుర విపణివీథియం దొకవిరిబోణి స్మరశరంబువలె యువజనకదంబమనంబులఁ బీడించుచు, నొకయంగడివాని చెంత నిలువఁబడి యిట్లు ప్రసంగించెను.

యు- 'వసంతా! వసంతా! ఏమిచేయుచున్నావు? పిలిచినను బలుకవేమి?

వ- వసంతుఁ డేమిచేయుచున్నను,' నెన్నిపుష్పంబుల దాల్చినను మాలతీ విరహితుండై నఁ బ్రకాశింపఁడు. వచ్చికూర్చుండి నాదుకాణమును బ్రకాశింపఁజేయుము.

మాలతి-నీ వెప్పుడును బరిహాసములాడుచునే కాలముపుచ్చుచుందువు.

వ- సుందరీ! కోపమేల! పరిహాసమాడినఁ గోపించినయువతివి నీవే కాని మఱియెవ్వరును లోకంబునలేరు. పోనిమ్ము నీకుఁ గావలసినది కోరుము.

మా:-వసంతా! కోపము వచ్చినదా! యేమి! కార్యవేగంబుచేన ట్లంటిని కాని వే ఱొకయభిప్రాయంబుతో సనలేదు. నాకుఁ బూవులదండ నొసఁగుము.

వ:-యువతీమణీ! పోనీ! నాపూవులదండనుగూర్చి మీ రాణియభిప్రాయ మెట్లున్నది. చెప్పుదువా? మగుడఁ గోపింతువా?

మా:-కోపమేల! వసంతా! పుష్పమాలారచనయందు నీకుఁ గల చాతుర్యంబునకు మారాణి మిగుల మెచ్చుకొనుచున్నది. ఆమె సమయము చూచి చక్రవర్తికి విన్నవింప వలెనని యుండఁగా నేఁటికి సమకూడినది. చక్రవర్తి యిప్పు డనంగసేనతో చతురంగ మాడుచున్నాఁడు. ఈసమయంబుననే నీదండను గొనిపోయినఁ జక్రవర్తి చూచి యానందించి నీకు బహుమాన మర్పించును. కావున నన్నుఁ ద్వరగాఁ బంపుము.

వ:-అట్లయిన నేనదృష్టవంతుఁడను. నాయల్లిన దండలన్నింటిలోను నిది ప్రశస్తమైనది. దీని గొనిపోయి చక్రవర్తికి జూపి నాపైనతనికి దయగలుగునట్లు చేయుము.' అని చెప్పి యొకసుందరమైనమాలిక నిచ్చి పంపెను. అంత మాలతియుఁ బరమానందంబుతో నాపుష్పమాలను దీసికొని యనంగసేన మందిరంబున కరుదెంచెను. మాలతి యమ్మందిరంబును బ్రవేశించి

పోవునప్పటికి రాజేంద్రునితో ననంగసేన చతురంగ మాడుచు నిట్లు సరసోక్తులాడుచుండెను.

అ:-దేవా!రాజు కట్టఁబడెను.

రా:-అవును. నిశ్చయంబుగాఁ గట్టఁబడెను. అనంగసేన యెదుటి పక్షంబున నుండఁగా రాజు కట్టఁబడుట కేమి వింత?

అ:-మీ కనంగసేనయందుఁ బెద్దదయ యుండుటచే దాని 'సంత సింపఁజేయనెంచి రాజు బద్ధుండగున ట్లు చేసితిరి. అంతేకాని మహారణరంగంబుల మిక్కిలి నేర్పుచేఁ జతురంగబలంబుల నడిపి పెక్కండ్రరాజులను బంధించి కొనివచ్చెడి మీ రెదుటి పక్ష మవలంబించియుండగా రాజు నెవ్వరు కట్టఁగలరు?

రా:-సుందరీ! సజీవులగు సైనికులసాయంబునఁ బరరాజుల బంధించికొనివచ్చుట సత్యమే. కాని నిర్జీవంబులగు బలంబులనుఁ జతురతచే నడిపి నిర్జీవుండగురాజును బంధించుటయే కాక సజీవుండగురాజును సైతము బంధించి విడిచితివి?

రా:-మీ హాస్యోక్తులకేమి లెండు, నాకు గెలుపువచ్చు ముందఱ మీ రెప్పుడునేవోపరిహాసంబులాడి యాటను ముగించుచుందురు. రాజును దప్పించు నుపాయ మాలోచింపుఁడు.

రా:-ఎటుచూచినను ననంగసేన ప్రతిబంధించుచున్నది. ఎట్లు తప్పు కొనుట.

అ:-అట్లయిన మీ రోడితిరా!

రా:-ఇప్పుడే కాదు. నీ వనంగసేన వెప్పు డైతివో యప్పుడే.

అనుసంతలో మాలతి యాపూలదండను గొనివచ్చెను.

కృష్ణదేవరాయలు పూలదండను జూచి బాహాదండంబు సాచి పుచ్చుకొని దాని నామూలాగ్రంబును బరిశీలించి యానందించి యనంగసేనం జూచి 'ఓసుందరీ! నీ వందముగా నలంకరించుకొని వచ్చితివేని నే నీపూలదండను నిండుమనంబుతో నీమెడలో వైచి నీసౌందర్యంబునకుఁ బట్టము గట్టెద' నని పలికెను.

'భూపాలతిలకా! మూర్ధాభిషిక్తులగు మీవంటి సార్వభౌముల దయ నాయం దుండఁగా నాకేమి కొదువ? అట్టియిన నాసౌందర్యము నేఁడు చరితార్థమగును. నాకంతకంటె గొప్ప గౌరవముకూడ కావలెనా?' అని యలంకరించుకొనుటకు భవనాంతరంబున కరిగెను. మాలతియు నామెను వెంబడించి పోయెను.

అప్పుడు రాజేంద్రుండాదండనుగైకొని యాదీపకాంతి యందు దానిసొబగును,జూచి సంతసించి యల్లినవాని చాతుర్యంబును జూడఁ బ్రతికుసుమంబును బరీక్షించి చూచుచుండె. ఆ సమయంబున నతని కాదండలో నొకవింతవస్తువు లభించెను. దానిని మెల్లమెల్లగ నంకించుకొని పైకెదీసి పరీక్షించి చూచెను. అంతట నతనిభావంబు లన్నియును మాఱిపోయెను. ఆవింతవస్తువును జూచినతోడనే జనించినమహాకోపానలంబు ప్రజ్వలించి యనంగసేనం గూర్చి యారాజేంద్రునిచిత్తంబున నుద్భవించి పొంగి ప్రవహింపనున్న యనురాగసముద్రము నింకింప బడబానలసదృశమయ్యెను. క్షణకాలంబులోనే యాయనురాగసముద్రము కోపాగ్ని సంబంధంబున నావిరిగా మాఱి యదృశమాయెను. అనురాగ మిట్లు నశించిన తోడనే, యతనిచిత్త మూరకుండక

యతనిచేతిని గత్తిపై కీ మరల్చెను. మానస ప్రేరితమైనప్పు డవయవంబు లూరకుండఁ గలవా! కావున నతని హస్తము ఖడ్గం బును ధరించెను. పాదంబుల వడివడి నడువ నాజ్ఞాపించెను. అవి నడుచుటకుఁ బ్రారంభించెను. భవనాంతరంబునకు వేగముగాఁ బోయి, యనంగసేనను జంపవలయునని మనంబు కోరుకొనుచుం డెను. మనం బిట్లు తనపని యొనరింపఁగా బుద్ధిప్రభవించి "ఇది యుక్తము కాదు వివేచింపుము త్వరపడకుము" అని బోధించెను. అంతఁ గృష్ణభూపాలుం డాయుపదేశంబును విని పైకిఁ దీసిన ఖడ్గంబును మగుడఁ గోశంబున నమర్చి, యెప్పటివోటఁ గూర్చుం డి నిర్ధూమానలంబు చందంబునఁ బ్రజ్వలించుచుండెను.

అట నంనంగసేన యమూల్యంబులగు నలంకారంబులు దాల్చికొని కమనీయంబగు దుకూలంబును గట్టి మూర్తిమంత మైన సౌందర్యమువలె నొప్పాఱుచుఁ గందర్పుని దంతిచందం బున విలాసమందగమనముతో రాజేంద్రు నెదుటికి వచ్చుచుం డెను. నాఁడు రాజేంద్రుండు తనసుందరరూపంబును జూచి యానందకందళిత హృదయుండై తన కపార గౌరవం బొనర్చునని సంతసించుచుండెను. రాజచంద్రుండు నాఁడు తన కభిముఖం బుగా వచ్చి తనకుఁ గైదండయొసంగికొని పోకపోఁడని నిశ్చయిం చెను. ఇట్లు తలపోయుచు ననంగసేన మెల్లమెల్లగా నాథరాకాం తుని చెంతకరిగెను. ఆమె తలంచునట్లు రాజేంద్రుఁడెదురువచ్చి గౌరవింపక పోవుటయేకాక దరహాసపూర్వకంబుగా నొకమాట నైన మాటాడదలేదు. అనంగసేన సమీపంబునకు రాఁగానే

యామెను జంపవలయునని మనంబుత్వరపెట్టెను. కాని బుద్ధియా సంకల్పంబును మానిచెను. ఈసమాచార మనంగసేన యెఱుఁగ కుండుటచే 'గార్యాలోచనాపరుండగుటచే రాజు తన్నుఁజూడ లేదనియుఁ, జూచియుండిన వచ్చి గౌరవింపక మానఁడనియు నూహించుకొనుచుండెను. కాని కోపోద్దీపితమానసుండై తన్నుఖండింపనున్నాఁడని యెఱుంగకపోయెను. రాజేంద్రుం డామెను జూడకపోలేదు. ఇంతకుఁబూర్వ మానందాంబుధిలో ముంపజాలిన తదీయసుందరరూప మిప్పుడతని కోపంబునకుఁ గారణమయ్యెను. సంతోషదాయకంబులగుతదీయసుందరవిలాసము లిప్పుడు సంతాపంబునకు హేతుభూతమయ్యెను. పూర్వమిట్టి సుందరవేషంబుతో వచ్చి యనంగసేన రాజేంద్రు నెదుట నిలువఁబడినచో వందిమాగధులచందంబున నుతింపఁ దొడంగును. కాని విపరీత చిత్తవృత్తిగల యతనికి నేఁడు మఱింత కోపంబునకుఁ గారణంబై నిందాపాత్రమయ్యెను. నిరుపమాన సౌందర్య మహితంబైనను, దన కానందసంధాయకంబగుచున్నను, బ్రభూత ప్రేమాస్పదంబైనను, వస్తువు వృత్యంతరము నొందిన చిత్తంబునకు వెగటగుచుండు ననుట కిదియొక తార్కాణంబుగదా! అంత రాజేంద్రుండు లేచి యావిన్నాణంపు పూలదండ నేలపై వైచికొట్టి, యాసుందరింజూచి, 'ఓ విశ్వాసహీనురాలా! నిన్నేమిచేసినను బాపములేదు. ఈకరవాలంబున నీకంఠంబును ఖండింప వలసినదే. కాని వైరివీరనికాయంబులందు నిరర్గళంబుగ విహరించు నాయీ కరవాలము నీవంటి యబలలపై బడజంకుచున్నది.' అనిపలికి

సరభసంబున నవ్వోటు విడిచిపోయెను. ఆమాటలు సిడ్గాతపాత సదృశంబులై కర్ణపుటంబులఁ దాకినప్పుడనంగసేన ప్రకం పనోన్మూలితయగు లతచందంబున వసుంధర యందు గూలెను. రాజేంద్రునకును నాసుందరికిని బ్రవర్తిల్లుసంభా షణంబును, వృత్తులనుజూచి యానందింపఁ లెసని కవాటంబు మూలనొదిగియున్న మాలతి భయకంపితమానసయై వడివడి నేతెంచి స్మృహతప్పి నేలపైఁబడియున్న యనంగసేనకు శైత్యోప చారంబు లొనర్చుచుండెను. అనంగసేన కొంతవడికిఁ దెలివి తెచ్చు కొనునంతలోఁ గోపంబు భయంకరరూపంబుతోఁ బొడసూపె. అంత విచారం బడుగంటెను. మెఱపుదీవియచందంబున, జివాలున నాస్థలంబున నంతర్థానమండెను. ఇట్లారోషామణి రోషావేశం బున లోపలి కరుగుటగాంచి యామాలతి భయకంపితయై వెంట నే యామెను వెంబడించెను. మాలతిపోయిచూచునప్పటి కా యనంగసేన దుర్నివారకోపపరీతయై యమూల్యమైన కట్టుబట్టను జీల్చివేసెను. ఆభరణంబుల నొక్కొక్కటి చొప్పుననే తీసి నేలఁ గొట్టి పగుల్చుచుండెను. అవి ముక్కముక్కలై నట్టింట వ్యాపిం చెను. వేలకొలందివెలగల యొకముత్యాలహారంబును దీసి కోపం బున నేలఁగొట్టెను. తోడనే యాపుత్తెపుటెత్తు చిన్నసూత్రి మయ్యెను.ముత్యంబులు నలుగడలఁ చెదరిపోయెను. ఇట్లాభరణం బుల ముక్కలు చేసినను నామె కోపము శాంతింపలేదు. అంత, మాలతి యెంతో ప్రయత్నించి తన నేర్పంతయు వినియోగించి యల్లినజటను తెప్పపాటుకాలములో విప్పి వికీయఁజేసెను. అం

తన్నో నూరకుండక మలినవస్త్రంబు నొకదానిని ధరించి కటికినే లపై శయనించెను. మాలతి కోపవికారంబున ననంగసేన చేయు చున్న కృత్యంబులను జూచుచునే యుండెను. కాని యేమియు మాటలాడలేదు. అట్టి కోపసమయంబునఁ దనసాంత్వవచనం బులు మరిగిన తైలంబుపైఁబడిన నీటిబిందువులవలె విపరీతఫల దాయకంబు లగునని మాలతి యెఱుంగును. కావున నిశ్శబ్దముగ రాత్రి చెప్పవాల్పక యట్టే చూచుచుండెను. కొంతవడి కనంగ సేనకోపంబు రూపణఁగెను. తోడనే విచారంబు తలయెత్తి యతిశ యించెను. అనంగసేన వెక్కి వెక్కి యేడ్వ నారంభించెను. మాలతి యామె కోపంబు తఱిగినట్లు తెలిసికొని సమీపించి యిట్లనియె.

మా:-అమ్మా!ఆభరణంబులఁ బగులగొట్టుటవలన నీ కోపంబం తయుఁ జల్లారినదా? నీకింత వెఱ్ఱి యెత్తుచున్న దేమి? ఈ భూష ణంబుల నలియఁగొట్టుట వలన నేమిలాభము? ఆ వస్తువులు మగుడఁగావలెనన్న సమకూర్చుకొనుట యెంత కష్టము.

అ:-చెలీ! నాకీయాభరణంబులతోఁ బనియేమి? ఇఁక నీజన్మం బున కీతను వాభరణంబులు దాల్ప నోచుకొనలేదు. అని యేడ్వ నారంభించెను.

మా:-తల్లీ! నీవింతవెఱ్ఱి పడెదవేమి? నీ వారాజేంద్రునిపైఁ గోప మువహించిన నెవరికి నష్టము? అతండేకారణంబుననో కోపించి పోవుచుండ నతని నెదుర్కొని కోపంబు శాంతించునట్లు సాంత్వ నంబులు పలికిమరలింపవలెను. కాని యతనికోపంబునకుఁ

బడింతలు కోపమువహించిన నేమిప్రయోజనము? రాజుల చిత్తరంగబులందు నిగ్రహాను గ్రహంబులు పర్యాయంబుగఁ దాండవించుచుండును. నేఁ డాగ్రహించి నిన్ను నిందించిపోయిన రాజేంద్రుఁడె తేపు వచ్చి నిన్ననుగ్రహించి యభినందించును. ఇట్లు ధైర్యమవలంబించి యుండక స్వరూపనాశనంబు చేసికొనఁ జూచెదవేమి? అతని నీ వాశ్రయించి యుంటివి. కాని నీవ్నతం డాశ్రయించి యుండలేదు. లతామతల్లి సాలము నాశ్రయించును. కాని సాలము లత నాశ్రయింపదు. పుష్పసంశోభిత లగు లతలులేక సాలము లెట్లు శోభించునని సందియ మందకుము. స్థిరమగు నాధార మొకటి యుండిన నాశ్రయింప నెన్నో సుందరలతలు చేరుచుండును. ఎన్నివిధంబు లాలోచించినను నీవు చేసినది పొరపాటని భావించెదను.

అః-చెలియా! నీ వాక్యంబులవలన నాకోపవిచారంబు లంతర్ధానంబు చెందినవి. వివేక ముదయించెను. నాచేసనది తప్పేయని నా కిప్పటికిఁ దట్టినది. నాసౌందర్యంబునకుఁ బట్టంబు గట్టెద నని ప్రేమాతిశయంబునఁబలికిన రాజన్యున కంతలోనే యంత కోప ముదయించుటకు హేతువేమియో తెలియరాకున్నది. అంత కఠినపుమాట లతని నోటివెంబడి నెన్నండును వినియుండమిచే సహింపలేక యట్టివికారచేష్టలు చేసితిని. కోపకారణంబు నాకుఁ దెలిసినంగాని యూరటకలుగదు. నీవు పోయి యెట్లయినను గోపకారణంబు తెలిసికొని రమ్ము నా కీయుపకారము చేయుము.

మా:-అమ్మా! నేను ద్వరలోనే తెలిసికొని వచ్చెదను. నీవ్వారట చెందియుండుము. అని చెప్పి యామె వెడలి పోయెను.

అనంతర మనంగ సేన తనయందేమి లోపమున్నదోయని పరిపరి విధంబుల నాలోచించెను. కానికోపకారణం బగులోపం బేమియును దనయందున్నట్టు తోఁచలేదు. వెంటనే రాయల కొక యుత్తరము వ్రాసి సంపవలెనని మొదట నిశ్చయించెను. కాని యట్టికోపసమయంబునఁ దావ్రాసినఁ యుత్తరమువలన విపరీత ఫలం బుద్భవించు నేమోయని తలపోసి యాప్రయత్నము విడిచి మాలతిరాకకై ప్రతీక్షించి యుండెను.

---

## పంద్రెండవప్రకరణము.

### కొండపల్లి చుట్టరికము-మరణదండనము

'అక్కటా! స్త్రీజనంబుల నెంతమాత్రమును నమ్మరాదు. స్త్రీలచిత్తంబు లతిచంచలంబు లనియు, విశ్వాసానర్హ లనియు, మహానుభావుండగు భర్తృహరి చెప్పిన వచనంబు ముమ్మాటికి సత్యమని యిప్పుడు నామనంబునకు దృఢంబుగాఁ దట్టుచున్నది. పురుషులెంత విశ్వాసంబు చూపుచున్నను, నెంతగౌరవంబు చేయుచున్నను, నెంత ద్రవ్యం బొసంగుచున్నను, స్త్రీలు స్థిర చిత్తలై యుండరు. ఇంతకుఁ బూర్వము కులకాంతలకంటె ననంగ సేన నెక్కుడుఁగా బ్రేమించుచుంటిని. అదిమిక్కిలిగర్హితకార్యంబు.

నీచవంశప్రసూతుల నెంతయు నుద్ధరించి గొప్పవారినిగాఁ జేయుద
మన్నను, జాతిధర్మమగు నీచత్వంబును విడుచుట కష్టసాధ్యము. అట్టి
నీచురాలైన యనంగసేన నీకనా మందిరంబుననుండ నీయక వెడలఁగొ
ట్టించుటే యుత్తమకార్యము. ఉన్నతవంశసంభూతుఁడనియును,
మహాపరాక్రమశోభితుండనియు, సద్గుణశాలియనియును, గౌరవిం
చి తెచ్చి నామందిరంబున నుంచుకొనఁగా విజయసింహుండు దురా
త్ముండై కృతఘ్నుండై తిన్నయింటికే కన్నములు త్రవ్విన
నాకే మహాపకారముఁ గావించె. విజయసింహుండు తప్పక వధింపఁ
దగినవాఁడు.' అని యిట్లు కృష్ణదేవరాయ లోకమందిరంబునఁ
గూర్చుండి విచారింప నారంభించె. కోపాటోపంబున హృదయంబు
ఘూర్ణిల్లుచుండుటచేఁ గార్యనిశ్చయంబును జేయఁజాలక తనకన్ని
కార్యంబులలో నుసాయపడుచున్న తిమ్మరుసునకు సందేశమంపెను.
అమ్మంత్రి శిఖామణియు నతిరయంబున వచ్చి రాయలచే సత్కృ
తుఁడై యుచితాసనంబున నాసీనుండయి రాయల యాకార
లక్షణంబులు విపరీతంబులుగా నుండుటకుఁ గారణం బూహించి
యుం దెలిసికొనలేక యతనితో నిట్లు ప్రసంగించెను.

మ:-రాజేంద్రా! విచారపరీతస్వాంతుండ వయినట్టు తోఁచుచు
న్నది. ఆవిచారకారణంబును దెలిపి తద్విచారంబులో నీమం
త్రిభాగము మంత్రి కొసంగి కొంత సుఖంబు చెందుము.

రా:-అప్పాజీ! నాచెప్పఁబోవునది మిగుల విచారకరమైనదే!
అయిన దానిం దర్వాతఁ జెప్పెదను. కాని విజయసింహుని

చరిత్రమెట్టిదియో తెలిసిన తెలుపుము. విన గుతూహల మగుచున్నది.

మః-రాజేంద్రా! విజయసింహునిచరిత్ర మనింద్యమైనది. చిత్తమతి నిర్మలము. సద్గుణంబు లార్యజనగేయంబులు. కొందఱు రాజద్రోహులువచ్చి రాజద్రోహంబునకుఁ బ్రోత్సాహించి నను గృతాపకారులైన మనయెడ నింతేనియు ద్వేషబుద్ధి వహింపలేదఁట! మఱియు రాజద్రోహులను బట్టుకొని మన కప్పగింపఁ బ్రయత్నించెనఁట! కాని దైవము విపరీతముగాఁ జేసెను.

రాః-దైవముచేసిన విపరీతమేమి?

మంత్రి అచ్చటి వృత్తాంతంబును సర్వంబునునివేదించెను.

రాః ముక్తాంబ విజయసింహుని దప్పింపనట్లు సాహసింప నేమి యవసరము?

మ- ముక్తాంబా విజయసింహులుదాంపత్యము నొందనున్నారఁట!

రా- విజయసింహుఁడు మఱికొందఱి స్త్రీలను ప్రేమించుచున్నట్టు లున్నది.

మ- ఎవరిని ప్రేమించుచుండెను!

రా- అనంగసేనను.

మంత్రిపుంగవుం డామాటలువిని విచారాతిశయంబున నిశ్చేష్టితుండయ్యెను. ఏమియును బలుకనోపడయ్యె. విజయ సింహుం డట్టిదుశ్చరిత్రుండు కాఁడని నిశ్చయించి తనకుఁ బ్రాణ దానముచేసిన విజయసింహు నెట్లయిన రక్షింపఁదలంచి ధైర్యం

బవలంబించి 'రాజేంద్రా! నీవాక్యంబు సత్యమా! నాకది భ్రాంతి మూలకంబని తోఁచుచున్నది.' అని సనిమర్శకంబుగాఁ బలికెను.

రా- అప్పాజీ-అది సత్యమే, నిన్ను భ్రాంతిసముద్రంబులో ముంప వలెనన్నదుస్స్వభావ మిదివఱకితనికి లేదని నీవెఱుంగవా? పాడిమాటలతో బ్రయోజనంబులేదు. అందుల కుత్తరముప్రమాణమున్నది.

మః-ఉత్తరము ప్రమాణమా! అ దెవ్వరు వ్రాసినది?

రాః-ఇతరులువ్రాసిన యుత్తరంబైనచో విజయసింహునిపై నీనింద మోపనేలా?

మః-విజయసింహుండే వ్రాసెనా! ఏదీ! న న్నొకమాఱు చదువ నిండు.

రాః-ఇదిగో! చూడుము. తుదదాక చదివి యుండలిసత్యమును నిశ్చయింపుము (అని యిచ్చెను.)

మంత్రి దానిం గైకొని దీపమునొద్దకుఁ బోయి యిట్లు చదివె. 'ఓ గుణనిధానా! అనంగసేనా!

చిన్నతనమునందే మనయనురాగబీజంబులొండొరులందు నెలకొల్పి కొని మొలపించి వర్ధించి తదీయఫలంబు లందవలెనని నోరు తెఱచుకొని యుండఁగా భగవంతుండు మనల నెడబాపి మ న మ నో ర థ ం బు ల ను వ్య ర్థ ము గా వి ం చె ను. కొండపల్లిదుర్గంబులో నుపవనంబున మనకుఁ బ్రవర్తిల్లిన సంభాషణమును నీ వొకమాఱు స్మరింపుము. ఆ నా వాక్యంబులు నీయందు నాకుండిన ప్రేమంబును వెల్లడింపక మానవు. కావున

నన్ను నమ్మి నీవు దర్శన మొసంగవచ్చును. ఆ నీసుందరరూపం బును జూడవలెనని నామనంబు కుతూహలపడుచున్నది. నీ పతి ప్రేమంబునఁబంపిన యంగుళీయకంబును జూచి నిన్నుఁ జూచినట్లె సంతస మొందుచున్నను, నీ ప్రత్యక్షరూపమును గన్నుల విందుగాఁ జూచునప్పటి సౌఖ్యంబు గలుగదుగదా! నీవు కోరుటచే నే నంపి నయుంగరంబును జూచుకొనుచు నాయం దనురాగంబును వర్ణించుచుండుము. మగుడ నీదర్శనభాగ్య మలవడుసుదిన మెప్పుడో తెలుపవలెను. నాపేరు బయలుపడకుండుటకై చేవ్రాలు చేర్ప మానితిని. అతిగుప్తముగాఁ బ్రవర్తిల్లిన యంగుళీయకవినిమయ మిం దుదాహరించుటచే నీవు విశ్వసింపవచ్చును. దీనికిఁ బ్రత్యుత్తర మంపుము.'

మంత్రిశిఖామణి దానింబూర్తిగాఁ జదివికొని సార్వభౌముంజూచి 'ఓరాజరాజా! నీవెట్లు యోజించుచున్నావో కాని నాకిది విశ్వసనీయము కానట్లు తోఁచుచున్నది. తుదకు జేవ్రాలు చేర్పకుండుటచేఁ గల్పితంబని నిశ్చయింపవచ్చును. కావున దీని మనము విశ్వసించి సచ్చరిత్రయగు ననంగసేన యందును, యోగ్యతముండయిన విజయసింహునందును నిందారోపణంబుచేయుట మన బుద్ధిహీనతను లోకమునకు వెల్లడించును.' అని నిస్సంశయముగా వాక్రుచ్చెను.

రా:-ఆయుత్తరమునేల విశ్వసింపవు? చేవ్రాలు చేర్పలేదని యుత్తరమందే పొందు పఱిచెను గదా? తక్కిన విషయములు విజయసింహానంగసేనలందు స్పష్టమగుచున్నవి? ఏల నమ్మవు?

మః-మహారాజా! ఏ రిరువురికి కొండపల్లిదుర్గము నివాస భూమియైనంతమాత్రంబున దోషారోపణంబు చేయవచ్చునా? కానవిశ్వసింపరాదు.

రాః-మంత్రీశ్వరా! అంగుళీయముల మార్చుకొనినట్టు లుత్తరంబున నున్నది. దానంజేసియైనను నమ్మెదవా?

మః-రాజేంద్రా! ఒక్కరీతి యుంగరంబులు పెక్కు లుండవచ్చును గదా? విజయసింహునకుఁ బ్రబలశత్రువు లున్నట్టు మీకు విశదమేకదా? కాన నదియును బ్రబలకారణంబు కానోపదు.

రాః-అమాత్యా! దాని నీ వట్లు పూర్వపక్షంబు చేయఁ దగదు. ఆయుంగరములవంటి యుంగరంబులు మఱి లేవు. అవి సామాన్యముగా లభించునవి కావు. విదేశవర్తకులయొద్ద రెండుంగరంబులు గొంటిని. వానిలో నొకదానిపై ననంగసేన పేరు చెక్కించి యామె కొసంగితి. రెండవదానిపై 'శ్రీరంగ' అని చెక్కించి నావ్రేల నుంచుకొంటిని. నిన్న గాపాడినట్టులు విని విజయసింహునకా యుంగరంబు నిచ్చియుంటిని. ఎవరియుంగరము వారియొద్ద నుండిన నీయుత్తర మసత్య మనవచ్చును. లేనిచో నీ వప్పు డేమందువు?

మః-ఏ మనఁగలను? సత్యమని తప్పక యొప్పుకొందును.

అది విని రాజేంద్రుండు విస్రంభపాత్రుండగు నొకసేవకుని బంపి యుంగరంబును దెమ్మనిపంపెను. అప్పుడాసేవకుఁ డతిరయంబునఁ జనివిజయసింహుంజేరి 'ఓ వీరవరేణ్యా! నీకు రాయలవారు బహుూకృతిగా నొసంగిన యంగుళీయకంబు నొక్కసారి దెమ్మనిరి,

నాకు దానితోసంగుము' అని పలికెను.

విజయసింహుఁడదివిని తనయుంగర మూనెగొండె ఘుందుఁ బోవుటచే మిగుల విచారించి యట్లుపోయినదని చెప్పి కొనుట తన శౌర్యమునకు లోపముకలుగునని భావించి యా యంగుళీయకంబువలెనే యుండుటచేఁ బిచ్చివాఁడు బహూకృతిగా నొసంగిన యుంగరంబు నతనికొసంగి 'అంగుళీయకమును దెమ్మనుటకుఁ గారణమేమి?' అని యడిగెను.

'ఏమో తెలియదు. రాజమంత్రు లిరువురును గూర్చుండి సంభాషించుచున్నా' రని సేవకుఁడు ప్రత్యుత్తరమిచ్చి యతని వీడ్కొని రాజసందర్శనంబున కరిగెను. రాజేంద్రుండు సేవకుని బంపినప్పుడే యొకపరిచారిక ననంగసేనచెంత కుంగరంబునిమిత్త మంపెను. ఆపరిచారిక యనంగసేన మందిరంబున కరుగునప్పటి కామె మాలతితో నేమేమియో సంభాషించుచు రాజుకోపకారణం బెఱుంగ నేరక సంతాప మందుచుండె. అనంగసేన యాపరిచారికం జూచి తనోద్దార్చుటకు రాజే యాయబలామణిం బంపి యుండవచ్చు నని యెంతయును సంతసించి యెక్కుడుగా గౌరవించి 'సుందరీ! ఏమి పనికై యిచ్చటికి వచ్చితివి? రాజుగారేమి చేయుచున్నా' రని యడిగెను.

'అమ్మా! ఇంత వఱకును మహాకోపావిష్టస్వాంతులై సర్పరాజంబుకై వడి రోజుచుండిరి. కాని మంత్రివచ్చి సంభాషించినపిమ్మట గొంత శాంతము వహించినట్లు లున్నది. మీకు వారిచ్చిన వజ్రపుటుంగరంబును దెమ్మనఁగా వచ్చితి' నని యా

పరిచారిక బదులు చెప్పెను.

'కారణమేమో తెలియునా? రాజమంత్రివర్యుల సంభాషణంబును గొంచెము తెలుపఁగలవా?' అని యనంగసేన యాత్రతతో నడిగెను.

'యువతీలలామా? ఆవృత్తాంతము నాకేమియుం దెలియదు. ఈయుంగరంబు నెందులకుఁ దెమ్మనిరో యదియును దెలియదు.

అది విని యనంగసేన మిన్నకుండఁగా 'అమ్మా! విలంబము చేయక యా యుగరంబు నిమ్ము. ఇప్పుడే నీపై మండిపడి, పోయిన రాజేంద్రుండుంగరంబునిమిత్తము సందేశమంపెను గదా? రేపువారు స్వయముగానే వచ్చి నిన్ను మన్నించి సంతసింపఁజేయుదు'రని మాలతిబోధించి యుంగర మిప్పించెను.

అంత నాయంగన యా యుంగరంబును గైకొనిరాజసన్నిధికి వచ్చెను. అనంగసేన యావృత్తాంతంబును గనుఁగొని రావలెనని మాలతిని రాజమందిరంబున కంపెను. కృష్ణదేవరాయలు సేవకుండును బరిచారికయుఁదెచ్చిన యంగుళీయకంబులఁ దాఁబరీక్షించి యాయుంగరంబులు తారుమారుగాకుండ మంత్రిపుంగవున కర్పించిన నతండును వానింజక్కఁగఁ బరిశీలించి రాజేంద్రుండు చెప్పినట్లుండుటచే విచారపరీతహృదయుఁడై యేమియు మాటాడలేకపోయెను. రాయలతని మొగంబారసి 'మంత్రివరా! ఇప్పుడు త్తరము విశ్వాసనీయమైనదని నమ్ముదురా!' అనియడిగెను.

''నమ్మకతీఱునా! నమ్మఁ దగియే యున్నది. . ఎట్టివాని

హృదయంబు లెట్లుండునో యెఱుంగఁ జాలము కదా? విజయ
సింహుం డిట్టివాఁడని యెన్నండును భావింపలేను. ఏమి చేయ
గలము?" అని మంత్రి సవిచారముగాఁ బలికెను.

రా:-మంత్రివర్యా! విజయసింహుఁడువధ్యుండనియొప్పుకొందురా?

మః-ఒప్పుకొనపునా? కాని యతని బిలిపించి యడిగిన నేమిచెప్పునో?

రా:-ఇందులకై యతని నడుగనేల? ఈయుంగరమే ప్రత్యక్ష
ప్రమాణముకదా? మఱియు నిదివఱలో మనకు మహోప
కారముచేసిన వానిమొగంబు చూచుచుఁ గఠిన శిక్షవిధిం
చుట కష్టము. కావున శాసనపత్రము వ్రాసి పంపుము.
చండాలురే యీసమాచార మతనికిఁ దెల్పి, కొనిపోయి పని
సాధించుకొందురు. అట్లు చేయుటయే యుచితము.

మంత్రి యీవచనంబులు విని యతనిఁ జంపవలసివచ్చి
నచో రాజేంద్రుడు చెప్పినట్లు చేయుటయే మంచిదని నిశ్చయిం
చుకొని రాజేంద్రునిజూచి 'మహారాజా! ఈయుత్తరము పూల
దండలో గదా! యున్నది. ఆవర్తకుని బిలిపించి యడిగిననే
మగునో?' అని మరల యడిగెను.

'అమాత్యశేఖరా? పైవారి సాక్ష్యముతో మనకుఁ
బ్రయోజనమేమి? విజయసింహునియొద్దనుండి తెచ్చిన యనంగ
సేన యుంగరంబును జూచియు నిట్లు శంకింతువేల? అంతఃపుర
ద్రోహిని విడిచిపెట్టవలయునని నీయభిప్రాయమా? యేమి?' అని
రాజేంద్రుఁడు కోపమునఁ బలికెను.

'మహారాజా! ఆగ్రహమేలా? అపరాధిని విడిచి పాలనా

పద్ధతుల నతిక్రమింపవలయునని నేనెప్పుడును జెప్పను. నామతము తమకుఁ దెలియదా?' అని మంత్రివిన్నవించుకొనెను.

'అట్లయిన రేపటియుదయమున విజయసింహుని వధ్య స్థానంబునకుఁ గొనిపోయివధించి వచ్చుటకుఁ జండాలురకు శాసన పత్రిక నిప్పుడే వ్రాసిపంపుము. అట్టిద్రోహి నుంచరాదని నా యభిప్రాయము. సిమ్మట మీయిష్టము.' అని రాజనెను.

'సార్వభౌమా! నేఁడు విపరీతవాక్యంబులను వినుచున్నా ను. మీయభిప్రాయమునకు నాయిష్టంబు వ్యతిరిక్తమ్ముగా నుం డుట యసంభవము. ఇప్పుడేయప్పని యొనరింప శాసనపత్రమును వ్రాసిపంపెదను. కాని దానిలోని విషయమును గొంచెము మార్చుట కంగీకరింపవలయును. వెంటనే విజయసింహుని గారా గృహాబద్ధునిగాఁజేసి నేఁటి కయిదవనాఁటియుదయమునఁ జంపు దురు. అందులకు మీరు సమాధానపడవలయును.' అని మంత్రి పలుకఁగా దానికి రాజేంద్రుండంగీకరించి యతనికి సెలవొసంగెను. అనంతరము పరిచారిక కాయుంగరము నిచ్చి 'రెండుదినంబులలో నీపురంబువిడిచి పోవలయును. లేనిచో వెడలఁగొట్టింతు' నని యనంగసేనకుఁజెప్పి యీయుంగరమిచ్చి వేయుమని దానిఁబంపి తనయంతఃపురంబున కరిగెను.

మంత్రిపుంగవుండు రాజేంద్రుని యనుమతిచొప్పున నప్పు డే యాజ్ఞాపత్రమును వ్రాసి కారాగృహాధికారికిఁ బంపించి 'నా ప్రాణంబులుగాచి నాకు మహోపకార మొనర్చిన విజయ సింహుని ప్రాణంబులుదీయ నాజ్ఞాపత్రమునువ్రాసి కృతఘ్నుండ

నగుచున్నా'నని దుఃఖించుచుఁ దనమందిరంబున కరిగెను.

అట్లు పరిచారిక యనంగసేన మందిరంబున కరుగునప్పటికి మాలతివలన నావృత్తాంతమును విని దుఃఖాతిశయంబున మూర్ఛిల్లెను. పరిచారిక యాయుంగరమును మాలతికిచ్చి యా వృత్తాంతమును చెప్పి పోయెను. తరువాతమాలతి యొనర్చిన శైత్యోపచారములవలనఁ దెల్విచెంది 'సుందరీ! ఇదేమిచిత్రము? నాయుంగర మిట్లుమాఱి పోవుటకుఁ గారణమేమై యుండును?' అని యడిగెను.

మా:-అది తెలియకున్నది. అది వింతగా నున్నది.

అ:-ఆ విజయసింహుని మొగమైన నెఱుంగను. నాకెట్టి యపవాదము వచ్చినదో చూడుము.

మా:-కిట్టనివారెవ్వరో యిట్టి, యుత్తరంబులఁ గల్పించి యుందురు.

అ:-ఆయుత్తరంబునుగూర్చి యావరకు నడుగలేదా?

మా:-ఆయుత్తర మంపినయుత్తరక్షణమందే వాఁడంతర్థానము చెందెను.

అ:-నే నెవ్వరికి నపకారము చేయలేదు! నే నేపాపము నెఱుంగను. (అని యేడ్వసాగెను.)

మా.- అమ్మా! విజయసింహునకుఁ బెక్కండ్రు శత్రువులున్నారు. అతఁడు రాజేంద్రుని దయకుఁ బాత్రుండయ్యెనని మచ్చరపడి రాజున కతనిపై నాగ్రహము గలుగవలెనని యిట్లు చేసియుం

దురు. విజయసింహునకుఁ జేసినయపకారము నీకుఁగూడ సంప్రాప్తమైనది.

అ. చెలియా! ఏయుంగరమువలన నాకీ యపవాదమువచ్చినదో యాయుంగరంబువలననే ప్రాణంబులు దొరంగి సుఖించెదను. ఆయుంగరం బిటు తెమ్ము.

మా. అమ్మా! అంతసాహసము వలదు. ఈయపవాదకారణంబు రాజేంద్రునకుఁ గొన్నిదినంబులలోఁ దెలియకపోదు. తెలిసిన పిమ్మటవచ్చి నిన్నాదరింపక మానఁడు. ఈరెండుదినంబులు నిటుఁగాలము పుచ్చుదము. తరువాతిసంగతి యోజించుకొన వచ్చును.

అ. చెలియా! ఈయూరడింపుమాటలతోఁ బ్రయోజన మేమి? ఈసాయంకాలంబుతోడనే నాకును రాజేంద్రునకును ఋణంబు చెల్లినది. అనురాగపాశము త్రుంపఁబడియె. భిన్నమయిన త్రాటిని ముడిచినను నదుకు స్పష్టముగానే కానవచ్చుచుండును. అట్లె మాకిరువురికిని మగుడసమావేశ మయినను దొంటి సుఖం బలవడనేరదు. నీవన్నట్లొకవేళ నపవాదకారణంబు తెలిసినను, రాజేంద్రుఁడు నన్ను బ్రేమతో నాదరించినను, నాకు వచ్చిన మచ్చుపోదుగదా? కావున నపవాదకళంకముచేఁ గళంకితమైన నావదనచంద్ర బింబంబును, రాణులకుగాని, రాజేంద్రునకుఁ గాని పురవాసులకుఁగాని చూప నిష్టము లేదు. ఇప్పుడే యీపురంబును వీడి పోవలయును.

మా:-అమ్మా! ఇట్టి సమయంబున నెచ్చటికిఁ బోవుట ప్రమాద కరము గదా?

అ:-అయినఁ గానిమ్ము! ఇప్పుడే పోవలయును, పోయెదను. దయ యుంచుము.

మా:-ఏమీ! నేడు విపరీతవచంబులు వినవచ్చుచున్నవి. అనంగ సేనామాలతు లుండిన నొక్కచోటనే యుండవలయు. చచ్చిన నొక్కసారే చావవలయును. అంతేకాని నేనిచ్చట నుండుదానం గాను. నాసహవాసము నీకుఁ గష్టముగా నుండి నచోఁ జెప్పుము.

అ:-చెలియా! ఎంతమాటాడితివి! నీవంటి హితురాలు వేయి జన్మంబులెత్తినను లభించునా? నాపూర్వ పుణ్యమువలన లభించితివి. నీబంధువులఁ బరిత్యజించి రమ్మనుటకు నో రాడక యట్లు పలికితిని.

మా:-సమస్తము నా కనంగసేనయే యని యెంచుకొనుచున్నాను.

అ:-అట్లయిన నీనగలను మూటగట్టుము.

అని పల్కి యనంగసేన యప్పుడే మాలతితో నాపురం బును విడిచిపోయెను. మరునాఁ డాసమాచారంబును విని పుర వాసు లనంగసేన దుష్టగాలన్ని మఱింత దృఢపఱిచిరి.



## పదుమూడవ ప్రకరణము

### ముక్తాంబ సభకురాలేదు

ఆనెగొందిపురంబున మగుడ ప్రహారేశ్వరాదు లొకసభ చేసిరి. ఆ సభకు రామయమంత్రియే యధ్యక్షుఁడు. అతని యాజ్ఞచొప్పున నతనిసహచరు లందఱును వచ్చి • కూర్చుండిరి. కాని యేమి కారణంబుచేతనో నాఁటి సభకు ముక్తాంబ రాలేదు రామయమంత్రి మునుపటివలె నామెను రమ్మని బలాత్కారంబు చేసి పిలుచుటయునులేదు. ముక్తాంబతోఁగలిసివచ్చుచుండుప్రహా రేశ్వరుఁడు వచ్చియుండుటచే నిఁక వచ్చునన్న యాశయునులేదు ఆస్త్రీలలామ వృత్తాంతంబు నేమియుఁ దెలియలేదు. ఏకారణము చేతనోరామయామాత్యుండు వారిం గూర్చి యడుగలేదు. ప్రహా రుండేమియుం జెప్పలేదు. తక్కినవారుకారణ మూహింపఁజాలక గుసగుస లాడఁ దొడఁగిరి. వారిలోవారు పరస్పర మడుగుకొనిరి. కాని వాంఛిత మీడేరలేదు. ఆకారణమడుగుటకు సంకోచించి కొందఱు మౌనముద్రాధారులై రి. కాని యొకపురుషుండూరకుండ లేదు. అతఁడు రుద్రదేవుండు. ముక్తాంబ సుందరరూపంబును, నిస్తులగుణంబులును, రుద్రదేవుని మనంబు నాకర్షించినవి. ముక్తాం బయందు వాని కనురాగము చిరకాలము క్రిందటనె యుదయించి నను గప్పిపుచ్చియుండెను. విజయసింహుని రక్షించు నాఁ డామె వేసిన కేకలు విన్నతోడనే యనురాగంబు ప్రకటిత మయ్యెను.

ఇంతేగాక ముక్తాంబను దనకొసంగునట్లు రామయామాత్యాదు లచే వాగ్దానము చేయించుకొనెను. వారును నిండుమనంబుతో వాగ్దానముచేసిరి. అందువలన రుద్రదేవుని కోర్కె లాకసమును ముట్టుచుండెను. కావునముక్తాంబ తన సన్నిధియం దున్నప్పుడు దిన నాథుండులేకున్నను నాదినము సుదినంబే. సభామండలంబున భాను మంతుండు చక్కగాఁ బ్రకాశించుచున్నను, ముక్తాంబ తపనుఁ గానరానిచో నాదినము దుర్దినంబనియే రుద్రదేవుండు భావించు చుండె. ఇదివఱకు ముక్తాంబ సభామందిరం బలంకరించి కార్యా లోచనపరురాలై యుండఁగా రుద్రదేవుండుతన నయనమధుక రంబులను ముక్తాంబ వదనారవిందంబునఁ జరింపఁజేసి తదీయ సౌందర్య మకరందంబును ద్రావించి తృప్తిగొలుపుచుండెడి వాఁడు. ఇతరసమయములకంటెఁ గార్యాలోచనాపరురాలై యున్నప్పుడే ముక్తాంబయందంబును దనివిదీరఁ జూడవలనుపడి యుండుటచే సభాదిన మతని కత్యంతానందదాయక మగుచుం డెను. నాఁడు సభ జరిగినను దన కానందంబునుగూర్చుసుందరి సభామందిరంబునకు రాకపోవుటచే నాఁటిసభ యతనికి సంతాప కరంబుగా నుండెను. కావున సహింపలేక మంత్రింజూచి ,రామ య్యామాత్యా! ముక్తాంబ . సభకు రాకపోవుటకుఁ గతమేమి? ఆమెరాకపోవుటచే సభ వెలవెలపోవుచున్నది. సయుక్తికంబు లును మృదుమధురంబులును నగుముద్దుపల్కులతో నందఱడెం దంబులకుం దట్టునట్లుచెప్పి కార్యనిశ్చయంబు చేయునిపుణము ముక్తాంబకుఁ దక్కమఱెవ్వరికిఁ గలదు?' అని ప్రశ్నించెను.

అతనివాక్యంబులువిని తక్కినవారందఱును ఔనని పల్కిరి. కాని ప్రహరేశ్వరుండును రామయమంత్రియును నేమియుఁబల్కలేదు. కాని రుద్రదేవునివచనంబుల కుత్తరమీయనిచో నతనికి కోపమువచ్చుననియు, నందువలనఁ గార్యంబులు చెడుననియు రామయమంత్రి యెఱుంగును. కావునరుద్రదేవుంజూచి 'ఓయీ! ముక్తాంబ నేడు రాకపోవుట కొకకారణమున్నది. స్త్రీలబుద్ధు లతిచంచలంబులు. వారియెదుట ప్రసక్తిలైన రహస్యంబులు వెఱ వారికిఁ దెలుపుచుందురు. ముక్తాంబ విజయసింహుని త్రికరణ శుద్ధిగా వరించినది. కావున మనమతనివధకై యొనర్చుమాయో పాయంబు లతనికిఁదెల్పి రక్షించుచున్నది. అందువలన మనప్రయాసమంతయు వ్యర్థమగుచున్నది. నాఁడు మనచేతఁ జిక్కిన విజయసింహుని రక్షించిన దాముక్తాంబయే కదా?'అని చెప్పి నాఁటివృత్తాంతంబును దెలియఁజేసెను.

ఆవృత్తాంతంబును విని యచ్చటి వారందఱును నాశ్చర్యంబు నొందిరి. రుద్రదేవుం డాశ్చర్యమగ్నుం డగుటయే కాక విచారసాగరమగ్నుండును నగుచుండెను. విజయసింహు నంతటి ప్రేమముతోఁ జూచుచున్న ముక్తాంబతన్ను వరించుట దుర్ఘటమని భావించి యేమియు ననలేక వెలవెల వోయిచూచుచు 'ఈ యుదంతము నాకు మిక్కిలి యబ్బురంబు గొలుపుచున్నది. విజయసింహుఁ డీపర్యాయమైనం జావండా? లేక యిప్పటికిఁ జంపఁబడియే యుండెనా? ముక్తాంబయట్టి దయినచో సభకు

రాకుండఁ జేయుటయే మంచిదిసుడీ' అని రుద్రదేవుండు సవిచారంబుగాఁ బలికెను.

'రుద్రదేవా! అందుచేతనే ముక్తాంబను సభకుఁ బిలువలేదు. పిలువకపోయినంత మాత్రమున నామెకుఁ గోపమురాదులెమ్ము. దానికేమి విజయసింహుండు చచ్చినచో నీమనోరథము తప్పక నెఱవేఱును. వాఁడు నేఁడో రేపో చంపఁబడక మానఁడు.' అని రామయమంత్రి పలికెను.

'మంత్రివర్యా! నీమాయావాగురయందు దాబలిష్ఠసింహము చిక్కినది. అది తనంతటదాను విడిపించుకొనలేదు. ఒరులు వచ్చి విడిపింపరు. ఈపర్యాయ మది యందులోఁబడి చచ్చుటయే సిద్ధము. ఇక్కార్యం బొనర్చుటలో మీరును రుద్రదేవుండును జేసిన పనులు దురూహ్యంబులుసుఁడీ! ఇంతబుద్ధిచాతుర్యంబుగల రుద్రదేవుఁడే ముక్తాంబకుఁ దగినభర్తయని నాయభిప్రాయము.' అని ప్రహారేశ్వరుండు పలికెను.

రుద్రదేవున కతనివచనంబు లమృతధారాపాతంబు లగుటచే నానందాంబుధిలో నీదులాడుచు నేమియుఁబల్కక యూరకుండెను.

'ప్రహారేశ్వరా! నీవచనము యుక్తమైనది. కాని ముక్తాంబ విజయసింహునం దనురక్తయైయున్నది. ఆయనురాగంబును రుద్రదేవునిపైకి మరల్చుట దుర్ఘటకార్యము. పల్లంబునకు బాఱుచున్న జలప్రవాహంబును బర్వతశిఖరంబుపైకి మరల్చుట మిగులఁ గష్టసాధ్యముకదా?' అని రామయమంత్రి పలికెను.

'రుద్రదేవుం డది విని, తెల తెల వోయి మంత్రివర్యా! నిమ్నాభిముఖంబులై పాఱెడి మహాప్రవాహంబులు సైతము బంధింపబడుటయును, దజ్జలంబును వలసినస్థలంబునకు గొనిపోవు టయును జూచుచున్నాము.' అని విచారమనస్కుఁడై పలికెను.

'రుద్రదేవా! నీ వన్నది సత్యమే? కాని యాబంధనంబున కామహాప్రవాహమును నిలుపునంతటి శక్తి గల్గి యుండవలెను. ఒక్కబిందువైన జిమ్మకుండ జేయదగి యుండవలెను. పైనుండి పొంగిపోకుండఁ గాపాడవలెను. ఆబంధనమున కిట్టిసామర్థ్య ముండి నచో జలప్రవాహము నాపి వలసినస్థలంబునకుఁ గొనిపోఁ గలుగు దుము. కాని యం దేమాత్రములోప మున్నను బ్రయత్నమంత యును వ్యర్థమే. ప్రహరేశ్వరుండు ముందుగా నామెమనంబును ద్రిప్పయత్నించుచుండవలెను. నీవును సద్గుణంబులచేతను, దదీ భీష్టవస్తు సంపాదనము చేతను, దదీయానురాగంబును నీపైకి మరల్చుకొనవలెను.'

'మంత్రివర్యా! ఈమధ్య వివాహప్రసంగము తెచ్చినప్పు డేమియు నిష్కర్షగాఁ జెప్పదాయెను. కాని మనంబున విజయ సింహునిఁ గోరుచున్నట్లు తోఁచుచున్నది. మనమేమి చెప్పినను బ్రయోజనము లేదు. విజయసింహుండు చచ్చెనేని, దదాశ్రయ మైన యనురాగలత నిరాధారమై యాధారాంతరమునకై వెదకు చుండును. అప్పుడు రుద్రదేవునిపై నెలకొల్పవచ్చును. విజయ సింహుం డీపర్యాయమైన నామావశేషుం డగునా?' అని ప్రహ రేశ్వరుం డడిగెను.

అందు కేమియు సందేహములేదు. మంత్రిపుంగవుఁ డతని రక్షింపవలయునని సద్యోవధార్హుండైనను విజయసింహునిఁ గారాగృహమం దుంచి తప్పింప నుపాయంబుల వెదకుచున్నాఁ డఁట! అతని రక్షించు నుపాయ మలవడుట కష్టసాధ్యము. మీదుమిక్కిలి యనంగసేన బురంబును విడిచిపోయినదఁట. అం దువలన విజయసింహునందు నేరము మఱింత దృఢపడినది. ఈమాఱు మనకార్యంబు నెఱవేఱినట్లె. అయిన విజయసింహ వధకై మనము చేసినయుపాయంబులఁ బెఱవారికిఁ దెలియనీరాదు. జాగరూకులరయి యుండుఁడు.' అని రామయమంత్రి పల్కెను.

'మంత్రివర్యా! ఇప్పుడు మనము చేయవలసిన పనులేమి? మంత్రిపుంగవునిఁ జంపుటకై మగుడఁ బ్రయత్నింతమా? అని ప్రహారేశ్వరుం డడిగెను.

'ప్రహారేశ్వరా! మనము చేయవలసిన పను లనేకము లున్నవి. వానింగూర్చి పిమ్మటఁ జెప్పెదను. విజయసింహామరణము విన్నతరువాత యోజించి నీ వన్నపని చేయవచ్చును. మనమిఁక ముక్తాంబ నీపురమునుండి తప్పించు నుపాయ మాలోచింప వల యును.' అని రామయమంత్రి యనెను.

'మెట్టమొదటనే మన మాపని యొనర్పవలసినది. మేము రాజద్రోహులతో స్నేహముఁ జేయుచున్నట్లు విని తిమ్మరుసు పెక్కండ్రభటులను గాపుంచినాఁడు. ఆభటులును జాగరూకులై యున్నారు. మీరు నానావేషంబులుదాల్చివచ్చుటచే మీ కిందుఁ బ్రవేశము గలిగినది. లేనిచో రక్షకభటులు మిమ్ము లోపలికి రానీ

యరు. ఆమె నెట్లు తప్పించుకొని పోవుటయో, తెలియకున్న' దని ప్రహారేశ్వరుండు సందేహించుచుఁ బలికెను.

'నీ వందులకు సందేహింపకుము. వందమంది భటుల నుంచినను రామయమంత్రి వారి కనుఁబ్రామి ముక్తాంబను గొని పోఁగలఁడు. వెనుకఁ జెప్పుటయేకాని ముక్తాంబతో విజాపుర ప్రయాణముంగూర్చి చెప్పలేదు. ఇప్పు డందుల కిష్టపడునా? లేనిచో మనప్రయాసమంతయును వ్యర్థమే?' అని రామయ మంత్రి పలికెను.

'ముక్తాంబ నీవాక్యంబును ద్రోసివేయఁలేదు. పౌరుషంబున రాజ్యంబు గొనవలెననియే యామె కోరుచున్నది. కాన నచ్చ టికిఁ దప్పకవచ్చి తీరును. తన మనఃప్రియుండైన విజయసిం హుఁడు మృతినొందును. కావున నిఁక నిటనుండుటకు విరక్తి గలదై మనమున్నచోటికిఁ దప్పక వచ్చును. ఇంతేకాక రాజమం త్రిపుంగవులు పెక్కులు క్రూరకృత్యంబు లొనర్చునట్లు చెప్పి యామెకు భయము పుట్టించినచో నొకనిముసమైన నుండఁజా లదు. ఆమెకు నాయందు మిక్కిలి ప్రేమ యున్నది. నాపై రాజ ద్రోహమును మోపి రాజేంద్రుండు చంపఁ బ్రయత్నించు చున్నా డనియు, ప్రహారేశ్వరుండు తప్పించికొని పోనిచో నతఁడు బ్రదు కుట దుర్ఘట మనియుఁ జెప్పిన మాఱుచెప్పక పయనముచే యును. ఇటు బోధించుట కొఱకని నియోగింపుము.' అని ప్రహా రేశ్వరుండు వచించెను.

'ప్రహారేశ్వరా! మిక్కిలి చక్కఁగా నుపదేశించితివి. ఆపని నెఱవేర్చుటకు రుద్రదేవుని నియోగించుట ముఖ్యకార్యము. ఇతండు పోయి యామెతో సంభాషించుచున్న నితనిపై నను రాగం బుదయింపక పోదు. మనకు శత్రువగు విజయసింహుని వరించుటన్న నాకిఁ గష్టముగా నుండెడిది. ఇప్పుడది తప్పినందుల కానందించుచున్నాను. పౌరుషంబున శత్రువులనుండి మగుడ నుదయగిరి స్వాధీనము చేసికొన్నప్పుడే నాబుద్ధివిశేషము జనశ్లాఘాపాత్రమగును. కానిచో నేమిలాభము?' అని రామయామాత్యుం డనెను.

'రామయామాత్యా! నీరాజభక్తి నిరుపమానమైనది. నీబుద్ధివిశేష మప్రతిహతమైనది. అట్టి నీబుద్ధివిశేషంబుచే నీ ప్రభుకుమారికహితంబుకై మిగులఁ బాటుపడుచున్నావు. ఆ ముక్తాంబయు నీ కనుకూలముగాఁ బ్రవర్తించిన సంతోషకరముగా నుండును. కాని యామె కొన్నింటిలో నీకు వ్యతిరిక్తముగాఁ బ్రవర్తించి కృతఘ్నురాలగుచున్నది. నేను, జెప్పినను వినకున్నది. ఏమిచేయుదును?' అని ప్రహారేశ్వరుం డనియె.

'ప్రహారేశ్వరా! నే నందులకుఁ గోపమువహింపను. నా ప్రభుకుమారిక యొకవేళఁ దప్పొనర్చినను నేను దాని సరకు గొనక యామె హితంబునకై పాటుపడుట నాకు విహితకృత్యము. ఒక్క విషయములో మాత్రము ముక్తాంబ నాకు విపరీతమైయున్నది. రుద్రదేవుని వరింపుమని నేననఁగా విజయసింహుని వరింతునని యామె పల్కుచున్నది. ఐన విజయసింహుం

డు హతుండగును. కాన మనవచమే సఫల మగుచున్నది. ముక్తాంబ వెనుకజేసిన విపరీతకృత్యంబులకైన నేఁ గోపింపను. తన మనఃప్రియుండగు విజయసింహుని రక్షించుకొనఁ బాటు పడుట యుక్తకార్యమే. పోనిమ్ము. గతమునుగూర్చి విచారింప రాదుఁ' అనిపల్కి రుద్రదేవుంజూచి 'ఓయి వీరవరేణ్యా! నీ విది మొదలు ముక్తాంబను సందర్శింపఁబోవుచు మనరహస్యంబులను గప్పిపుచ్చుచు వర్తింపుము. నే నిదివఱకుఁ జెప్పిన వచనంబులను మనమునం దుంచుకొని యామె నిటనుండి కదల్పఁ బ్రయత్నింపుము.' అని చెప్పి వారిని పంపి, తానును దన ఘూర్గంబునఁ నెచ్చటికో పోయెను.

---

## పదునాలుగవప్రకరణము.

### రాజకీయ వ్యవహారము లెట్లున్నవి?

'గీ. సామమున నెల్లపనులును సరివిజెందు
నన్నిచూచినఁ గీడులే దెట్టియెడల!' పంచతంత్రము.

ముక్తాంబ యద్వితీయప్రజ్ఞావలంబ. ఎట్టి యాపద్దశలందైనను మహాధైర్యమవలంబించి కార్యనిశ్చయము చేయఁగల సమర్థురాలు. త్వరపడక, సూక్ష్మబుద్ధితోఁ నాలోచింపక యేకార్యంబునైన నాచరింపదు. తన మనఃప్రియుండగు విజయ సింహునిఁ దప్పించుటలో నామె చూపిన బుద్ధిచాతుర్యంబును,

ధైర్యంబును, సాహసంబును, దెలిసినమీా కామెంగూర్చి నేఁజెప్ప నవసరంబులేదు. ఆమె విజయసింహునిఁ ద్రిశుద్ధిగ వరించియు, నావృత్తాంతము ప్రహరేశ్వరాదులకుఁ దెలియకుండనుండ నెంచి, విజయసింహుని దప్పించుటకై తాఁ బాటుపడినట్టు వారికిఁ దెలియకుండ నుండునట్లు విజయసింహుండు తనకుపకారము చేసె నని చెప్పినమ్మించినది. నాఁ డామెవచనంబులు నమ్మి రామ యామలు 'విజయసింహునిఁదప్పక చంపెద'మని ప్రతిజ్ఞ చేయఁగా ముక్తాంబ విని విచారపరీతురాలై 'అక్కటా! నన్నుఁదప్పించుకొనన నెంచి విజయసింహునకు కషాయము తెచ్చిపెట్టిన క్రూరాత్ము రాల'నని మిక్కిలి దుఃఖించె. కాని రాజమంత్రివర్యుల యపార కృపారసంబున కాలవాలమైన విజయసింహునకు రామయాదు లేమిచేయఁ గలుగుదురని దృఢముగా నమ్మియుండెను. నేఁడు విజయసింహుం డంతఃపురద్రోహము చేసెనది రాజేంద్రుండతని కారాగృహబద్ధుం గావించినట్టును, నికఁగొలదిదినంబులలో ఖండిం తుఁడగునట్టును విన్నప్పు డామెకుఁ గలిగినదుఃఖంబునకుఁ బారంబు లేదు. అప్పు డామె పలువిధంబులఁ దన్ను నిందించుకొనన సాగెను. తన్ను నమ్మి, ప్రాణపదముగా నెంచు కొనెడి విజయసింహుని నిష్కారణముగాఁ జంప రామయాదులఁ బ్రోత్సాహించినపాపంబును వేయిజన్మంబులకైనఁ దొలగించు కొనలేనని వగవఁజొచ్చెను. అట్టి పాతకంబును దుడుచుకొనఁ దగిన యుపాయము విజయసింహరక్షణంబుగాక వేఱొక్కటి లేదని నిశ్చయించెను. రామయమంత్రి మంత్రప్రభావమే విజయ

సింహమరణంబునకుఁ గారణంబుకాని మఱియొకటి కాదని యామె దృఢముగా నమ్మెను. విజయసింహుఁడు వేఱొక్కయువతిని జేపట్టెడని యామెకుఁ దెలియును! ఆమె కింత విశ్వాసము కల్గించునది తనపై విజయసింహున కుదయించిన దృఢానురాగమె. తన యం దట్టి దృఢానురాగము గల విజయసింహుని రక్షించుట ముఖ్యకార్యమని తలంచెను. కాని యిప్పు డెట్లురక్షింపఁగలదుఁ? తా నానెగొందె యం దున్నది. విజయసింహుఁ డారాయల కారాగృహమం దుండెను. రామయాదుల కపటోపాయంబులా! దురూహములై యుండెను. ఎట్లు రక్షింపఁగలుగును? పూర్వము తాను సభామందిరంబున కరుగుచుండెను. కాన విజయసింహవధోపాయంబులు తెలిసికొనఁ గల్గినది. కాని యిప్పు డట్టియవకాశము చిక్కలేదు. రామయాదులు కార్యాలోచన మందిరంబునఁ గూడినట్లు తెలిసెను. కాని తన్నుఁ బిల్వకపోవుటకుఁ గారణంబు తెలిసికోలేక పోయెను. అయినను రా మ య మం త్రి యం దు గోపము వంహింపలేదు. వహింపకయుం బోలేదు. సర్వకాలములందును దనమేలే కోరుచుండిన రామయమంత్రి యందుఁగోపం బూనుట తప్పని కోపము వహింపక పోయినను తన కభీష్టుండగు గువానిఁ జేపట్టనుండగా రుద్రదేవునినే వరింపవలయునని నిర్బందించుచు తనప్రియుని జంపనెంచుట రామయమంత్రికిఁ దగదని కోపమును వహింపకపోలేదు. అయిన నది మనంబుననే యుంచుకొనెను. కాని బైటఁ బెట్టలేదు. తన కభిలషితుండగు వరునిఁ బరిణయ మాడుచుండ వేఱొకని వరింపు మని యొకరు బోధింప

నవసరము లేదనియు, నొకవేళ బోధించినను సఫలము కానేర దనియు, కార్యసంపాదనము నిమిత్తము మొదట రామయాదులు చెప్పిన చొప్పుననే వర్తించినను దుష్టతుదకుఁ దన మనోరథంబే నెఱవేర్చుకొన వచ్చుననియునామె నిశ్చయము చేసికొనియుండెను. ప్రహారేశ్వరుఁడు రాజద్రోహము చేయుచున్నట్లు తిమ్మరుసునకుఁ దెలిసెననిముక్తాంబ యెఱింగినప్పటినుండియు,సామంబునరాజ్యంబు లభించుట కలలోని వార్త యని భావించినను రాజానుగ్రహపాత్రుండైన విజయసింహుని మూలకముగా సంపాదింప వచ్చును గదాయని తలపోసికొనెను. కాని యిప్పటితో నాయాశయుఁ బూర్తిగా నసించె. కావున నిఁక నుదయగిరి రామయమంత్రి శేముషీవిశేషమువలన సాధ్యము కావలెనుగాని వేఱొకవిధంబున సాధ్యంబుగాదని నిశ్చయించుకొని యుండుటచే, రామయ మంత్రి సభాభవనమునకుఁ దన్నుఁ బిలువక పోయినను, గొన్నింటిలోఁ దనకు విరుద్ధముగా బ్రవర్తించుచున్నను, నాతనిపైఁ గోపము వహింపలేదు. పితృపితామహమగు రాజ్యంబు తనకు రావలయును, విజయసింహుఁడు తనకు భర్తగావలయును. ఈరెండే యామెకు ముఖ్యకార్యములు. కావున రాజ్యసంపాదనము నిమిత్తము రామయమంత్రి కనుకూలమై వర్తించుచున్నట్టు నటించుచున్నను, నతఁడొనర్చిన కార్యములలో విజయసింహునకు విరుద్ధములుగా నుండువానినిఁ దన బుద్ధి చాతుర్యముచేఁ జక్కచేయుచుండక పోలేదు. నేఁడు విజయసింహుని దప్పించుట కేమియుఁ దోఁచలేదు. విజయసింహుని

యపరాధము స్థాపింప రామయాదు లొనర్చిన కపటోపాయము లైనను దెలియలేదు. వానిని దెలిసికొన నవకాశములేదు. ప్రహరేశ్వరు నడిగిన నతం డనుమానపడి చెప్పఁడని యెఱుంగును. ఇందువలన ముక్తాంబ విచారాతిశయంబు ననుభవించుచుఁ, బాన్పున శయనించి యేమియో యాలోచించుచుండెను. ఆసమయంబున ముక్తాంబయనురాగంబును సంపాదింపఁ దలంపుగొని రుద్రదేవుం డామెమందిరంబున కరుదెంచెను. ముక్తాంబ వచ్చుచున్న రుద్రదేవుం జూచి యమితానందంబు నొంది చివాలునఁ బాన్పునుండి లేచి యెదురు చని గౌరవించి యుచితాసనం బిచ్చి, 'ఓ పురుషవరేణ్యా! రాజకీయవ్యవహారము లెట్లున్నవి? రామయమంత్రి బుద్ధివిశేష మప్రతిహతమై వర్తించుచున్నదా?' అని ప్రశ్నచేసెను.

ముక్తాంబమనోహర వాక్యము లతని హృదయంబునఁ బ్రవేశించి కలపనారంభించెను. వాడామెచూపులకుఁ దాళఁజాలక మోహపరవశుండై యుక్తాయుక్తవివేకము బరిత్యజించి యుండెను. ఆమెమృదుమధుర వచనంబులు మఱియొక్కపరి వినవలె నని కుతూహలుఁడై యుండెను. యువతీమణుల విలాస సంపదకుఁ జిక్కి కార్యరహస్యంబులు దెలుపనివారును, దెలిపి చెడనివారును లోకంబున నుండుట దుర్ఘటంబుగదా? అంత రుద్రదేవుండు, 'ఓ సుందరీ! రాజకీయవ్యవహారంబులు మన కనుకూలములై యున్నవి. మన రామయమంత్రి నిరుపమాన ప్రతిభతోఁ బ్రతిఘటించి నిలుచునది లోకంబున వేఱొక్కటి యేది

కలదు? స్వపక్షులు విపక్షులతోఁ జేరి రహస్యంబులు బైటఁ బెట్టనిచోఁ దలఁచినపని యెల్ల సఫలమై యుండును.' అని మంద హాసము చేయుచుఁ బలికెను.

రుద్రదేవా! నీయభిప్రాయంబు నాకవగతమైనది. వచన శూలంబును నాహృదయంబునఁ జక్కఁగా గ్రుచ్చితివి. విజయ సింహుని నే రక్షించితినన్న దురభిప్రాయంబు మీకందఱకును గలిగిన ది. కాని యందలి సత్యమును బాటింప రైరి. విజయసింహుని రక్షించినవాఁడు రామరాజు. వాఁడు విజయసింహుని కాప్తమిత్రుఁడట. వాఁడు విజయసింహరక్షణార్థము తిమ్మరుసుచే నియమింపఁబడెనఁట. వాఁడే మనకార్యంబును జెడగొట్టినవాఁడు. ఇట్లుండ మీకందఱకును నాయం దనుమాన మంకురించినందులకు వగచుచున్నాను. నాహితంబును గోరుచు నిష్కపటభక్తితో నాకార్యంబులు నిర్వహించుచున్న రామయ మంత్రికి విరుద్ధముగా వర్తింతునా? నాబ్రతుకుదెరువు నాకుఁ దెలియదా? అని పలికెను.

ఇంతటితో వానిజ్ఞానము పూర్తిగా నశించెను. మిక్కిలి మోహామువహించెను. ఆమెవాక్యంబులు వాస్తవముగా విషస దృశములైనను నమృతధారాసదృశంబు లాయెను. ఆమెవచనం బులు యదార్థంబులని గ్రహించెను. కాని తన్ను మోసపుచ్చు టకట్లు పలుకుచున్నదని గ్రహింపలేకపోయెను. రామయాదుల యుపదేశమును మఱచిపోయెను. రుద్రదేవుం డామెకుఁ గోపము వచ్చునేమోయని సందేహించి ' ఓ యువతీలలామా! రామయ

మంత్రి చెప్పవిని నిశ్చయ మనుకొన్నాను. అతండు తత్వంబు గ్రహింపలేకపోయెనని యిప్పుడు నీవచనంబులవలన నిశ్చయించితిని. క్షమింపుము. నీ విఁక మాపక్షమే యవలంబించినదానవయినచో నావిన్నవింపఁబోవు శుభకార్యంబు మాకువలె నీకును నానందసంధాయకంబే యగునని తలంచెదను.' అని సంకోచించుచుఁ బలికెను.

'రుద్రదేవా! ఇంకను నాయందు విపక్షభావమును వదలవేమి? రామయాదు లందఱును నన్నుఁ బ్రధానురాలినిగాఁ జేసికొని కార్యము సాధించుచుండఁగా వారందఱు నాపక్షంబులోనివారే కదా? దైవానుగ్రహంబున నేను రాణినైనచో రామయాదులందఱును నాకుఁ బ్రకృతిజనంబులే యగుదురు గదా! రాజమంత్రులకు వేఱువేఱుపక్షం బవలంబించు టెచ్చట నైనఁ జూచుచున్నామా? వారిరువురునుఁ జెఱియొకపక్ష మవలంబించిన రాజ్యంబు శత్రువుల పాలగుటకు సందియ ముండునా? నాకది తెలియకపోలేదు. కృష్ణదేవరాయలు మనకు విరోధి. అతనికిఁ బ్రియభృత్యుండయి వర్తించు విజయసింహుండు నాయనురాగంబునకపాత్రుండు గదా! అదియైన మీరాలోచింప వలదా?' యని ముక్తాంబ దృఢంబుగా పలికెను.

మోహాంధుఁడైన రుద్రదేవుండు ఆమె వాక్యంబుల గూఢార్థమును గ్రహింపజాలక పూర్తిగా వచింతుండయ్యె. విజయసింహునియందు ముక్తాంబ కనురాగంబున్నదన్న వచన మవివేకమూలక మని నిశ్చయించెను. కాని తనవలన రహస్యంబులు

తెలిసికొనక నిట్లు పలుకుచున్నదని యెఱుఁగకపోయెను. కామ దేవప్రభావంబునకు లోఁబడి మూర్తిమంతమగు తదీయ మహా శక్తియో యాయన నొప్పారెడి యానారీమణి, ప్రేమాల వర్తించుచుం డఁగా నంతటివివేక మెట్లుదయించును? అప్పుడు రుద్రదేవుండు ' ఓ యువతీలలామా! విజయసింహుని విపక్షునిగా నెంతువేని నాచెప్పఁబోవు వృత్తాంతము సంతోషదాయక మగును. ' అని వచించెను.

' రుద్రదేవా! ఆవృత్తాంతమును నాకుఁ దెలిపి సుఖవంతు రాలినిగాఁ జేయుటకు మాఱుగాఁ గాలవిలంబము చేసి బాధింతు వేల? విజయసింహునిగురించి పలుమాఱు వచించుచున్నావు. నాకు సంతాపకరుండగు విజయసింహుండు కాలధర్మము నొందెనా యేమి? అని ముక్తాంబ త్వరపెట్ట సాగెను.

'సుందరీ! విజయసింహుండు చచ్చుటకు సిద్ధంబుగా నున్నాఁడు. నేడో రేపో నీ కాశుభోదంతమును, నేఁదప్పక తెలు పుదునని నమ్ముము.' అని రుద్రదేవుండు సంతసముతోఁ బలికెను.

'వీరవరేణ్యా! నాయందు నీ కంతదయయుండిన లోప మెట్లువచ్చు? సామాన్యులే శుభోదంతమును దెచ్చిన నెక్కుడు గా గౌరవింతురు. అట్లుండ నీవంటి రాజపుత్రుండు స్వయముగా శుభోదంతంబును వినిపించినప్పు డెట్టి బహుమానము చేయువల యునో, తెలియఁజాల కున్నాను. నీవంటివాఁడు సందేశహారుఁడు గా లభించుట నాపూర్వపుణ్యవిశేషంబు సుమీ'యని ముక్తాంబ పల్కెను.

రు- తరుణీమణీ! దేనిని వినఁగోరెదవు! విజయసింహుని మరణ వార్తనా? అయ్యో! అందులకు సందేహింపవలదు. విజయ సింహునిచావు నిశ్చయమని ముమ్మాటికిని నమ్ము.

ము-రుద్రదేవా! ఎందులకీ ముఖప్రీతివచనంబులు? విజయసిం హుండు చచ్చుట కలలోనివార్త. వాఁడు మహాబుద్ధిశాలి. మృత్యుముఖంబునంబడియు నాఁడెల్ల తప్పించికొనిపోఁడెనో చూడుము. అట్లే యిప్పుడును నెవ్వరో వచ్చి విడిపించి రక్షింతురు?

ముక్తాంబ త్రికరణశుద్ధిగా విజయసింహుని వరించిన దని రామయమంత్రి దృఢంబుగాఁ జెప్పినను ముక్తాంబయొక్క ప్రౌఢ వచనంబులకు పరవశుండై రుద్రదేవుండు మయిమఱచి ముక్తాంబ తనకు స్వాధీనురాలైనట్లు భావించి సకలవృత్తాంతంబునుఁ జెప్ప సాగెను. అయారే! యువతీమణుల ప్రభావ మెంతశక్తి గలది? తనకు వశుండయినవానినిఁ దోలుబొమ్మ నాడించినట్లాడించి విడి చిపుచ్చును గదా? ఆమె చనువిచ్చిన కొలందిని దన్మయుం డగు చుండెను. 'ఓ ముక్తాంబా! విజయసింహుండు తప్పించుకొని పోఁగలఁడనియా నుడువుచున్నావు? అది యెప్పటికిని బొసఁగదు. ఈమాఱుతప్పించుటకు ఫాలాక్షునికైననుదరముకాదు. మాతో విరోధ మవలంబించి విజయసింహుఁ డింకను జీవింపఁ గలఁడా?' అని రుద్రదేవుం డనియెను.

ము- ఏమీ! విజయసింహునిమరణంబునకు మీరు కారకు లెట్లగు దురు? ఆతఁడు కామాంధకారమునఁ గన్నుగానక దుష్పథ

వర్తిదై రాయలకుఁ బ్రియురాలైన యనంగసేనం బ్రేమించి యూపదకాలవాల మాయెనని వినియుంటిరే?

రు. అక్కటా! పాపము. ఆతఁ డనంగసేనముఖమైన నెఱుంగఁడు? అతఁడంతఃపురద్రోహంబు చేసినట్లు నేనును రామయమంత్రి యును జేసినారము.

ము. ఏమేమీ! ఇది మీప్రభావమా! ఎంతపని గావించితిరి? మీ బుద్ధిచాతుర్యమున కెంతేనియు మెచ్చుకొనవలసియున్నది. రాయల కెట్లనుమానము గల్గించితిరి? మహాజ్ఞానసంపన్నుఁడయిన రాయలు సామాన్యుల వాక్యములునమ్మి ప్రియ భృత్యుని జంపింపనెంచునా? ప్రియురాలిని వెడలగొట్టించునా? నా కంతవిశ్వసనీయముగాఁ దోఁపకున్నది.

రు.-లలనామణీ! ఆవృత్తాంతమును బూర్తిగాఁ జెప్పనిచో నీకు నామాటయందు విశ్వాస ముదయింపదు. విదేశవర్తకుల యొద్ద రాయలు రెండుంగరంబులు గొని యొకటి ప్రియురాలగునసంగసేన కిచ్చి రెండవది తనచేత నుంచుకొని, మంత్రి ప్రాణంబుల గాపాడెనని తెలిసినప్పుడు విజయసింహున కాయుంగర మొసంగెను. ఇట్లున్న విజయసింహానంగసేనల యుంగరంబులను దారుమాఱగునట్లు చేసితిమి?

ము.-ఎట్లు మార్పఁగలిగితిరి. ఆయుంగరములు మీకెట్లు లభించినవి?

రు.-విజయసింహుఁ డానెగొందికి వచ్చినప్పుఁ డాతనియుంగరమును దీసికొంటిమి! రామయమంత్రి పిచ్చివానివేషంబును దాల్చి యొక్కకోఁతిని దీసికొని విజయనగరంబునఁ దిరుగుచు ననంగఁ

సేనయెదుటఁ గోఁతి నాడించుచుండఁగా నామె సంతసించి ఫలముల నీఁబోయెను. కోఁతి యామెచేతిని బట్టుకొనఁగా నామె బలాత్కారమున విడిపించుకొనెను. అప్పు డామె యలంకారంబులు క్రిందఁబడియె. ఆ సమయంబున రామయమంత్రి క్రిందఁబడిన యాయుంగరమును సంగ్రహించి తనయొద్దనున్న యుంగరము నచట బాఱవైచెను. అనఁగనేన తనయలంకారములు తీసికొనునప్పు డా యుంగరమును గొనిపోయెను. అనంతర మతఁ డా యుంగరము నెట్లయిన విజయసింహున కీయవలయు నని వచ్చుచుండఁగా దైవికముగా నొకయాఁబోతా మార్గమున వచ్చుచు నతనిపైఁబడి చంప సిద్ధపడి యుండెను. అప్పుడు విజయసింహుఁ డామార్గంబునఁ బోవుచు నట్లు వచ్చి యాఁబోతును దరిమి యతనిని రక్షించెను. అప్పుడు రామయమంత్రి యతని కాయుంగరమును బహుమతిగా నొసంగెను. ఇట్లా యుంగరములు మార్పఁబడినవి.

ము:-(ఆశ్చర్యపడుచు) రక్షించినవాని భక్షించినట్లు తన్ను రక్షించిన విజయసింహునకుఁ బ్రాణాపాయకర మగునాయుంగర మిచ్చుట కతని మనస్సెట్లొప్పె?

రు:-రామయమంత్రి అతని కాయుంగర మిచ్చుటకు సందేహించెను. అయిన మేము బలాత్కారముచేసి యిప్పించితిమి.

ము:-తనయొద్దనున్న యుంగరమువంటి యుంగరమనంగసేనయొద్ద నున్నట్లు రామయమంత్రి యెట్లు తెలిసికొనియె.

రు- అంతకుఁ దొలినాఁడనంగసేనకు సాముద్రికఫలంబులు చెప్పెద నని యామె హస్తమును బరీక్షించెను. అప్పుడాయుంగరమును బరికించి యీయుపాయమును బన్నెను. నాఁడతఁ డనంగసేన యుంగరము సంపాదింపలేకపోయిన మఱియొకయుపాయము పన్నను. రామయమంత్రి• కపటోపాయంబులకై వెదక నవసరములేదు.

ము- ఆవృత్తాంతము రాయలకెల్ల దెలిపెను.

రు- అనంగసేనచెలికత్తె యగుమాలతి యొకవర్తకునియొద్ద పూల దండలు గొని తీసికొని పోవుచుండెను. నేనదిచూచి యావర్తకునితో స్నేహముచేసి పుష్పమాలికలవలన వచ్చుద్రవ్యము నతని కిచ్చుట కేర్పాటుచేసి యతనికి మాఱుగా నేనమ్ముచు మాలతికిఁ బ్రతిదినంబును మాలిక నిచ్చుచుండెడి వాఁడను• నే నల్లినదండల కాయువతి సంతసించి చక్రవర్తికిఁ జూపి బహుమానము చేయించెద నని చెప్పెను. చక్రవర్తి కాదండ జూపెద నని యాసతి యొకనాఁడు చెప్పఁగా నొక దండను పసందుగ నల్లి విజయసింహుఁ డనంగసేనకు వ్రాసిన శ్లోకయుత్తరము వ్రాసి యందుగూర్చి పంపితిని. ఆనాఁడు రాయలు దానిఁ బరిశీలించుచుండఁగా నాయుత్తర మతని కంటఁ బడినది.

ము:-రుద్రదేవా? నీప్రభావము మెచ్చవచ్చు. పుష్ప మాలాగ్రథన చాతుర్య మిప్పటికిఁ బనికి వచ్చినది. నేఁడు మిగుల మంచి వార్త తెలిపితివి. అని చెప్పి యతని పొగిడి పంపఁగా నత్యఁడు

నాఁడు ముక్తాంబ చనువిచ్చి సంభాషించినందుల కానందించి వెడలిపోయెను.

---

## పదునయిదవ ప్రకరణము.

### చేతఁజిక్కిన పక్షి యెగిరిపోయెను.

'శా. ఆయుర్దాయము గల్గుమానవుఁ డరణ్యానీస్థుఁడై యున్న పా
నీయానీకములోనఁ జొచ్చినను నగ్నిం జొచ్చినం జచ్చునే.'

విజయసింహుం డట్లుముక్తాంబా రామరాజులసాయంబున విముక్తుండై విజయనగరంబుఁజేరినకొలఁదిదినములకొకనాఁటిరాత్రి తనశయనంబున శయనించి తనభావిఫలంబులంగూర్చి తలపోయ నారంభించెను. నాఁడుముక్తాంబ తనయందవ్యాజానురాగంబుగల్గి దన్నుఁ దప్పించుటకై చేసిన యుపాయంబుల కమితానందంబు చెందుచుండెను. రాజమంత్రుల పరిపూర్ణానుగ్రహంబు నొంది యున్నవాఁడు కావునఁ దాను ముందుముందు దన కున్న తాధి కారముసంప్రాప్తముకాకపోదనియు, నప్పుడుముక్తాంబనుబరిణయ మాడియపారసుఖంబులనుభవింపవచ్చుననియు,బరిపరివిధములఁద లంచుకొనుచుండఁగానంగుళీయకంబునిమిత్తమురాజభటుండరుదెం చిదానికొనిపోయి యొకగంటకాలములో మగుడదెచ్చియతనికిచ్చి విజయసింహుఁ డేదియోయడుగుచున్నను బదులుచెప్పక వెడలి పోయెను. విజయసింహుఁ డాయుంగరంబును దాల్చి యెప్పటి

యట్లు తనమనోరథహర్మ్యమును బూర్తి చేయ నారంభించెను. ఆయుంగరము నేల గొనిపోయిరో! దానివలనఁ దన కెట్టియపాయము సంప్రాప్తముకానున్నదో యెఱుఁగక పోయెను. ఆమనోరథహర్మ్యమునుఁ బూర్తి చేసి తదుపరిభాగంబున విహరింపఁ జొచ్చెను. అప్పుడు ముక్తాంబ సుందరరూప మతనిమనోదర్పణంబునఁ బ్రతిఫలించెను. ముక్తాంబ తనసమీపంబునకే వచ్చినట్లు సంతసించి యామెతోఁగూడ విహరించుచు నపారసౌఖ్యపారావారంబునఁ దొప్పదోఁగుచు నేదేదియో యోజించుకొనుచుండెను. అందువలన నతనిమానసము, రాత్రి చాలవఱకతిక్రమించినను విశ్రాంతిస్థానంబున కరుగలేదు. అంతట దసమందిరద్వారంబున నేదో చప్పుడు వినవచ్చె. అదివిన్నతోడనే యతఁడు త్రుళ్లిపడి జాగరూకతతో వినుచుండఁగా, నది మనుష్యుల పదధ్వనులవలె వినఁబడెను. అతఁడట్లు శయనించియేయుండి యావంకఁ జూచుచుండఁ బదుగురుమనుష్యులు కంటఁబడిరి. వారిచేతులలో భయంకరంబులగు నాయుధంబులు గానవచ్చుటచే వారెవ్వరో శత్రువులనియును, వెనుక దానుదప్పించుకొని వచ్చుటచేఁ గోపించి, చంపుటకో, లేక బంధించి కొనిపోవుటకో వచ్చుచున్నారనియు, భావించి చివాలునలేచి క్రోధారుణితనేత్రుండై తన ప్రక్కనున్న ఘోరతరతరవారిని కరతలంబునఁజేర్చి కూర్చుండెను. అంత నాపురుషు లతనిశయ్యను సమీపించి నమస్కరించి నిలిచిరి. విజయసింహుండు వారినమ్రభావంబునుగాంచి 'వారు రాజభటులుకాని శత్రువులు కారనియు, రాజద్రోహులనో చోరులనో

వ్వేరై నను నాకుఁ దెలియదు. ఈ వృత్తాంతంబును సావకాశముగా విన్నవించిన యుక్తాయుక్త వివేకనిధియైన రాజేంద్రుండు నన్ను నిరప రాధునిగా నిశ్చయించి విడువక మానఁడు. నీవుపోయి 'విజయసిం హుండు మీదర్శనంబు గోరుచు న్నాఁ' డని మనవి చేయుము. పిమ్మట నాయదృష్ట మెట్లుండునో, అని పరిపరివిధంబుల విజయ సింహుండు వేఁడుకొనఁ జొచ్చె. కారాగృహాధిపతి యావాక్యం బులు విన్నతోడనే మండిపడెను: వాఁడు స్వభావముచేతనే కఠిన హృదయుఁడు. వాఁడు మహాకోపముతో ' ఓయీ! నీ దీనా లాపంబుల వినువా రెవ్వరునులేరు. రాజమంత్రు లిర్వురును గో పోద్దీపితమానసులై యున్నారు. పాపాత్ముండ వయిన నీమొగం బును జూడరాదని నిశ్చయము చేసికొనిరి. చక్రవర్తి యాగ్రహో యత్తచిత్తుఁడై నిన్నుఁ దక్షణమందే వధింప నాజ్ఞాపించెను. కాని దయార్ద్రహృదయుఁడగు మంత్రి నాల్గుదినంబులువరకును బ్రాణం బులతో నుండునట్లుచేసెను. వారిదర్శనంబునకుఁ దీసికొని రావల దని శాసించినారు. ఇక నీవాయాశవదలుము. పిచ్చివాఁడుంగరమి చ్చినట్లు చెప్పుచున్నావు. అ దెవ్వరునమ్ముదురు? అపరాధముచేసి యేల తప్పించుకొనఁ జూచెదవు? అని పల్కి విజయసింహుని యాశాలతను మొట్టమొదటికి ఛేదించెను. కారాగృహాధిపతి పోయి యాయంగుళీయక వృత్తాంతంబును విన్నవించినఁ గొంత వఱకైనం దత్త్వము బైఁట బడియుండును. కాని వాఁ డందుల కంగీకరింపలేదు. విజయసింహుండు నిరాశ చేసికొని తన దురదృ ష్టమును నిందించుకొనుచు నతనిం గాంచి ' ఓయీ! మీపని

మీరు నిర్వహించుకొనుఁడని పలికెను. అంతఁ గారాగృహాధికారియాజ్ఞ చొప్పున సేవకులు శృంఖలాబంధంబులు దగిల్చికొనిపోయి కారాగృహంబున నుంచిరి. నాల్గుదినంబులును గడచెను. ఈ నాల్గుదినంబులును విజయసింహుం డన్న పానంబులను ముట్టలేదు. ఒకనాఁడైనను నిద్రింపలేదు. ఆ యపనింద బడబానలసదృశమై, రాత్రిం దినంబు లంతరాత్మను బరివేధించు చుండఁగా నాతనికి నిద్ర యెట్లువచ్చును. మృత్యువు కంటె లోకాపవాదమె యతని కెక్కుడు విచారము గల్గించు చుండెను. ఆ విజయసింహుండు తన బాహుపరాక్రమంబున వీర వారంబునే కాక సార్వభౌముంగూడ మెప్పించి ఖ్యాతి సంపాదింప నిశ్చయించివిజయనగరంబునకేతెంచెను. రణరంగంబునందుఉభయ పక్షంబులవారుశ్లాఘించునట్లుపోరి మరణంబునొందవలెనని యతని కోరిక, మహాఖ్యాతియు తమగు మృతినతఁడు కోరుకొను చుండఁగా, మహాపవాదయుతమగు మృతి యతనికి సంభవించె. తాఁ జేసిన యుపకారంబును మదినుంచి తిమ్మరుసు తనకుఁ బ్రాణదానంబు చేయునని యొక్కొకమా ఊహించు కొనుచుండెను. కాని యానాల్గుదినంబులలో వచ్చి దర్శనంబైనను నొసంగలేదు. అయినఁ దనవృత్తాంత మంతయు సాంతంబుగా విన్నవించినఁ దన యాపద తొలంగునని యెంచి రాజేంద్రునకు విన్నవింపవలయునని కారాగృహాధికారినిగోరుకొనెను. కానికర్కోటకునికంటెనుగ్రూరాత్ముండయిన కారాగృహాధికారి యతనివచనంబులను బెడఁజెవులం బెట్టె. రాయలసందర్శనంబు తనకు లభించినచోఁ దనచావును

దప్పించుకొనఁగల నను ధైర్యమతనికిఁగలదు. కానియది లభించు టెట్లు? సూర్యుని సందర్శనంబు లభించినఁ జలిబాధనశించును? కాని సాంద్రములగు మేఘంబులు ప్రతిబంధించు చుండఁగా నది లభించుటెట్లు? చలిబాధ తొలంగుటెట్లు? అందువలన విజయ సింహుండు మరణంబు నిశ్చయించు కొనియె. ఉన్నత వంశసంభవుండగు విజయసింహుండు తావృశమహాపవాదకే మిగుల దుఃఖించుచుండఁగా, మహావీరుల పవిత్ర కరవాలంబు లకు లక్ష్యము కాఁదగిన తన పవిత్రశరీరము, సాధారణముగాఁ బశువులను, బశుప్రాయులగు మానవాపసదులను ఖండించుచున్న కటికివాండ్రమలినఖడ్గంబుల కప్పగింపవలసి వచ్చెగదా యన్న క్రొత్త దుఃఖము నిరతిశయంబై విజృంభించె. దురతి క్రమమైన మహాపవాదముతోఁగూడిన మరణము నొందుటకే కాఁబోలును, నాఁడు ముక్తాంబారామరాజులు శత్రువులనుండి తప్పించి రని మిక్కిలి విచారింపసాగెను. ఆ సమయంబున ముక్తాంబసుంధర రూపము ప్రసన్నంబయి, మఱింత దుఃఖంబును గల్గించి, 'గోటి చుట్టుపై రోకటి పోటన్న' సామెతను సార్థక పఱిచెను. విజయ సింహుండు ముక్తాంబా సౌందర్యంబునకును, విలసత్కీర్తి కాంతా విలాసంబులకును బట్టుపడియె, స్వదేశంబును విడిచి యింతదూ రంబు వచ్చియుండెను. ఇట్లుండఁ దనమనోరథంబులు రెండును భగ్నంబులయ్యెను. ఏసుందరీమణి కమనీయరూపసంపద దనడెం దంబు నాకర్షించెనో, యేలలనాతిలకము బుద్ధిచాతుర్యము మృత్యు వునోటిలోఁబడిన తనప్రాణంబులం గాపాడెనో, యేకాంతాలలామ

చిన్నప్పటినుండియుఁ దన్నుఁ బోషించుచున్న ప్రహారేశ్వరుని వాక్యమునైన మతిక్రమించియవ్యాజానురాగంబును దనయందు నిల్పెనో యానవమోహనాంగిస్నేహఫల మనుభవింపకయే జీవనంబులు విడువవలసి వచ్చెను. ఏకీర్తికాంత తననిరుపమానవిలాస సంపదచేవిజయసింహునిదనవశంబుగావించుకొని దూరదేశంబునకు దెచ్చివిడిచిపెట్టెనో,శత్కీర్తి లలనావిలాసజనితానందమనుభవింపక యే యుసురులువిడువవలసివచ్చె. ఇంతియేకాక యతని ధవళకీర్తి కాంతకుఁ దుస్సహకళంకంబుగూడ సంభవించె. మఱియు దమ మనోహరవిభ్రమ సంపదలచే మోహింపఁజేసి యింతదూరంబుఁ గొనివచ్చిన యాముక్తాంబా కీర్తికాంతలలో నొకతెయగుముక్తాంబను దుష్టాత్ములచేతులలో వదలి యామె కపారదుఃఖమ్ముగలిగించియు, రెండవదియగు కీర్తికాంతకుదురపవాదకళంకముగలిగించియునీలోకంబునువిడిచిపరలోకమునకేగుట విజయసింహునకెంత కష్టంబుగానుండునో యెంతవిచారకరంబుగా నుండునో, యెవఁడు వర్ణింపఁగలఁడు? ఇట్లతండు విచారంబుల పాలయియుండఁగా నిరువురు పురుషులు కారాగృహంబును బ్రవేశించిరి. వారి యాకారంబులు మిక్కిలి మోటుగా నుండెను. దేహచ్ఛాయ యింగలంబుల మించుచుండెను. వారిచూపు లతిభయంకరములై క్రూరత్వంబును వెల్లడించుచుండెను. వారిచేతులందు భయంకర ఖడ్గంబులు ప్రకాశించుచుండెను. ఆఖడ్గములందు నెత్తుటిమచ్చలు దట్టముగానుండి చూచుట కసహ్యముగానుండెను. వారలను జూచినతోడనే విజయసింహుండు పులకితగాత్రుండయ్యెను.

అతనిమానసము సంచలింపఁజొచ్చె. భయంకరసంగ్రామములందు మహావీరుల కరవాలఘాతంబులకైనఁ జలింపని విజయసింహుని చిత్తమిప్పు డాకటికివాండ్రను జూచినతోడనే చలించినదని చెప్పుట చదువరులకు వింతగానుండును. శూరాగ్రేసరుఁడగు విజయసింహుండు శూరజనార్హమైన మరణమునకు జంకఁడు కాని రోత పుట్టించెడి నీచాత్ముల కరవాలంబుల కెరయగుటకు జంకక మానునా? అట్లువచ్చిన వారింజూచి విజయసింహుండు 'ఓరీ! మీరెవ్వరు? ఎందులకై వచ్చితిరి' అని ప్రశ్నించెను.

'ఏమయ్యా! మారూపంబులును, వేషంబులును జూచియు నడుగుదువేల? మేము చండాలురము. నీపాలిటి యమకింకరులము. నిన్నుఁ గొనిపోయి వధింప వచ్చినారము' అని మొదటివాఁడనెను.

క్రూరులలోఁ గూడఁ గొందఱు మంచివా రుందురు. ఆ వచ్చిన చండాలురలో మొదటివాఁడు మంచివాఁడు; రెండవ వాఁడు కఠోర హృదయుఁడు. వాఁడు విజయసింహుం జూచి 'ఏమయ్యా! అనంగసేన కుత్తరము వ్రాసిన ఫలం బిప్పు డనుభవింపుము. శరీరమును బాగుగాఁ బెంచితివి. చిరకాలంబునుండి పెంచిన రక్తమాంసంబుల చే గాఁబులుగులకును గృధ్రంబులకును సంతర్పణంబుచేసి కృతార్థుఁడ వగుము' అని వికటముగా నవ్వుచుఁ బలికెను.

ఈ వాక్యంబులు విజయసింహునిడెందంబున శూలంబుల వలె నాటెను. అంత నతఁడు సహింపలేక ,,ఛీ దురాత్మా! నోరు మూయుము. నీకత్తితో నాకుత్తుకను దెగవ్రేయుము. నీపని చేసి

కొనుము. అంతేకాని శూలములపోటులకంటె దుస్సహంబులగు కఱకుఁవచనంబులచే నన్ను హింసింపకుము పొమ్మని' కోపముతోఁ బల్కెను.

అది విని వాఁడు కోపోద్దీపితుఁడై రెండవవానిం జూచి 'ఒరీ! చింతజచ్చినను పులుపు చావలేదనునట్లు వీఁడు మృత్యుముఖంబులఁ బడ సిద్ధముగా నుండియుఁ గోపగర్వంబుల విడువకున్నాఁడు. త్వరపడుము నాకత్తి తొందర పడుచున్నది.' అని త్వరపెట్ట సాగెను.

అంత విజయసింహుండు మొదటివానిం జూచి 'ఒరీ! రాజదర్శనంబు నాకుఁ జేయింపఁ గలుగుదువా!' అని విచారాతిశయంబున యుక్తాయుక్త వివేకము గోల్పోయి పల్కెను.

మొదటివాఁ డందులకేమో చెప్పఁబోవుచుండగా రెండవవాఁ డడ్డుపడి, 'ఏమీ! నీకు రాజదర్శనంబు కావలెనా! ప్రేత రాజదర్శనంబుఁజేయింప సమర్థులముకాని రాజదర్శనంబు జేయింప సమర్థులముకాము. నాపైఁ జూపిన కోపంబునకు ఫలం బిప్పుడే యనుభవింపుము.' అని గేలిచేయ నారంభించెను.

విజయసింహుఁ డావాక్యంబులు విని వచ్చినకోపము నడఁచికొని 'ఓరీ! మీపని మీరుచేసికొనుఁ' డని పచించెను.

అంతఁ జండాలురు విజయసింహునివధ్యస్థానంబునకుఁ గొనిపోవుచుండిరి రాజవీథింబడి పోవుచున్నప్పుడు పౌరులు చూచి పలువిధంబుల భాషించుకొనఁజొచ్చిరి. కొందఱు విజయసింహుని దురవస్థకు మిగుల వగవ నారంభించిరి. మఱికొందఱు సంతసించిరి.

ఆసంతసించిన వారు విజయసింహుని పరాక్రమాదులను గాంచి యోర్వలేనివారే. ఆహా! కాలగతి యచింత్యము. తన బాహు పరాక్రమంబున శత్రు వీరుల పొంక మడంచి మంత్రివర్యుని ప్రాణంబులు గాపాడి యతనిచే మహాగౌరవ మందుచు, సకల జనమ్ముల శ్లాఘావచనంబులకు గుఱియగుచు, నేమార్గంబునంబడి మంత్రిమందిరంబున కరిగెనో, మల్లయుద్ధంబునాఁడుప్రోల్లసద్వీర్యం బునుఁ జూపి సాధుహృదయులగు వీరవరేణ్యుల స్తోత్రంబులకుఁ బాత్రుండై సార్వభౌమునివలన బహుమానములంది మర్గళభం బగురాజశకటము నధిరోహించి యసమాన గౌరవంబుతో నే మార్గంబున రాజమందిరంబున కరిగెనో, నేఁ డావీధింబడి విజయ సింహుఁడు కర్కశపాశబద్ధుండై యవనతవదనుండై యస్తమిత శరీరకాంతియై చండాల కరస్పర్శవలనఁ దన పవిత్రదేహంబును మలినంబు గావించుకొనుచు, జనంబులహృదయంబుల ద్రవింపం జేయుచు, వధ్యస్థానంబునకుఁ బోవుచుండెను. 'అత్యుచ్ఛ్రయః పతనహేతు' వనువచనంబు యదార్థంబుగదా! పున్నమనాఁడు చంద్రుండు షోడశకళాపరిపూర్ణుండగుట నాశనంబునకే కారణ మగుచున్నది. అల్లె మల్లయుద్ధము. విజయసింహుం డట్లు కొని పోఁబడుచున్నప్పు డతని యింద్రియంబు లేమియుఁజెప్పినట్లు విన లేదు. అధికారి లేనిసమయంబున సోమరిపోతులగు నుద్యోగస్థుల వలెఁ దమతమ కార్యంబులు చేయమానెను. ఇంద్రియంబులకు మనం బధిపతి. ఆ మనంబు లేకపోయినప్పు డొకయింద్రియం బైనను దనపని నెఱవేర్చుకొనదు. విజయసింహుని చిత్త మిప్పు

డింద్రియంబులతోఁ జేరక యాత్మతోఁ గలిసి తనపూర్వస్థితిం గూర్చియు,ముక్తాంబసుందరరూపంబుంగూర్చియు రాజమంత్రుల యుక్తాయుక్త వివేకవిహీనతం గూర్చియు నేమేమియో యోజించు కొనుచుండెను. మనంబు తమ సన్నిధానంబున లేనిమాత్రమునఁ గన్నులును, జెవులును, దక్కిన జ్ఞానేంద్రియంబులును జ్ఞానసంపాదకములుకాక స్తబ్ధంబులై యుండెను. కర్మేంద్రియంబులింతకు బూర్వమె బంధింపఁ బడియె. ఆలోచింప నిప్పు డింద్రియంబు లుడుగుండుటయే విజయసింహుని కుపకరించినది. కన్నులు నిమీలితంబులగుటచేఁ దనకుఁ బరిచితులైన పిన్నపెద్దలంజూచి కాని, శత్రువులనుజూచికాని సిగ్గుపడి మఱింతవిచారమునొంద నవసరంబులేదు. చెవులు శబ్దంబును గ్రహింపక పోవుటచేఁ దన్నుఁ జుట్టుముట్టి వెంబడించి వచ్చుచున్న పౌరుల నిందావాక్యంబులు విననవసరంబులేదు. ఘ్రాణేంద్రియము తనపని మానుటచేఁ జండాలురనుండి వెలువడుచున్న దుర్గంధంబును గ్రహింప నవసరంబు లేకపోయెను. త్వగింద్రియము తనపని మానుటచే సంతత మపవిత్రములైన యా దురాత్ములకరంబులు సోకుచున్నను, గర్కశపాశంబు లంగంబుల నలియఁ జేయుచున్నను, బాధచెంద నవసరంబు లేకపోయెను. ఇట్లింద్రియజ్ఞానంబులేక నిర్జీవునివలెఁ గన్పట్టుచున్న విజయసింహుని చండాలురు వధ్యస్థానంబునకుఁ గొనిపోయి యచ్చట నుంచిరి. ఆ స్థానంబునఁ గొన్ని యున్నత వృక్షము లుండెను. వధ్యస్థానంబునఁ ఖండితులైనవారి మాంసాదులను దృప్తిదీఱ భక్షించి వర్తించెడి గృధ్రాదుల కావృక్షం

బులు విశ్రాంతిస్థానంబులై యుండెను. అచ్చట మానవులకంకా ళంబులును, నానా విధాస్థి సమూహంబులును బడియుండెను. కొన్నిస్థలములందు రాబందులుగులు గతదినంబునఁ జంపఁబడిన యపరాధుల శవములను బొడిచికొని తినుచుండెను. కుళ్ళినశవం బుల నుండి వెల్వడిన దుర్గంధంబు నలుగడల వ్యాపించుచుండెను. ఆ స్థలంబెల్లు భీభత్సజనకంబై యున్నను బౌరులు లక్ష్య పెట్టక, పోయి చండాలురకంటె ముందుగనే యాస్థలంబును జేరిరి. మఱికొందఱు స్థలంబు చాలమిచే నావృక్షంబు లధిరోహించి వృక్షచరసామ్యమును వెల్లడించిరి. అచ్చటికి వచ్చినజనంబులలో నెవ్వరును మరలిపోలేదు. కొందఱాసక్త ములు విజయసింహునట్టిదశలో విడిచి పోవ నిష్టపడకుండిరి. మఱి కొందఱు విజయసింహుని మరణమును గన్నులారఁ గాం చవలెనని కోరి యచ్చోటును విడిచి పోవ నిష్టపడ కుండిరి. ముక్తాంబకుఁ బ్రియుఁడైన విజయసింహ మరణవార్తను గొనిపోవు టకై వచ్చి రుద్రదేవుఁడొకప్రక్క గూర్చుండి యుండెను. పిచ్చి వాఁడుకూడ బాలకులచేఁ బరివేష్టితుండై యొక మూలఁ గూ ర్చుండెను. చూడవచ్చిన జనంబు లిట్లు భవిష్య త్కార్యంబున కువ్విళ్లూరుచుండఁ జండాలురు విజయసింహుని వధ్యశిలచెంతకుఁ గొనిపోయిరి. ఆశిల రక్తధారలచేఁ దడిసి చూపరకు భయము కలిగించుచుండెను. కన్నులకు మిఱుమిట్లు కొలుపుచు రక్తమింకను నాశిలయందు ప్రకాశించుచునే యుండెను. విజయసింహుం డాస్థ లంబు చేరఁగానే కన్నులను విప్పెను. విప్పినంతనే యతనినేత్రం

బులకు గోచరంబైన దావధ్యశిలయే. అంత విజయ సిం
హుండు వెంటనే కన్నులను మూసికొని తన దుష్కృతంబుల
శమింపఁజేయు భగవంతునిఁ బ్రార్థించు చుండెను. అప్పుడు
చండాలు రతనిం గాంచి ' నీ ధ్యానంబయ్యెనా? ఇఁక
మాపని మేము చేసికొన వచ్చునా? ' అని యడిగిరి.
విజయసింహుండు నిమీలితనేత్రుండై మాటాడక చేసికొన
వచ్చునని చేసన్న చేసెను. అంత నాకటికవాండ్రతని వధ్య
శిల యందుంచిరి. వారిలోఁ బెద్దవాఁడు విజయసింహునిఁ గదల
కుండఁ బట్టుకొనెను. రెండవవాఁడు నిశితకరవాలంబును దాల్చి
కాలకింకరునివలెఁ జూపఱకు భయము గొల్పుచు, నతనితలవైపు
నిలువఁబడెను. జనంబులు హాహాకారంబులు చేయుచు నొకరి
నొకరు త్రోసికొనుచు నక్కార్యంబును జూడఁ ద్రొక్కులాడు
చుండిరి. రెండవ చండాలుఁడు కత్తి నొకమాఱు మీఁదికెత్తుచు
మగుడఁ గ్రిందికి దించుచు, లక్ష్యము సరిచేసి కొనుచుండెను. విజ
యసింహునిస్థితి చూచి నిర్జీవుఁ డయ్యెనని భావించిరి. ఇక నాల
స్యము చేయవలదు. ఖడింపుము. ఖడింపుము. అనునినాద మా
మందిలోనుండి వెడలివచ్చెను. అట్లుపల్కిన వాఁ డాపిచ్చివాఁడే.
'నీప్రాణంబులఁ గాపాడినవాని • మరణంబునకు నీవేల త్వరపడెద'
వని యెవ్వరైన నడిగిననేమియు నెఱుంగనట్లు పకపక నవ్వుచుం
డెను. చండాలుఁ డావాక్యంబులు విని తమయధికారియే యట్లు
పల్కుచున్నాఁడేమోయని తలంచి ఖండించుటకుఁ ద్వరపడుచు ఖడ్గ
యుతంబగుహస్తంబును బైకెత్తెను.అంతట 'చంపవద్దు.చంపవద్దు'

అనెడి గంభీరనినాదమొకటివీతెంచెను. జనంబులందఱును నావంకఁ జూడసాగిరి. చండాలుఁడు మీఁదికెత్తిన చేతిని గ్రిందికి దించి చూచుచుండెను. ఆనినాదంబు తోడనే యొకమహాపురుషుండు జనంబు నొత్తిగించుకొని వచ్చి వధ్యశిలను సమీపించెను. ఆ మహాపురుషుఁడు సార్వభౌముని ప్రధానమంత్రియగు తిమ్మరుసే. అతనింజూచి జనంబు లచ్చెరువొందిరి. అప్పుడమ్మంత్రిపుంగవుండు విజయసింహుని బంధనంబుల వదల్ప నానతిచ్చెను. తోడనే రాజ భటులువచ్చి బంధనంబులు వదల్చిరి. విజయసింహుండప్పుడు కన్నులఁ దెఱచిచూడఁ దనపాలిట భాగ్యదేవతవలె మంత్రిపుంగ వుండు ప్రత్యక్షంబయ్యె. అది స్వప్నవృత్తాంతముగా భావించి తెలతెలపోయి చూచుచుండఁగా మంత్రివరుం డతని లేవనెత్తి తనవెంటవచ్చిన శకటంబున నాసీనుంగావించి రాజమందిరాభి ముఖుండై పోయెను. అంత నచ్చటిజనంబులు విజయసింహుని యదృష్టంబునెన్నుచుఁ బోయిరి, కొందఱు నిర్వాణోన్ముఖం బయినదీపము మగుడ నఖండకాంతితోఁ బ్రజ్వలింప సాగెనని వచించిరి. మఱికొందఱు మహావాయూన్మూలితంబయిన బాలర సాలము మగుడ స్థాపితంబయ్యెనని సంతసించిరి అపరాధియగు విజయసింహునప్పటి కప్పుడే తప్పింపఁ గారణ మేమోయని తెలిసి కొనఁ ద్రొక్కులాడు చుండిరి. రుద్రదేవుండు విచారపర్వీత హృద యుఁడై వెడలిపోయెను. పిచ్చివానికి మొదటనున్న సంతస మంతయును నంతర్థానంబు చెందెను. బాలురు పిలుచుచున్నను వినక

చేతికిచిక్కినపిట్ట యెగిరిపోయెనని విచారించుచు పిచ్చివాఁ డట నుండి పారిపోయెను.

---

## పదునారవ ప్రకరణము

### భవిష్యత్కార్యాలోచనము

కం. హితబోధ చేయుదురు స్నే
హితులకు హితులెప్పుడు దాని నెలమిని విని స
న్మతి కృతకృత్యుండగుదు
ర్మతి వినక స్వకార్యమును జెఱచుకొను చుండున్.

ఆకాశవాణి

ఆనెగొందిదుర్గంబునఁ బ్రహరేశ్వర పాత్రుండు తన మందిరంబునఁగూర్చుండి యేదియో యోజించుకొనుచుండఁగాఁ బిచ్చివాఁడచ్చటికేతెంచెను. అతఁ డాపిచ్చివానిఁ జూచి లేచి గౌరవించి యుచితాసనంబునఁ గూర్చుండఁ బెట్టెను. దుర్గరక్షకభటులు సర్వదా రక్షించుచుండుటచేఁ బ్రహరేశ్వరుని నితరులు చూడ వలనుపడకుండెను. అందుచే రామయమంత్రి పిచ్చివాని వేషంబునఁ బోవలసివచ్చెను. రామయమంత్రి యట్లు ప్రవేశించి ప్రహరేశ్వరున కిట్లనియె. "ఓప్రహరేశ్వరా! నాకనుచరులయి వర్తించువారి నాలుక లతిచంచలంబులగుటచే మనరహస్యంబులు బైటఁబడుచున్నవి. నాప్రజ్ఞయంతయును భ్రష్టమగుచున్నది. నా

ప్రయత్నమంతయును వ్యర్థమగుచున్నది. నాస్నేహితులు నా యాజ్ఞ నతిక్రమించి ఫలోన్ముఖంబులయిన యుపాయమహీరుహం బులను దమ రసనాకుఠారంబులచే మొదలంట ఖండించివైచిరి. ఇఁక నేమి చేయుదును? నేను బలువేషములువేసి శత్రువుల కను బ్రామి కార్యంబులునిర్వహించుచుండ మనమిత్రుల తెల్వితక్కువ చే సమస్త మస్తంగతమగుచున్నది. మృత్యువునోటిలోఁబడిన విజయసింహుండు మఁగుడ్రబదికెను. తన్మరణంబుకై నాచేసిన ప్రయత్నము భగవంతునికే తెలియును. రుద్రదేవునినిమిత్త మింత పని చేసితిని. అదియంతయును విఫలమయ్యెను. అని విచారంబు తోఁ బలికెను.

‘ అమాత్యవరా? మనలో నట్టివిశ్వాసహీను డెవ్వఁడు గలండు? మన స్నేహితులు ప్రాణంబులైన నర్పింతురుకాని రహస్యంబుల బైటఁ బెట్టరని నిశ్చయముగాఁ జెప్పఁగలను. ఇట్లుండ మనరహస్యములు శత్రువుల కెట్లుతెలిసినవో యని మిగులవిచారించుచున్నాను. మీ కెవ్వరియం దనుమానమున్న దో తెలియఁ జెప్పుడు. ’ అని ప్రహరేశ్వరుం డడిగెను.

‘ ప్రహరేశ్వరా! ఎంత మాటాడితివి. నీ హృదయంబునే నెఱుంగనా! నీ వట్టిపని చేయుదువని యన నాకు నో రెట్లువచ్చు? నీవట్టివాడవు కావు. తక్కినవారును నట్టివారు కారు. కాని ము క్తాంబవలన నీపని జరిగినదేమోయని యనుమాన మగుచున్నది.’ అని రామయమంత్రి పలికెను.

‘ మంత్రిపుంగవా! ఈ విషయములో ముక్తాంబ నిందు

రాలు కాదని దృఢంబుగాఁ జెప్పఁగలను. మొన్నటిసభకు ము క్తాంబ రాలేదు. ముక్తాంబ కాసమాచార మెట్లు తెలియును? నావచనము మీకు విశ్వాసపాత్రమగునేని నా ప్రమాణమందు మీకు నమ్మిక ముండునేని ముక్తాంబతో నీవిషయము ప్రసంగింప లేదని యీశ్వరసాక్షిగాఁ జెప్పుచున్నాను. ఇతరు లెవ్వరును జెప్పుట కవకాశము చాలదు. ఇట్లుండ నాఁటి సభావృత్తాంతము ను ముక్తాంబ యెట్లు తెలిసికో గలుగును. అది యామెకుఁ దెలి యనప్పుడు పరుల కెట్లుదెలుపఁగలదు. ’ అని ప్రహారేశ్వరుండు నమ్మఁ బలికెను.

‘ మిత్రమా! నీవిషయమై నాకు సుంతేనియు ననుమా నంబులేదు. నీవు కటకటం బడకుము. రుద్రదేవుం డామెను సంద ర్శింపఁబోయి యుండును. మహామతిమంతురాలగు ముక్తాంబ తనచాతుర్యంబున నతని మోసపుచ్చి యీ రహస్యంబును దెలిసికొని యుండును. మన రహస్యంబులు శత్రువులపాలఁ బడు ట కింతకుఁదప్ప వేరువిధంబులేదు. మన మెంతబోధించినను వినక రుద్రదేవుం డెట్లుచేసెనో చూడుము. రుద్రదేవుండే తన కార్యం బును సమయించుకొనియె. ముక్తాంబ విజయసింహుని దక్క వేఱొకని వరించునట్లు తోఁచకున్నది. అయినను వదలక రుద్ర దేవునికార్యంబునిమిత్తము ప్రయత్నింతము. అప్పటికిని గొన సాగనిచో నతని యదృష్టము. మన మేమి చేయుదుము? ఇప్పుడు రుద్రదేవుని నిందించినను జెడినకార్యంబు బాగుపడదు. మనమట్లొనర్చిన నతండు మొగంబు ముడుచుకొని భవిష్యత్కా

ర్యంబులందు నిరుత్సాహుం డగును. అదియును మనకు నష్టమే కావునఁ బ్రస్తుతమతనితో నీప్రసంగము త్రవ్వవలదు. రెండుకార్యంబులు నెఱవేర్చుకొన నేనిచ్చటికి వచ్చితిని. అం దొకటి యనంగసేనను దప్పించికొనిపోవుట. రెండవది నిన్నును ముక్తాంబను నిరపాయంబుగా రాయచూరునకుఁ జేర్చుట. తరువాత కార్యంబు లన్నియును నానుషంగికములు. నెరవేరినసంతోషము. నెఱవేఱకున్న విచారంబులేదు. అందుచే మంత్రిబ్రదికినను, విజయసింహుండు బ్రదికినను, మనభవిష్యత్కార్యంబున కొకనష్టములేదు. మన ప్రయాసముమాత్రమే వ్యర్థమైనది. శత్రువులకాపాటిదుఃఖము గల్గించుటచే నదియైన వ్యర్థముకాదు. ప్రధానకార్యంబులు రెఱడింటిలోనుమొదటిదిసానుకూలముగానెరవేరినది. ఇఁక నిప్పుడు రెండవకార్యము నెరవేర్పవలసియున్నది. ఇఁక నే నీ పిచ్చివేషంబుతో నొక ఘనకార్యము చేయవలసియున్నది. నేనిచ్చటఁ జిరకాల ముండవలను పడదు. విజయసింహుండు బ్రదికెను. కాన యుంగరములవృత్తాంత మందరికిని దెల్లమగును. అందుచే నన్నుఁ గపటినిగా భావించి పట్టుకొని శిక్షింతురు. ఇది వఱకే మంత్రిపుంగవుండు నాపై నొక కన్ను వేసియున్నాఁడు. ఈవృత్తాంతము తెలిసినపిమ్మట క్షణకాలములో నన్ను బంధింపకమానఁడు. ఈదినముననే మిమ్ముఁ దీసికొనిపోయెదను. మీరు సంసిద్ధులరై యుండుఁడు ' అని రామయమంత్రి సర్వమును వచించెను.

' మంత్రివర్యా! అది సత్యమే. విజయసింహుని బంధిం

చినప్పటినుండియు మంత్రి నాయం దనుమానపడుచున్నట్లు చూ చాయగాఁ దెలియుచున్నది. అప్పటినుండియును బెక్కండ్రభటు లను గాపుంచి నా కితరులతో సంబంధ ముండకుండునట్లు చేయు చున్నాఁడు. ఆభటులును నహర్నిశలం దొకనిముసంబైన నేమ అక కాచుచున్నారు. వారికనుబ్రామిమమ్ముఁగొనిపోవుట బహు కష్టసాధ్యమని తోఁచెడిని.' అని ప్రహారేశ్వరుండు సందేహిం చుచుఁ బలికెను.

'ప్రహారేశ్వరా' అట్లు సందేహింపవలసిన యవసరంబు లేదు. నాబుద్ధి విశేషంబుచే మిమ్ము సులభంబుగా దాఁటించి పోఁగలను. అందులకొకయుపాయ మాలోచించి యున్నాను. దాని నెవ్వరికిం జెప్పను. అట్లంటినని నాపైఁ గోప ముంచకుము.' అని రామయమంత్రి పలికెను.

'మంత్రివర్యా! తమ రట్లుపలుకుటచే నామనంబు విచార మగ్న మగుచున్నది. నీ వన్నదానిలోఁ దప్పేమి యున్నది? నాకుఁ గోపంబేల కలుగును? మీరు మీయత్నంబున నుండుఁడు. మేము ప్రయాణోన్ముఖుల మయి యుందుము' అని ప్రహారేశ్వరుండు పలికెను.

'అట్లే చేయవచ్చును! కాని ముక్తాంబ నొక్కమారిచ్చ టికిఁ దోడ్కొని రమ్ము. ఆమెతోఁ గొంత సంభాషింప వలసి యున్నది.' అని పలుక విని ప్రహారేశ్వరుం డేగి యామెను దోడ్కొనివచ్చి కార్యాంతరాసక్తుఁడై పైకేగెను. అప్పుడు ముక్తాంబ 'మంత్రివర్యా! రాజకీయవ్యవహారంబు లె ట్లున్నవి?

మీసందర్శనంబు లేకపోవుటచే నేమియుఁ దెలియలేదు. ఇప్పుడు చేయవలసిన పనియేమి?' అని యడిగెను.

'అమ్మా! ప్రయత్నంబులు ఫలోన్ముఖంబు లయ్యు విఫలంబు లయ్యెను. అయిన వానివలన మనభవిష్యత్కార్యంబులకుఁ జెఱుపులేదు' అని మంత్రి పలికెను.

'మంత్రివర్యా! ఏప్రయత్నంబులు విఫలంబు లయ్యె? అనంగసేనం దప్పించితిరి. గదా? విజయసింహుండు మృతినొందెను గదా? ఇంక నేమి విఫలంబయ్యె.' అని ముక్తాంబ పలికెను.

రామయమంత్రి యావాక్యంబులు విని విజయసింహుండు బ్రదికి యున్నట్లు తెలిసియు విజయసింహరక్షణోపాయంబునకు దా నేమియు సాయపడనట్లు తెలియఁ జేయుటకే యట్లు పలుకుచున్నదని గ్రహించినను నామె కందుల కేమియును జెప్పదలంచుకొనలేదు. రాజకుమారిక మనంబు విచారంబు చెందుట తప్ప వేరొక్క లాభంబు. లేదని యతం డెఱుంగును. 'అమ్మా! విజయసింహుండుచావలేదు. కొందఱిపుణ్యాత్ముల దయవలనజీవించినాఁడు. అతఁడు బ్రతికిన నేమి? మృతిదొందిన నేమి? మన భవిష్యత్కార్యంబునకును, నతనికిని సంబంధంబు లేదు. మన మీదినంబుననే యీపురంబు విడిచి పోవలయును. కాన నీవు ప్రయాణోన్ముఖురాలవై సిద్ధముగా నుండుము. అని రామయ మంత్రి పలికెను.

అది విని ముక్తాంబ సందేహించు చుండఁగాఁజూచి రామయమంత్రి యామెంజూచి, 'అమ్మా! నీవట్లు విచారించుచుండిన

లాభంబులేదు. మన మిటనుండి శీఘ్రంబుగాఁ గదలి పోకపోయితి మేని మన ప్రాణంబులు నిలుచుట దుర్ఘటము. మీకు రాజద్రోహులతో సంబంధంబు గలదని తిమ్మరు సెరుంగును. నే నొక నాఁడు పిచ్చివానివేషంబున నతని చెంతనుండఁగా, 'ప్రహరేశ్వరుండు రాజద్రోహులలో మొదటివాఁడే' యని స్పష్టముగాఁ జెప్పెను. ప్రహరేశ్వరుండిటనుండిన చచ్చుట నిశ్చయంబు. స్త్రీవి కదాయని కనికరించి నిన్నుఁ జంపక విడిచినను, నీకుఁ దొంటిగౌరవంబు గలుగనేరదు. గౌరవహీనంబగు బ్రదుకు వ్యర్థమని నీకుఁ దెలిసియే యున్నది. ఇఁక సామంబున రాజ్యంబు లభించుట స్వప్న వృత్తాంతము వంటిది. ప్రహరేశ్వరుండు తప్పించికొనిపోయి ప్రాణంబులు కాపాడికొన నిశ్చయించి యున్నాడు. చిన్నతనంబు నుండియును నిన్నుఁ బెంచి పెద్దచేసిన ప్రహరేశ్వరు నిప్పట్టున విడిచి పెట్టుట యుక్తముగాఁ దోఁపదు. నీకు సంరక్షకుఁడై యుండిన ప్రహరేశ్వరుండు లేకపోయిన నీ విట నిరపాయురాలవై యుండఁజాలవు. శత్రువుల గెల్చి నీకు రాజ్యం బప్పగించి నారాజభక్తిని దెల్లము చేసికోవలెనని యుంటి. నీ విచ్చట శత్రుదుర్గంబునఁ బెక్కుబాధ లనుభవించుచుండ, నాకోరిక యెట్లుసఫల మగును. ఘనకార్యంబు లాచరించుటకు మాకుగాళ్ళు సేతు లెట్లాడును? కావున నీవుతప్పక మాతోరావలయును. మాకుఁ బ్రోత్సాహము గల్గించుచుండుము. నీసందర్శనంబు మాకు లభించుచుండినంజాలును. ఎంతటికార్యంబులనైన నవలీల సఫలము కావింతుము.' అని

లాభ నష్టంబులును, హితాహితంబులును దెల్ల మగునట్లు బోధించి చెప్పెను.

ముక్తాంబయుక్తాయుక్త వివేకనిధానురాలు. రామయమంత్రి చెప్పుచున్న ప్రతివచనంబును సావధానచిత్తురాలై విని విమర్శించి తనకుఁ గలలాభనష్టంబులంగూర్చి చర్చింప నారంభించెను. రామయమంత్రి తమకుటుంబమునం దవ్యాజ ప్రేమము గలిగి వర్తించు చున్నట్లును, దానుపేక్షించుచున్నను, దన్నుఁ బ్రోత్సాహించుచు, దననిమిత్తము రాజసంపాదనముచేయగా నతఁడు తనతపంబును ధారవోయు చున్నట్లును దృఢవిశ్వాసమువహించి యుండెను. అతండు తలంచిన దెంత ఘనకార్య మైనను నిరుపమాన ప్రతిభావిశేషముచేనవలీలనెఱవేర్పఁగలండనెడి నమ్మకమామెకెక్కుడుగానుండెను. రామయమంత్రిపన్నెడియుపాయంబులకు దాఁబ్రతీకారముచేసివానివిఫలముచేసినను నతఁడెదయందుసుంతేనియుం గినుక వహింపక తనశ్రేయంబు నిమిత్తమే కష్టపడుచున్నాఁడనియు, నట్టిమంత్రి వచనంబును నతిక్రమించి కృతఘ్నురాలను గాఁ గూడదనియు నామె నిశ్చయించుకొనెను. రామయమంత్రి బుద్ధిబలంబువలనఁ దనకు రాజ్యంబు లభించినచో నప్పుడు దనయం దవ్యాజానురాగంబుంచి వర్తించు విజయసింహుని రప్పించుకొని వివాహమాడవచ్చుననియును, నొకవేళ నావిధంబున రాజ్యంబు సంపాదితము కాకపోయినచోఁ జక్రవర్తిదయకుఁ బాత్రుఁడై యున్న విజయసింహుని మూలంబుననఁగాని యాచన వలనంగాని సంపాదించి యభీష్టంబు నెఱవేర్చుకొన వచ్చుననియు

భావించుకొనెను. తానానగొందినుండి తప్పించుకొని పోవుటవలన రాయ లాగ్రహాయత్తచిత్తుం డయినను దన బుద్ధిచాతుర్యంబు చేతను, సామవచనంబులచేతను, బ్రసన్నునిఁగాఁ జేసికోవచ్చునన్న ధైర్యం బామెకుఁగలదు. కావున రామయమంత్రింజూచి 'అమాత్యపుంగవా! నీవాక్యంబులు నా కానందంబును గొల్పినవి. నీ హితబోధకు మిగుల సంతసించితిని. ఇట్లు కార్యంబులందు లాభనష్టవిచారంబు సల్పి రాజకుటుంబమునం దమితభక్తిగలిగి, స్వార్థత్యాగియై ప్రవర్తించు మంత్రిసత్తముండు మఱియొకం డేడీ? నీవలె హితబోధచేయు నుత్తముఁడు లభించుట యసంభవము. నీవంటి మహనీయుఁడు నాకు మంత్రిగా లభించుట నా పూర్వపుణ్యమే సుమీ? ఇఁక నీవాక్యంబు నతిక్రమింపఁ జాలను. నానిమిత్తము సర్వకాలంబులందును శ్రమపడుచున్న నీ హితవాక్యంబును బెడచెవులఁ బెట్టి చెడునట్టి యవివేకురాలను గాను. నీవేమి చేయుమందువో దానిఁ జేసెదను. రక్షకభటులనుండి తప్పించుకొనిపోవు నుపాయంబు నాలోచించితివా?' అని యడిగెను.

'రాజపుత్రీ! ఆలోచించితిని. మిమ్ముల నిరపాయంబుగా దాఁటించికొనిపోఁ గలుగుదును. మీరు ప్రయాణోన్ముఖులరై యుండుఁడు.' అని చెప్పియామె నొప్పించి పంపి తానాస్థలంబు నుండి కదలిపోయెను.

---

## పదునేడవ ప్రకరణము.



### లంకా దహనము

ఆనెగొందిపురంబున నొకనాఁటిసాయంకాలంబునఁ బిచ్చి వాఁడు సంచరించుచుండెను. దుడుకుపను లొనర్చెడి గడుసు పిల్లలు వానింజూచి సమీపించి చుట్టుముట్టి నానావిధంబుల బాధింపఁ జొచ్చిరి. అయినను బిచ్చివాఁడు కోపింపక పకపకనవ్వుచు మఱింత ప్రోత్సాహము గల్గించుచుండెను. అందులకాపిల్లలు సంతసించుచుఁ గ్రొత్తనీటికిఁ జెలరేగిన చేపలవలె విజృంభించి పెంకితనము చేయుచుండిరి. పిచ్చివాఁడు వారు పెట్టు బాధలను సహించి యొక వీధికొన కేగునప్పటికి వందలకొలంది బాలకులు చేరి తన్ననుసరించి బాధింపనారంభించిరి. సామాన్యపుబాధను వాఁడు సహించుకొనుచుండెను. కాని దుస్సహమగునప్పుడు పెద్దకోపము వహించి, గంభీరముగా ధ్వనిచేయుచు, ' ఓరీ! దురాత్ములారా! నే నెవండనో యెఱుఁగుదురా ?మహాపరాక్రమశాలియైన హనుమంతుఁడను, మీరందఱును రాక్షసులరు. హనుమంతుండు రాక్షసుల నెట్లు పాదిపచ్చడి చేయునో, యట్లె మిమ్మును నలియఁజేసెదను. ' అని కేకలువేయ నారంభించెను. ఆవచనంబులు విని మొదటబాలకులు భయపడిరి. కాని వాఁడు వెంటనే నవ్వుటచే నాకోపము నటనమే కానివేఱు కాదని తలంచి యెప్పటిసితి నవలంబించి యనుసరించి పోఁ జొచ్చిరి. ఆపిచ్చివాఁ

డామార్గంబున బోయి పైనమఠంబున కరిగి యచ్చట గూర్చుండెను. బాలకు లతని వెంబడించిపోయి యతనిఁ జుట్టును గూర్చుండిరి. ఆ బాలకులలో గొందరతనిఁ జేరఁబడి కూర్చుండిరి. కొందఱతని కేశపాశంబును విప్పి చక్కఁ జేయుచుండిరి. కొంద ఱతని చెవులు పట్టుకొని యాడించుచుండిరి. ఆపిచ్చివాఁ డాపిల్లలబాధ సహింపలేక వెనుకటి వాక్యంబులను మఱొక్కసారి పలికెను. అది విని యొకపిల్లవాఁ డతని జూచి ' నీవాంజనేయుండ వయిన నీకు వాలమేది ? అని పల్కెను. ఆ డనే మఱియొక బాలుఁడు లేచి యాసమీపంబునఁ బడియున్న యొకకాష్ఠంబును దెచ్చి ' యిదే యితని వాల ' మని చెప్పి మొల కంటఁగట్టెను. ఆపిచ్చివాఁ డా కఱ్ఱను బట్టుకొని ' ఇదిగో నావాలము ఇదిగో నావాలము నే నిశ్చయంబుగ నాంజనేయుండనే. మీరు రాక్షసులరు. రాక్షసులు హనుమంతుని బాధపెట్టినప్పు డతఁడు తన మహావాలంబుతో వారినిగొట్టువాఁ'డనిచెప్పి బాధపెట్టినవారి నొక్కొక్కదెబ్బకొట్ట నారంభించెను. బాలకు లది చూచి సహింపలేక మేము రాక్షసుల మైనచో నీవు హనుమంతుఁడవైనచో, రాక్షసులు హనుమంతుని బంధించిరి. కాన నిన్ను మేము బంధించెద మని చెప్పి కొన్ని త్రాళ్ళను, సంపాదించి కట్టివైచిరి. ఆ పిచ్చివాఁడు బాలురుకట్టిన కట్లు త్రెంపుకొనునంతటి శక్తి కలవాఁడైనను దప్పించుకొనఁ బ్రయత్నింపఁడాయెను. పూర్వ మాంజనేయుఁడు రాక్షసుల జయింప శక్తి గలవాఁడైనను దన ప్రభావంబు చూపక కొంతసేపు వారి నిందావాక్యంబులను, పిడికిటిపోటులను సహింపలేదా?

అల్లె పిచ్చివాఁడును సహించెను. ఆపిల్ల లేమిచేయుచున్నను మాటలాడలేదు. అంత వారిలో నొకబాలుఁడు, 'మన మురా క్షసులమఁట. ఇతఁ డాంజనేయుఁడంట. పూర్వము రాక్షసులు హనుమంతునితోఁకకు ని ప్పంటించిరి. మనముగూడ నితనితో కకు నిప్పంటించి జ్వలింపఁజేయవలదా?' అని పలికెను. అదివిని బాలులందరును బాగు బాగు అని యతని వచనంబును మెచ్చు కొనసాగిరి. పిచ్చివాఁడును నప్పని యొనరింపఁ బ్రోత్సాహిం చెను. అంతలోఁ గొందరుబాలురు తమతమగృహంబులకు బర్విడి పెద్దవాండ్రు చూడకుండ జింపిరిగుడ్డలు నూనెలో ముంచి యతి రయంబునఁ దీసికొనివచ్చిరి. పిల్లలు కొందఱు గుడ్డలు తెచ్చు చుండ నింకఁ గొందరు నేర్పుతో నాగుడ్డలను నతనికి వాలభూత మయిన యావక్రకాష్ఠంబునకుఁ జుట్టుచుండిరి. ఇప్పని యవలీల ముగిసెను. ఆసమయంబున నొక పిల్లవాఁ డగ్నిని గొనివచ్చెను. వారిదిమంటచేసి యాకాష్ఠమునకంటించిరి. అదిభయంకరజ్వాలల లో మండఁజొచ్చెను. పూర్వముహనుమంతుని వాలము సీతా దేవి యనుగ్రహంబువలనఁ దహింపఁబడలేదఁట. నేఁడితనివాలం బును దహింపఁబడకుండఁ బ్రార్థించుటకు సీతాదేవివంటి సాధ్వీ మణి లేకపోవుటచే వాలము దహింపఁబడుచుండినను, వానికి నుంతేనియు బాధగలుగలేదు. సామాన్యంబుగా బాలకులు తమ చాతుర్యంబు బెద్దలకుఁజూపిఁ మెప్పొందవలయు నని తలంచుచుం దురు. కావునఁ బిచ్చివాని నూరేగించికొనిరి. పిచ్చివాఁడు వారల ప్రయత్నము తన కనుకూలముగా నుండుటచే మిగుల సంతసిం

చెను. అప్పటికి చీఁకటులు లోకంబు నావరించుచుండెను. శైవ మతమునొద్ద బాలకులు తమపని నెఱవేర్చుచుండఁగా మేఘంబు లాకసంబున గుమిగూడి తమపని చేసికొనుచుండెను. గడియలో కజ్జలకాంతివంటి జలదంబులు గగనంబునఁ గప్పి చీఁకటుల నభివర్ధించుచుండెను. మహామారుతంబును వీచుటఁ బ్రారంభించెను. ఆసమయంబును జూచి పిచ్చివాఁ డమితానందంబు నొంది తనపని తప్పక నెఱవేఱునని సంతసించుచుండెను. బాలకులు తమకార్యంబునకు విఘ్నముకలుగునట్లు వర్షము వచ్చునేమో యని భయపడుచు త్వరపడి పురంబునుఁ బ్రవేశించిరి. కొందఱు పిచ్చివానిం బట్టుకొనిరి. మఱికొందఱు చప్పట్లుగొట్టుచుఁ బకపక నవ్వుచు వెను వెంట వచ్చుచుండిరి. వారొకవీధిం బడిపోవ సాగిరి. మహామారుతముకాలంబునవిజృంభించియతనివాలంబునుబ్రజ్వలింపఁజేయఁ జొచ్చెను. మంటలు నానాముఖంబుల వ్యాపింపఁజొచ్చెను. ఆవింతనుజూచి పెద్దవాండ్రు బాలకులబుద్ధికుశలత కానందించి మెచ్చుకొనసాగిరి. వారట్లు నడిచి యావీధికొన కేగిరి. ఆవీధి యాపురంబున కెగుదలగా నుండెను. అందు సామాన్యులయిండ్లును దుర్గరక్షక సైనికులమందిరంబులునుఁ గలవు. పిచ్చివాఁ డచ్చటికి వచ్చి నలువంకలు చూచి మనమునం దేమియో యోజించుకొనెను. ఆపిల్లలు మఱియొక వీధికిఁగొనిపో నెంచుచుండిరి. అంత వాఁడు వాలభూతమగు నాకాష్ఠమును నొకమారు కదలించెను. తోడనే యదివఱకుఁ గాలియున్న గుడ్డచీలికలు మండుచు దట్టముగా రాలఁజొచ్చెను. అవియాబాలకులపైఁబడి కట్టువస్త్రంబుల

భస్మముచేయఁ దొడంగెను. అందుచేనాబాలకులు పిచ్చివానివదలి పర్విడిరి. ఆపిచ్చివాఁడు 'ఓరీ! బాలకులారా! మీరు పెట్టినబాధలకువడ్డీతోఁగూడనప్పగించెదను జూడుం'డనిపైకి లంఘించి యొక్కొక్కయింటికే నిప్పంటింప నారంభించెను. క్షణకాలములో నాచుట్టుపట్లనున్న గృహంబుల నంటించి మహారభసంబునఁ బర్విడసాగెను. వాయువు మహారభసముతో వీచుచుండుటచే నాయిండ్లు కాలకముందే మఱికొన్నియిండ్లు మండనారంభించెను. అదిచూచి జనంబులు పర్విడి యాస్థలంబునకు వచ్చిచేరిరి. కాని పిచ్చివాఁడదృశుండాయెను. అయినను గృహాధిపతులు తమగృహంబులం గల వస్తువులను దీసికొనఁ బ్రయత్నించుచుండిరే కాని యాపిచ్చివానిని బట్టుకొందమన్న తలంపొక్కరికినిఁ జనింపలేదు. పిచ్చివాఁడొకవీథి మాత్రమేకాల్చి విరమించెను. కాని వాయువు తనబలంబున నగ్నికణపుంజంబును గొనిపోయి దూరంబుననున్న మందిరంబులనుసైతము కాల్పఁజొచ్చెను. ఇట్లొక్కుమ్మడిని పెక్కుచోట్ల గృహంబులు మండుచుండుటచే నొకవీథి వారు వేఱొక వీథివారికిఁ గాని యొక గృహము వారు వేఱొక గృహమువారికిఁ గాని తోడుపడ నవకాశము చిక్కలేదు. అందుచే నొక్కయిల్లైన నార్పఁబడలేదు. ఒకవస్తువయినను దీయబడలేదు. పురంబు నలుదిక్కులందును మండుటచేతను, ధూమచక్రంబులు మానవులకన్నులను గప్పి బాధించుటచేతను, నేనైపునకుఁ బోవలయునో తెలియక యొక్కొకచోట కూలఁబడి

జనంబులు హాహాకారంబులు చేయఁ దొడంగిరి. మొదట నాయ
గ్నిని జల్లార్పఁ బెక్కండ్రు ప్రయత్నించిరి. కాని మారుత ప్రేరి
తరిబులైన జ్వాలామాలలు నానాముఖములఁ బ్రసరించుటచే
సమీపంబునకుఁ బోవ నొక్కండును సాహసింపఁ డాయెను.
జనంబులకోలాహలంబులచేతను, అనాథుల రోదనధ్వనులచేతను,
నగ్ని నుండి తప్పించుకొన బాధనంబులఁ ద్రెంచికొని చెలరేఁగి పర్వె
డెడి పశుబృందంబులయఱపులచేతను, నప్పురంబు మిక్కిలి భయంక
రంబుగానుండెను.ఆకస్మికంబుగాఁ బురంబు దగ్ధంబగుచుండుటచేఁ
దమతమమందిరంబులందున్న యమూల్యవస్తువులను దీసికొనలేక
పోయిరి.ఒకవేళనిప్పట్లుసాహసించివస్తువులనుదెచ్చికొనఁబోయినచో
వారి ప్రాణంబులు దక్కలేదు. ఎవరియిల్లు వారే కాపాడుకొనఁ
బ్రయత్నించుటచే నొకయిల్లయినను దక్కలేదు. ధూమసమూ
హంబులును, మంటలును చెదరి పురంబంతటను వ్యాపించుటచే
నగ్ని జ్వాలావలితంబులుగాని మందిరంబుల నుండు వారైనను
వచ్చి పెఱవారికిఁ దోడు సూపలేక పోయిరి. పురంబున నున్న
వారి కందఱికి సంతాప మొక్కరీతిగానే యుండెను. పురంబు
గాలుచున్న దని విన్నతోడనే, యుద్యోగస్థులును బురరక్షక
భటులును, దక్కిన కార్యాలయములవారును దమ పనుల నిల్పి
యగ్నిశమనసాధనంబులఁ బట్టుకొని పర్విడివచ్చి చల్లార్ప, బ్రయ
త్నించిరి. కాని జ్వాలలతిభయంకరంబుగా వ్యాపించుచుండుటచే
నేమియుఁ జేయలేక పోయిరి. ఇఁకఁ బురజనులు వహ్నినిశమింప
జేయు ప్రయత్నంబులు విడిచి తమదారసుతాదులను రక్షించు

నుపాయంబు లరయఁ జొచ్చిరి. దుర్గరక్షకభటులు మొదట
రాజశాసనంబుల నుల్లంఘింపక తమతమ పనులందు శ్రద్ధా
ళువులై యుండిరి. కాని తమ వీధి పూర్ణంబుగా దగ్ధంబైన దని
విన్నప్పుడు నిలువఁ గాలాడ నందునఁ దమతమగృహంబుల జూచి
కొనఁ బోయిరి. ఎవ్వఁడు గృహదారసుతాదులందు విరక్తుండై యుం
డనోపు? ఎవ్వం డట్టి సమయంబులందు ధైర్యం బవలంబించి
రాజశాసనంబుల మన్నింప సమర్థుండు? ఎవ్వరి కట్టిసమయము
లందు మనంబులం గార్యాకార్యజ్ఞానము నెలకొనును? తమగృ
హంబులు జ్వాలావలితంబులై మండుచున్న సమయంబునఁ దా
మరిగి యయ్యగ్నికిఁ దగిన ప్రతీకారము చేయఁ జాలక పోయినను,
వహ్ని సంతాపము శరీరమందున్న రక్తంబును మరిగించుచున్నను,
హాహాకారంబులు చేయుచుఁ గన్నులారఁ జూచుచు నచ్చటనే
యుందురు. కాని వే రొకచోటికిఁ బోలేదు. ఆకస్మికముగా నుప్ప
తిల్లిన యగ్నిహోత్రంబునుండి తప్పించుకొని తమ కనువగు
స్థలంబులం దాగియుండుటచేఁ దమతమ కుటుంబములో నెవ్వరు
బ్రదికిరో యెవ రగ్నిహోత్రంబునకు శలభమాత్రులైరో కను
గొనఁ దరము గాకుండెను. అంతఁ గొంతవడికి వాయు వుపశమిం
చెను. తన కుండదగినస్థలంబు లేకపోవుటచేతను, దన మిత్రుండు
ఉపశమించుటచేతను, నగ్నియును శాంతించెను. నాఁ డానెగొంది
ప్రజలు మహాభూతంబుల వాతంబడి నానాబాధలం బొంది మృ
త్యుముఖంబునం బడి తప్పించుకొని వచ్చినట్లు భావించి సంతసింపఁ
దొడంగిరి. అనంతరము పౌరులు తమతమ దారసుతాదులను

వెదకికొనుచుఁ, బరస్పరము పిలిచికొనుచు, నిజమందిరంబులం జేరిరి. కాని యట కుప్పలుగాఁ బడ్డ నిప్పుకలు దప్ప నేమియు మిగులలేదు. తిన నన్నము లేదు, శయనించుటకు కాని కూర్చుండుటకుఁగాని స్థలంబు లేదు. ఆ సమయమునఁ గొందఱు ధర్మాత్ము లాయాపన్నులకుఁ దగిన భోజనాదు లర్పించి కాపాడిరి. అప్పుడు పురరక్షాధికారి యా యాపదకుఁ గారకుఁడు పిచ్చివాఁడే యని తెలిసికొని బట్టుకొని బంధించి యగ్నిలోఁబడఁ ద్రోయుఁడన్ని భటుల కాజ్ఞాపించెను. వారును మహా ప్రయత్నంబులు సలిపివానింగూర్చి యన్వేషించిరికానివాఁడెచ్చటనుగానరాఁడాయెను. అప్పు డప్పురజనులు పిచ్చివాఁడు శత్రువుగాని పిచ్చివాఁడు కాఁడని భావింపసాగిరి. అంతలో దుర్గరక్షకభటులు తమప్రభువు పాదంబులు పట్టుకొని ప్రహరేశ్వరాదులు తప్పించుకొని పోయిరని చెప్పి యేడ్వనారంభించిరి. అతఁడు వారి నోదార్చి యాపిచ్చివాఁ డెవ్వడో మహాబుద్ధిశాలి యనియుఁ, బ్రహరేశ్వరాదులను దప్పించుటకే యియ్యాపద గల్పించెననియు నిశ్చయించి యావార్త ను సార్వభౌమునకుఁ దెలియఁ జేయ వెంటనే సేవకులం బంపెను.

---

## పదునెనిమిదవ ప్రకరణము

### తత్త్వాన్వేషణము

తిమ్మరుసు నట్లు విజయసింహుని విడిపించికొని నిజమంది రంబు చేరెను. విజయసింహుం డపరాధి యని నిర్ణయించిన మంత్రివర్యుండు మగుడ నిరపరాధుండని యెట్లు స్థాపింపఁగల్గెనో మీకు విన్నవించుట నాకు విధి. విజయసింహుని సత్ప్రవర్తనమును, నతని యుదారగుణంబులను, మంత్రి చక్కఁగా గ్రహించి యుండెను. కాన నతఁడు విజయసింహుం డట్టి పని చేసెనని తెలిసినప్పుడు మనంబున సుంతేనియునమ్మలేదు. రాజేంద్రుఁ డపరాధ హేతువులను జూపుచుండ నేమియు ననలేక పోయెను. అప్పటికిని విజయసింహుం డట్టిపని చేసెనన్న దృఢవిశ్వాస మతనికిఁ గలుగలేదు. ఈచరిత్రమం దెంత తత్వమున్నదో తెలియఁ గోరియే, విజయసింహుని వెంటనే చంపవలయు ననిశాసింపగా, శాసనంబును బొడిగించెను. ఈనాల్గు దినంబులును జక్కఁగఁ బరిశీలించి యందలి తత్వంబును జక్కఁగా గ్రహించి యప్పటికి విజయసింహుండపరాధియైనట్లు గనుపట్టిన వధింపవచ్చుననియు, లేనిచో బ్రతికింపవచ్చుననియు నతని యభిప్రాయము. రాయలది విని నాలవనాఁటి సాయంకాలంబు నాఁటికి విజయసింహుండు వధార్హుండని తెలుప నప్పుడు, వేఱే యను మతి యవసరము లేకుండఁగనే విజయ సింహునిఁ జంపవచ్చునని దండనాయకునకు సందేశ మంపెను. ఈనాల్గుదినంబులును మంత్రి పోయి విజయసింహునిఁజూడఁ బోఁగూడదనియును

శాసించెను. మంత్రిపుంగవుం డింటికి వచ్చి యానాల్గుదినం బులును దనబుద్ధిచాతుర్యంబును వినియోగించి చూచెను గాని యేమియుఁ దోఁచలేదు. విజయసింహునిపై నిఁక నాశవదలు కొనెను. తుద కిట్లు భావింపఁ జొచ్చెను. 'విజయసింహునకుఁ బెక్కండ్రు విరోధులున్నారు. వారే యీపని చేసి యుందురు. నాఁ డానెగొందికేగి నప్పుడు శత్రువు లతని బంధించి చంప సమ కట్టఁగా ముక్తాంబ యాసమాచారంబును దెలిసికొని రక్షింపఁ గలిగినది. ఈయపాయంబు తొలంగించు నుపాయము ముక్తాంబ కేమయినను దెలియునేమో' అని యోచించి రామరాజుం బిలి పించి యానెగొందెకుఁ బుత్తెంచెను.

అట ముక్తాంబయు విజయసింహునకు సంభవించినయాప దకు వగచుచు, నట్టియాపదకుఁ దానే కారకురాలనియుఁ దానికిఁ దగిన ప్రతీకారము యోజింపవలెననియు, నూహించు చుండఁగా నాల్గవనాఁడు మధ్యాహ్నంబున రక్షకభటునకుఁ గొంతధనము లంచమిచ్చి తన దర్శనంబునకు రుద్రదేవుం డరుదెంచెను. అతని మోసపుచ్చియారహస్యంబులను దెలిసికొని,విజయసింహుని బ్రది కింపవచ్చునని సంతసించి యావృత్తాంతము నొక పత్రమున బొందు పఱిచి రాయలకుఁ గాని, మంత్రికిఁ గాని పంపవలెనని యుండె. కాని యాయుత్తరంబును నమ్మకంబుగాఁ గొనిపోవువాఁ డెవ్వండును లభింపలేదు. జాముఱాత్రి కావచ్చినది. ఉత్తరంబు గొనిపోవువాఁ డెవ్వండును లభింపలేదు. ఇఁక దెల్లవాఱిన విజయసింహుండు బ్రదుకఁ డని త్వరపడసాగెను. డెంధంబు డోలాందోళనము చెందు

చుండెను. విజయసింహరక్షణోపాయము చేతికిఁజిక్కనను నతని రక్షింపలేక పోవుదునేమో యని భయపడసాగెను. ఆమె కేమి యుందోఁచలేదు. తానాసమయంబున విజయనగరంబున కరుఁగఁ బ్రహరేశ్వరుఁ డంగీకరింపఁడు. అందుచే నామె మిగుల విచారించుచు గవాక్షము చెంత నిలిచి వీధివంక జూఁడఁగా నొకపురుష వ్యక్తి యతనికిఁ గోచరమయ్యె. ఆపురుషుఁడు రామరాజే. అతఁడు చీఁకటిలో నుండుటచే ముక్తాంబ తెలిసికోలేక పోయెను. కాని యతఁడామెను గుర్తించి' సోదరీ! ముక్తాంబా! అని పిలిచెను. అందుల కాయింతి స్వాంతంబున సంతసించి 'అన్నా! నేఁడు కోరని కోర్కిగా వచ్చినావు. నాఁడును నీవిట్లె వచ్చి విజయసింహుని రక్షించితివి? నీ విఁక నాలస్యము చేయక యీయుత్తరంబును గొనిపోయి మంత్రిపుంగవున కిమ్ము' అని వచించెను.

'సోదరీ! రోయఁబోవుతీవియ కాళ్లకుం దవిలినట్లయ్యె. విజయసింహ రక్షణోపాయంబు నీకుఁదెలియునేమో యని దెలిసికొన మంత్రిపుంగవుండు నన్నిచ్చటికిఁ బంపెను. ఈయుత్తరంబువలన మాబావ బ్రదుకునా?' అని రామరాజనెను.

'సోదరా! నిశ్చయంబుగా జీవించును. విలంబముచేయకుము. శత్రువులకుఁ జిక్కకుండ భద్రంబుగా బొమ్ము.' అని ముక్తాంబ పలికెను.

అంత రామరాజు రెండుజాములరాత్రికి విజయనగరము చేరి మంత్రి భవనంబునకుఁబోయి యా యుత్తర మతనికిచ్చె. ఆ మంత్రి యాపిచ్చివాఁ డొనర్చిన మాయోపాయమున కచ్చెరు

వొందుచు, విజయసింహుని బ్రదికింపవచ్చునని నిశ్చయించుకొని రాజసందర్శనమున కది తగినసమయమని యప్పటికూరకుండెను. మఱునాఁడుదయమున రాజసమ్ముఖమునకుఁ బోవుచుఁ దావచ్చునందాక విజయసింహుని వధ్యస్థానంబునకుఁ గొనిపోవలదని దండనాయకునకు సందేశ మంపెను. అయిననువాఁ డద్దాని మన్నింపక రాజాజ్ఞంబట్టి విజయసింహుని వధ్యస్థానంబునకుఁ గొనిపోయెను. తిమ్మరు సాసమాచార మెఱుఁగఁడు. పిమ్మట నతఁడు రాజసందర్శనంబుచేసి కూర్చుండి 'ఓ మహాప్రభూ! మనము నిష్కారణముగా నపవాదల పాలగుదుము. విజయసింహుండు గాని, యనంగసేనగాని యెంతమాత్ర మపరాధులుగారని నిశ్చయముగా వక్కాణింపఁగలను. మనపురంబున సంచరించెడి పిచ్చివాఁడే ఈపని గావించెనఁట వాఁడు విజయసింహునికిఁ బరమశత్రువఁట! ఆనెగొందికిఁ బోయిన నాఁడు విజయసింహుని బంధించి చంపఁదలఁచిన నాఁడతనిచేతనున్న యుంగరంబును సంగ్రహించెనఁట! మఱియొకనాఁడు కోఁతి నాడించుచు ననంగసేనమందిరంబున కరిగి యామెమీఁదికిఁగోఁతిని వదలఁగా నది యామెచేతినిబట్టుకొనెనఁట. ఆమెభయంబునఁజేతినిజాడింపనాయుంగరము నేలఁబడెనఁట. అప్పుడువాఁడదిమార్చియామెయుంగరంబును గొనివచ్చి తన్ను రక్షించినందులకుబహుమానముగావిజయసింహునకిచ్చెనఁట. ఈయంశములనుజేర్చి ముక్తాంబ మనకొకయుత్తరము వ్రాసిపంపె' నని సమస్తము నివేదించెను.

అదివిని కృష్ణరాయ లాయుత్తరంబును జూచికొని కోఁతి వృత్తాంతమందులకు సరిపడుటచే నదియే నిశ్చయమని నమ్మి విజయసింహుని రక్షింప మంత్రిపుంగవుని పంపెను. అట్లు రాజాజ్ఞనుబొంది తిమ్మరుసు వధ్యస్థానంబునకు వచ్చి చండాలురను దటిమి విజయసింహునితోఁ దనమందిరంబున కరిగెను. అటఁ గృష్ణరాయ లాయుత్తరంబును జూచికొనుచు, నిష్కారణముగా ననంగసేన నవమానించి వెడల గొట్టించితిఁ గదా యన్న విచారంబుచే నతండస్వస్థుఁడై యుండెను. అందువలన మంత్రి రాజదర్శనంబునకుఁ బోవ వలనుపడక యుండెను. ఆమరునాఁడు రాజాజ్ఞానంబున విచారంబును దొలగించుకొని విజయసింహ సహితంబుగా రావలయునని మంత్రికి సందేశ మంపెను. మంత్రి విజయసింహునితోఁగూడరాజసందర్శనంబునకుఁబోగా రాజేంద్రుండు వారిని, గౌరవించి యుచితాసనాసీనులం జేసెను. విజయసింహుండు సిగ్గుచేఁ దల వంచుకొని రాజేంద్రునిమొగంబు జూడలేక యుండెను. అది కనుగొని రాజాధిరాజు విచారాతిశయంబును సూచించుచు, 'ఓవిజయసింహా! నీసత్ప్రవర్తనంబును దెలిసికోలేక నీకు నిష్కారణముగా మహాపకారంబును జేసితిమి. క్షమింపుము. మత్కృతంబగు నవమానంబునుమఱచిపొమ్ము. శత్రువుల కపటోపాయంబులవలన మన కిన్నిచిక్కులు సంభవించినవి' అని పలికెను.

'ఓసార్వభౌమా! మాపురాకృతకర్మంబులకు మీరేమిచేయుదురు? మాదుష్కర్మమే యాయంగుళీయకంబుగాను, ఆయుత్త

రంబుగాను బరిణమించి యిట్టి దుష్ఫలంబును గలుగఁజేసినవి. ఈ తటస్థించిన యాపదకుఁ బిచ్చివాఁడే కారణము. నే నాతని •నాబోతునుండి రక్షింపగా నా కతఁడొనర్చిన ప్రత్యుపకార మిది. వాఁ డెవ్వడో బహుదుర్మార్గుఁడు. నేనా యంగుళీయకవృత్తాంతము మీకుఁ దెలుపుట కవకాశము చిక్కినది కాదు. అందుచే నింతవఱకు వచ్చినది.' అని విజయసింహుఁడు పలికెను.

'ఓయీ! విజయసింహా! ముక్తాంబవలన నీవు జీవించితివి. ఆమె యీయుత్తరంబు వ్రాసి పంపనిచో నీవు నిష్కారణంబుగా ఖండింపఁబడియుందువు. నీ ప్రాణంబులుగాచి నాకపకీర్తిని దొలంగించి పాపంబు రాకుండఁ గాపాడినముక్తాంబను మిక్కిలి నుతించెదను.' అనిరాయలు పల్కెను.

ముక్తాంబనామము చెవులఁ బడిన తోడనే సమస్తవిచారముక్తుండై యమితానందంబు నొందుచుండె. అంత గృష్ణభూపాలుండు విజయసింహునిఁ జూచి 'ఓ వీరవరేణ్యా నీకు నే నొనరించిన యవమానంబునకుఁ బరిహారమ్ముగా నేదేని యొక వర మిచ్చెదను. కోరుకొనుము.' అని కరుణారసమేదురములయిన తన కడకంటిచూపు లతనిపైఁ బఱపెను.

రాజేంద్రుని వాక్యంబులకు విజయసింహుండు ద్విగుణితానందుండై 'ఓ భూపాలరత్నమా! మీ కరుణారసంబున కెప్పుడు పాత్రుండ నైతినో యప్పుడే నాయభీష్టంబు లన్నియును సఫలంబు లయ్యె. అయినమీరు దయార్ద్రహృదయులై కోరుకొనుమన్నప్పుడు నిరసించుట తగదు. ముందు ముం దాపర

రత్నంబును గోరుకొందును. అందాక తమయొద్దనే యుంచుఁ' డని పలికెను.

రాజేంద్రుం డదివిని విజయసింహుం డానందమొందినం దుల కమితానందంబు చెందుచున్నను, ననంగసేనా విషయకమైన విచారమొకవంక బాధింపక పోలేదు. అప్పుడు మంత్రింజూచి 'అప్పాజీ! కోపావేశంబున బుద్ధిహీనుండనై యకృత్య మాచరించితిని. యోగ్యురాలైన యనంగసేనకు దుస్సహమైన యవమానంబును గల్గించితిని. ఆయవమానభరంబును సహింపలేక యెందైనంబడి మృతినొందెనో, లేక యెచ్చటికైనఁ బోయెనో తెలియమిచే నామనంబు మిగుల విచారాతిశయంబునఁ బొగులుచున్నది.' అని విచారించుచు రాజు బల్కెను.

'ఓ మహీతలాధిపా! ఏల విచారించెదవు? కష్టములు సంప్రాప్తమగు నప్పు డెవ్వరు నిర్బంధింపఁ గలరు? అయిన నంగుళీయకాదులఁ బరిశీలింపకుండ నామె నవమానించుట నీతప్పని నిశ్చయముగాఁ జెప్పఁగలను. గతించినదానికై వగచిన లాభములేదు. అనంగసేన యెచ్చట నున్నదో తెలిసికొనుటకు సేవకుల నంపెదను. ఆమెతో మాలతి పోయినదఁట. మాలతి యసామాన్య బుద్ధిమంతురాలు. ఆమె చెంతనుండఁగా ననంగసేన కెట్టి యాపదలును బొరయలేవు.' అని మంత్రి యోదార్చెను.

రాజేంద్రుండు కొంతయూరట చెంది 'మంత్రిపుంగవా! మన కిన్ని యాపదలఁ గల్గించిన యాపిచ్చివాఁ డెవండో మనము తెలిసికోవలసియున్నది. నే నతనిఁ బిచ్చివాఁ డనియే భావించి

విచ్చలవిడి చరింప నాజ్ఞయిచ్చితిని. వాఁ డెవఁడో యెఱుంగు దువా?' అని రాజు ప్రశ్నించెను.

'సార్వభౌమా! వాఁడెవ్వఁడో మహా బుద్ధిశాలి. మన శత్రుమండలంబునకు మొనగాఁడు. నేనును మొదట సామాన్యు నిగా భావించితిని. కాని యింతటి వాఁడని తెలిసికోలేక పోతిని, విజయసింహు నానెగొందిలోఁ జంపఁ దలచినవాఁడాపిచ్చివాఁడే. నన్నుఁ జంపఁ బ్రయత్నించినవాఁడును వాఁడే. అనంగసేనా విజ యసింహులకు దురపవాదంబు గల్గించినవాఁడును వాఁడే. ఇది కాక మరియొకచిత్రము. నిన్నయానెగొందెపురంబును బూర్ణంబు గా దహించెనట,' అని మంత్రియచ్చెరు వొందుచుఁ బలికెను.

'ఏమేమీ! ఆనెగొంది దహింపఁ బడినదా! ఎందులకు దహింపఁబడినది? ఆ పిచ్చివాఁడే యందులకుఁ గారణమా?' అని రాజడిగెను.

,, ఓధరాతలాధిపా! వాఁడే మాయోపాయంబున దహిం చెనఁట, ముక్తాంబాప్రహరేశ్వరపాత్రులను, దప్పించికొనిపోవు టకే యిట్లు చేసి యుండెను. ముక్తాంబ పిచ్చివాని గుఱించి వ్రాసెనుగాని పిచ్చివాఁ డెవండో వ్రాసినదికాదు. అతఁ డామెకు నచ్చిన చుట్టమై యుండవచ్చును. కావుననే యతని రహస్యంబు తెలిపినదికాదు. అతఁడు విజయసింహునకు శత్రువై యుండును. ఏకారణముచేతనో యతండు విజయసింహునకుఁజేసిన యపాయంబులనుండి యామెదప్పించుచుండెను. ఆమెమహాశేము షీ. మతి. . విజయసింహునిఁ గాచుచు నతనికిఁ గోపము రాకుండ

జేసికొన్నది. అంతటిచాతుర్య మామెకే కాని వేఱొకనికి లేదు.' అని ముక్తాంబనుఁ బొగడసాగెను.

విజయసింహుఁడు ముక్తాంబ యానెగొందెనుండి వెడలి పోయినట్లు విని మిక్కిలి విచారింపసాగెను. అతని ముఖవిలాసంబులు తరిగిపోయెను.

అంత రాయలతనిం జూచి 'ముక్తాంబాదులు మనకు లోఁబడిన వారేకదా? వారుతప్పించుకొని పోవుచుండఁగా నీ వేల నిర్బంధింపలేదు.' అని రాజేంద్రుండనెను.

'రాజపుంగవా! వారిని జాగరూకతతో రక్షించుటకుఁ బెక్కండ్రభటుల నాజ్ఞాపించితిని. కాని వారికి మహాపద గలిగించి తప్పించుకొనిపోయినాఁడు. ఆశత్రువుఁడు సామాన్యుఁడని భావించితిని గాని మహాబుద్ధిశాలి యనియు, రాజనీతి విశారదుండనియు నెఱుంగకపోతిని. వాఁడప్రతిహతంబు లగుశరంబులనే ప్రయోగించెను. కాని దైవవశంబున లక్ష్యంబులకు దప్పిపోయినవి. రెండు మాత్రమే లక్ష్యంబును భేదింపఁ గలిగినవి. అనంగసేనను గొలఁది దినంబులకె మన పురంబునకు వచ్చునట్లు చేయఁగలను. ముక్తాంబాదు లెచ్చట నున్నను, క్షణకాలంబులో నే తేఁగలశక్తి నాకు గలదు. వా రొక స్థలంబునకుఁ బోవుదురని చూచాయగా గ్రహించితిని. అదియె సత్యమైనచో, జిరకాలమునుండి మనమనంబులందు వర్థిలుచుండిన మనోరథము సఫల మందును. దానిం గూర్చి మీా కిప్పుడు వివరించి చెప్పను. ఇంతేకాక శత్రువులు క్రూరసర్పముల వంటివారు.వారు. శత్రువుల ప్రాణవాయువుల

నపహరింపఁ జాలినవారే, అయిన నా సర్పరాజులను, నాయప్రతి హతమంత్రశక్తిచే బంధించి కొని వచ్చి తమసన్నిధికిఁ జేర్చెదను. ఆ శత్రువు ప్రయోగించినయస్త్రములలోఁ గొన్ని నిష్ఫలంబులైనవి. ఫలించిన వయినను, విశేష ఫలదాయకంబులు కాలేదు. నే నా శత్రువులపై మంత్రరహస్యయుక్తంబుగా మహాస్త్రంబులఁబ్రయోగించెదను. వానిని వారు ప్రతిహతంబులుగాఁ జేయుదురేని మెచ్చఁదగినవారే. ఎట్లయినను గొలదిదినంబులలోనే శత్రువును దమపాదమూలంబులం జేరునట్లుజేయుదు. అప్పుడుగాని మీామంత్రిపుంగవుని యప్రతిమమేథాశక్తి దేవరకుఁ దెల్లము గాదు.' అని గంభీరస్వరముతోఁ బలికె.

రాజేంద్రుం డతనివచనంబుల కానందించి యతనిశక్తిని గొనియాడి వారలకుసెల విచ్చి పంపివేసెను.

---

## పందొమ్మిదవ ప్రకరణము

### సదాశివ భట్టాచార్యుఁడు

'గీ. విషమరసముంచి చేతఁ ద్రావింపవచ్చుఁ।
జెడ్డచేఁ బొల్లయినఁ ద్రావఁ జేయలేము॥'

ఆనెగొందిదుర్గంబునకై దుక్రోసులదూరంబునఁ గందరాడ యను నొకపల్లియ యుండెను. అం దొకవందయిండ్లు మాత్రమే కలవు. ఇప్పుడాయిండ్లును లేవు. ఆ పల్లెయును లేదు. గ్రంథస్థము లగుటచే నామంబులు మాత్రమే యిప్పటికి వినవచ్చుచున్నవి.

అం దొకటిరెండుమాత్రమె పెంకుటిండ్లు, తక్కినవి పూరిండ్లే. ఆగ్రామంబున నొక బ్రాహ్మణకుటుంబము కలదు. ఆబ్రాహ్మణుఁడు గ్రామణీపదము నంది జీవించుచుండెను. అక్కడి పెంకుటిండ్లలో నొకటి యాబ్రాహ్మణునిదే. ఆయింటికి రెండుగదులు గలవు. ఆబ్రాహ్మణుఁ డొకగది తనకు నిలయముగఁ జేసికొని, రెండవది బాటసారులకిచ్చి వారికిఁ దగినసదుపాయము చేయు చుండుటచే నతండు మంచివాఁ డనియు, ధర్మాత్ముఁ డనియుఁ బ్రఖ్యాతివహించెను. బాటసారులు నివసింపవలసినగదిలో నిరువురుయువతీలలాము లుండిరి. వా రెచ్చటికో పోవుచు మార్గవశమున నచ్చటికి వచ్చిరి. వా రచ్చటికి వచ్చి నాల్గయిదు దినంబులైనను, నేకారణంబుననో యచ్చటనే యుండిరి. ఒకయువతి రెండవయువతితొడలపయి దల నిడుకొని శయనించి యుండెను. ఆ రెండవయువతి గూర్చుండియుండె. రాత్రి చాలభాగ మతిక్రమించినను వారు నిద్రింపలేదు. ఆలోచింప వారిముఖంబులు విచారాతిశయంబునఁ గాంతివిహీనంబులై నీహారసంపర్కంబునఁ గాంతిదక్కినకమలంబులచందంబున నుండెను. ఆ కమల దళంబులుఁ మంచు నిండినట్లు వారి చంచల విశాలలోచనంబులు బాష్పప్రపూర్ణములై యుండెను. ఇట్లు విచారాతిశయంబునఁ బెల్లుగ దల్లడిల్లెడి వారికి నిద్ర పట్టుటెట్లు? మీఁదుమిక్కిలి వా రెద్దియో కార్యాలోచనంబుం గూడఁ జేయుచున్నట్లున్నది. నిద్రాదేవి యట్టి వారి చెంతకైనను బోఁజాలదు. వారిలో నొకతె మాలతి. రెండవది యనంగసేన. వా రిట్లు సంభాషించుకొను చుండిరి.

మా-అమ్మా! అనంగసేనా! మనము సాహసించి పురంబు వెల్వడినందుల కావిప్రుండు తారసించుటచే నిరపాయంబుగా రాఁగలిగితిమి. లేనిచో నేచోరులకో, యేదుష్టమృగంబులకో, చిక్కి గతాసువులమై యుందుము. దిక్కులేనివారికి దేవుఁడే దిక్కయి రక్షించు ననుట కిది యొక తార్కాణంబు గదా!

అ-చెలీ! నాప్రాణంబు లట్లు పోయియున్న నాకష్టంబులన్నియుం బోయియుండు. నాకంత యదృష్టంబు పట్టుటెట్లు? ఛీ! అవమానాగ్నిహోత్రంబు ప్రజ్వరిల్లి నాశరీరవల్లి నెల్లప్పుడును సంతప్తంబగునట్లు చేయుచుండ సహించి మొండినై యుండిన జన్మంబేల? కాల్పనా? నిరుపమానగౌరవంబు నందుచుఁ, గష్టమన్న నెట్టిదో యెఱుంగక యుండిన నే నిప్పట్టునఁ బెక్కులిక్కట్టులు చెందుచు, నూరూరఁ దిరుగుచుంటిని. ఇంతకంటెఁ జచ్చుటయే మేలు. మఱియు నిరుపమానసౌందర్యవంతుఁడును, సరసాగ్రేసరుండును నగునాథాత్రీరమణుం డొనర్చెడి స్తోత్రంబునకుఁ బాత్రంబైన నామృదుతరగాత్ర మిప్పట్టున నిట్లు తిరుగుచుఁ, గ్రూరజననేత్రంబులకు గుఱిచేయ నామనంబున కెంతో భర మనిపించుచున్నది.

మా-అమ్మా! నీవన్నది సత్యమే. సుఖంబు లనుభవించి కష్టంబు లనుభవించుట మిక్కిలి దుర్భరము. నిరుపమానం బగురాజగౌరవంబు చెందువారు పరాభవమును సహించుట మహాభరము. లోకంబునఁ గష్టంబులను, నవమానంబును జెందినవా రెందఱులేరు? వారందఱును బ్రాణంబులపై నీవలె నాశవదలు

కొనుచున్నారా? కొలఁదిదినంబులలోనే యారాజేంద్రునకుఁ దత్వంబు తెలియకపోదు, తెలిసికొని నిన్నుంగూర్చి విచారా క్రాంతస్వాంతుండు కాక మానఁడు, అయి నిన్ను వెదకి పురంబునకుఁ గొనిపోక పోఁడు. కొనిపోయి తొంటికంటె నెక్కుడు గౌరవంబు చేయకపోఁడు. కావున విచారంబును విడువుము. ధైర్య మవలంబింపుము.

అ:- చెలియా! నీ యూరడింపుమాటలకు నేసంతసింపఁ జాలను. ఈజన్మంబున నీనేత్రంబులతో నాధాత్రీరమణుని సందర్శించు భాగ్యముగల్గునా? ఈశరీరం బీజన్మంబున నారాజచంద్రముని గౌరవంబునకుఁ బాత్రంబగునా? నాకంతటి యదృష్ట మున్నదా! నీయుపదేశబలంబున నింతవఱకు జీవింపఁగల్గితిని. లేనిచో నీపాటి కేలోక మందుందునో? నేఁటి సాయంకాలంబునకే వచ్చెదనని చెప్పిపోయిన యావిప్రుండింకను రాలేదేమి?

మా- అతని కేవో కార్యంబు లుండుటచే రాక తక్కియుండును. ఎట్లయినను వచ్చితీరును. తెల్లవారినదాకఁ జూతము. అప్పటికి నతఁడు రానిచో మనమీస్థలము విడిచిపోవుదము. మీపుట్టింటివా రున్న కొండపల్లిదుర్గంబునకు దారి నెఱుఁగుదు. క్రూరులకుఁ జిక్కకుండ నినుదీసికొని పోయెదను.

అ- మాలతీ! మన మిప్పట్టునఁ గొండపల్లిదుర్గంబునకుఁబోవ సముచితముగాఁ గన్పట్టదు. నేనుఁదుశ్చరిత్రురాలనని యపనింద వహించి యచ్చటికిఁ బోయిన వారు చేరనిత్తురా? ఒకవేళఁ బ్రేమభరంబునఁజేరనిచ్చినను దొంటిగౌరవంబుతో నన్నుఁ

జూతురా? అచ్చటికి బోయి వారిచే నిందావాక్యంబులు పడు టకంటె వేరొక్కచోటికిఁ బోవుట సముచితము.

మా-నీయాలోచనము విపరీతముగా నున్నది. మనంబున నిన్ని సందేహములు పెట్టుకొనిన జీవించుట కష్టము. సుఖంబు సుం తేనియునబ్బదు. నీవనుకొన్నట్లు నీబంధువర్గ మెప్పుడును నవ మానింప సమకట్టదు. తలిదండ్రులకు బిడ్డలందు నిరతిశయం బయినవాత్సల్యంబు నిరూఢంబై యుండు. దుర్గుణంబులుగాని కురూపత్వంబుగాని యవమానకారణములుకానోపవు. కావున సందియము దక్కి పుట్టింటి కరుగుటయే యుచితము. ఆపత్కా లంబున రక్షింప జనకులకంటె దిక్కెవ్వరు? ప్రేమసహితంబుగా వారు చెప్పెడినీతివచనంబులచేఁ దక్క వేఱొక్కదానిచే బాధలుతొలంగవు. నీవునీతలిదండ్రుల చల్లనివచనంబులువిన్నం తనే దుఃఖవిముక్తురాల వగుదువు.

అ- అట్లనకుము. దుఃఖోపశమనంబు చేసికొన నీవు చెప్పినదాని కంటె నత్యుత్తమంబయిన యుపాయమొకటి యున్నది.

మా- ఏదియో! చెప్పుము, అది దుఃఖోపశమనసాధనంబులలో నత్యుత్తమమే యయినచో నప్పథంబునే తప్పక యవలం బింతము.

అ- పుణ్యక్షేత్రములకుఁబోయి మహాత్ముల సందర్శించి తదీయ పాదసేవచేయుచు, శ్రోత్రపేయంబులయిన వారియుపదేశం బులవినుచుఁ గాలముపుచ్చుట.అట్లుచేసిన దుఃఖముతొలంగు. సుఖము వచ్చు.

మా-అమ్మా! నీవాక్యంబులునాకు నవ్వుపుట్టించుచున్నవి. పుణ్య క్షేత్రముల కరిగి మహాత్ముల నందర్శించి వారిపాదసేవ చేయు దువా? అది యెప్పటికిని నీకుఁదగదు. నీసుందరాకారంబును సందర్శించి నంతనే యెట్టివిరాగియైనను భోగికానిష్టపడకుండు నే? నీ చంచలకటాక్షవీక్షణంబులకు గుఱియైనచో నెట్టిమహా త్ముఁడైన నీపదసేవచేయ నంగీకరింపక మానునే నీమధురా లాపంబుల విన్నవాఁ డెట్టిసాధువైనను స్మరచంచలితహృద యుండై కాముకవృత్తి నవలంబింపకపోవునే? నీవు తీర్థయాత్ర లకేగి మహాత్ములసేవచేయుట కేమి? కాని వారిసేవలు చేయిం చుకొంట నిశ్చయము. వారివచనంబులవలన నీకుసంతస మలవడుట వట్టిది. కాని నీ మంజు లాలాపంబులవలనవారికి సంతసము కలుగుట నిక్కము. కావున సంతతమును బుణ్య క్షేత్రంబులఁ గ్రుమ్మరుచు దపోవృత్తి నవలంబించి జ్ఞానాభి వృద్ధి కావించికొనెడి యతిస్వాములకు నిరుపమాన లావణ్య నిధానమైన నీ సుందరాకారంబుం జూపి మతులుపోవున్లు చేయకుము. వారిమనంబులందుండు దృఢత్వంబునుఁ దొలం గించి చాంచల్యంబును నెలకొల్పకుము. వారితపంబులు చెఱిచి మోసపుచ్చకుము. వారి జ్ఞానదీపమునార్పి మోహాంధకారం బునఁ ద్రోయకుము. అందువలన నీవు మఱింతపాపంబునార్జిం తువు. తొంటిజన్మంబున నార్జించిన పాపములవలననే మనకిట్టి దుఃఖంబులు సంప్రాప్తమైనవి. ఇప్పుడు పాపమార్జించిభవిష్య జ్జన్మంబులనుగూడ దుఃఖభాక్కులనుగా జేసికొనకుము. ఇంతే

కాక పుణ్యక్షేత్రంబుల కరుగునప్పుడు దుష్టాత్ము లెందరో తారసింతురు. వారు నీనవమోహనరూపంబుం జూచి మరులుగొనక మానరు. మరులుగొని నీస్నేహంబునకుం బాటుపడక విడువరు. అందువలన నీకింతకంటె దుస్సహములగు నాపదలు రాక తప్పవు. కాని సామాన్యురాలవు కావు. నా యుపదేశంబు విని యాత్రప్రయత్నంబును వదలి పుట్టింటి కరుగుము. అక్కడ నీవు భద్రముగా నుండవచ్చును. రాజేంద్రుండు క్రమక్రమంబుగా నీ చరిత్రంబుం దెలిసికొని వచ్చి నిన్నుం గొనిపోయి యాదరించును.

అ- (మాలతి వాక్యంబులు విని దుఃఖం బుపశమింపం జేసికొని, కన్నీరు దుడిచికొని) 'చెలియా! దుఃఖాతిశయంబుచేం గలంగిన నాచిత్తమందు యుక్తాయుక్తవివేకము నెలకొనకున్నది. ఈయాపదలో నీవే నాకు దిక్కు. నీవు చెప్పినట్లెల్లం జేసెదను. ప్రస్తుతము మనము చేయవలసిన పని యేమి? ఆ బ్రాహ్మణుండు రానప్పుడు నిరపాయంబుగా మనము కొండపల్లికిం జేరం గలుగుదుమా? ఆలోచించి చెప్పుము.

మా-మనము సాహసించితిమేని తప్పక పోంగలుగుదుము. అయినను బురుషసాహాయ్యముండుట మంచిది. అపాయంబులకుం జిక్కి తద్విమోచనంబుకై ప్రయత్నించుటకంటె మొట్టమొదటనేకనుగవగల్గి మెలంగుటయుచితంబు.ఆవిప్రోత్తముండు చతురుపాయకోవిదునివలెం జూపట్టు చున్నాండు.అతండు మన ప్రార్థనంబు లేకయే మనయం దపారకృపారసము చిల్కి

కొండపల్లికి, గొనిపోవుదునని వాగ్దానముచేసి యున్నాఁడు. అందాక సహించి యుండఁగల్గుదువేని యుండుము. లేనిచో నాశక్తికొలందిని నిన్నుఁ దప్పించుకొని పోఁ గలుగుదును.

అ:-ఆవిప్రుఁడు విశ్వాసపాత్రునివలెఁ గన్పట్టుచుండెను. అతని మృదుమధురవచనంబు వినిన నెట్టివారైనను వశు లగుదురు. అతండు బహుయోగ్యుం డనియుఁ బరోపకారశీలుం డనియు దృఢంబుగాఁ జెప్పఁ గలను. సందేహాస్పదంబగు కార్యంబు నకుఁ గడంగనేల? అతండు వచ్చునందాక యుండుటయె కర్తవ్యము.

అని వా రిరువురును సంభాషించుచుండ నొక పురుషుని పదధ్వనులువినవచ్చె. వారు సంభాషణము చాలించి యటు చూచుచుండిరి. అప్పు డొకపురుషుండు వారికి గోచరుండయ్యె. అతఁడు నీర్కావిదోవతులు ధరించెను. వీపున దర్భాసనంబు వెల యుచుండెను. ఒంటియందంతటను విభూదిపూత లొప్పాఱుచుండె. విశాలఫాలంబున బూదిరేఖలు విరళముగా గానవచ్చుచుండె. ఒకచేతఁ గమండలు వొప్పుచుండెను. మెడలో రుద్రాక్ష మాలి కలురాణించుచుండె. అతని దక్షిణప్రకోష్ఠంబున స్ఫటికాక్షమాల దులకించుచుండెను. అతండు మాటిమాటికేదో జపించుచుండెను. అతడు ప్రత్యక్షశంకరునివలెఁ జూపట్టుచుండెను. ఆయువతీలలామ లావికృతరూపంబును గాంచి మొదట భ్రుకుటిపడిరి. కాని తరు వాతఁ దా మనుకొన్న బ్రాహ్మణోత్తమునిగా నెఱింగి సంతసించి లేచి నమస్కరించిరి. అంత నాసదాశివభట్టాచార్యుండు వారి

నాశీర్వదించి 'ఓ యువతులారా? మీరు క్షేమముతో నున్నారా? గతించిన మూడు నాల్గుదినంబులందును మీకెట్టి లోపంబు గలుగ లేదు గదా?' అని కుశలప్రశ్న చేసెను.

'ఆర్యవర్యా! మీవంటి సాధుజనుల పరిపూర్ణ కరుణారస మునకుం దావలంబులమై యుండగా మాకు లోప మెక్కడిది? నాఁడు గాఢాంధకార బంధురంబయిన నిశీథంబునఁ బురంబు వెడలి గమ్యస్థానంబునకు మార్గం బెఱుంగక చిడిముడి పడుచుండఁగా మమ్ము నిరపాయ స్థలంబునకుఁజేర్చుటయే, తమయవ్యాజ కరుణా రసమును వెలిపుచ్చుచుండెను. ఇఁకమీఁదఁగూడ మాపై మీ కరుణారసముంచి దుష్టులకు జిక్కకుండఁజేసి గమ్య స్థానంబునకుఁ జేర్పుడు. మీరాకకుఁ వేచియున్నారము. మమ్ముల రక్షింపు' డని యనంగసేన పలికెను.

'అమ్మాయీ! నీవు నా కుమారికవు. నాకంఠములో జీవమున్నంత కాలమును. మీప్రాణంబులకు గాని మీ గౌరవం బునకుఁ గాని, భయపడ నవసరము లేదు. అనదల బాధల తొలంగించి బ్రోచుటయే మావంటి సాధులకు విధి. అందులో ననాథస్త్రీలనుబ్రోచుట విహితకృత్యమని వేఱచెప్ప వలయునా? అందులో నీవు మాసార్వభౌముండవయిన కృష్ణదేవ రాయులకుఁ బ్రియురాలవు. అట్టినిన్ను నీయభీష్టస్థలంబునకుఁ గొని పోవుట కేమివింత? భయపడకుము'అని భట్టాచార్యుండనియె.

'ఆర్యా! చక్రవర్తి ప్రియురాలవని యేల పల్కెదరు? నే నతని మనఃప్రియురాల నైనచో నాకిట్టిదురవస్థ పట్టనేల? ఇఁక

నాకుగౌరవములభించుట శశవిషాణప్రాయము.' అని గద్గదకంఠయై కన్నులనుండి బాష్పంబును వర్షించుచు ననంగసేనపల్కెను. ఆమె దుఃఖంబునుజూచి మాలతియును దుఃఖింపనారంభించెను.

'ఓయువతీమణీ! నీకు లోకానుభవంబుచాలదు. అందుచే నేపాటికష్టము వచ్చినను నదే గొప్పకష్టమనితలంచి యనుభవింప వగచుచున్నావు. కష్టంబులు శాశ్వతంబులుగా నుండవు. నేఁడు కష్టమువచ్చినది. రేపు సుఖమువచ్చును. ఇంతమాత్రకై వగవ నేల? రాజులచిత్తంబులు క్షణక్షణ చంచలంబులు. వారలకు సామాన్యముగా యుక్తాయుక్త వివేకము శూన్యము. ఎద్దీనెననఁ గొట్టంబునఁగట్టింపు మనెడి రాజులకు వివేక మెట్లు సంభవించు? వారు వివేకహీనులై యెవ్వ రేమి చెప్పిన నదే సిద్ధాంతమని నమ్మి నిరపరాధులను బలుబాములు పెట్టుచుందురు. ఆరాజు చెప్పుడుమాటలు విని నిన్నిప్పుడు వెడలఁ గొట్టినను, మరలఁ గొలఁదికాలములోనే వివేకము వహించి సత్యాసత్యాన్వేషణప రుండై నిన్నుఁ గొనిపోయి గౌరవించును. కావున దుఃఖింపకుము.' అని భట్టాచార్యుం డనెను.

'ఓ మహీసురా! ఆరాజచంద్రుండు నీ వన్నట్లు వివేక శూన్యుండు కాఁడు. అతఁడు సామాన్యరాజుల వంటివాఁడు కాఁడు. అతఁడు మహోదారుఁడు. ఔదార్యాది గుణగణంబుల కతఁ డాలవాలము. సామాన్యరాజులవలె నతఁడు నిరక్షరకుక్షి కాఁడు. అతఁడు మహావిద్వాంసుఁ డగుటయే కాక నిరుపమాన కవితాశక్తి కలవాఁడు. పెక్కండ్ర కవీశ్వరుల కాశ్రయమిచ్చి

వెలుచున్నాఁడు. ఇట్టిమహాత్ముండు నా కపకారము చేసినంత మాత్రంబున నిందనీయుండు కాఁడు. ఇంతేకాక యతండు రాజేంద్రుఁడు. రాజునకుఁ బ్రజలలోనర్చు దుష్కార్యంబుల వారించి పాలించుట విహితకృత్యము. కావునఁ నేను బ్రియురాలనైనను, దుష్కార్యంబు లాచరించుచున్నట్లు దెలుపు నిదర్శనంబులతఁ నికిఁగన్పించినప్పు డూరకుండుట పాడికాదు. కావున నేనతని నెంతమాత్రంబును నిందింపను నాయదృష్టంబునే నిందించుకొందును.' అని యనంగసేన పల్కెను.

'యువతీలలామా! ఇంతకాలమతని నాశ్రయించుటచే నతనిఁ బొగడుట యుక్తకార్యమే. ఇట్లయిన నీయందు నిష్కారణముగా నిందమోపి వెడలగొట్టించు టేమిపని? అవిమర్శనపూర్వకముగా నీ కవమానము కల్గించుటతప్పని నిరాటంకంబుగావాదింపగలను. దుశ్చరిత్రవుకాని నిన్ను వెడల గొట్టించుట యట్టిరాజునకు యుక్తమా! లేక నీవుదుశ్చరిత్రవా? యోజింప నీవాదమే నీవుదుశ్చరిత్రవన్నట్లు స్థాపించుచున్నది. నీవు దుశ్చరిత్రవైనచో రాజేంద్రుఁడొనర్చినది యుక్తము. నీవట్టిదానవు కానిచో రాజేంద్రుండు తప్పక నిందనీయుండే!' అని భట్టాచార్యుండు మగుడ వచించెను.

ఆర్యా! మీవాక్యమునాకంతరుచింపలేదు. ఆకృష్ణరాయుడే నాభర్త. అతఁడే నా దైవము. అతఁడే నా ప్రాణము. అతఁడు నాకపకారము చేసినను, నే నతని బ్రాణాధికునిగాను, హృదయవల్లభునిగాను దలంచుకొనుచున్నాను. నా కతనిమించినవస్తువు లోకంబునం దెద్దియును లేదు. నాచరిత్రంబు దోషరహితం బైన

దని యీశ్వర సాక్షికంబుగా వక్కాణింపఁ గలను. నే నిరపరాధు రాల ననుటకు సందియములేదు. ఆ రాజేంద్రుండును నిరపరాధుఁడే. లోకంబునఁ గొందఱు దుష్టాత్ము లెట్టిమహాత్ములకైన మోసము గల్గించెడి కపటోపాయంబులఁ బన్ని సాధులను బాధించుచుందురు. దురాత్ము లెవ్వరో నాయందు ద్వేషము వహించి నాకు బాధల గల్పింపనెంచి నాదుశ్చరిత్రము స్థాపింపఁ జాలిన యుత్తరంబును గల్పించి యందుండువిషయముల కనుకూలముగా మాయుంగరంబులను మార్చివేసిరి. ఇట్టి ప్రబలకారణంబు లుండఁగా రాజేంద్రుఁ డెట్లు సహింపఁ గలఁడు? కావున నతఁడు న న్నపరాధినిగా నెంచి దండించిన దండింపవచ్చు? దండింపబడినంతమాత్రమున నేనును దుష్టురాలను గాను. నాకు సంభవించిన యపారదుఃఖంబులకుఁ గారణము దుష్టాత్ములుగాఁ బరిణమించిన నా పురాకృత దుష్కృతమే కాని యా రాజేంద్రుండు కాఁడు. అని యనంగసేన మెల్లమెల్లగాఁ బల్కెను.

'మాయనంగసేన చెప్పినది సత్యము. దుష్టాత్ము లెవ్వరో కపటోపాయంబులను బన్ని మా కిరువుర కిట్టి యపాయంబులు గల్గించినారు. దుష్టులెవ్వరోయని సందేహింప నవసరములేదు. విజయనగరంబునసంచరించు పిచ్చిముండకొడుకేయి ట్లొనరించెను. వాఁడు కోఁతి నాడించిననాఁడే యిప్పని యొనరించి యుండును. ఉత్తరమును యిచ్చినవాఁడు కపటపుష్పవర్తకుఁడు. వారికిని నా పిచ్చివానికి నేదోసంబంధ ముండితీరును. ఆపిచ్చివాఁడే యతనిచే నాయుత్తరము వ్రాయించి యుండును. ఆయుత్తరము బయల్పడిన

నాఁటి రాత్రియే యాపూలవర్తకునికై వెదకితిని. ఎచ్చటను గానరాఁ డాయెను. ఇది యంతయు నింద్రజాలమువలె నున్నది. ఇదో యింక కొలఁది దినంబులలోనే నల్వురకుం దెలియకపోదు. అది క్రమక్రమముగ రాజునకుఁ గూడఁ దెలియును. అప్పుడు రాజు తత్వమును విచారించి మాయనంగ సేనను గౌరవించి యుండును. కాని యీమె కోపావేశంబుచే నేఁ జెప్పిన వచనంబుల వినక యిల్లు వచ్చినది.' అని మాలతి యనంగసేన వాక్యంబును దృఢ పఱిచెను.

'సుందరీ! మీ రాడువాండ్రు. మీకు యోజనాశక్తి చాలదు. కాన మీరు తత్వమును గ్రహింపలేక పిచ్చివాఁడే యిప్పని చేసెనని నిశ్చయించుచున్నారు. కాని యనంగసేనాదుల కపాయంబులు గల్గించుటవలన నాపిచ్చివాని కేమిలాభము' అని భట్టాచార్యుండు పల్కెను.

'విప్రోత్తమా! దుష్టులకు సాధుహింసయే ముఖ్యకార్యము. పరులు తమజోలికి రాకున్నను, వారు పరులకు బాధలనే సమ కూర్చుచుందురు. ఆపిచ్చివానికి విజయసింహునిపై గోప ముండవచ్చును. అతని నుద్దేశించిన యాపద యనంగసే నకుఁ గూడ సంప్రాప్తమైనది.' అని యనంగసేనం జూచి 'అమ్మా! మనమెట్లయిన విజయనగరంబునకు రహస్యంబుగాఁ బోయియుండుట మంచిది. మనము సమయము చూచి యా పత్రికాంగుళీయకంబులు దుష్టప్రేరితంబులని రాజేంద్రునకు నమ్మ

కము పుట్టునట్లు బోధించినచో నీకాశ్రయమిచ్చి తీయును. ఇదియే ముఖ్యకార్యమని తలంచెదను. అని మాలతి పలికెను.

ఆ వచనంబులు విని యనంగసేన యోజించుకొనుచుండఁగా భట్టాచార్యుండు వారింజూచి, 'ఓయబలా! నీకు యుక్తాయుక్త వివేకము చాలదని మొదటనే చెప్పితిని. ఈసమయంబుననీవు విజయనగరంబునకరుగుట యుక్తముకాదు. రాయలకింకను నీమీఁద కోపము తగ్గియుండదు. ఇట్టిసమయంబున నీవుపోయి మొగంబు చూపితివేని కార్యంబంతయును నశించును. నీవిప్పట్టునఁ గొండపల్లికిఁబోయి కొంతకాల ముందువేని నీ నిర్దోషత్వంబును దెలిసికొని విచారించి రాయలే నీకు సందేశ మంపును. పిలిపించికొని వెళ్ళినప్పుడే గౌరవము లభించును, గాని నీయంతట నీ వేగిన గౌరవంబు నశించుటయే కాక కార్యంబు సైతము విఫలమగును. కావున నాబుద్ధివిని నాతోరండు' అని హితాహితంబుల బోధించి వచించెను.

'విప్రవర్యా! మీయాజ్ఞ చొప్పుననే వర్తించెదము. మమ్ముల నిరపాయంబుగాఁ గొండపల్లి దుర్గంబునం జేర్చి రక్షింపుఁడు. మీవంటి సాధుజనులు మాయందు నిర్హేతుకకారుణ్యంబు చూపుట మాపూర్వపుణ్య విశేషంబు వలననే కదా?' అని వారనిరి.

'ఓ యువతులారా! తీర్థసంసేవనంబు చేయుచు బరుల కుపకారం బొనర్చుటయే మాకు విహితకృత్యము. కావున మీ కపాయము కలుగకుండఁ గాపాడి మీ గమ్యస్థానంబునకుఁ

జేర్చెద.' అని పల్కి వారి నొప్పించి ధూమ్రరునాఁడే పయనం బయి వారితో నాస్థలంబును విడిచెను.

---

## ఇరువదియవ ప్రకరణము

### రాయచూరు దుర్గము

'గీ. భ్రష్ట మెలఁగుచున్న నాపన్నుఁడైన ।
వానికే భీకరాపదల్ వచ్చుచుండు ।
కడఁగి కడు నేర్పుతోడను నడుచుచున్న !
గాయముండినకాలికే ఘాత మొదవు॥'

కృష్ణాతుంగభద్రానదులకు మధ్యనున్న కొంతభాగ మంతర్వేది యని పిలువఁ బడుచుండు. అందు రాయచూ రనెడి బలిష్ఠదుర్గం బొకటి గలదు. ఆదుర్గంబు సామాన్యమైన దైనను, జరిత్రంబులలో మిక్కిలి ప్రఖ్యాతి వహించెను. అది విజయనగరవిజాపురరాజ్యముల సరిహద్దులలో నుండుటచేఁ దద్రాజ్యాధిపతులలో నెవరు బలాధికులో వారు దానిని వశముగావించుకొను చుండిరి. అందువలన దానిం గూర్చి విజయనగరవిజాపురరాజులకుఁ బెక్కు యుద్ధంబులు ప్రభవిల్లెను. అది మొదట విజయనగర రాజులది. వారు బలహీనులై యున్నప్పుడు విజాపుర రాజులు వశముగావించుకొనిరి. మనకథాకాలమున నాఁ డిస్మల్ ఆదిల్ షాహ యనెడి విజాపురరాజు పాలనమునకు లోఁబడి యుండెను. కృష్ణదేవరాయలు దానిని వశముగావించుకొనఁ

నిర్వ్యాపారి నెక్కుడుగా బాధించును. వానికంటె విజనప్రదేశ వాసియైన నిర్వ్యాపారిని, నంతకంటె మనోహరవస్తు సంతతిచేఁ దులదూగు విజనప్రదేశమున వ్యాపారశూన్యుండై కాలంబుఁ గడపువానినిఁ గామానలము క్రమాధిక సంతాపతప్తులనుగాఁ జేయుచుండును. మన ఖానునందుఁ బైని వర్ణింపఁబడిన యంశము లన్నియు బొందుపడియుండెను. అతఁడొక్కండు నట్లు కూర్చుండి నిమీలిత లోచనుండై యేమేమో యోజించు కొనుచుండెను. ఆసమయంబున నొక పురుషుండా మందిరమ్మునుఁ బ్రవేశించెను. ఆదురవస్థలోనున్న యతనికాతనియాగమనంబు మొదటఁగోపజనకం బయ్యెను. కాని యప్పురుషునిమొగము చూచినతోడనే యది యతని కానందజనక మయ్యెను. ఆనూతనపురుషున కామహా మ్మదీయుఁ డుచితకృత్యము లాచరించి యర్ఘ్యాసన మిచ్చి యాదర మేదురకటాక్షంబు లతనిపైకిఁ బఱపి 'ఓ రామయమంత్రీ! నీవు పోయినకార్య మేమాయెను? మందహాసభాసురంబగు మీవద నంబే సఫలీకృతకార్యు లయినట్లు చెప్పక చెప్పుచున్నది, అయి నను మీవదనారవిందంబునకు మకరందసదృశమైన వచననిచయం బుచే వీనులకు విందొనర్పుఁడు. అప్పుడుగాని మనంబున నున్న యారాటంబుతొలంగదు' అని యత్యాదరంబుతోఁ బలికెను.

'ఓ తురుష్కాగ్రణీ! కార్యములందు స్థిరసంకల్పుఁడై రామయమంత్రి యరిగినప్పుడు సఫలంబుకానికార్యములుండునా? కార్యంబుసఫల మైనది' అని మందహాసము చేయుచు రామయ మంత్రి పల్కెను.

'వహ్వారే! శబాస్ మంత్రివర్యా! నీ సామర్థ్యం బమేయంబు. నీ నిరుపమాన ప్రజ్ఞావాతూలంబునకుఁ దక్కిన మంత్రులును, రాజేంద్రులును, దూదిపింజలవంటి వారని తలంచెదను. భవదప్రతిమప్రతిభామహానదీప్రవాహంబునకే మంత్రివర్యుల ధీనౌకలు ప్రతిఘటించి నిరపాయంబుగా నిలువఁగల్గు? ఆయువతీరత్న మిప్పుడే స్థలంబున కలంకారభూతమై యున్నది?' అని ఖాను సంతసముతో నడిగె.

'ఓ మహమ్మదీయశ్రేష్ఠా! ఆసుందరీతిలకము సఖీద్వితీయయై యీమార్గంబుననే ధర్మసత్రంబున విడిసి యున్నది. ఆ శుభోదంతంబును మీకుఁ దెలిపి యానందంబు గొలుప మును ముందు వచ్చితిని.' అని రామయమంత్రివచించెను.

'అక్కటా! యెంతపని చేసితిరి. సుందరసౌధంబున కలంకారభూతంబైన యాసుందరీతిలకంబును ధర్మసత్రంబు పాలుచేసి యా వచ్చితిరే?కటకటా! యామాట విన్నప్పటి నుండియు నా మనంబు కటకట పడుచున్నది. వెంటనే సేవకులఁ బంచి రప్పించి యాసుందర సౌధాంతరంబున నిడియుంచుట యుచిత కృత్యంబని తలంచెదను.' అని త్వరపడుచుఁ బలికెను.

'మహమ్మదీయాగ్రణీ! త్వరపడి సేవకులఁ బంపవలదు. అట్లయినఁ గార్యంబు చెడును. వారిని వంచించి మంచి మాటలాడి, కొండపల్లిదుర్గంబునకుఁ గొనిపోదునని నమ్మించి, యిచ్చటికిఁ దెచ్చితిని. ఆమెదుఃఖాగ్నిహోత్రంబింకను శమింపలేదు.ఇఁకఁ గొంతకాలము చనినం గాని తదీయదుఃఖంబు పూర్తిగానశింపదు.

అంతవఱకు నీవుకాని, నీసేవకులుగాని యామె కంటఁబడి యను మానము కల్గింపరాదు. అట్లు చేసితిరేని క్రమముగా మనసమా చారము తెలిసికొని మఱింత దుఃఖమ్ము చెందును. అందువలన మనకార్యంబు చెడును. స్త్రీల కిందుసాహసము మఱియొక్కరి కుండదు. సాహసించి ప్రాణంబులు పరిత్యజించినఁ బరిత్యజింపఁ గలదు. కావునఁ బ్రస్తుతంబున వారి నారామమందిరంబున విడి యుంపఁదగు. ఒకవారముదినము లట్లుంచి మంచిమాటలాడి క్రమంబుగాఁ దన్మనంబును నీవంక కాకర్షించుకొని తెచ్చి యీ సౌధంబున నుంచుకొనవచ్చు, ఎంతో జాగరూకతతో వర్తించినం గాని ప్రకృతిచేవక్రమైనస్త్రీబుద్ధినిఁదిన్నఁదనంబునకుఁగొనిరాలేము. తొందఱపడినోటిముందఱిపదార్థంబుననుభవింపలేక చెడఁగొట్టుకొన కుము. నెమ్మదితోఁబ్రవర్తిల్లి కార్యముసాధించుకొనుము. రాజ్య లక్ష్మినివశంబు గావించుకొనెడి చాతుర్యంబుకంటె నూఱురెట్లధిక చాతుర్య మలవడినం గాని స్త్రీలలామను వశంబుగావించుకొనుట దుర్ఘటంబు. అందులో నొకనియందుఁ బూర్ణానురాగంబుండిన మెలనాగను స్వాధీనము గావించుకొనుట మఱింత దుర్ఘటము. ఈ యువతీలలామ చక్రవర్తియందుఁ బూర్ణానురాగంబుతో వఱ లుచున్నది. నాబుద్ధిచాతుర్యంబునఁ గొనివచ్చి నాపని నేను నెఱ వేర్చుకొంటిని. ఇఁక నామెను వశంబు గావించుకొనుపని నీయది. అని రామయమంత్రి యుపదేశించెను.

'మంత్రి సత్తమా! ఇఁక నే నన్ని దినంబు లోర్చియుం డుట మిగుల గష్టము. ఈ యనంగసేనతండ్రి నాకు మిత్రుఁడు.

నేనొకపరి కొండపల్లికిఁ బోయినప్పు డాయువతిని జూచియున్నాను. ఏసుందరీలలామ తన మనోహరవిభ్రమ సంపదలచే నాడెందం బాకర్షించెనో, యామె యిప్పుడు నాదుర్గమందే నాయారామ సౌధమందే నివసించియుండఁగాఁ జూడకుండ నె ట్లోర్చియుందు? ఆ కొనియున్నవాని నోరూరఁ బ్రమోల రసనానందకరంబులైన పదార్థంబు లుంచి తినవలదని నిషేధించిన నెట్టి వాఁడైన నా నిషేధంబునకుఁ గట్టువడునా?' అని ఖానుపలికెను.

'తురుష్కాగ్రణీ! అది కష్టసాధ్యమైనను నోర్చియుండక తీఱదు. ఆహారపదార్థము లారోగ్యప్రదాయకములు కావని వైద్యులు చెప్పినప్పుడు పరిత్యజించుటయే శ్రేయస్కరము కాదా!' అని మంత్రి యుపదేశించెను.

రామయమంత్రివచనంబులుతనకు హితకరంబులుగానున్న ట్లులోఁచుటచే ఖానంగీకరించెను. అనంతరము మంత్రి యతని వీడ్కొని ధర్మసత్రమునకు వచ్చె. ఇతఁడు పోవునప్పటి కాపడతు లిట్లు సంభాషించుచుండిరి.

అః-మాలతీ! ఈవిప్రుండు మనపాలిటి భాగ్యదేవతవలె సంభవించెనుసుమీ? నేఁటిప్రయాణము సుంతేనియుఁ బ్రయాసకరంబు కాలేదు.

మాః-అవును, నీ వన్నది సత్యమే, ఆమహనీయుండు చెప్పెడి కథలవలన మనప్రయాసము యథాయథలై పోయెను.

అః-ఇ దేదో గొప్ప దుర్గమువలె నున్నది. ఈదుర్గ మెందులోనిది? విజయనగరరాజ్యంబులోనిదేనా?

మా:-అమ్మా! ఇది రాయచూరుదుర్గమఁట. పూర్వ మిది విజయనగరరాజ్యములోనిదే కాని ప్రస్తుతము విజాపురరాజునకు లోఁబడి యున్నదఁట! దీని నొకమహమ్మదీయప్రభువు పాలించుచున్నాఁడఁట.

అ:-ఇది ప్రధానమయిన దుర్గమని వినుచున్నాను. దీనికే విజయనగరబిజాపురరాజులకు ఘోరసంగ్రామములు సంభవించెనఁట! దానికేమి? ఈవిప్రుండిచ్చటికి మనల గొనివచ్చుటలో నభిప్రాయ మేమి?

మా:-ఆవిప్రుండు దురభిప్రాయంబుతోఁ గొనివచ్చి యుండఁడు. అతఁడు మిగుల మంచివాఁడు. ఈదుర్గము మార్గమధ్యమందుండుటచేతను, నతని మిత్రవర్గ ముండుటచేతను నిచ్చట విడియవలసివచ్చె. ఇఁక గొన్ని బసలతోనే మనము కొండపల్లికిఁ జేరఁగలము.

అని వారట్లు సంభాషించు చుండఁగా రామయమంత్రి వచ్చె. ననంగసేన యతనింజూచి ,ఆర్యా? నేఁటికిఁ బ్రయాణము చాలింతమా? లేక మఱికొంత దూరము, పోవుదమా?

రా-అమ్మా. ఈదినంబు చాలదవ్వు పయనంబు చేసితిమి. నాకే మిక్కిలి యలఁత కలిగినది. కుసుమకోమలశరీరలయిన మీరలఁత చెందుదురని వేఱ చెప్పవలయునా? కావున నేఁడిచ్చట నివసించి నామిత్రులిచ్చిన యాతిథేయసత్కారము లంబడసి రేపు వెడలి పోవుదము.

అ-తమసెలవు చొప్పుననే నడుచుకొందుము. కాని ఈదుర్గం బెవ్వరిది? ఇప్పు డెవ్వరి పరిపాలనము నున్నది?

రా-అమ్మా. ఇది విజాపురరాజ్యంబులోనిది. ఇప్పుడు తద్రాజ్యాధిపతియగు నాదిల్‌షాహా యానతిచేఁ దోఫల్‌ఖానుఁడను మహమ్మదీయ ప్రభువు పాలించు చున్నాఁడు.

అ-(విప్రోత్తమా! మీవాక్యంబులు విన్నతోడనే నాహృదయంబు కపించుచున్నది. మనంబునఁ గొండంతభయం బావేశించుచు చున్నది. ఏమి సంభవించునో' యని యనంగసేన యేడ్వ సాగెను.

రా-(యువతీలలామా! నీ వట్లు భయపడెద వేల? నీ భయంబునకుఁ గారణంబు తెలుపుము. సమస్తమంత్రోపాసనాశక్తిగల నాకుఁ గోపంబుద్భవించినచో నీరాజమండలం బంతయు నిస్తేజస్కంబై పాదాక్రాంతమగునని మనంబున నమ్ముము. నన్ను సామాన్యుగాఁ దలంపకుము. మనలఁ బట్టుకొన రాజాధిరాజు దండెత్తివచ్చినను, మన్మంత్రప్రభావంబునఁ బరాభూతుం జేసి పాఱదోలుదు నని నమ్ముము. భయకారణంబులు నుడువుము. దానంగలతత్వము వివరించెదను.' అని రామయమంత్రి వచించెను.

అమ్మంత్రి పుంగవుని వచనప్రకంపన మాతరుణీలలామల హృదయగగనమున వ్యాపించుచున్న దుఃఖనీలజలదంబులను జెదరగొట్టెను. అంత ననంగసేన కొంత యూరటచెంది, యమ్మంత్రి వదనారవిందంబునఁ దన నిరీక్షణమధుకరంబులఁ బ్రసరింపఁజేసి,

'ఓధరణీసురోత్తమా! నీవునిరుపమానశక్తియుతుండ వని యిప్పుడు తెలిసికొనుచున్నాము. నీకు మేము చిరకాలపరిచితురాండ్రము కాకపోవుటచే నీసంపూర్ణశక్తి నెఱుంగజాలకపోతిమి. మేము స్వభావభీరులము. కర్తవ్యాంశవిమూఢలము. కాన క్రొత్తస్థలంబు కంటఁబడగానే, క్రొత్తవారిపేరులు వినఁగానే మిగుల భయపడు చుందుము. సాధారణముగా మహమ్మదీయులు హిందువులను బాధింతురనియు, హిందూయువతులగౌరవంబు చెఱుతురనియును విని శార్దూలంబులకు నివాసభూతంబగు కొండగుహలో వసింపఁ దలంపుగొన్న మృగశాబకంబులకు మాస్థితి సరిపోవుచున్నదని వగచుచున్నాము.' అని విచారించుచుఁబలికెను.

'సుందరీమణీ! నీయభిప్రాయంబు నాకవగతమైనది. ఈ దుర్గాధిపతి తురుష్కుండుకాన మీగౌరవంబునకు భంగముగల్గించు నేమోయని భయపడుచున్నారా? మీరట్లు సందియమంద నవసరములేదు. మీరనుకొనునట్లు మహమ్మదీయు లందఱును దుష్టస్వభావులని తలంపవలదు. వారిలోఁ గొందఱు సుస్వభావులు లేకపోలేదు. ఈదుర్గాధిపతి మిగుల మంచివాఁడు. అతఁడు హిందువులందుగాని, హిందూమతమందుఁగాని ద్వేషబుద్ధికల వాఁడుకాఁడు. ఇంతేకాక యతఁడు నాకు బరమాప్తుఁడు. కావున నిందులకై భయమందకుఁడు.' అని రామయమంత్రి పలికెను.

'ఓవిప్రవర్యా! మీరంతధైర్యవంతంబులగు వచనంబులు పలుకుచుండ మాకు భయమెట్లు కలుగును? మాభారమంతయు మీదే. మిమ్మునే నమ్ముకొని వచ్చినారము. విశ్వసించిన వారి

కుత్సితకలుత్తరించు విశ్వాసహీనులరు మీరు కారని యెరుగుదుము.' అని యతనిపాదములంబడి వేఁడికొనిరి.

'ఓ యనంగసేనా! నీవు భయపడనవసరంబులేదు. భవద్రక్షణభారంబు వహించితిని. మీకెవ్వరినుండియు హానికలుగకుండఁ జేయఁగలుగుదునని నమ్మెదు. మొదట నీధర్మసత్రములో విడియవచ్చునని తలంచితిని. కాని యిందున్న మీక్షేమము సందేహాస్పద మని భావించి యింతకంటె వేవిధంబుల సురక్షితమైయున్న యొకసౌధరాజంబును గాంచివచ్చితిని. అందుమన మీరాత్రివసించి రేపకడ పయనము చేయుదము.' అని మంత్రి పల్కెను.

'విప్రవర్యా! ఈధర్మసత్రము సురక్షితమైనట్లె కనుపట్టుచున్నది. ఈరాత్రి యిటఁగడపి వేకువనే పోఁగూడదా? సౌధమందు నివసించిన నాపూర్వస్థితి జ్ఞప్తికివచ్చి మరింతదుఃఖంబు గల్గించును. నిరుపమానశక్తివగు నీవు మాకు సంరక్షకుఁడవై యుండగా నరణ్యములో నుండినను భయములేదన్న దృఢవిశ్వాసంబు నాకుదయించినది.' అని యనంగసేన పలికెను.

'నీవన్నది సత్యమే. నేనుండమీకు భయముండదు. ఎట్లయిన జాగరూకులమై యుండుటమంచిది. ఆసౌధము చోరక్రూరాదుల కెంతమాత్రము చొరశక్యముకాదు. అందుండుట నిరపాయము. తత్సౌధప్రవేశమును దుఃఖదాయకంబుగా నెంచకుము. నీయదృష్టవశంబున నదియే శుభదాయకంబగును. నాకు జ్యోతిషంబు పూర్తిగాఁదెలియును. నీనామనక్షత్రంబును గణించి

చూచితిని. నీకు శుభదివసంబులు రానున్నవి.' అని మంత్రిపల్కెను.

అతనివాక్యంబులకు వారిరువురును బరమానందమొంది యతని ననుసరించిపోయిరి. మహాప్రతిభాశాలులగు రాజాధిరాజులనే తన బుద్ధిచాతుర్యంబున మోహాసముద్రంబున ముంచుచుండఁగా నాస్త్రీలను మోహాబ్ధిలోముంచుట రామయమంత్రి కొకఘనకార్యమా?

వా రాధర్మసత్రంబును విడిచి పదిబారలదూర మేగునప్పటి కొకప్రాకారకుడ్యము కనులపండువు నొనర్చె. వారాగోడప్రక్కనుండి మఱికొంతదూర మరుగగా ద్వారంబునంబడి లోపలికిఁ బోవుచుండిరి. అక్కడ పెక్కండ్రుభటులు రక్షించుచుండిరి. కాని వీరిని బ్రతిబంధింపలేదు. ఆమంత్రి యువతీలలామలతో సౌధంబును బ్రవేశించెను. ఆసౌధము సుందరవస్తువిలసితమై చూపఱ కానంద సంధాయకంబే యగుచున్నది. అయినను విచారపరీతస్వాంతురా లయిన యనంగసేనకు సంతాపదాయకమే కాఁజొచ్చెను. అప్పుడు రామయమంత్రి వారింజూచి 'మగువలారా! మీ రెందు వసించియుండుఁడు. మీ కెవ్వరినుండియుభయంబుగలుగదు. ఇది దేవతలకై ననుదురధిగమము. యుక్తసమయంబునకొకయువతి మీకాహారంబులు దెచ్చి యిచ్చును. నేఁ బోయి నాస్నేహితునితో సంభాషించి వచ్చెదను. తెల్లవాఱుజామునఁ బ్రయాణంబు చేయుద' మని చెప్పి వారి నొప్పించి తా నచ్చోటు విడిచిచనె. ఆయువిదలు లతనివచనంబుల కమితానందంబు నొంద సాగిరి. అతఁడు వంచించెనని తెలిసికో లేకపోయిరి.

---

## ఇరువదియొకటవ ప్రకరణము

## ధర్మసత్రము

,,గీ. పడతి విభ్రమముకుఁ లోబడనివాఁడె ।
తలఁచి చూడఁగ ధరణిలో ధన్యతముఁడు
భావజాధీనుఁడగుచు లోఁబడినవానిఁ ।
గొమ్మలాడింతు రొకకోయ్యబొమ్మనట్లు॥"

హిందూదేశంబునఁ బ్రఖ్యాతివహించిన పుణ్యనదులలోఁ దుంగభద్రానది యొకటి నిర్మలజలప్రవాహశోభితయై మిక్కిలి ప్రఖ్యాతివహించుచున్నది. అది పడమటికనుమలలో నుద్భవంబంది యించు మించుగా నిన్నూటయేఁబదిమైళ్ళు తూర్పునకుఁ బాఱి కృష్ణానదితో సంగమించుచున్నది. ఆమహానది నిర్మలజల ప్రవాహయై తదుభయతీరంబులం గలసస్యంబుల నభివర్ధించుచు జనోపయోగినియై యున్నది. తత్తీరంబునఁ బ్రసిద్ధంబులగు నగరంబులలో నాదవాని యనునది యొకటి. అప్పురంబున బాటసారుల కనువయిన ధర్మసత్రమొకటి యుండెను. ఒకనాఁటిరాత్రి రెండుపాళ్ళతిక్రమించిన తరువాతఁ గొందఱుబాటసారులువచ్చి యందు నివసించిరి. రాత్రి చాలభాగ మతిక్రమించుటచేతను, మార్గాయాసము మిక్కుటమగుటచేతను, వారందఱును వచ్చుచున్ననిద్దుర నాపఁ జాలక యందు శయనించిరి. శయనించుటయే తడవుగా వారు గాఢనిద్ర చెందిరి. వారట్లు నిద్రించుచున్నను

నొక పురుషుండు మాత్రము నిద్రింపక భయంకరకరవాలంబు ధరించి యిట్టటు నడయాడుచుండెను. అతఁడును నిద్రించిన వారితోఁబాటుగా నడిచి వచ్చినను నిద్రాదేవి వాని చెంతకైనను రాలేదు. కార్యభారంబు తలపైఁ బడి యఱుముచున్నప్పు డెట్టివాఁడైనను నిద్రాదేవియనుగ్రహంబును బొందఁగలఁడా? అంతియకాక మిక్కిలిసంతసంబుగాని, కార్యాలోచనాభరంబునుగాని పొందియున్నవారిని నిద్రాదేవి కడకంటిచూపులతో నైనను జూడలేదు. ఆపురుషుఁడు పైనుదహరింపఁ బడిన యవస్థలలో రెండువస్థలకుఁ జిక్కియున్నాఁడు. తనతో వచ్చుచున్నయువతీలలామను రక్షించుట యొకటి. చిరకాలంబునుండి తనమనోనురాగంబునకుఁ బాత్రురాలయిన యాయువతిని శత్రుమధ్యంబునుండి తప్పించుకొని వచ్చుట రెండవది. మఱియు తనకత్యంతంబును సంతసము గూర్చు యువతీరత్నము చెంతనుండఁగా నెట్టి మోటువాఁడైనను నిద్రింపఁగలుగునా? వాఁడట్లు కాచికొని యుండ రాత్రి చాలభాగ మతిక్రమించినది. తమతమ యాహారంబులు సంపాదించి గూండ్ల కరుదెంచుచుఁ జేయుచున్న ఘూకాదిపక్షు లరుతంబులచేతను, నాకాశంబనెడి నీలవితానంబునకుఁ బొరదీయగోళముభంగిఁ దనర్చెడి వేఁగుచుక్కచేతను, రాత్రియెంతయో లేదని నిశ్చయించి ప్రయాణము చేయ నెంచు వారిని మేల్కొలుప వలెనని సిద్ధముగా నుండెను. తనమనంబున నుద్భూతంబులైన వాంఛితంబుల ఫలాఫలంబులగూర్చి చింతించుచు నిద్రాదేవికటాక్ష మందలేకయున్న యాయువతీ

లలామ యప్పురుషునిపై ఖరిం జూచి యిట్లు ప్రసంగించెను.

యు-రుద్రదేవా! ఈ రాత్రి యొకమాత్రైనను గంటిరెప్ప వేయలేదు. పాపము నానిమిత్త మెంత కష్టపడుచున్నాఁడవు? నేఁ గొంతసేపు మేల్కని యుండెదను. నీ విఁక నిద్రింపుము.

రు- ముక్తాంబా! రామయమంత్రి కార్యభారంబు నాపై వైచి నప్పుడె నిద్రాసుఖంబును బరిత్యజించితిని. అతఁడు తనబుద్ధి చాతుర్యము వినియోగించి యతికష్టంబున నిన్ను శత్రు పురంబునుండి తప్పించి నా కప్పగించి వైరులఁబారి పడకుండఁ దీసికొని రావలయు నని యాజ్ఞాపించి యున్నాఁడు. నే నే మాత్ర మశ్రద్ధతో వర్తించినను నీ కపాయంబులు సంభ వించుటయే కాక మంత్రీశ్వరుని కష్టంబును బూర్తిగా నశించును.

ము:-అవును. మంచిమాటాడితివి. నన్నుఁదప్పించికొని వచ్చు టలో రామయమంత్రి మిగులఁ గష్టపడెను. భయంకరశాస్త్రా లంబులచందంబున నారక్షకభటులు రాత్రిందివంబులు కాచి యుండ నెట్లు తప్పింప గలుగునని సందియ మందితిని. అట్లుం డ నమ్మహనీయుఁడు నిరపాయముగాను, నిరాటంకంబు గాను దప్పించి ముహూర్తకాలములోఁ బైకిఁగొని వచ్చెను. కాని యతఁ డానెగొందెను దహించుచుండ వారు లూరకుండిరా?

రు:-ఏమి చేయుదురు? తనంతటఁ దాను దహింపఁ బ్రయత్నిం చిన చూచి వాని బంధించి వధించి యుందురేమో కాని

యతఁడట్లు చేయలేదు. సామాన్యముగా బాలకులు మంచి మాట లాడిన లొంగిపోవుచుందురు. రామయమంత్రి యది దెలిసికొని బాలురను మంచిమాట లాడి శైవమఠంబునొద్దకుఁ గొనిపోయి లంకాపురదహనకాలమందున్న యాంజనేయునివేషమును బాలకులచే వేయించుకొని నెమ్మదితో నిట్లు చేయుఁడని చెప్పఁగా వారతఁడు చెప్పినట్లు చేసిరి. మహామంత్రులే యతని యూహలను గాంచలేదు. అట్లుండ యుక్తాయుక్తవివేకహీనులగు బాలకుల కేమి తెలియును? అతండు చెప్పినట్లు బాలకు లతని యూరేగింపసాగిరి. పిల్లలును పెద్దలు వినోదంబులో మునిఁగి యుండిరి. మహావాయుయుతమగు నాకాలముకూడ నతనికి మిక్కిలి యనుకూలముగా నుండెను. అతఁ డట్లు కొంతసేపు విహరించి తెప్పపాటుకాలములో దుర్గరక్షకభటులమందిరంబులు దహించెను. ఆయాపద తప్పించుకొన రక్షకభటులు ప ర్వెడుదు రనియు, నప్పుడు మిమ్మునిరపాయంబుగాఁ దప్పింప వచ్చుననియు నతని యభిప్రాయము.

ము:-రామయమంత్రి యొనర్చినపని ఘోరాతిఘోరమైనదిసుమీ! ఆపౌరులువహ్నిజ్వాలా మాలావృతులై పెక్కండ్రు మడిసిరి. అదినాకు మిక్కిలి విచారంబు గొలుపుచున్నది. అక్కటా! అప్పురవాసుల యార్తనినాదంబు లిప్పటికిని నాహృదయకుహరంబునఁ బ్రతిధ్వనించుచునే యున్నవి.

రు:-సుందరీ! నీవు భయస్వభావవు. నవనీతహృదయవు.అందువలన, నేపాటిఘోరకృత్యము ప్రవర్తిల్లినం భయపడుచుందువు. ఏమాత్రము సంతాపము గలిగినను నీ హృదయము ద్రవించుచుందును. మావంటి వారి కవియొక లెక్కా? సంగ్రామంబుల వీరుల కరవాల ఘాతంబులకు జంకము. శత్రువు లెట్టివగగొన్నను జాలి గొనము.

ము:-ఎట్లయినను, పురుషులు కఠిన హృదయులు. ఎట్టి ఘోర కృత్యంబున కైనను జంకరు.

రు:-నీవన్న దంతగణనీయము కాదు. పురుషులు శత్రువులపట్ల నట్లు ప్రవర్తింతురు. తక్కిన-చోట్ల సాధుస్వభావులే, సదయ హృదయులే.

ము:-అందఱి మాట కేమి? నిన్నుంగూర్చి చెప్పుము. నీవు కఠిన హృదయుండ వగుదువా! కావా! శత్రువులపట్ల కఠినహృదయుండనై యుందునని చెప్పుచున్నావు. నేనీకు శత్రువ నగుట చేతనే నాయెడ కఠినహృదయుండవై వర్తించుచున్నావా? అని మందహాసము చేయుచుం బలికెను.

ఆ వాక్యం బతనికి నిర్ఘాతమువలెఁ దాఁకెను. ఏమియుమాటాడలేక పోయెను. అయినఁ గొంతసేపటికి ధైర్య మవలంబించి, ,,ఓ సుందరీ! ఎంత మా టాడితివి? నీవాక్యంబు నాకర్థము కాలేదు. ఏసుందరి వదనేందుబింబంబును సందర్శించుటవలన నాహృదయకువలయము పరిపూర్ణవికాసము నొందుచున్నదో, యామె . నాకు శత్రు వె ట్లగును? ఇట్టి శత్రుత్వ మెచ్చటను

జూడలేదు. చంద్రబింబమునకును, దన్నిర్గతసుధామయకిరణసందో హంబువలనఁబూర్ణవికాసము నొందుకువలయంబులకును,నట్లెభాను బింబంబునకును, దన్నిర్గతఖరతరకరసమూహమువలన వికస్వరంబు లగు నరవిందంబులకును, శత్రుత్వంబు స్థిరమైనచో, నీకును, నీవద నేందువువలన వెల్వడెడి మందహాసచంద్రికలచే నానందంబుఁజెందు నాకును శత్రుత్వము సంభవించును. ఓ రాజపుత్రీ! నీ సందర్శ నంబు లభింపనినాఁడు నానేత్రములును, నీమధురవచనంబులు విననినాఁడు నాచెవులును వ్యర్థంబులని తలంచుచు లోకంబున నీకంటె నానందసంధాయి యగువస్తువు వేఱొక్కటి లేదని యెం చుకొనుచు వర్తించుచుండ నీ విట్లు పలుకుట యుచితమా!' అని విచారంబును వినయంబును బూర్ణానురాగంబును వెల్లడించుచుఁ బలికెను.

ము:-రుద్రదేవా! నీవు మహాయోగ్యుండవు కావచ్చును. నీవు నాయందుఁ బూర్ణానురాగం బుంచిన నుంచవచ్చును. కాని యొకరి యభిప్రాయము తెలిసికొనుట వాని గుణప్రవర్తనం బులచేతనే తెలిసికో వలెను. నీవు నాయం దెట్టియభిప్రా యంబు గలవాఁడవయి యున్నావో, యది నీ ప్రవర్తనంబు వలననే తెలిసికో వలెను. అంతకుఁ దప్ప వేఱొక యుపా యము లేదు.

రు:-యువతీమణీ! ఏమేమో నేఁడు క్రొత్తమాటలు వినవచ్చు చున్నవి. నాప్రవర్తనంబేమి చెడినదో చెప్పుము. నామనంబు నీయెడ నిష్కల్మషమైనదని నిశ్చయముగాఁ జెప్పఁగలను. ఏ

కారణంబున నన్ను వైరినిగా భావించుచున్నావో చెప్పి నా హృదయాందోళనంబును జక్కఁజేయుము.

ము-రుద్రదేవా! నావాక్యంబులకుఁ గినియకుము. ప్రతిదినంబును నాకు దర్శన మిచ్చెదనని నాఁడు చెప్పి యట్లు చేసితివా? నీ వన్నంతయనురాగమే నీ కుండిన-చో నది యొరులమాటల వలన మరల్పఁబడునా? నిష్కపటాను రాగంబు నిమ్నాభిముఖమైన జలప్రవాహమువలె నెంతమాత్రమును నిర్బంధింపఁబడదు.

రు-లలనామణీ! తిమ్మరుసుశాసనంబునఁ బరులు మీమందిరంబునకు రావలను పడలేదు. ఎన్ని ప్రయత్నంబులు చేసినను నీసందర్శనంబు లభింపలేదు. రాజభటుఁడు మునుపున్నవాఁడు కాఁడు. వీఁడు లంచము గొను స్వభావము గలవాఁడు కాఁడు. ఏమి చేయుదును? ఆదినంబులలో నేఁ జెందిన సంతాపమాయరవిందాసనునకే తెలియు? చచ్చినవిజయసింహుం డదృష్టవశంబున జీవించెను. అతనిఁ జంపఁ జేయవలసినంత పురుషప్రయత్నము చేసితిమి? దైవము తోడ్పాటు లేమి వితథం బయ్యె. నీకుఁ సంతోషకరముకానియీవార్త నీ కేమని తెల్పుదును?

ము-ఏమేమీ! విజయసింహుండు మృతి చెందెనని వినియుంటినే? నీవేమి యిట్లు వచింతువు? ఆ విజయసింహుఁ డెట్లుగా రక్షింపఁబడెను? నీకుఁ దెలియదా!' అని యడిగెను.

ముక్తాంబకు, విజయసింహుండు క్షేమముగ నుండవచ్చు నని తెలియును. అయినను, నిజసమాచారము తెలిసికొనుటకును, నతని మోసపుచ్చి రహస్యంబుల బైటబెట్టుటకును నిట్లు పలుకు చున్నది. మఱియు మంత్రి పట్టుదలగలవాఁడు కాన, విజయ సింహావధకై మగుడ నేవయినఁగపటోపాయంబులఁ బన్నెనేమో తెలిసికొననిట్లు ప్రయత్నించుచున్నది. రుద్రదేవుండది తెలిసికో లేక రహస్యంబులను వెడల గ్రక్కుచున్నాఁడు.

రు- సుందరీ! విజయసింహునివధకుఁ గొనిపోయినవాఁడు నే నచ్చ టనే యుంటిని. వధ్యశిలపై నుంచిన విజయసింహుని మంత్రి పుంగవుండు వచ్చి కొనిపోయెను. ఆపై సంగతి మాకు దెలియ లేదు. ఆయుర్దాయమనిన వానిదే యాయుర్దాయము. మృత్యువునోటిలోఁ బడియు బ్రదికివచ్చుచున్నాఁడు.

ము:-మన రామయమంత్రి మిగులఁ బట్టుదల గలవాఁడు. అతఁ డాతని జంపుటకై తిరిగి యేమియుఁ బ్రయత్నింపలేదా?

రు:-లేదు. ఎందుచేతనో, విజయసింహావధోద్యోగంబునం దుపే క్షాపరుఁడై యుండెను.

ము:-ఎందుల కుపేక్షించును? అతఁ డేదియో కపటోపాయం బును బన్నియేయుండు. అది నీకుఁ దెలిసియు నుండవచ్చు. అయినను నీవు చెప్పవు. రహస్యంబులఁ జెప్పి సంతసింపఁ జేయుటకు నీవు మునుపటి రుద్రదేవుండవా?

రుద్రదేవుండు ముక్తాంబయొక్క యభిప్రాయంబును గను గొనలేకపోయెను. అతఁడు రామయమంత్రితో సంభాషించి నప్పు

పై నను ముక్తాంబ యభిప్రాయ మిట్టిదని చెప్పలేదు. చెప్పిన రహస్యంబులు బైట బెట్టుచున్నట్లు గ్రహించి కోపించునని భయపడుచుండెను. ఇతఁడు చెప్పక పోయినను రుద్రదేవునివలననే రహస్యంబులు బైటఁ బడెనని గ్రహించియు, నతని నడిగిన నత నికిఁ గోపము వచ్చుననియు నందువలన భవిష్య త్కార్యంబు లందు నిరుత్సాహుండగు ననియు, రహస్యప్రకటనంబువలన నత నికార్యమే చెడునుగాని తనకునష్టము లేదనియు నూహించి యత నితో నీ ప్రసంగము త్రవ్వలేదు. అందువలన రుద్రదేవుం డిం కను బెరటిదారినే యున్నాఁడు.

రు:-సుందరీ! నారసంబులకంటెను మిక్కిలి వాడియైన మాటలచే నాడెందంబును జిల్లులు వడఁ జేయుచున్నావు. రామయ మంత్రి, రహస్యంబులఁ బైట బెట్టకుండునట్లు నాచేఁ బ్రమా ణము చేయించెను. అట్లయినను, నాయనురాగంబున కాస్ప దురాల వయిననీవడుగు చుండఁ జెప్పకుండుట పాడిగాదని ప్రమాణంబునుసైత మతిక్రమించితిని. అట్టి నన్ను నీవిట్లు తలంచుట మంచిదా? రామయమంత్రి యిప్పటికి విజయసింహ వధోద్యోగంబునుండి మరలుట నిశ్చయము. తనతలంచిన రెండుకార్యంబులును నెఱవేరినవి కావునఁ దక్కినవెట్లయినను విచారంబు లేదనిపల్కెను?

ము- రుద్రదేవా! పరిహాసవాక్యంబులను యథార్థంబులఁగా బరి గణింపకుము. నీహృదయంబును నేనెఱుఁగనా? పోనిమ్ము! దానికేమి? అనంగనేన యవమానపీడితయై యెచ్చటికో

పోయెనని కొందఱును మరణించినదని కొందఱునుఁ జెప్పుకొను చున్నారు. ఆమెయెచ్చటి కేగియుండును? నీ కేమయినం దెలియునా?

రు- ఆమె యెచ్చటి కేగగలదు? రామయమంత్రి యామెను సామాన్యంబుగా విడుచునా? ఆమె బ్రదికియేయున్నది. మీరక్షణభారంబును నాపై విడిచి యాయనంగసేనను రాయచూరునకుఁ జేర్చుటకే యతఁడు మనల విడిచిపోయెను. మన మరుగునప్పటి కామె యచ్చటనే యుండును.

ము- అనంగసేనను గొనిపోవుటవలన మనకు లాభమున్నదని మంత్రి నాతోఁ జెప్పెను. ఆగొప్పలాభ మేమియో చెప్పఁ గలవా?

రు- రామయమంత్రి మొదట విజాపురరాజుసాయమును బ్రార్థించెను. కాని యతఁడు చిరకాలమునుండి తనతో మైత్రినొంది వర్తించురాయలతోఁ గలహింప నిష్టపడక యతని ప్రార్థనను నిరసించెను. అప్పుడతఁడు రాయచూరు దుర్గాధిపతి స్నేహము చేసెను. ఆదుర్గాధ్యక్షుఁడు చిరకాలంబు నుండి తనమనంబు నాకర్షించి బాధించుచున్న యనంగసేనను గొనివచ్చి తన కిచ్చినచోఁ గార్యంబు జక్కఁబడునట్లు చేసెదనని చెప్పెను. అందులకు రామయమంత్రి యంగీకరించెను. తోడనే యాతోఫల్ ఖాను సంతసించి విజాపురరాజగు నాదిల్ షాహాను సందర్శించి తనకపటవచనరచనలచే నతనికి లాభాలాభంబులను విప్పిచెప్పి యెట్టకేల కంగీకరింపఁ జేసెను.

ఆదిల్‌షాహా మహాప్రజ్ఞావంతుఁడైనను యుక్తాయుక్తవివేకయుతుఁడైనను, నీవిషయమున ఖానుపన్నిన మాయావాగురంబున దవులొ్కనెను.

ము—అక్కటా! ఎంతటి ఘోరకృత్యము! సద్గుణవంతురాలయిన అనంగసేనను ఖానునకిచ్చునా? కార్యనిర్వహణంబునకై యిట్టిచెట్టపని నాచరించుచున్నాఁడా? నిరపరాధురాలయిన స్త్రీని హింసించి యీరాజ్యంబు సంపాదించుట? ఒక మహమ్మదీయుండు కోరెనచో నొకానొకకార్యంబును నిర్వహింప నిన్నును నన్నును గూడ నిచ్చుట కంగీకరించు నేమోయని భయ మగుచున్నది. అని పరిహాసముగా పలికెను.

రు—హరహర! ఎంత మాటాడితివి. రామయమంత్రి యంత వివేకహీనుండుకాఁడు. అతఁడు తన ప్రభుకుటుంబమునకు ద్రోహంబుచేయునంతటి కుటిలుండు కాఁడు. నిష్కపటరాజభక్తిసముపేతుఁడై మన శ్రేయంబు గోరియే, యింతపని చేయుచున్నాఁడు. అట్టి మహనీయుఁడు నిష్కళంక వంశసంభూతవగు నీకు మ్లేచ్ఛనాథసంబంధంబు గల్గించునా?

ము—నిష్కల్మషచరిత్రయై భర్తతోఁ గాఁపురము చేయుచున్న యీయిల్లాలికెట్టి యిక్కట్టు గల్గించెనో చూడుము. ఇట్టిపని చేయునని నాకు మొదటఁ దెలిసిన నే నిందుల కంగీకరించియుండను. రాజ్యలాభంబునైన విడుచుకొందును. కాని యట్టిసాధ్వీమణి క్షోభంబునుసహింపలేను. ఇన్ని పాపకార్యంబు·లాచరించి సంపాదించినరాజ్యం బభివృద్ధిలోనికెట్లువచ్చు?

రు—సుందరీ! నీవలె మేమును దయార్ద్ర హృదయులమైనచో శత్రుహస్తగతంబయిన రాజ్యంబును సంపాదించుకొనుటెట్లు? శత్రువుల కాపదలు గల్గింపకుండ మన మభివృద్ధిలోనికివచ్చుటెట్లు? యుద్ధంబు క్రౌర్యంబని వెనుకదీసినరాజు రాజ్యంబును నిల్పుకొనఁగలఁడా? రాజెంతదయాళువైనను, రాజ్యాభివర్ధన కార్యంబులెంతక్రూరంబులైనను, నాచరింపంజను. అట్టికార్యంబులందు మనరామయమంత్రి యెంతమాత్రమును వెనుదీయఁడు. కాని రామయమంత్రి యాశ్రయనాశనంబు గావించుకొనెడి యవివేకి గాఁడు. రాజ్ఞవగు నిన్ను జక్కఁగ సంరక్షించుచునే తనకార్యంబును జక్కఁజేసికొనును. నిన్ను మహమ్మదీయునకీ దలఁచినచో రాజ్యము సంపాదించి యేమి చేయు? దేనికైన సహించునుగాని నీ పవిత్రకుల చంద్రబింబమునకుఁ గళంకము సంభవించునట్లు చేయఁడు. దుష్టస్వభావులగు మ్లేచ్ఛులవలన నీ కవమానము కలుగకుండఁ గాపాడుచుండవలయునని యాజ్ఞాపించి యున్నాఁడు. నాకంఠంబున జీవములుండ నీకు భయంబులేదు. రుద్రదేవుఁడు ఖడ్గపాణియై నిన్ను రక్షించుచుండ నీ కపాయంబులు కలుగుటెట్లు?

ము—రుద్రదేవా! మిగుల సంతసించితిని ఈమాట లెవ్వరికిఁ దెలియకుండ దాపుము. నా కపాయంబు రాకుండఁ గాపాడుచుండుము.

రుద్రదేవుం డామె వచనంబుల కమందానందంబు చెందెను. ముక్తాంబ క్రమక్రమంబుగాఁ దనకు మిక్కిలి చను విచ్చి

మా టాడుచుండుటచే, దనపై వలపూనుచున్నదని నిశ్చయిం చెను. అంతియకాని మ్లేచ్ఛభూయిష్ఠంబయిన రాయచూరునందుఁ దనకు దుష్టులనుండి యపాయంబులు రాకుండ జేసికొనసాయంబు వడయుటకై తనతో నిట్టు చనువుగ నుండెనని, రుద్రదేవుండు గ్రహింప లేకపోయె. యావద్రహస్యంబులనుఁ జెప్పుచుండెను. అంతఁ బ్రహారేశ్వరుండు మేల్కాంచెను. అప్పుడుఁ రుద్రదేవుండు తక్కిన వారిని మేల్కొలిపి ప్రయాణసన్నద్ధులనుగాఁజేసి ముక్తాం బను శిబికారూఢం గావించి ప్రహారేశ్వరుండును ఖడ్గపాణియై, యొకప్రక్క నడిచి రక్షించుచుండఁ దాను రెండవప్రక్కనుండి రక్షించుచు రాయచూరునకుఁ బోయెను.

---

## ఇరువదిరెండవ ప్రకరణము.

### తోషల్ ఖాను- పకీరు

గీ. కపటినటుని విధానలోకంబునందుఁ
బెక్కు వేషంబులను దాల్చి చక్కఁ దదను
సారముగఁ బల్కు, నాలించి సత్యమనుచు
నమ్మకుము, పరీక్షించి తత్త్వమ్ముఁ దెలియు.

రాయచూరుదుర్గంబునఁ దదధిపతియగు తోషల్ ఖాను వసించుచున్న సౌధము మహోన్నతమై, విశాలమై, మనోహరమై

తెల్లనికాంతిసంతతులచే ధగధగలాడుచు, నొప్పారుచుండెను. తోఫల్‌ఖాను కార్యంబుల ముగించుకొని వచ్చి తత్సౌధంబున నొకవిశాలసుందర మందిరంబున సుఖాసీనుడయి యుండెను. అది నిశాసమయము. రెండుగడియలరాత్రి కావచ్చినది. నాఁడు పౌర్ణమియగుటచే నిండుచంద్రుఁడుదయించి క్రమక్రమముగ గగనప్రాసాద మధిరోహించుచుండెను. తెల్లనిపండువెన్నెలలు నలుదిక్కుల వ్యాపించుచుండెను. మలయమారుతంబులు చల్లగఁ బ్రసరించుచుండె. ఆసమయము సకలప్రాణులకును సౌఖ్యదాయక మగుచున్నను, వియోగిజనములకు దుస్సహబాధాజనకంబై యుండెను. గాన చిరకాలంబునుండి యనంగసేనా వియోగానలంబున సంతప్తుఁడగుచున్న ఖానునకు మిక్కిలి దుస్సహమై యుండునని వేఱచెప్ప నక్కఱలేదు. ఆసమయమునఁ జంద్రకిరణంబులు మలయమారుతంబులతోఁ గూడ గవాక్షద్వారంబున లోపలికి వచ్చి యతనిపైఁబడెను. ఆచంద్రికా మలయమారుతంబులు సమస్తజంతువులకును సుఖదాయకంబులై మానసోల్లాసము గల్గించునవే యైనను నాదుర్గాధ్యక్షున కట్లుకాక మనోవికార జనకంబులయ్యెను. ఆసమయమున సాగరమధ్యంబున మహామారుత ప్రసారంబుచే, నుప్పతిల్లిన మహాకల్లోలంబువలె నతని హృదయ కుహరంబునఁ జంద్రాతపమారుతంబులవలనఁ జాంచల్య ముదయించె. అందువలన డెందంబు డోలాందోళనంబు చెంద సాగె. మనంబు మెఱపుదీవియువలెఁదళుక్కుమని మెఱసి వెంటనేయంతర్థాన మగుచుండెను. అతనితలంపు లనంతములై మిన్ను ముట్టుచుండె.

అప్పుడాతని స్మృతిదర్పణంబున నొకసుందరవ్యక్తి చూపట్టెను. మొదట నది యవయవవిభాగంబులేక కానవచ్చినను, గ్రమక్రమముగా విస్ఫుటావయవయై దర్శనీయమైన దివ్యసుందరీవిగ్రహంబుగఁ బరిణమించెను. అనిమిషత్వంబు వహించి తదీయసౌందర్యసుధారసపానంబుచేయుచుండఁ గొండపల్లిదుర్గంబు కనఁబడియె. తనమిత్రుని మందిరంబు సైతమందుఁ బొడసూపె. తాను దన మిత్రునితో రాజకీయవ్యవహారంబులు ముచ్చటించుచు నచ్చట నున్నట్లు తోఁచెను. తనజనకుండు తప్పనొరులును లేరని తలంచి ధవళవస్త్రసంశోభితయై సుందరమందగమనంబుతో వచ్చితన్నుం జూచి చయ్యన మరలి మందిరాంతర్భాగంబున కరుగుచున్న యా సుందరీలలామవదనేందుమండలము మందహాసచంద్రికలచేనందమై కానవచ్చె. అట్లె చూచుచుండఁగొంతసేపటికి, దానచ్చటనున్నట్టును దనమిత్రునితో సంభాషించుచున్నట్టును మనంబునకుఁ దట్టె. అందుచే నప్పు డేవో రెండుమూడుమాటలు దనహితునితో సంభాషించెను. ఏకారణముననో యాస్మృతిదర్పణంబు పగిలి పోయెను. వెంటనే మెలకువచెంది నలువలంకలం జూచెను. ఏమియుఁగానరాలేదు. అది స్వప్నమని భావించుకొనెను. ఏసుందరి యందుఁ దనడెందంబు పొందుపడియుండెనో యమ్మందగమన దన యారామమందిరంబుననే యుండెగదాయని సంతసించి లేచి కరవాలంబు కేలఁగీలించి యచ్చటికిఁబోవ నడువఁబొచ్చె. కాని యప్పుడు రామయమంత్రి చెప్పినవాక్యంబులు దృఢపాశతుల్యంబులై బంధించెను. ఇఁక గాలుమెదల్పలేక పోయె. ఆ

రమణీలలామ సుందరవదనారవిందంబును జూడ మనోరథంబు త్వరపెట్టుచున్నను గార్యసిద్ధి జనకంబులై హితదాయకంబులై యున్న మంత్రివచనంబులను జక్కఁగ గ్రహించి మనంబు బలవత్తరమై యచ్చటికిఁబో నిష్టపడలేదు. మనం బిష్టపడనప్పు డెవ్వ డేఁపని యాచరింపఁ గలండు? అంత పాదంబులు వానిని మగుడ నాసనంబుచెంతకుఁ గొనివచ్చెను. హస్తంబు కరవాలంబు నొకమూలకుఁ బాఱవై చె. అతనిశరీర మాసనంబునఁ జేరఁ బడియె. ఇఁక నప్పట్టున సుఖకాలక్షేపంబు జేయుట యతనికి దుర్భరంబై చూపె. మొదట నతఁడు తనమిత్రబృందముతో సంభాషించిన మనోవికారము తొలంగునని నిశ్చయించెను. కాని సర్వకాలములందును జెప్పినవాక్యంబులే చెప్పుచున్న మిత్రసత్తములవచనంబులు తనమనోవికారంబును శమింపఁజేయ సమర్థంబులు కావని తలంచి యాయత్నము నిరసించె. సకలదేశంబులం గ్రుమ్మరుచు నందలి వృత్తాంతరత్నంబులను మనఃపేటికల దాచితెచ్చి పరులకు బహుమానము లిచ్చుచుండెడి పకీరులెవ్వరైన నాసమయంబున లభించిన బాగుండునని తలఁపోయఁ జొచ్చెను. అప్పు డచిరకాలంబుక్రిందనే వచ్చి తనదుర్గంబునను్న మసీదులలోనివసించియొకటిరెండుపర్యాయంబులు తన సందర్శనంబుచేసివిదేశవృత్తాంతంబులు జరిగినవిజరిగినట్లుచెప్పిసంతసమొదవించినపకీరుతలంపునకురాఁగా నొకసేవకునిఁబిలిచి యతనిని గొనిరాఁబంపెను. ఖానునకు మహమ్మదీయమతమందుఁ బెద్దప్రీతి గలదు. అతనికం దెంతప్రేమమున్నదో, యది యనాది సిద్ధమెవచ్చు

హిందూమతంబును విడిచి తన్మతంబును జేకొనుటవలననే తెల్ల మగుచున్నది. అట్టి మతంబును లోకంబున వ్యాపింపఁ జేయు పకీరు లతనికిఁ బ్రేమాస్పదులై యుందు రని వేఱె చెప్పవల యునా? అందుచే నతం డాదుర్గంబునకు వచ్చిన పకీరులను మిక్కిలి ప్రేమించిపోషించుచు, వారివలన వినఁదగిన రహస్యంబులు వినుచు సంతసించుచుండెను. కావున నద్దుర్గంబున కరుదెంచిన పకీరు లతని సత్కృతు లంది భిందుమనంబులతో దీవించి నిస్పృహులైనను నతని కనుకూలు రయి వర్తించుచుందురు. ఆ సేవకుఁడు మసీదున కేగునప్పటి కాపకీరు తనశయనంబునఁ గూర్చుండి యేదియో యోజించుకొనుచుండె. అంత సేవకుఁడు వచ్చి ప్రభుశాసనంబును జెప్పినతోడనే మా ఱాడక యటనుండి కదలి గిలకలకఱ్ఱ చప్పుడుచేయుచు, హిందీపాటలు శ్రోత్రపేయముగాఁ బాడుచుఁ దోపల్ఖాను చెంత కేతెంచెను.

ఆమహమ్మదీయుం డతనిఁజూచి యానందించి పోయి యెదుర్కొని తెచ్చి యాసనాసీనుంజేసి తానును దదాజ్ఞచొప్పునఁ గూర్చుండి యిట్లు భాషింపనారంభించె.

ఖా-ఓ మహాత్మా! మీరు మహామహిమగలవారు. నాఁడు నాఁకు దొందరపను లుండుటచే సావకాశంబుగా మా టాడలేక పోయితిని, మీ రే యే దేశంబుల మెట్టినారు? ఏదేశంబున నేయేవింతలం జూచినారు? మీరు మావలెఁ గేవలసుఖాభిలాషులై యొక్కచోట నుండక యెల్లప్పుడును దేశసంచా

రంబు చేయుచుందురు. కాన మీకుఁ దెలియని విశేషంబులు లోకంబున నుండవనియె నాయభిప్రాయము.

ఫ-ప్రభువర్యా! సత్యము వచించితివి. నిశ్చయంబుగ మే మెల్లప్పుడొక చోట నుండక దేశంబులందు దిరుగుచు నిస్లామును బోధించుచుందుము. దేవునికిఁ బ్రియదూతల మగు మా కదియే పరమధర్మము. మతాభివృద్ధికొఱ కెంతకాల మొక్కచోట నున్నను దేవుఁడు కోపింపఁడు. మతసంబంధికాని కార్యంబునఁ బ్రవేశింతుమేని దేవుఁ డేదోరూపంబున శిక్షించు. దేశదేశంబులం ద్రిమ్మరుచు హిందువులను మహమ్మదీయులనుగాఁ జేయుమని దేవుఁ డాజ్ఞాపించి యున్నాఁడు. తదీయాజ్ఞాపుష్పమాలను శిరంబున నిడికొని తత్కార్య సాధనంబునై దేశంబులం దిరుగనారకొంటిని. రాత్రిందివంబులు నేఁజేయుపరిశ్రమముచేతను, దైవానుగ్రహంబుచేతను, పెక్కండ్రహిందువులను మహమ్మదీయులనుగా నొనరించితిని.

ఖా-ఓ మహనీయా! మహమ్మదీయమతంబునుబోలినది లోకంబున వేఱొకటి లేదు. నాకీమతమనిన మహా సంతోషకరము, తన్మతబోధకులు నాకుఁ బ్రాణాధికప్రియులు. అక్కటా! హిందువులు బుద్ధిహీనులై యేదో యొకరాతిని బాతి దేవుం డందులో నున్నాఁడని నమ్ముదురు. వారు వట్టి మూర్ఖులు. వారిదేవాలయంబులు నాకుఁ గంటఁ బడినప్పుడు మహా విచారంబు కలుగుచుండును. అవియన్నియును మసీదులైనచో నాకుఁ బరమానందకరంబుగా నుండును.

అట్లు చేయ నామనంబు నన్నుఁ బ్రోత్సాహించుచున్నది. కాని యంతటి శక్తి లేదు. ఏమిచేయుదును? అని విచారంబును సూచించుచుఁ బల్కెను.

ఫ—ఖానువర్యా! సెబాస్! చక్కఁగాఁ బలికితివి. ఈవిషయము లో మనయిర్వురి యభిప్రాయంబులు నొక్కటియే. హిందూ దేవాలయంబులఁ బడగొట్టి మసీదులు కట్టింపుఁ డని యిప్పటి మహమ్మదీయప్రభువుల నెంత నిర్బంధించుచున్నను వారు వినరు. ఆమహాశక్తి పూర్వులకే చెల్లినది. పూర్వము గజనీమ హమ్మ దెన్నియో దేవాలయంబులం గూల్చె. హిందూ దేశంబున సుప్రసిద్ధవహించిన సోమనాథదేవాలయపు దేవిడీ తలుపులు గొని మక్కాకుఁ జేర్చెను. సోమనాథునివిగ్రహశ కలంబును గొని మసీదునకు, బెట్టించెను. అంతటిసామర్థ్య మును వేఱొక్కని కేది? అటుతర్వాత మహమ్మద్ఘోరీయును నతనివలె మిక్కిలి ప్రఖ్యాతివహించె. అనంతరము కుతుబు ద్దీను హిందువులకుఁ బ్రక్కలో బల్లెమై వర్తించి మనమత మును పోషించెను. అమ్మహనీయుండు హిందూదేవాలయ పురాళ్ళచే గట్టించిన కుతుబుమీనారు జగత్ప్రసిద్ధమై యిప్ప టికిని దత్కీర్తిపుంజంబువలెఁ బ్రకాశించుచున్నది. తరువాత మహమ్మదీయప్రభువు లెందరో హిందూదేశంబును బాలిం చిరి. కాని యట్టి ప్రఖ్యాతి నెవ్వరును సంపాదింపలేకపోయిరి. అట్టి ప్రభువు లవలంబింపనిచో మావంటి వా రెంత శ్రమ పడుచున్నను మనమత మభివృద్ధి చెందలేదు.

ఖా:-ఓ మహనీయా! మీరన్నది నిశ్చయమే. ఈమహమ్మదీయ ప్రభువుల కాపాటి మంచిబుద్ధి పుట్టునా? మాప్రభువైన యూ దిల్ షాహ కెన్నియో మారులిందునిమిత్తము బోధించితిని. కాని యతఁడుపేక్షాపరుఁడై నావచనంబుల సరకుగొనఁ డాయె! గోలకొండాధ్యక్షుండయిన కుతుబ్ శాహియు నట్టి వాఁడే. అహమన్నగరరాజును వీరి ననుసరించియే పోవుచు న్నాఁడు. వీరు హిందువులఁ బ్రేమించుచు, "నున్నతోద్యోగం బులనిచ్చుచున్నారు. అందుచే హిందువు లిప్పుడుస్వతంత్రులై మనల నిర్లక్ష్యభావంబునఁ జూచుచున్నారు. ఇఁక ముందు వచ్చు ప్రభువులుగూడనిట్టివారే యయినచో మనమతమిటనా మావశేషమగుననితోఁచెడిని. మనమతమభివర్ధింపనిష్టముగల మహీపతు లుత్తరహిందూస్థానంబుననైనఁగలరా! అని యడిగెను.

ఫ—దుర్గాధిపా! ఏమి చెప్పుదును? ఇదివఱకు ఢిల్లీపాలించిన సికందరులోడీ మన మతమన్న ప్రాణము పెట్టెడి వాఁడు. కాని మన దురదృష్టంబునఁ గాలధర్మము నొందె. ఇప్పటి లోదీయంత మంచివాఁడు కాఁడు. సంకర జాతివారైన దక్షిణమహమ్మదీయప్రభువులు పూర్వమతవాసనా బలముచే మహమ్మదీయమతాభివర్ధనపరులు కాకపోయిన పోవచ్చును. కానిస్వచ్ఛమ్లేచ్ఛవంశసంభూతులగు నుత్తరహిందూస్థానతురు ష్కప్రభువులిందులకై ప్రయత్నింపకపోవుట మిగులనాశ్చర్యకర మైయున్నది. నీకున్నమతాభిమానముమహమ్మదీయ ప్రభువుల

కుండి మాకు సాయపడుచున్న నీపాటికి హిందూస్థానము తురుష్కస్థానమని పిలువఁబడక పోవునా? నీవు నిక్కపు మహమ్మదీయునికంటెను నధికమగు మతాభిమానముతో వఱలుచుండుటంజేసి నిన్నుఁజూచిన నాకుఁ బరమానందము గల్గుచుండును. నీవంటిమతాభిమాని వేఱొక్కఁడు లేఁడని నిక్కముగా వక్కాణింపఁగలను.

తో ఫల్ఖానాతనివాక్యంబులకమితానందమునొంది యతనింజూచిఓమహానీయా!మీరు కేవలము దైవస్వరూపులరు.మీవంటి వారిదయమాకుఁ గల్గినఁ బరమ పవిత్రులమగుదుము. కృతార్థులమగుదుము. మహనీయా! భవాదృశులగుమహానుభావులు భవిష్యత్కాలంబున సంభవించు శుభాశుభంబులనుగూర్చి చెప్ప గలరని వినియుందుము. మీరు నాయెడ దయగలవారై నచో నేనొక్కటి యడుగుచున్నాను. ప్రత్యుత్తర మిండు. అనియడిగెను.

ఫః-మంచిది. అడుగుము నాకుఁ దెలిసినంతవఱకును జెప్పిసంతసింపఁజేదసెను.

ఖాః-నేనొక స్త్రీరత్నముం దెచ్చిపరిణయమాడఁ దలంచి యున్నాను. ఆమెవలన నాకు సుఖంబు లలవడునో లేదో తెలియఁ జెప్పుఁడు.

ఫ- ఆస్త్రీ యెవ్వరు? ఆమె దేదేశము? ఎట్లు సంపాదింపఁ గలిగితివి?

ఖా- ఆమె దీదేశమే. హిందూమతస్థురాలు. ఆమె నిరుపమాన సౌందర్యముకలది. నాయాప్తమిత్రుని సాయమువలన సంపా

డింపఁ గల్గితిని.

ఫ- మంచిది. నీవడిగిన సమాచార మామెంజూచినగాని చెప్ప లేను. ఇంతేకాక నాశక్తిచే నామెకు మహమ్మదీయదీక్ష యొసఁగి నీకుఁ బెండ్లి చేసెదను. సమయముఁజూచి యామె నొకమారు నాకుఁజూపుము. ఆమె యెచ్చటనున్నది?

ఖా- ఇచ్చట నాకు స్వాధీనురాలై యే యున్నది. ఆరామమందిరం బున నివసించుచున్నది.

ఫ- ఆమెకు నీయందనురాగంబుగలదా! నిన్నుఁ బరిణయమాడఁ గుతూహలముతో నున్నదియా?

ఖా- ఏమో చెప్పఁజాలను. ఇచ్చటికి వచ్చినతరువాత నామెను నేను జూడనేలేదు. మనోహరవస్తువులను మాత్రమంపు చున్నాను.

ఫః-ఎంతపనిచేసితివి? అభిలషితకాంతామణి చెంతకు వచ్చినప్పుడు సందర్శించి యోగక్షేమము లరయకుండుట మోటుతన మనిపించుకొనదా! దర్శనసంభాషణాదులు లేనిచో నను రాగము వర్ధిల్లునా? ఆలోచింప నీవు చేసినది. కఠినకృత్యమని తలంచెదను.

ఖాః-మహాత్మా! ఆమె సుందరవదనారవిందంబును జూడ నాడెం దంబు తొందరపడుచునే యున్నది. కాని నామిత్రుఁడగు రామయమంత్రి కొన్నిదినంబులు చనునంతవఱకుఁ నామె సం దర్శనంబునకుఁబోవలదని నిషేధించెను. మహాబుద్ధిశాలియగు నాతనివాక్య మతిక్రమించినఁ గార్యంబు చెడునేమో యని

వగచి యూరకుంటిని.

ఫ:-అతఁ డెందుల కట్లుచెప్పె? ఆసుందరి కష్టములలో నున్నదా యేమి? ఆమె యొకనియందు నిరూఢానురాగయై యుండ మోసపుచ్చి బలాత్కారంబునఁ గొనివచ్చితిరా యేమి?

ఖా- భర్తనిందారోపణము చేసి యింటినుండి తఱిమివేసెనఁట! ఆమె దుఃఖాతురయై యెచ్చటికో పోవుచుండఁగా మంచి మాటలాడి నామిత్రమిచ్చటికిఁ దెచ్చినాఁడు. నాయందను రాగమున్నదో లేదో నేఁజెప్పజాలను.

ఫ- లేకపోయినను దర్శనసంభాషణములచేతను మనోహరపదార్థ సమానయనముచేతను దదనురాగంబును సంపాదింపవచ్చును. ఆమెను సంతసింపజేయు వాక్చాతుర్యము నీకున్నదో లేదో యని సందేహించి మీరామయమంత్రి యట్లుచెప్పవచ్చును. నీవాక్చాతుర్య మాలోచింప నామెను దప్పక వశముగావిం చుకోగల దని తలంచెదను. ఇంతేకాక ఆమె తిరస్కృతయై గృహంబు వెలువడివచ్చినది. కావున మొదటిభర్తయందలి యనురాగము లతవంటిది. లతవలెనే యనురాగము నిరా శ్రయమై యుండలేదు. అది వేఱొకయాధారంబును జుట్టు కొన్నయెడ వదల్పించుకొనుట మిక్కిలికష్టము. కావునఁ దదీ యానురాగము వేరొకయాధారము నాశ్రయింపకముందే ప్రయత్నించి నీపైకి మరల్చుకొనుము.

తోఫల్ఖానున కావాక్యంబు లమితానందకరంబులయ్యె. రామయమంత్రి వచనంబులకంటె నవియే హితకరంబులైనట్లు

తోఁచెను. ఫకీరు చెప్పినట్లామె యనురాగ మాధారాంతరంబు జేరకమునుపే తనపైకి మరల్చుకొనుట యుచితమని తలంచి ఫకీరుం గాంచి 'ఓమహాత్మా! నీవచనంబులు నాకానందంబును గొల్పినవి. మీయుపదేశప్రకార మాయువతిని నిప్పుడే చూడఁ బోయెదను. మీరు శ్రమంబని యోజింపక నాతో వచ్చి యామెంజూచి ముఖలక్షణంబులు పరిశీలించి శుభాశుభంబులఁ జెప్పఁగోరుచున్నాను. మన కనుకూలురాలయిన మహమ్మదీయదీక్షయొసఁగవలసి యున్నది. కాన నిది మతసంబంధికార్యమే. అట్టికార్యంబునుగూర్చి ప్రయత్నించుటలో మీ కాక్షేపమేమి యున్నది?' అని పలుకగాఁ బకీరందులకు సమ్మతించె. అంత ఖాను పకీరువచనాలవిత్రంబుచే రామయమంత్రివచనపాశంబును ఛేదించుకొని యతికుతుకంబున నారామమందిరంబున కరిగె.

---

## ఇరువదిమూడవ ప్రకరణము

### మందులవాఁడు.

'గీ. విపదలెల్లవారికి సంభవించుచుండు ।
వనటచెందకు ధైర్యంబు వదలఁబోకు ।
దేవు నెదలోననిల్పి చింతించుచుండు ।
విపదలొక్కక్షణంబులో వెడలిపోవు॥'

పాప మాపడతు లారామమందిరంబున నివసించి రామ యమంత్రికై వేచియుండిరి. ఆవేఁకువనే వచ్చెదనని చెప్పి పోయెను. అతఁ డట్లు రాలేదు. అంతతో వా రాశాలతను భేదించుకొనలేదు. వారు నిరీక్షించియుండిరి. వారముదినము లేగెను. మఱియొకవారము ప్రతీక్షించిరి. రామయమంత్రి పేరే వారు వినలేదు. ఆబ్రాహ్మణుఁడు యోగ్యతముఁ డన్న విశ్వాసము వారి మనంబుల నెలకొనియుండుటచే నాతఁడింకను వచ్చుననియే భావించుచుండిరి. వారికిఁ బ్రతిదినంబును దటి తప్పకుండ నొకపరిచారిక యాహారంబు గొనివచ్చుచుండెను. ఈపదార్థము లెవ్వరు పంపుచున్నారని దాని నడుగ నది మాప్రభువు పంపుచున్నాఁ డని చెప్పె. ఆ దుర్గాధీశ్వరుఁ డా విప్రునకు మిత్రుఁడు. కానఁ దదాజ్ఞచే నతఁడు తమ కట్లు సదుపాయము చేయుచున్నాఁ డని తలంచిరి. పురుషులెవ్వరు వారికంటఁ బడలేదు. కాన నది స్త్రీజన వాసయోగ్యమైనదియు నిరపాయమైనదియు నని భావించుకొని యందుఁ గాలము కడుపుచుండిరి. ఆ యారామమందిరంబున నివసింప నసంగసేనకు మిగులఁ గష్టముగా నుండెను. ఆసౌధమందలి వస్తువులు మనోహరము లయినను నామెకు సంతసము గొలుపలేకుండెను. ఆవస్తువులు కంటఁ బడినప్పు డామెకుఁ దన నివాస సౌధంబున నున్న వస్తువులును, నాకాలంబునఁ దనకుఁ గలుగు గౌరవసౌఖ్యంబులును దలంపునకు వచ్చి విషాదపరీతచిత్తనుగాఁ జేయుచుండె. ఒకప్పుడు సదృశ వస్తుసంస్మరణంబుచే మొదట ధనసౌధంబును, దరువాత నందలివస్తుసముదాయంబును,

బిమ్మట నచ్చుటికి విచ్చేసి తన కమందానందంబును సమకూర్చు వసుంధరాధిపతియు ననంతర మతఁడు పలుకు సరసవచనంబులును, నావలఁ దా మతికుతుకంబుతో సలుపు చతురంగక్రీడావినోదంబును, మనోదర్పణంబునఁ బ్రతిఫలించినప్పు డా లలన మాలతీవచనంబులవలన ధైర్యం బవలంబించి దుఃఖ మాఁచికొను చున్నను, గండోయినుండి యనివార్యమై స్రవించు బాష్పబిందుసందోహంబును నిర్బంధింపలేకపోయెను. తాను బ్రస్తుతము పరదేశంబునఁ బరుల సౌధంబునఁ బరు లిచ్చునాహారాదులను దినుచుఁ గాలము పుచ్చుచున్నను. భర్తృవియోగానల కీలలు చుట్టిముట్టి బాధించుచున్నను, మాలతి సతతము తనచెంతనుండి యుక్తవచనంబులు పలికి విచారంబు దొలంగించుచుండుటచే నామెకావిదేశవాస మంతకష్టమనిపింపలేదు. ఒక్కొక్కప్పుడనంగసేన విచారాతిశయంబున నాహారంబును దిన నిష్టపడకుండెను. ఐనను మాలతి హితోపదేశంబు చేసి బలాత్కారంబున దినునట్లు చేయుచుండెను. మాలతి యెంతధైర్యంబు గొలుపు చున్నను, దఱఁదప్పకుండ నన్నపానాదుల గొనుచుండినను సతతంబును మనోవ్యథానలంబుదతికొని బాధించుచుండుటచేఁ గొలదిదినంబులలోనే మిక్కిలికృశించి యనారోగ్యవంతురాలై యుండెను. ఇట్లుండి యొకనాఁటిరాత్రి తన శయ్యపై గూర్చుండి యిట్లు సంభాషించెను.

అః-మాలతీ! ఆవిప్రుని రాక యింతతడవాయె నేమి? రాకపోవుటకుఁ గారణమేమయి యుండును? అతఁ డేయభిప్రాయంబుతోఁదీసికొనివచ్చియుండెనో? ఇది తురుష్కరాజ్యంబు. న

న్నొక తురుష్కున కిచ్చుట కిచ్చటికి గొనివచ్చి యుండునా యేమి? నీమనంబున కేమి తట్టుచున్నదో చెప్పుము. ప్రియ వియోగాగ్నిసంతప్తనై బాధపడెడి నాపై పిట్టపిడుగొకటి యనివార్యమై పడదలంచి యుండెనా యేమి? అని పలికి కెవ్వున కేకవేసి వలవల నేడువం జొచ్చె.

మాలతి యావాక్యంబులు విని తానును గొంచెము దుఃఖించె. కాని వెంటనే ధైర్య మవలంబించెను. అనంగసేన నెవ్వరికో యిచ్చుట కెంచి, యాకపటబ్రాహ్మణుండు త మ్మచ్చట బంధించినట్లును, నాబ్రాహ్మణుండు మహామాయావి యైనట్లును, దా మచ్చటికి వచ్చినరెండవదినంబుననే మాలతి గ్రహించి తాము తప్పించుకొను నుపాయ మరయుచుండెను. కాని యాయుదంత మనంగసేనకుఁ జెప్పినచో దుఃఖాతిశయంబునఁ బ్రాణంబులు విడుచునని నిశ్చయించి చెప్పలేదు. మాలతి యనంగసేనం జూచి ' అమ్మా? నీవు విచారింపకుము. కష్టంబులు మనుజులకు రాక మ్రాఁకులకు వచ్చునా? ఆ బ్రాహ్మణుఁడు నీతికోవిదుఁడు. పరోపకారపారీణుఁడు. మిక్కిలి యోగ్యుఁడు. మనల వంచింపఁ బోఁడు. వంచించుటకు గొనిరాలేదు. అతనికేదోపని యుండుటచే రాలేదు. అంతమాత్రంబున భయపడకుము. వెనుక మన మిట్లె శంకించికొంటిమి. మనమాటలలోనే వచ్చెను. స్మరింపుము. ఇప్పటికేనీవు దుస్సహదుఃఖ సంతప్తురాలవై యుంటివి. ఇఁకమీఁద మఱియొక నూతనదుఃఖంబును సమకూర్ప భగవంతుఁడు దలంచియుండఁడు. అతఁడంత కఠినహృదయుండు కాఁడు.

అతఁడు దయాళుఁడు. దీనవత్సలుఁడు. ఆపదలలో నున్నవారి నుద్ధరించును. కాని మఱింత యడుగునకు ముంచివేయఁడు. తీవ్రతరసూర్యతాపంబున వాడుచున్న కోమలపుష్పలతను దావాగ్నిచేఁ గాల్పనెంచునా? కావున సందియంబు విడిచి, సకలసౌఖ్యదాయకమయిన కృష్ణస్వరూపంబును డెందంబునఁ బొందుపఱిచి సతతంబును సంస్మరించుచుండుము. అందువలన నీకుఁగొంతశాంతి కలుగును? ఇంతలో నాబ్రాహ్మణుండునువచ్చి మనలగమ్యస్థానంబునకుఁ గొనిపోవును.'అని ధైర్యంబుగొలుపుచుఁ బలికెను.

మాలతీ! ఆపత్పారావారంబున మునుంగుచున్న నన్నుద్ధరింప భగవంతుండు నీవనెడి దృఢతరనౌకను సాయముగా నిచ్చియున్నాఁడు. కావుననే యింతవఱకైన జీవంబులతో వర్తింపఁ గలిగితిని. ఆతనివృత్తాంత మిచ్చట నెవ్వరినైన నడిగి తెలిసికొనలేకపోతివా? అతండు రాఁడని నిరాశచేసికొని వేఁకువనే లేచి పోవుట యుచితకృత్యము. ఇందులకు నీవేమందువు'అని యనంగసేన మాలతి నడిగెను.

మాలతి యావాక్యంబులు విని బ్రాహ్మణుండు రాఁడని నిశ్చయముచేసికొనియు, దాని దెలుపక 'అమ్మా! అనంగసేనా? ఆవిప్రునికోస మెందరినో యడిగితిని, అతఁ డీయూరనే యున్నాఁడఁట. నేను స్వయముగాఁ జూడఁబోవఁ దలంచితిని. కాని దుష్టదురుష్కులవలనఁ గీడుమూడునేమో యని భయపడుచున్నాను. అతని యుదంత మెట్లయినను రేపు తెలిసికొని వచ్చెదను. నేఁటికి నిద్రింపుము. నిద్రలేనిచో దేహారోగ్యంబు చెడును.'

అని యుక్త వచనంబులు పల్కి యామె కూరట కల్గించు చుం డెను. ఆసమయంబున నెవ్వరో వచ్చుచున్నట్లు వారికిఁ దెలియ వచ్చెను. అది విని మాలతి ‘ అదిగో నెవ్వరో వచ్చుచున్న ట్లున్నది. ఆవచ్చువాఁడు మనవిప్రుఁడనియే తలంచెదను. వేఁకు వనే లేచి మగుడఁ బయనము చేయవచ్చును? ’ అని పలికి యావచ్చువారి నిమిత్తము ప్రతీక్షించుచుండిరి. వా రాబ్రాహ్మ ణుండే వచ్చుచున్నాఁడని తలంచి మేలిముసుంగులు వదలి సంత సంబుతో నుండిరి. ఆ సమయమున భయంకరవేషంబులతో నిర్వురుపురుషులు ప్రవేశించిరి. ఆయువతుల నిరీక్షణమధుకరము లొక్కుమ్మడి నావిప్రోత్తముని ముఖారవిందముకొఱకు వెద కెను. కాని తమ కానందముగొలుపు నమ్ముఖపద్మంబు గాన రాలేదు. సమీపంబునకు వచ్చుచున్న యాభయంకరపురుషులం గాంచి యనంగసేన భయాతిరేకంబున మూర్ఛిల్లెను. ఆతోఫల్ ఖా నదేసమయమని యామె సుందరవదనారవిందంబును వీక్షించు చుండెను. తదీయవదనేందు సౌందర్యసుధారసంబును గ్రోలి యతఁ డనిమిషత్వమంది చూచుచుండెను. మాలతియు మొదట భయ పడెను. కాని ధైర్యంబు తెచ్చుకొని నేలఁబడియున్న యా యువతి చెంతకేగి మేలిముసుంగు సవరించి తానును ముసుంగువైచికొనె ను. అంత ఖాను ననంగసేన మేలిముసుంగు సవరించి తనయానం దంబున కంతరాయము కల్పించిన యామాలతిపై కోపము వహించి చుఱచుఱ చూచుచుండ నాయువతి యతనివైఖరిఁ బొడగాంచి మృదుమధురస్వరంబుతో ‘అయ్యా! మీరెవ్వరు?

ఇంత రాత్రివేళ వచ్చుటకుఁ గతం బేమి? అసహాయలై యేకాంతంబున నున్న పరకాంతామణుల చెంతకు నిస్సంశయంబుగా వచ్చుట యుదారపురుషులకుఁ దగ దని తమ కేల గోచరము కాకున్నదో తెలియఁ జాలకున్నాను. మీ వేషంబు లుదార పురుషు లని చెప్పుచున్నవి. కాని మీవర్తనమందులకు సరిపడ కున్నది. మీభయంకరవేషంబులు చూచి తుళ్ళిపడి మానెచ్చెలి భయాతిరేకంబున మూర్ఛిల్లినది. శుద్ధాంతంబును బురుషులు చొచ్చునప్పుడు కాంతామణుల యనుమతి నొందకుండఁ బోఁగూడ దనుమర్యాద తమకుఁ దెలియదా? తెలియనిచో నీదినురా లిప్పుడు చేసిన యుపదేశంబును మనంబున నుంచుకొని వర్తింపుఁడు' అని నిర్భయంబుగాఁ బలికెను.

ఆమాటలు విని తోఫల్‌ఖాను పకపకనవ్వి పువ్వుబోఁడిని వీక్షించి 'నీవచనరచనలు నాడెందంబున కెక్కెవు. నే నీదుర్గంబును బాలించెడి తోఫల్ ఖానుఁడను. నేను మిమ్ము బరకాంతంలని భావింపలేదు. స్వీయకాంతలనియే భావించు చున్నాను. నాదుర్గమునందే, నామందిరంబందే నివసించియుండిన స్త్రీ దుర్గాధ్యక్షుని గాఁ దెలిసికొని గౌరవింపక సామాన్యునింబలె మాదలింపసాహసించినందులకుఁ గడుంగడు నాశ్చర్యపడుచున్నాను. నా యాకారంబు భయంబు గొలుపుచున్నదా? అట్లయిన నీ కేల భయముగొలుపలేదు? మీటక్కులునాకు స్పష్టముగాఁ దెలిసినవి. మీ రిట్లు జేసినం జూచి వగచి విడిచిపుచ్చుదునని యనుకొను చున్నారు. కాని య దెప్పటికిని సరిపడదు. మీచెలి భయపడ

లేదు. మూర్ఛిల్లలేదు. నా కది తెలియును. నే నెంతో ప్రేమం బున నాసుందరాంగివదనారవిందంబును సందర్శింపఁ దలంపుతో వచ్చి చూచుచుండగా నీవు పానకములో పుల్లవలె మధ్యవచ్చి మేలిముసుంగు గప్పిపుచ్చి నాయానందమునకు భంగము గలిగిం చిన దానవు. ఏదీ! ఇప్పుడయిన నామేలి ముసుంగుదీసి వదనేందు మండలంబుం జూపుము. కన్నుల కఱవుదీఱ చూచి యానందిం చెదను. నీకుఁ దగిన బహుమాన మిచ్చెదను. నామాట ననుస రింపుము' అని నయనంబును భయంబును జూపుచుఁ బలికెను.

ఆవాక్యంబులు మాలతిచెవులకు శూలంబులవలె నాటుటచే ననివార్యమగు కోప ముప్పతిల్లె. కోపాతిశయంబున వదన మరుణితమై యుదయకాలసూర్యమండలంబును బురుడించె. కనుగొనలు కెంపు నదిరె. అంగలతిక కంపించె. ఆమహామ్మదీయు నకుఁ దగినట్లు ప్రత్యుత్తర మిచ్చుటకు నిశ్చయించె. అందువలనఁ దన ప్రాణంబులు నిలుచుట దుర్ఘటంబన్ని యొఱింగియు సాహ సించి చెప్ప నుంకించుచుండ నొక పురుషుం డతిరయంబున వచ్చి యుత్తర మొకటి ఖానున కొసంగె. ఖా నాయుత్తరముకు జదివి కొని పకీరుంజూచి 'అయ్యా మన ప్రభువర్యుం డగు నాదిల్ షాహా వచ్చుచున్నా డఁట. మనము వెంటనేపోయి యతని నెదుర్కొని కొనిరావలయును. అతఁ డింతవేగముగా వచ్చునని యనుకొనలేదు.' అని ఖాను పలుకఁ బకీ రతనిం జూచి 'ఓతురు ష్కాగ్రణీ: అట్లయినవిలంబము చేయక నడువుము. మఱియొక నాఁడు వచ్చి మచ్చిక చేసికొని సంభాషించి ముచ్చట దీర్చుకొన

వచ్చు. ఈచంచలాక్షి ముఖలక్షణంబులను బరిశీలించితిని. అవి యైశ్వర్యద్యోతకంబు లగుట నిక్కము. అన్ని విధంబుల చేత నీ నాతిమిన్న నీ కనుకూలయైయున్నది. దీనిం దప్పక పరిణయ మాడుము.' అని యతనికి మఱింత ప్రోత్సాహము కలిగించెను.

అనంతరము వారిరువురు నచ్చోటు కదలిపోయిరి. మాలతి యనంగసేన ముసుంగుదీసి 'అమ్మా! వారు పోయినారు. నీ కేమి యును భయములేదు. లెమ్ము లెమ్ము. వారు మాన కగౌరవము చేయుటకు రాలేదు.' అని పలికెను.

అనంగసేన మైమఱచి యున్నది గాన యీదురాత్ముని సంభాషణము వినియుండ దనియు, యుక్తవచనంబులు పలికి దుఃఖోపశమనము చేయవచ్చుననియుం దలంచి మాలతి యట్లు పలికె. కాని యనంగసేన భయాతిశయంబున నేలం బడియున్నను మైమఱచి యుండలేదు. వానివచనంబులును, మాలతివచనంబులును వినుచునే యున్నది. కాన మాలతిరహస్యము దాగినదికాదు. అప్పు డనంగసేన మాలతింజూచి 'చెలియా! ఏ వేల దాచెదవు? ఇప్పుడు మనకుసంభవించు ముప్పు తెలియ వచ్చె. అక్కటా! ఆ కుటిల విప్రుం డెంత చేసెను! నే నింక బ్రదుకుట కష్టము. నీవు నానిమిత్తము మిగుల శ్రమపడితివి. నీబంధువుల నందఱిని విడిచి వచ్చి నాతో పరదేశవాసము చేసితివి. ఇదియంతయు వ్యర్థ మయ్యెను. నేటితో నాకును నీకును ఋణంబు చెల్లినది. ఈ రాత్రి యవసానము నొందునప్పటికి నాప్రాణంబును నవసాన మొందును. దయ యుంచి యింకనైన నీవారిం జేరుము.' అని

యేడ్చుచు పలికెను.

ఆమె వచనంబులు విన్నప్పుడు మాలతికిని దుఃఖ ముద యించెను. అతికష్టంబునఁగాని యాదుఃఖమును శమింపఁ జేసి కొన లేకపోయెను. ఇఁక నాదుష్ట తురుష్కునకుఁ జిక్కుటయో ప్రాణంబులు తక్కుటయో నిక్కంబని మాలతి నిశ్చయించెను. అయినఁ దాను ధైర్యం బవలంబించి యామెకు ధైర్యంబు కొలుపనిచో నప్పుడె మృతిచెందునని యెఱుంగును. కాన నా మానిని జూచి ' అమ్మా! అనంగసేనా! నీ వింతయధైర్య పడెద వేమి? నీవు ప్రాణంబులు విడువవలసినంత యవసరమేమి? ఆ దు రాత్ముని యగౌరవమును బొందకుండ నుండుటకా? నీ నెచ్చెలి యగు మాలతి జీవించియుండ నీకట్టి యవమాన మెట్లు కల్గు? ఒకవేళ నా దురాత్ముఁడు వచ్చి నీ కవమానము కల్గించునని యే యనుకొందము. అయినను సాధ్వీమణివగు నీ కవమానము సంభవించుచుండ ద్రౌపదీ మానరక్షకుండగు శ్రీకృష్ణుం డూర కుండువాఁడు కాఁడు. కావున ధైర్య మవలంబించి నిర్భయంబు గానుండుము. ఏదో యుపాయము పన్ని కొలఁదికాలములోనే నిన్నిచ్చటి నుండి కొని పోయెదను. ' అని ధైర్యంబుఁ గొలిపెను.

' చెలీ! మాలతీ! నీ వచనంబులెంత ధైర్యస్థాపకంబు లయినను, నాయెడ నిష్ఫలంబు లగుచున్నవి? ఏదో యడ్డు పెట్టి నాదుఃఖప్రవాహము బంధింపఁ జూచుచున్నావు. కాని నీవు వేసి నగట్టును ముంచివేసి స్వరూప నాశనము చేయుచున్నది. ' అని

చెప్పి యేడ్చుచు దుఃఖాతిశయంబున మూర్ఛిల్లెను. మాలతి తనశక్తి యంతయు ధారవోసి శైత్యోపచారంబులఁ జేయుచుం డెను. కాని యామె మేల్కొనలేదు. ఆ యువతి కన్నులుమూసి చేష్టలు దక్కియుండె. మాలతి ధైర్యవంతురాలైనను నామెం జూచి భయపడసాగెను. అయిన నూరకుండక యుపచారంబులు చేయుచునే యుండెను. నాడి పరిశీలించి చూడ జ్వర మతితీవ్ర ముగా నుండెను. ఆరాత్రి గతించెను. అనంగసేన మేల్కొనలేదు ఆమెకు దగిన మం దిచ్చినంగాని మగుడ నారోగ్యస్థితికి వచ్చుట దుర్ఘటం బని నిశ్చయించుకొనెను. ఆ జ్వరంబును దణిగించు నౌషధము కావలసి యుండెను. అది సంపాదించు టెట్లు? ఆదు ర్గాధ్యక్షునకుఁ దెలిపిన మంచిమందు బంపించునని యెరుంగును. అయిన నాదురాత్మ్ముని సాయ మొంద నిష్టములేదు. పురంబు లోనికిఁ దానే పోయి మందు గొనిరావలెనని తలంచి కొంతధనం బుతీసికొని పోవుచుండెను. కాని ద్వారపాలు రామెను నిర్బం ధించి పోనీయలేదు. అతఁ డేగునప్పుడు ద్వారపాలురం జూచి చెలికత్తెనైనను బైకిఁ బోనీకుఁ డని శాసించెను. ఆచెలికత్తె మహామేధావంతురాలనియు, నామెను బురంబులోనికిఁ బోని చ్చిన నేవో కపటోపాయంబులు పన్ని యనంగసేనం దప్పించు కొనిపోవ యత్నించు ననియు, గ్రహించియే యా ద్వారపా లురకట్టియుత్తరువు చేసెను. ఆమె దీనాలాపములు వారి కఠోరహృదయంబులం ద్రవింపఁ జేయలేక పోయెను. కొంతధనంబు లంచ మిచ్చెదనని చెప్పెను. ఆ ద్వారపాలుర

మనంబు దాని నపేక్షింపలేదు. మాలతియిఁక నచ్చట నుండలేక యనంగసేనచెంతకు వచ్చెను. ఆమెజ్వరాతిశయంబున నోడ లెఱుంగక యుండెను. ఇఁక నాయువతి చచ్చుట నిక్కం బని నిశ్చయించుకొనెను. మహోన్నత పదవియందుండి సమస్తభోగం బులనుభవించిన యాకాంతాలలామ యందులేక చావవలసి వచ్చె గదా యని యపరిమితదుఃఖంబు జెందె. బోరున విలపింపఁ జొచ్చెను. కాని కొంతసేపటికి తెలివి వహించి తననెచ్చెలిజీవం బును నిలుపఁ దనజీవంబునైన నిచ్చుటకు నిశ్చయించి మగుడ ద్వారపాలురచెంత కేగి దీనాతి దీనముగాఁ బ్రార్థించెను. అప్పటికిని ద్వారపాలురచిత్తంబు కరుగలేదు. కాని పూర్వ మున్నంత కఠినత్వంబును వహించి యుండలేదు. వారిలో నొకఁడు మాలతిం జూచి, 'ఓసుందరీ! మమ్ము బట్టుకొని యేడ్చిన నేమి లాభము? నిన్నిగడపదాఁటి పోనీయ వలనుపడదు. పురంబులోని వైద్యుని నైనను లోపలి కిఁ బోనీయము. ఇంతకుఁ బూర్వమే యొకవైద్యుఁడు మందులమ్ముచు నీ మార్గంబునఁ బోయెను. వాఁడుమగుడవచ్చినచోఁ జెప్పెదము. ఆతనియొద్ద మం దుకొని తీసికొని పొమ్ము. అదియైన మిగులరహస్యముగా జరుగవ లెను.మాప్రభువునకుఁ దెలియరాదు. ఆతనియొద్ద మందుకొనుటకు మాత్రమే సెల విచ్చితిమి.' అని పలికెను. ఆ సుందరాంగి యం దులకు సంతసించి యా వైద్యునికై యచ్చటఁ బ్రతీక్షించి యుం డెను. కాని యతఁడు రాలేదు. అట్లా పగలు గడపెను. సాయం కాలము కావచ్చెను. ఆమాలతి యీమధ్యకాలంబుననొక్కచో

నుండలేకయిట్టటుఁదిరుగుచుండెను! ఆద్వారపాలురు తన్నుఁబరిహ
సించుచున్నారేమో యనితలంచియు నూరకుండలేకమగుడ ద్వార
పాలురచెంత కేగియుచ్చట నుండెను. అంతనొకఁడుమందులమ్ము
చునాప్రాంతంబునకు వచ్చెను. మాలతి వాని దైవముగ భావించి
ర మ్మని పిలిచి 'అయ్యా! నానెచ్చెలి జ్వరపీడితురాలయి బాధ
పడుచున్నది. తగిన మం దిచ్చి బ్రదికింతురేని మీరుకోరిన బహు
మానం మిచ్చెదము.' అని పలికెను.

వై-ఓ యువతీ! రోగిని జూడకుండ లక్షణంబులు పరిశీలింపకుండ
మం దిచ్చి నఫల ముండదు. ఆమెను న న్నొకపర్యాయము
చూడనిమ్ము.

మా:-అయ్యా! మేమనాథలము. వీరికిఁ జిక్కియున్నాము. వీరు
నిన్ను లోపలికి రానీయరు. రోగలక్షణంబులం జెప్పెదను.
వాని నాలోచించి తగిన మం దిప్పింపుఁడు.—అని చెప్పి
యారోగలక్షణంబును సవిస్తరముగాఁ దెలిపెను.

వై:-నీవు చెప్పిన లక్షణంబుల వలన నారోగ మేజాతిదో చక్కఁ
గఁ దెలియవచ్చినది. దానికిఁ దగినమం దున్నది. ద్రవ్య
మిచ్చిన నిచ్చెదను.

మా:- ముందుగా దవ్యమీయను. కుదిరినచో మీకోర్కికి మిం
చిన ద్రవ్య మిచ్చెదను. ముందుపొ మ్మిచ్చిన మీరుకంటపడు
దురో పడరో. మీగా ద్రవ్యము మాయొద్ద నుండినఁ బ్రతి
దినంబును వత్తురు. లేనిచో మాయు మగుదురు. తఱుచుగా
వైద్యులస్వభావ మిట్టిది. నే నిట్టంటి నని కోపింపకుఁడు. మం

దిచ్చి పంపుదుము. రోగము కుదిరినదాఁక యిచ్చటికి వచ్చు చుందుఁడు.

వై. యువతీ! అట్లే చేసెదను. నాకు ముందుగా ధన నిరాయ సక్కఱ లేదు. కుదిరిన పిమ్మటనే యిమ్ము. నే నిచ్చటి కుద యసాయంకాలములందు వచ్చుచుందు. నీవు నిచ్చట సిద్ధ ముగా నుండుము. ఈమందువలనఁ గుదురనిచో నిది నా కిచ్చి వేయుము. నీకు మఱియొకమం దిచ్చెదను.

అని చెప్పి తనమూటలోనున్న యొకకాగితమును దీసి యందుఁ దెల్లని పొడిని కొంత వేసి ముడిచి యామె కిచ్చి పంపి తాను దనమార్గంబునఁ బోయె.

అంత మాలతి యాపొట్లముఁ గొని చయ్యన ననంగసేన చెంత కరిగి యామెను మేల్కొలిపెను. ఆమె కన్నులు విచ్చి మాలతిం జూచి 'చెలీ! ఈలోకంబును విడిచి పోవుచున్నాను. నాహృదయంబున నున్నబాధను సహింపలేను. ఇప్పుడే పోవుచు న్నాను.' అని నిస్పృహతో బలికెను.

'అమ్మా! అధైర్యపడకుము. నీనిమిత్తము మంచిమందు తెచ్చితిని. దాని నీవు సేవించితివేని నీసంతాపమంతయు శాంతిం చును.' అనిచెప్పి కొంచెముశుద్ధజలమును దీసికొనివచ్చి యందు లోనామందును మిళితముచేసి యామెకిచ్చెను. ఆయువతియు నా యౌషధంబును ద్రావి శయనించెను. మాలతి సమీపమునఁ గూర్చుండి యాపొట్లమును కాగితమును జేతికిఁ జుట్టుకొనుచు మరల విప్పుచు నేదియో సంభాషించుచుండెను. మాలతి చదువు

కొన్నది. అందుచే నాకాగితమున నున్న యక్షరములను జదువ నారంభించెను. ఆదీపపువెలుతురున నాకాగితమునుసంపూర్ణముగఁ జదువుకొనెను. అధికానందభరితురా లయి యనంగసేనను సమీపించి 'చెలియా! ఆవైద్యుఁడు మంచివాఁడు. మిక్కిలి మంచిమం దిచ్చెను. ఆమందుకంటె నీకాగితమే నీ జ్వరంబును బూర్తిగా మరలింపఁ జాలును. ఇందలి విషయమును' వినుము.

'ఓ యనంగసేనా! నిష్కారణంబుగా నీమీఁద నేరము మోపి వెడలఁగొట్టినందులకు సార్వభౌముండు మిగుల వగచు చున్నాఁడు. నిన్ను వెదుక నన్నుఁ బంపగా నీపురంబునకు వచ్చి నీసేమ మరసి సంతసించితిని. నీనిమిత్తము వనట చెందుచున్న రాజేంద్రుండు కొలఁదిదినంబులలోనే నిన్నుఁ దప్పించుకొని పోవును. కావున విచారంబువదలి ధైర్యమవలంబించి యుండుము. మహాబుద్ధిమంతు రాలగుమాలతి నీచెంతనుండఁగా నింతలో నీ కెట్టియవమానంబును సంభవింప నేరదు. ఇట్లు రామరాజు'అని యున్నది.

అనంగసేన యా యుత్తరపువృత్తాంతము విన్నతోడనే యమితానంద భరితురాలయి యా యుత్తరమందికొని చదువు కొనెను. తోడనే యంతరంగంబున నున్న సంతాపమంతయు నంత ర్ధానముచెందెను. ఆయుత్తరమే యామెకు దివ్యౌషధమయ్యెను. ఆదివ్యౌషధమిచ్చిన యావైద్యునికి వారేమి బహుమానము చేయుదురో చూడవలె.

---

## ఇరువదినాల్గవ ప్రకరణము

### రాయబారి.

రాయచూరుదుర్గంబున రాజభవనంబులన్నింటి యొకిపెద్ద సభామందిరంబుకలదు. అది మిక్కిలి విశాలంబై యొక్కపెట్టున రెండువేలమంది కూర్చుండఁ దగియుండెను. అది నున్నని నల్లరాపలకలచే నమర్పఁబడి విచిత్రంబులగు నాసనంబులచే నలరుచు, మిక్కిలి రమణీయంబై యుండెను. ఆదుర్గాధ్యక్షుం డందులోఁ గూర్చుండి వ్యవహారంబులం జక్కఁబెట్టుచుండును. తమ ప్రభువు వచ్చియుండుటచే దర్బారవార్థముగా నా తోఫల్ ఖాను సభాభవనంబును గడుఁజక్కఁగా నలంకరించెను. ఆసభామందిరము నైసర్గిక సౌందర్యంబుచేతనే కాక కృత్రిమసౌందర్యంబుచేఁ గూడ మిగులఁ గన్నులపండువు లొనర్చుచుండెను. ఎనిమిది గంటలరాత్రికి దర్బారు నిర్ణితంబయ్యె.

ఆసభ కాహూతులగువారుతక్కఁ దక్కినవారు పోవవలనుపడకుండెను. నిర్ణితకాలంబునకు మహాజనులందరును వచ్చి సభాతలంబున నియమితాసనంబులఁ గూర్చుండిరి. అంత నుద్దండ వైభవముతో నాదిల్ షాహా వచ్చి కొలువుకూటంబు ప్రవేశించెను. అతఁడు ప్రవేశించినతోడనే మంగళవాద్యఘోషంబులు చెలంగె. వందిమాగధులు నుతింపఁజొచ్చిరి. సభాసదులందరును లేచి భయసంభ్రమంబులు మెఱయ సమస్కరించిరి. ఆయాదిల్ షాహా

వయ స్సప్పటి కిరువదివత్సరంబులు. జవ్వనము, కలిమి, దొర తనము విమర్శనా శూన్యతయు నాఁబడు నాల్గింటిలో నొక్కొ-క్కటి యున్నను, ననర్థంబులు గల్గించుచుండ నవియన్నియును నొక్కనియం దున్నప్పు డనర్థంబులు గల్గించునని వేఱ చెప్పవల యునాయని పండితులు చెప్పుదురు. అతఁడు యౌవన ప్రారంభ దశయందుండెను. సమస్తసమ్మృద్ధులతోను వెలయు చుండెను. విజాపుర రాజ్యంబు దొరతనంబు వహించియుండెను. ఇష్టా డును నున్నప్పుడు విమర్శనాశూన్యత్వము తప్పక యుండు నని యందురు. కాని యతని కా నాల్గవగుణ మంటలేదు. తక్కినవి మూడు నమ్మహీపాలున కలవడియున్నను, తనబుద్ధిచాతుర్యం బున ననర్థంబులు రాకుండఁ జేసికొని పండితవాక్యంబున కన్య థాత్వమును గల్పించి ప్రజారంజకత్వంబు సంపాదించి ధర్మపురస్స రంబుగా రాజ్యంబునుఁ బరిపాలించుచుండెను. అతఁ డల్పవయ స్కుఁడైనను రాజకీయవ్యవహారంబులం దపారప్రజ్ఞ విశేషం బును జూపుచు, మహమ్మదీయమతాసక్తి కలవాఁడైనను హిం దూమతమును, దన్మతావలంబులను ద్వేషింపక పరగుచుండెను. అతఁడు యౌవనవంతుఁడై రాజ్యాధిపత్యంబు వహించియున్నను సామాన్యరాజులవలె నింద్రియాధీనుండై యసత్కృత్యంబుల నాచరింపకకనుగలిగి మెలఁగు చుండెను. అతఁ డున్నతశరీరుఁడై స్తంభసదృశబాహాయుగళము కల్గి, యతివిశాలమగు ఫాలం బును, నేత్రయుగ్మంబును గలవాఁడై చూపఱ కసాధా రణ పురుషుం డని తోఁపించుచుండెను. అతఁడు నిరుపమా

శౌర్యవంతుండై శత్రురాజ్యంబులం బెక్కింటి జయించి మిక్కిలి విఖ్యాతి సంపాదించెను. ఆమహాపురుషుం డట్లు ప్రవేశించినతోడనే తనయాసనముచెంత నిల్చియున్న పకీరునకు నమస్కారముం గావించియాశీర్వచనంబులు గైకొని తక్కిన వారికిం దగిన మర్యాదలొనరించి సింహాసనాసీనుండయ్యె. తదనుమతిని బడసి తక్కినవారున్ను తమతమయాసనంబుల నాసీనులైరి. అమ్మహారాజు గుణసంపదకును, వినయాతిశయమునకును, బ్రజావాత్సల్యంబునకును సభాసదులు గరమ్ము సంతసించి నుతించిరి. అంత తోషల్ ఖాను లేచి తనప్రభువునకు నమస్కరించి ,ఓ కీర్తివిశాలా! మహీపాలా! నాపరిపాలితంబగు దుర్గంబునకు మహనీయుల రగుమీరు విచ్చేసియుండుటచే నన్నెక్కుడుగా గౌరవించినట్లు భావించుకొని సంతసించుచున్నాను. ఈసభలోం దమకుం బరిచితులుకాని మహాపురుషులు పెక్కురున్నారు. వారిని దమకు విన్నవించుట నాకు విధి. ఇతండు తనబుద్ధిచాతుర్యంబుచే మహారాజులను మహా మంత్రులను సైతము మాయావాగురం బంధించి కొయ్యబొమ్మల నాడించిన ట్లాడింప శక్తిగల రామయామాత్యశ్రేష్ఠుండు. ఇతండు విక్రమాతిశయంబున సుప్రసిద్ధుండును నుదయగిరిరాజు పినతండ్రియు నగుప్రహరేశ్వరపాత్రుండు. ఇతండుదయగిరి దుర్గాధ్యక్షుం డగువీరభద్రపాత్రుని పుత్త్రుండును, నిస్తంద్రప్రతాపుండును నగు సోమేశ్వరపాత్రుండు. ఇతండు బెల్లముకొండ దుర్గాధినేతకుమారుండును, వైరివీరలయకాలరుద్రుండును నగు రుద్రదేవుండు. ఈ మహనీయుండు గోలకొండ మహీపాలుని సేనానా

యకుండగు మలమలఖాను. ఈమహాత్ముం డహమన్నగరరాజ్య ధురంధరుని ప్రధానమంత్రియగు కంబరసేనుండను బ్రాహ్మణపుం గవుండు. అశేషశేముషీమహితుండగు రామయమంత్రి యిమ్మ హానీయుల నందఱి నిచ్చటికిఁ జేర్చెను. చిరకాలంబునుండి వేరువేరుగా నుండి వైరిసీరుల కనకాశ మీాయఁ జాలిన యీామహమ్మదీయ రాజ్యత్రయ మిప్పట్టునఁ బరస్పర మైత్రి చేఁ జెలంగి పురోభివృద్ధులను గాంచఁదగిన సమయము లభించినది. ఇక్కార్య మింతవరకును దెచ్చినవాఁడీ రామయ మంత్రియే. రాజనీతివిశారదులును, యుక్తాయుక్త వివేకధురంధ రులును నగు మీారీసమయంబును విఫలంబుగాఁ జేయరని నాత లంపు. పిమ్మట దేవరయే యోజింపఁదగు' అని సవిస్తరంబుగా వర్ణించి తన యాసనంబున గూర్చుండెను. ఆతనివాక్యముల కాదిల్ షాహా యమితానందంబు నొందె. రామయమంత్రిదిక్కు మొగంబై, ఓ మంత్రిపుంగవా! నీ వసామాన్యప్రతిభాశోభితుఁడ వని నీ విప్పట్టునఁ జేసిన పనులవలననే తెలియవచ్చుచున్నది. నీవు విజయనగరంబునకుఁ బోయి చేసినపనులు తోషల్ ఖానువలన విని యత్యాశ్చర్యంబు నొందుచున్నాను. నీవింతటి ఘనుండ వనియు, మహమ్మదీయరాజ్యంబుల నేకీభవింపఁ దగినంత శక్తి గలవాఁడ వనియు మొదట నెఱుంగక నిరసించినందులకు క్షమింపుము. నీ మహాశక్తికిఁ బరమానంద మొందుచున్నాను. కాని శత్రుకృతవిప త్పారావారంబున మునుఁగుచున్న యుదయగిరిరాజ్యము నుద్ధ రింప భవత్ప్రతిభానేకకసామర్థ్యము లేకపోయెనని వినుటకు

విచారించుచున్నాను' అని సందేహించుచుఁ బల్కెను.

'ఓ మహీపాలా! పూర్వ మనేకపర్యాయంబులు పొంగి పొరలి వచ్చుచున్న యపాయసముద్రంబులనుండి యుదయగిరి రాజ్యలక్ష్మిని దరింపఁజేసిన మత్ప్రతిభానౌక యీసమయంబునఁ గార్యాంతరము లనెడిమహా మారుతముచేఁ బ్రదేశాంతరములకు దరుమఁబడి యుండెను. అందువలన నింత పుట్టి నేనే యప్పట్టున నున్నచో నికార్యము మఱియొక విధముగ నెఱవేఱి యుండును. మాసైన్యంబు నాశన మందుటచేతను, సైన్యంబును సంపాదింపఁదగిన ధనంబు లేకపోవుటచేతను, నే మగిడి వచ్చునప్పటి కాయుద్ధంబునఁ జావఁగా మిగిలిన రాజపుత్రుండును, నాతనిపినతాతయు గృష్ణరాయునకుఁ జిక్కియుండుటచేతను, శత్రువులకుఁ దగిన ప్రతీకారముచేయ నామనంబు సతతంబును బోధించు చుండుటచేతను, నూరకుండఁజాలక తమవంటి మహారాజుల సాయంబువడసి శత్రువులం గెలిచి రాజ్యంబు స్వాధీనంబుగావించుకొనిమారాజపుత్రునందు నిలిపి నాప్రభుభక్తిని వెల్లడింపఁదలంచితమస్నేహంబునుగోరికొంటిని. తమయనుగ్రహంబునకుఁబాత్రులమగుదుమేని మాకష్టంబులుగట్టెక్కెననియే సంతసింతుము.ఈసమాచారముగోలకొండరాజ్యాధిపతియగు కుతుబ్‌షాహిమహీపాలునిఁ జేరి వేఁడుకొనఁగా నతఁడును మీతోఁగలిసి విజయనగర సార్వభౌమునితోఁ బ్రతిఘటించి పోరనంగీకరించి తన యంగీకారంబును దమకుఁ దెలుప నీసభకుఁ దనముఖ్య సేనాని నంపెను. అల్లె యహమన్నగరంబున కరిగి బెరీద్‌షాహ

సందర్శనంబు చేసి నావచనరచనలచే సంతసింపఁ జేసి యకార్యంబునకుఁ దోడ్పడ బోధించితిని. ఆతండును సంతసించి తన యంగీకారంబును దమకుఁ దెలుపఁ దన ముఖ్యమంత్రి నంపియున్నాఁడు. నాయుపదేశంబువలన నతఁడు పూర్వవైరంబు విడిచి తమతో స్నేహింప నున్నాఁడు. స్వల్పమగు జలప్రవాహంబు నెట్టివాఁడైనను దరింపఁగలఁడు. అట్టివే మఱికొన్ని గూడి ప్రవహించిన నెట్టిదిట్టయైనను దానిఁదరింపఁ జంకుచుండును. జంకుచుండుట యేకాదు. నాప్రవాహంబునఁబడికొట్టుకొనిపోకమానఁడు. అట్లెమీ మహమ్మదీయసైన్యములు ప్రత్యేకముగాఁగృష్ణరాయలతోఁ బోరలేకపోయినను నిమ్మాఁడును గలిసిన నవలీల జయింపఁ గలుగును. ఇమ్మహాకార్యంబునకు మీ రేకీభవించుటవలన మాకార్యంబు నెఱవేరుటయేకాక మీరాజ్యములకుఁ బ్రతిస్పర్థియగు విజయనగరరాజ్యము నిర్మూలమగును. మహాప్రజ్ఞావంతుల రగు మీకు నిమ్మహాకార్యంబులందలి లాభాలాభంబులను నే విభజించిచెప్ప నవసరములేదు.' అని రామయమంత్రి గంభీరభాషణంబులఁ బలికెను

ఆవాక్యంబు లాదిల్‌షాహాచెవులఁ బడినప్పు డతనిమనంబు పరిపరి విధంబులఁ బోఁజొచ్చెను. అతఁడు బహువిమర్శనాశక్తి కలవాఁడు. ఆలోచింపఁగా రామయమంత్రి చెప్పిన వచనంబులన్నియును యుక్తంబులైనట్లు తోఁచెను. అందుచే నతఁడు సంతసించి యతనిబుద్ధివిశేషంబును మెచ్చుకొనెను. మహమ్మదీయరాజ్యసమ్మేళనమున కానందముచెందెను. తాను దక్కినరాజ్యం

బులతో నేకీభవించివిజయనగరసామ్రాజ్యభాగమంతును స్తమింపఁ జేసినను నతఁడు వెనువెంటనే మగుడ నభ్యుదయముచెంది దుస్స హతేజోవిరాజమానుండయిసమీపశత్రురాజులను తేజోవిహీనుల గాఁజేయకవిడువఁడని మొదటసందేహముదయించెను. కానియంత లోనే,యింతమందిసాయంబులభించినప్పుడే తనరాజ్యంబునకు హృదయశల్యమైనవిజయనగరసామ్రాజ్యంబునురూపుమాప కుండుట రాజనీతికిఁ దగదని యొకతలం పుదయించి వెనుకటిసందేహంబును నొలంగించెను. కావునఁ దాను విజయనగరరాజుతో మైత్రి వహించి యున్నట్లయుండి యాకస్మికముగఁ పై బడఁదలంచి రామయ మంత్రింజూచి 'అమాత్యపుంగవా? నీప్రయాసంబునకు మిగుల సంతసించితిమి. తక్కిన రాజ్యంబులవారు సంతోషపూర్వకంబుగా మాకు సాయపడుదురని విజయనగరరాజ్యంబుపై దాడివెడలి రూపుమాపుట కింతేనియు సందియములేదు. మనము జయం బుగాంచినచోఁ గృష్ణరాయ లిదివరకుఁ దీసికొనినదుర్గంబు లను దద్దుర్గాధిపతుల కొసంగఁబడును. కాని యాదుర్గా ధీశ్వరు లీయుద్ధమునఁ దోడుసూపవలయును. తక్కిన రాజ్యం బును మారాజ్యంబులు సమానముగాఁ బంచికొనును. ఇందు లకుఁ దక్కిన రాజ్యంబులవారి యభిప్రాయంబులు గనుగొన వల యును.' అని యాదిల్‌షాహా యనెను.

అంత మలమలఖాను లేచి యమ్మహీపతికి నమస్కరించి 'రాజేంద్రా! తమవచనంబు యుక్తముగా నున్నది. సమయము లభించినప్పుడు ప్రబల శత్రువుని రూపుమాపుట ముఖ్యకార్య

మని మూరాజేంద్రుని యభిప్రాయము. ఈకార్యంబునకై యతఁడు చమూసమూహంబులతోఁ గూడికొని నిండు మనం బుతోఁ దమతోనేకీభవింప నిష్టపడెను. ఒకవేళ నతఁ డిష్టపడ కున్నను నా బుద్ధిచాతుర్యంబున నొప్పుకొనునట్లు చేసెదను. శత్రు రాజ్య విభాగము విషయమై మీయభిప్రాయము మాకు సమ్మ తమే' అని వినయ గాంభీర్యంబులు తెల్లమగు నట్లు పలికెను.

అప్పు డహమ్మదు నగరరాజ్యంబునకుఁ బ్రధాన మంత్రియగు కంబర సేనుండు రాజేంద్రునకు సలాముచేసి 'ఓవసుంధరాధిపా! ఈ రామయమంత్రి పుంగవుని వచనంబుల కమందానందబు నొంది యక్కార్యంబునకుఁ దోడుపడ సమ్మతించి తమయభిప్రాయంబు తెలిసికొని రావలయునని చిరకాలమునుండి ప్రజ్వరిల్లు చున్న వైరాగ్ని హోత్రంబులచే సంతాప మొందు మనరెండు రాజ్యంబు లిఁకమీఁద నీరామయమంత్రి మూలమున స్నేహజల స్నాన మాచరించి సుఖంబున నుండుఁ గాక. తక్కిన వెట్లయినను మాప్రభువునకు సమ్మతంబులే.' అని తనయభిప్రాయంబును దెలిపి కూర్చుండెను.

ఆదిల్‌షాహ వారివచనంబులు విని స్నేహసూచకములైన చూపులను వారి మొగంబులపైకిఁ బఱపి 'ఓయీ! మీయిరువు రవాక్యంబులును నాకానందంబును గొల్పినవి.ఏకమతస్థులచేఁ బరి పాలితంబు లగుచున్నను నిమ్మాదురాజ్యంబులును బరస్పరక్రో ధంబు వహించియుండ నీరామయమంత్రి హితవచనంబులు పల్కి యాక్రోధంబును దొలంగించి సుఖవంతులనుగాఁ జేసినందులకు

మనమందఱమును రామయమంత్రికిఁ గృతజ్ఞులమై యుండవల యును. ఇవన్నియుమారాజ్యంబులకును ప్రతిష్ఠిరమైన విజయనగర సామ్రాజ్యవినాశనంబును కీరాజ్యత్రయమేళన మొకటిముఖ్యకార ణం' బనితలంచెదను.

అని పలుక రామయమంత్రి లేచి 'ఓ యవనాధీశ్వరా! ఈ రాజ్యత్రయసమ్మేళనంబునకును, విజయనగరసామ్రాజ్యభాను మంతు నస్తమింపఁజేసి మారాజ్యంబు లనెడినక్షత్రంబులఁ బ్రకా శింపఁ జేయుటకును, మావంటి యసహాయులపై తమ కుద్భూ తంబైన యపారకృపారసంబే కారణంబుకాని వేరొక్కటికాదు. తమరు మొదట నా కాశ్రయ మిచ్చుటచేతనే యింతవరకు జేయవలను పడినది. ఇతఁడే మాదుర్గాధీశ్వరుని కుమారుఁడు. ఎంతయో శ్రమచెంది కృష్ణరాయల కారాగృహంబుననున్న యి తనిఁ దప్పించికొని వచ్చితిని. ఇతనికై నేనింతశ్రమపడుచున్నాను.' అని పలికి సోమేశ్వరపాత్రుని వంకఁ జూడఁగా నతండు లేచి, తురుష్కాధీశ్వరుంజూచి ' ఓ మహీపాలా! మావంశస్థు లంద రును నిరుపమానప్రతాపవంతులై యుదయగిరిదుర్గంబును వైరు లబారిఁ బడకుండఁ గాపాడి నిష్కళంకకీర్తి నార్జించిరి. ఆకీర్తిచం ద్రమండలంబునకు నిప్పుడు శత్రుకృతపరాభవకళంకము సంభవిం చినది. మాజనకుండు వీరమరణంబు నొందుటకు విచారింపను గాని యీపరాభవంబునకు విచారించుచున్నాను. అతని నాశ్ర యించిన మారాజ్యంబు మాకిచ్చున నెడి ధైర్యం బున్నది. కాని భూరిపరాక్రమ సంపాద్యంబగు రాజ్యంబును, యాచ్నాసంపా

ద్యంబుగ నొసర్చవలెనని లేదు. కావున మీ సాయంబున, శత్రుకృతపరాభవంబును దొలంగింప నెంచికొనియె మిమ్మాశ్ర యించితిమి. ఆపత్కాలంబునఁ జేరఁదీసి మమ్ము బురస్కరించు కొని మాయుత్తర మార్గాన సిద్ధపడినందులకు మీ కెంతయుఁ గృతజ్ఞులము యుందుము.' అని పలుక నతని ధైర్యవచనంబులకు సభాసదులును మహీపాలుండును మిక్కలి సంతసించి నుతించిరి.

వీరంద ఱిట్లానందాంబుధిలో దొప్పదోగుచున్న సమయం బున ద్వారపాలకుం డొకఁడు మెల్లమెల్లగ వచ్చి రాజేంద్రుని పాదంబులకు నమస్కరించి 'ఓదేవా! ఎవ్వఁడో యొకవీరుండు వచ్చి ద్వారంబుచెంత నిలిచి తమదర్శన మభిలషించుచున్న వాఁడు. సెలవైనఁ గొనివచ్చెదనని మనవి చేసెను. ఆదిల్‌షాహ యది విని సభాకార్యంబులు ముగియుటచేతను, మఱునాఁడుతా నచ్చటనుండ వలనుపడమిచేతను, నాపురుషునకప్పుడే దర్శన మొ సఁగదలంచి యాతని రప్పింపు మని చెప్పె. ఆ సేవకు డానూతన పురుషుని గొనివచ్చుటకుఁ బోయెను. అంత నాదిల్‌షాహా సభాసదులం గాంచి ఆ వచ్చువాఁ డెవ్వఁడో నూతనపురుషుఁ డఁట! వాఁ డీ స్థలంబునకు వచ్చినదో సంక్షోభనించిన మనలం జూచి యనుమానము చెందక మానఁడు. మన మూఁడురాజ్యం బులు సంక్షోభవించిన శ్లివ్వరికిం దెలియరాదు. కావునఁ గంబర సేనుండును మలమలఖానును స్థలాంతరంబులకు జనుట మంచిది. తక్కినవా రున్నను నొక నష్టములేదు. ఈ సభావృత్తాంత మెవ్వ రికిని దెలుప మని ప్రమాణములు చేయవలె నని చెప్పఁగా

హారందఱు సట్లొనర్చిరి. కంబరసేనుండును మలమలఖానుం డును లేచి సెలవు గైకొని తమ నిలయంబుల కరిగిరి. సభా సదులందఱును నిశ్శబ్దంబుగా నుండఁగా నా నూతనపురు షుఁడు సభాతలంబు ప్రవేశించెను. ఆ పురుషుఁ డున్నత శరీరుఁడై కవచాది రణసాధనంబుల ధరించి చూపఱకు భయము గొలుపుచుండె. అతనిఫాల మతివిశాలము. నేత్రంబు లంబుజాత పత్రములు. ఆపురుషుని సభాసదు లచ్చెరువడి చూడసాగిరి. కొంద ఱితఁ డెవ డని యొకరి నొక రడుగు కొనుచుండిరి. మఱి కొందఱు గుసగుస లాడఁ దొడగిరి. అంతట నూతనపురుషుఁడు నిర్భయంబుగఁ దురుష్క మహీపాలుని సమీపించి నమస్కరించి నిలువఁబడియె. అంత రా జతనితో నిట్లు సంభాషించె.

రా:-ఓయీ! నీ వేదేశంబునుండి వచ్చితివి?ఏమి పనికై వచ్చితివి? నీ యాగమనమునకు గారణంబును ద్వరఁగాఁ దెలుపుము.

పు:-ఓ యవనాధీశ్వరా! నేను బరరాజతిమిరదివాకరుం డగు కృష్ణ రాడ్ధరణీశ్వరుని రాయబారిని. నాపేరు విజయసింహుఁడు. మీరు సావధాన చిత్తులరై మాసార్వభౌముం డంపిన సందే శమును సాంతముగా నాలింపుఁడు.

రా-మాకు మిత్రసత్తముఁ డయిన కృష్ణరాయుల రాయ బారివా? అట్లయిన నీవు మా కెంతయును మాన్యుండవు. రాయబారి వని చెప్పుచుంటివి? రాయబారమునకువచ్చితివా? చిక్కుపడిన వ్యవహారము లేమియును లేవే? మా యిరువు రకిఁ గల మైత్రిని బట్టి యోజింప క్షేమోదంతము

తెలిసికొన మీరాజు బంపియుండు నని తోఁచెడిని. రాజ్య లక్ష్మీసమువేతుఁడైన సార్వభౌమునకు సేమమా?'

వి-ఓమహీపాలా! ఉదారబుద్ధియుతుండును, పరమంత్రభేదననిపుణుండును నగు మహామంత్రి తిమ్మరుసు రాజాంగంబులం జక్కఁబెట్టుచుండఁగా మారాజచంద్రమునకుఁ గాని రాజ్యలక్ష్మికిఁ గాని చెట్టలు సంభవించు టెట్లు? మీ రనుకొన్నట్లు నేను క్షేమోదంతం బిటు గొనిరాలేదు. కొన్ని రాజకీయ వ్యవహారములగూర్చి ముచ్చటించుటకే మా సార్వభౌముం డంపెను.

రా-ఏదయినను మాకు సంతోషమే. నీవు తెచ్చిన సందేశమును దెలుపుము.

అప్పుడు విజయసింహుండాసభ ంగలయఁజూచెను.చూడఁగానే కఠినహృదయుడై తన్ను రెండుపర్యాయంబులు చంపఁదలంచి నదురాత్ముల మొగంబులు ప్రత్యక్ష మయ్యె.ఈదురాత్ములితని కేమయినబోధించి తనప్రాణంబులు దీయుదురేమోయని మొదటసంచలించెను. కాని వెంటనే ధైర్యంబు తెచ్చికొని "మహీపాలా! వంచకస్వభావంబులు గల కొన్ని గుంటనక్క లొకజింక యను మతి నొంది పరమృగభయంకరం బయిన మృగసార్వభౌముని మందిరంబు సొచ్చి యపాయకరంబు లగు ధూర్త కృత్యంబు లొనర్చె. ఇంతవఱకు సింహముదయకుఁ బాత్రమైన లేడి యిప్పుడింత సాహసము వహించి తదీయ లలాటసటాచ్ఛటల

నూడఁ బెఱుక నూహించుట ప్రాణాపాయకరంబని మాసార్వ
భౌముండు మీతోఁ జెప్పు' మనియె.

ఆదిల్ షాహ ఆవచనంబులు విని వచ్చుచున్న కోప
మడంచుకొని యేమియు నెఱుఁగ నట్లు నటించుచు 'ఓ విజయ
సింహా! ఈవార్త యతి చిత్రముగానున్నది. మీసార్వభౌముండు
నన్నుఁ గ్రూరజంతువుతోఁ బోల్చక సాధుభావముగల జింకతోఁ
బోల్చినయెడల కానందము చెందితి ననియుసామాన్యముగా జింక
కట్టి సాహస ముండు నని తలంచినందులకు నగుచున్నాననియుఁ
జెప్పుము. దాని కంతటిధైర్యముండునా? దాని కొకవేళ ధైర్య
మున్నదే యను కొందము. అయిన గుంటనక్కలు మహా
భయంబు గొలుపు సింహంబుచక్కని ధూర్తకృత్యంబు లొ
నర్చుట యసంభవము. ఒకవేళ నొనర్చిన నాభయంకరసిం
హము సరభసంబున వానిపైఁ బడి తన ఖరతరనఖరంబులచేఁ
జీల్చక వదలునా? వానికిఁ దగినదండనము సింహము చేసియే
యుండును. అందువిషయమై నాతోఁ జెప్పనేల? మీ సార్వభౌ
ముండు చెప్పుడుమాటలు విని చెడు నని తోఁచుచున్నది. నే
నిట్లంటి నని చెప్పుము. ఇఁకఁ దెలుపవలసిన సందేశ మేమి?'
అని మరల నడిగెను.

విజయసింహుండు తన సందేశంబును విని తురుష్క
మహీపాలుఁడు కోపించునని మొదటఁ దలంచెను. కాని యతని
మొగంబున నెల్లప్పుడును మందహాసమే వెలయుచుండెను. అది
యెట్లు కోప లక్షణ మగును? మాటలును మిక్కిలిమృదువులై

యుండెను. ఇఁక నతనికిఁగోప మున్నట్లు భావించు టెట్లు? కాని సభాస్థలంబు నలంకరించి యున్న రామయమంత్రి ప్రభృతులు కోపమును సహింపలేక, నేత్రంబులచేతను, దంతములచేతను, కనుబొమలచేతను, జూపులచేతను, బ్రకటించు చుండిరి. విజయసింహుండు వారికోపలక్షణంబులఁ బొడఁగాంచియు, సరకుగొనక 'ఓ మహీతల నాయకా! నా సందేశ మింకను మిలిగియున్నది. వినుఁడు. ఆ గుఁటనక్క లంతతో నూరకుండక సామాన్యమృగ దుర్లభంబును, కేవల మృగరాజభోగ్యంబును, నగు నొక మనోహరవస్తువును దస్కరించి యా లేడియొద్దకుఁ గొనివచ్చెనఁట! ఆలేడి సంతసముతో స్వీకరించెనఁట! మృగసార్వభౌముని మనోజ్ఞవస్తువును లేడియుంచుకొనుట మిక్కిలి శోచనీయము కదా! లేడి మొదట సాధుస్వభావముగల దయినను, వంచక సహవాసంబున ధూర్తత్వ మవలంబించి యుక్తాయుక్త వివేకంబుగలిగి యావస్తువును సింహంబున కర్పింపక ప్రాణంబు లర్పింప నెంచుట మఱెంత శోచనీయము' అని నిర్భయంబుగాఁ బలికెను.

అతని వచనంబులు విన్నప్పుడు సభాసదులు విజయసింహుని ప్రాణంబు పోవుట నిక్కంబని భావించుకొనిరి. తమ ప్రభువు మొగంబుఁ గనుగొనిరి. కాని యతనియందుఁ గోపలక్షణమే కానరా దయ్యె. అంత మహీపాలుఁడు 'ఓయీ! అర్థగంభీరంబు లైనను మీసార్వభౌముని వాక్కులు నా కవగతములయి యున్నవి? రాయ లిందులకై సందేశ మంపుట తెలివి మాలినపని. తాఁ దన భార్య పై

నేరము మోపి నిష్కారణంబుగా నిలు వెడలఁగొట్టెను. లతవలె నాశ్రయాభిలాషిణి యగు నాస్త్రీలలామ మ ? యొక్కనివరించి న్నా రాజ్యమం దున్నదేమో? అంతేకాని నాచెంత లేదు. ఆ మనోహరవస్తువు నాయొద్దకుఁ జేరనే లేదు. చేరినను చేరనీయను. అందులో నా చేయవలసిన పనియే మున్నది? తనవస్తువును దా జాగరూకతతోఁ జూచుకొనక యందెవ్వరో తస్కరించినప్పు డాయపరాధంబును వేఱొకనియందు మోపుట యయుక్తమని మీ రాజేంద్రునితోఁ జెప్పుము.' అని పలికెను.

విజయసింహుఁడది విని 'ఓ రాజేంద్రా! తాము పల్కిన వాక్యంబునకు నేనొక సమాధానము చెప్ప వలసి యున్నది. ఒక వంచకుఁడు బహు వేషధారియై వర్తించుచు పెక్కు మాయో పాయంబులు పన్ని యాయువతి స్వప్నమం దైనను జూడని యొక పురుషునితో సంబంధము కలిగియున్నట్లు రాజేంద్రునకుఁ దెలియఁ జేసి యాసాధ్వీమణి కట్టి యపాయము కల్గించె. సాధువుల బాం ధించువారు బాగు పడరు. అదుష్టులాశ్రమమునకుఁ గూడ వినాశ మ్ము కలిగింతురు. ఆవంచకుఁడును నతని యనుచరులును దమ సభలోనే యున్నారు. అట్టి దురాత్ములను జేరఁ దీయుట తమ కీర్తికి భంగము కల్గింపకపోదు? అని పలికెను.

అతని పలుకులు విన్నప్పుడు సభలో నొక మహాకల కలము పుట్టెను. ఆసభ్యులలోఁ గొందఱు తమ హస్తంబులు కరవాలంబులపై నుంచ తమ ప్రభువు వదనంబు వీక్షించిరి. అంత నామహీపాలుండు వారి యుద్యమంబును వారించి విజయసిం

హుం జూచి, 'ఓయీ! అధికప్రసంగము మాని నీ సందేశము తెల్పుము. ఈపర్యాయము మాసభ్యుల నిందించితేని నీప్రాణం బులు నీకు దక్కవు. నీవు సందేశహరుఁడవు గాని నీతులు బోధిం చు దేశికుండవుకావు. నీకొలఁది నెఱింగి మాటలాడుము. తెలుప వలసి యున్నచోఁ దెలుపుము.' అని పలికెను.

'ఓ మహీపాలా! ఆ సాధ్వీలలామ యీమస్గంబున కధ్య క్షుఁడగు తోషల్ ఖానుమందిరంబునం దున్నది. ఈ తోషల్ ఖానుని సంతోషపెట్టుటకై రామయమంత్రి వంచించి కొనివచ్చి యున్నాఁడు. ఎక్కడనో యెవ్వరో యిట్టి తులువపని యొనరిం చిన మారాజేంద్రుండును సరకుగొనఁడు. మీకు బ్రాణాస్పదుఁ డయిన తోషల్ ఖాను జేయించుటచేతనే యింతవఱకుఁ జెప్పవ లసి యున్నది. కావున నతనికిఁ గొన్ని వాక్ప్రహారము లర్పించి యాయువతీలలామను విడిచిపుచ్చ వలయు నని మా రాజేం ద్రుండు చెప్పు మనియె.' అని విజయసింహుండు పలికెను.

ఆవచనంబులు విన్నతోడనే తోషల్ ఖాను గుండెలలో రాయిపడెను. పరాంగనలను బలాత్కారంబునఁ గొనివచ్చి యుం చుకొనుట రాజున కిష్టములేదని ఖా నెఱుంగును. అందుచేతనే యతఁడు రామయమంత్రి చేసిన పనులన్నియుఁ దెలియఁ జేసెను. కాని యనంగసేనను గొనివచ్చుటను దెలుప లేదు. ఆదిల్ షా హాకు తోషల్ ఖా నట్టి యసత్కృత్యము చేయఁ డన్నదృఢవిశ్వా సము కలదు. కావున విజయసింహుని వచనంబు నాలోచింప కయే, 'ఓయీ! మాయుద్యోగులను నిందించుటకు వచ్చితివా

యేమి? ఇదివఱకు రామయాదులను నిందించితివి. ఇప్పు డు దుర్గాధిపతిని నిందించితివి. ఇఁకమీఁద నన్నుఁ గూడ నిం దింతువేమో యని భయ మగుచున్నది. అధికప్రసంగము మాని సందేశము మాత్రము చెప్పి ముగింపుము. కానిచో నీవాగ్బంధ నంబు చేయించెదను. మా దుర్గాధ్యక్షుఁ డెప్పుడు నట్టి పని చేయఁ డని మా నమ్మకము. మీరాజేంద్రుఁడు చెప్పుమనుమా టలు విని భ్రమచెంది యిట్లు చెప్పియుండు. తరువాతిసందేశము చెప్పుము' అని యడిగె.

ఓ మహమ్మదీయాగ్రణీ! మాకారాగృహమం దుండెడి ఖైదీలు కొందఱు తప్పించుకొని వచ్చి యీదుర్గంబున దాఁగి యున్నారఁట! ఉదయపుర దుర్గాధీశ్వరుని కుమారికయును బ్రహ్మే శ్వరపాత్రుండును ననెడి యిర్వురను రాజశాసనంబుల నతిక్ర మించి రామయమంత్రి గొనివచ్చి యిందుంచి యున్నాఁడు. మఱియు సయ్యదహమ్మదనువాఁడు రాయలయొద్దబహుద్రవ్యం బును దీసికొని హయంబులం గొని విజయనగరంబునకుఁ దెచ్చుచుండ మీ మిత్రులు కొందఱు వానికి ధైర్యము చెప్పి యాహయంబులను మీసేనలోనుంచుకొని వాని నెచ్చటనో దాచి పుచ్చె. వీరందఱును మీరాజ్యంబునందే యున్నారు. కావున వారినందఱను బట్టుకొని నాతోఁబంపవలయు. లేనిచో తానే చమూసమూహంబులతో వచ్చి వారిని గొనిపోవుననియుఁ జెప్పుమనియె. ఇదియే నాసందేశము. దీనికి సమాధానము చెప్పిన మానగరంబున కరిగెద' అని చెప్పి విజయసింహుం డూరకుండె.

అదివిని యాదిల్‌షాహ యోజించి 'ఓ విజయసింహా! మీ రాజు చెప్పిన వన్నియు నసంగతంబులుగానే యున్నవి. ఉదయగిరిదుర్గాధీశ్వరునికిఁ గుమారిక యున్నట్టునేవినియుండలేదు. ఆసయ్య డెవ్వఁడో యాకారాగృహవాసు లెవ్వరో నే నెఱుఁగను. మే మొరులజోలికిఁ బోక మారాజ్యంబును సౌఖ్యకరముగాఁ బరిపాలించుకొనుచుండఁగా మీచక్రవర్తి యిట్టిదోషములు నిరూపించుట తగదు' అని యేదియో ధ్యాయోజించుచుండెను. సభాసదులు బహునిందావచనంబులు పల్కిన విజయసింహునికిఁ గారాగృహవాసమో, లేక మరణమో తప్పదని నిశ్చయించుకొని కాఁగల కార్యంబున కెదురు చూచు చుండిరి. అంత రాజేంద్రుఁడు వారి యభిప్రాయంబు తెలిసికొని మాఱు పలుకక తన యొంటనున్న యమూల్యాభరణంబు నొకదాని దీసి యతనికిఁ బహుమతిగా నొసంగి, 'ఓ విజయసింహా! నీవు తెచ్చిన సందేశమునకుఁ బ్రతిసందేశంబును జెప్పి పంపెదము. అంతవఱకును మాదుర్గంబుననుండి మాయిచ్చు సపర్యల నందుచుండుము.' అని చెప్పి యొకసేవకునకు సాయ మిచ్చి యొకసుందర మందిరంబున విడియించె. అంత సభాసదులు తమ ప్రభు వొనర్చిన యకార్యంబునకు మిక్కిలి యాశ్చర్య పడుచుండిరి. ఇంతేకాక తమప్రభువును మనంబుల నిందింపసాగిరి. శత్రురాజు తన్ను నిందించుచున్న సహించియుండుట తమరాజు నభిమానహీనునిగాను వెల్లడించుచున్న దనుకొనిరి. ఆ శత్రు వెమ్ములు చిల్లులుపడునట్లు నీచము లాడఁగాఁ బ్రతీకారము చేయుటకు

మాఱుగా బహుమానము చేయుట తగనిపని యని వాదించు కొనిరి. బుద్ధిమంతుఁడగు రామయమంత్రి సైత మాభూపా లుం డొనర్చినది యుక్తము కా దని తలంచెను. రుద్రదేవ ప్రహారేశ్వరులు తమశత్రువున కట్టి గౌరవముచేసి పంపినందులకు డెందంబులఁ గుందసాగిరి. అప్పుడు రాజు సభవారికలకలమును వారించి 'ఓయీ! మీ యభిప్రాయంబు మా కవగతమయినది. విజయసింహునికి బహుమాన మొసంగుట యసంగత మని భావింపకుఁడు. వేఁటకాఁ డొకమృగమును బట్టుకొనువలె నన్న తలంపుతో ముందుగా మాంసాహారమును బెట్టుచుండును. దాని వలన వేఁటకాని కెంతో లాభించు నని మీకుఁ దెలిసియుండును గదా? అట్లె నాబహుమానమని భావింపుఁడు. విజయసింహుఁ డొకప్పుడు విజయనగరంబునకు వెళ్లఁగలిగినచో నాసద్భావంబును రాయలకుఁ దెలుపుట కట్లు చేసితిని. దాని కేమి? మనము ముందు చేయవలసిన పనియేమి? ఈ రాయబారి కేమి చెప్పి పంపుదము?' అని యడిగెను.

అదివిని తోషల్ ఖాను లేచి 'మహాప్రభూ! ఇందు విష యమే యాలోచింప నేల? యుద్ధమునకు రమ్మని వార్త పంపు టయే యుక్తము. హృదయ శల్యమువంటి శత్రువు నున్మూలిం చుట యుక్తము కదా?' అని సగర్వముగాఁ బలికెను.

అంత రామయమంత్రి లేచి 'ఓ మహీపాలా! పరేంగి తజ్ఞుండ నని గర్వము వహించిన నేనును దమ యభిప్రాయంబును దెలిసికోలేక పోతిని. ఇఁక మన మాలస్యము చేయక సమరం

బునకుఁ గడంగుట యుచితకృత్యము. శత్రువులు యుద్ధసన్నా హంబులు చేయుచున్న ట్లున్నది. మనమింక నా ప్రయత్నము చేయలేదు. ఈరాయబారిని వెంటనేపుచ్చిన తేపేవారు యుద్ధంబు నకు వత్తురు. అట్లయిన మనము చిక్కు పడవలసివచ్చు. కావున నీ విజయసింహుని విడువక కారాగృహమం దుంచుట యుచిత కార్యము.' అని పలికెను.

'ఓ రామయమంత్రీ! నా మనంబున నున్న దున్నట్టు వక్కాణించితివి. మిగులసంతసించితిని.' అని పలికి తోఫల్ ఖా నుం జూచి 'ఓ దుర్గాధిపా! ఇఁక నీవు దగిన యుద్ధసన్నాహ ములు చేయు చుండుము. నే నిఁక రాజధాని కరిగెదను. రాయ బారినిఁ గారాగృహమం దుంచు' మని చెప్పి సభ చాలించి వార లను సెల వొసంగి వెడలిపోయె. తక్కినవారును విజయసింహు నకు మరణము లేకపోయినను గారాగృహవాసము సంభ వించినది కదాయని యానంద మందుచుఁ దమతమమందిరంబుల కరిగిరి. మరునాఁడు తోఫల్ ఖాను విజయసింహుని నివాసమున కరిగి 'ఓ వీరవరేణ్యా! నీసందేశమునకు మేమును మా రాజును మిక్కిలి సంతసించితిమి. మారాజు నీకుఁ దగిన ప్రత్యుత్తర మిచ్చి నందాక దుర్గాధ్యక్షుండనగు నేను నీకు విహితకృత్యంబు లొన రింపం జను. మాదుర్గంబును జూతువుగాని నాతో రమ్మని పలికి యాతనితోఁగూడ నాయాస్థలంబుల కరిగి యందలి వింత లను జూపి తుట్టతుద కొకమందిరంబునకుఁ గొనిపోయె. అది నల్లరాపలకలచే దృఢంబుగాఁ గట్టబడినది. పట్టపగలైనను నది యం

ధకారబంధురమై చూపఱకు భయము గొలుపుచుండెను. ప్రతిదినం బును దుడిచి శుభ్రపరుపక పోవుటచే, మలినపదార్థంబులతోఁ గూడి రోఁతపుట్టించుచుండె. వీరమ్మ మందిరంబు చెంత కరుగునప్పటికిఁ బదు గురుమనుష్యులు బంధనసాధనంబులను బట్టికొని యచ్చట నిలి చిరి. వారు తోఘల్ ఖాను మొగంబును వీక్షింపఁగా నతఁడు కను సైగ చేసెను. వెంటనే వారు వచ్చి విజయసింహునిఁ జుట్టు ముట్టిరి. అతఁ డది చూచి 'ఓ దుర్గాధిపా! ఇదెక్కడి న్యాయము. ఎందులకు వీరు చుట్టు ముట్టుచున్నారు? వీరు నన్నవమాన పఱుపఁ దలంచి నట్టు లున్నది. అట్లయిన నా యీ కరవాలంబు వీరి గ్రీవానాళంబులను దయతోఁ జూడదు.' అని ధైర్యముతోఁ బలికెను. అది విని దుర్గపాలుం డతనిజూచి 'ఓ విజయసింహా! నీవు తెచ్చిన సందేశమునకు మహారాజేంద్రుండు సంతసించి నీకు బహు మానము చేసియున్నాఁడు. నేనును నీకు బహుమాన మర్పింపవ లసి యున్నది. కావున బహుమానము తర్వాత నొసంగెదను. అం దాక నీ వీమందిరంబున వసించి చీఁకటిలో నిట్టటు పర్విడు చున్న గబ్బిలములతో మైత్రి సలుపుచుండుము. అవియు నిన్ను గౌరవించుచుండును.' అని చెప్పి బలాత్కారంబునఁ బట్టుకొని బంధించి కారాగృహంబున నుంచి, కారాగృహాధికారి కప్పగించి, నేనుగాని నాయంపిన యానవాలుగాని లేకుండ వీని విడిచిపుచ్చరా దని పలికి యచ్చోటు వెడలిపోయెను. విజయ సింహునకు మగుడ మహాపద దుర్నివార్యమై తారొక్కనెను.

---

## ఇరువదియైదవ ప్రకరణము

### కంబరసేన్

రాత్రి యేతెంచినది. కార్యార్థము స్థలాంతరంబుల కరిగిన జనంబులు తమతమకార్యంబులు ముగించికొని వచ్చి నిజగృహంబులం జేరిరి. దివాసంచరిష్ణువు లగు విహంగమాదులును దమ గూండ్ల కరిగెను. నీలాకాశంబున నక్షత్రపంక్తులు వజ్రమణుల చందంబునఁ బ్రకాశించుచుండెను. చీఁకట్లు దట్టముగా వ్యాపించియుండెను. అట్టిసమయంబున రాయచూరుదుర్గంబున నొక మూలనున్న పాడుదేవాలయంబుచెంత కొకమనుష్యుఁడు పోవుచుండెను. ఆదేవాలయము పూర్వము హిందూరాజు లాదుర్గంబును బాలించినప్పుడు కట్టఁబడినది. అది మహమ్మదీయ పాలనముక్రిందకు వచ్చినప్పటినుండియుఁ బాడుపడి జనసంచారము లేక యుండెను. అదొక మూలయందుండుటచే జనసంపర్క మంతగా లేదు. ఏదోపనియుండినంగాని పౌరులా ప్రాంతంబునకుఁ బోవుట తటస్థింపదు. కావున నాపోవుచున్న మనుష్యున కచట నేదియో పనియుండి యుండు నని యూహింపవచ్చును. ఆపురుషుఁడె మెల్లమెల్లగా నాదేవాలయముచెంత కేగు నప్పటి కందుఁగూర్చుండి ప్రసంగించుచుండిన యిర్వురు పురుషులు వానిఁ జూచి సంతసించి యెదురుగా వచ్చి కుశలప్రశ్న చేసికొని యచ్చటఁ గూర్చుండిరి. అంత వారిలో నొకఁడు తక్కినవారిలో నొకనింగాంచి 'ఓయీ! శంకరరెడ్డి, నీవుచేసిన ప్రయ

త్నము సఫలమైనదా! అనంగసేన రోగపీడిత యైనట్లు లున్నది. ఇప్పు డెట్లున్నది. నీవు మం దిచ్చితివా? రోగము తఱిగి చను చున్నదా?' అని యడిగెను.

శం:-అయ్యా! రామరాజా! మనము తెచ్చిన యుత్తర మాయనం గసేన కిచ్చుటయెట్లో యని యోజించుచు నేదోపని కల్పిం చుకొని యాప్రాకార ద్వారముచెంతనే సంచరించు చుండితి. అంత కొంతిసేపటికి మాలతి యచ్చటికి వచ్చి 'యనంగసేన రోగము నివారించుటకు మందు దెచ్చెదను. పురంబులోనికిఁ బోనిం' డని ద్వారపాలకుల వేఁడుకొనుచున్నది. కాని వారు వదలలేదు. అదిగాంచి నే నొకవైద్యవేషము పూని మందుల పేరులు చెప్పుచు నిట్టటు దిరుగుచుండఁగా మాలతి వచ్చినది. ఆమెకు మందిచ్చు నెపంబున నాయుత్తర మిచ్చితిని. ఆద్వా రపాలు రనుమానపడలేదు. ఆమరునాఁడే మాలతి ద్వారము నొద్ద మగుడ నన్నుఁ గలిసికొని 'అయ్యా! ఆమందు మంచిది కాదు. రోగము తఱుగలేదు. మంచిమందు నొసంగుము. ఇదిగో నిన్న నీవిచ్చిన మం' దని చెప్పి రెండుత్తరంబులతోఁ గూడిన యొకపొట్లము నా కిచ్చెను. మేము ప్రతిదినంబును నాద్వారముచెంతఁ గలిసికొను చుందుము.

రా:-మిత్రమా! బాగుబాగు. మంచియుక్తిపన్నితివి. మాలతి మహాబుద్ధిమంతురాలు. అనంగసేన కేమియు నపాయము దొడరకుండఁ గాపాడ గలదు. ఆమె యిచ్చిన యుత్తరంబుల వృత్తాంత మేమి?

శ:-ఆమాలతి నాకొక యుత్తరము వ్రాసినది. అనంగసేనసంతా
పము పూర్తిగా నశించిన దనియు, నీతోఁ దలచుగ మాట
లాడి నీకీయుత్తరము లందించుటకే యిట్లు బొంకుచుంటి నని
యు వ్రాసినది. రెండవది సార్వభౌమునిహృదయము కరిగిం
ప ననంగసేన వ్రాసికొన్నది.

గా:-ఓయీ! నీవు నీపనులు నెఱవేర్చుచు, నాతో నీదేహాలయం
బున నిట్టి సమయమందు గలిసికొనుచుందుము.' అని పల్కి
రెండవవానిం జూచి 'తమ్ముఁడా తిరుమలరాయా! నీవరిగిన
చోట వృత్తాంతము లేమి?

తి:-సోదరా! ప్రహరేశ్వరపాత్రాదుల నామరునాఁడే కలిసికొని
వారికిఁ గొంచెము వెనుకఁబడి వచ్చుచుంటిని. మంత్రిపుంగ
వుండు 'ప్రహరేశ్వరాదులు రాయచూరునకుఁ బోయినచో
నూరకుందుము. వేఱొకస్థలంబునకుఁ బోవుచున్నచో వారిని
బంధించికొని రమ్ము' అని నా కాజ్ఞాపించె. వా రిచ్చటికే
వచ్చుచుండుటచే నేమియుఁ జేయ నైతిని. మార్గమధ్యంబున
వారిం బంధించి కొనిపోవుట మిక్కిలి సులభము. ఇప్పుడు
వారిని గొనిపోవ నెంతకష్టమో యోజింపుము. బుద్ధిశాలి
యైన మనమంత్రి నా కిట్లాజ్ఞాపించుటలో నభిప్రాయ మేమి?

రా-తిరుమలరాయా! తిమ్మరుసుబుద్ధి యద్వితీయ మైనది. ఎంతో
ఫలముండినం గాని య ట్లాజ్ఞాపింపఁడు. ఆ రాజమంత్రు
లిర్వురును, రాయచూరును దీసికొనవలెనని చిరకాలమునుండి
చూచుచుండిరి. విజాపురరాజు తమకు మిత్రుఁడై యుండు

టచే దమమనోరథమును సఫలము కావించుకొనలేకపోవుచు వైరకారణము నరయుచుండిరి. ప్రహరేశ్వరపాత్రాదులు రాయచూరును జేరినచో వారిని సాధించునెపమున నద్దుర్గంబును వశము చేసికొనవచ్చునని యతనియభిప్రాయము. చిరకాలముక్రిందట నుదయించిన వారిమనోరథం బిప్పుడు సఫలము కావచ్చును.

తి.-విజయసింహుండు వచ్చెనఁట! ఎందులకు?

రా.-రాయబారియై వచ్చెను. ముక్తాంబాదులకును, ననంగసేనను, ధనాపహారియగు తురకను దన కప్పగింప వలయుననియు, లేనిచో యుద్ధంబునకు వచ్చుచున్నాము అని విజాపురరాజునకుఁ దెలియఁ జేయుటకు.

తి:-ఆ తురుష్కరా జేమి పత్యుత్తర మిచ్చె. ఆ రెండింటిలో దేని నంగీకరించె.

రా:-యుద్ధమునకే యంగీకరించెను.

తి:-ఏమీ ! యుద్ధమునకే యంగీకరించెనా ! లేడిపిల్ల మృగరాజు నెదుర్కొన సాహసించుచున్నదే! ఈవార్త దెలుపుటకు విజయసింహుండు విజయనగరంబున కరిగెనా?

రా:-లేదు. అతని కారాగృహబద్ధుని గావించిరి. పాప మావిజయసింహునకు మరలఁ గారాగృహనివాసము తప్పినది కాదు.

తి:-అతని బంధించుటలో నాదిల్‌షాహ యభిప్రాయ మేమి?

రా:-తానంపినవార్త రాయలకుఁ దెలియనిచో నంతశీఘ్రముగా యుద్ధంబునకు రాఁడనియు, నింతలోఁ దాము సమరసన్నా

హంబులు చేసికొననచ్చు ననియు నూహించి యట్లొనరించె.

తి-ఇదివఱకుఁ బరాభూతుండయిన యీ రాజున కింతధైర్యంబు గలుగుట కాశ్చర్య మొదవుచున్నది.

రా-ఆశ్చర్యమున కే మున్నది. మనమంత్రి చెప్పినదంతయును సత్యముఁ మహమ్మదీయరాజ్యంబులు మూడును స్నేహంబు చేసికొని విజయనగరంబుతోఁ బ్రతిఘటింప నున్నవి.

తి-అట్లయిన రాయ లీపర్యాయము యుద్ధమున కసాధారణప్రయత్నంబులు చేయవలయును. లేకున్నఁ గష్టము.

రా-అట్లుచేయుట యుక్తమే, అయిన నంతమాత్రమున భయపడ నవసరములేదు. ఆ రాజ్యత్రయమువారికిని భేదము పుట్టింపఁ దగినయుక్తులు పన్ని మనమంత్రిపుంగవుండు నా కుపదేశించెను. ఒక్కటఁగూడిన మహమ్మదీయరాజ్యమేఘంబులను మనమంత్రిపుంగవుని యుక్తిమారుతము చెదరఁగొట్టఁ గల దనెడి ధైర్యము నా కున్నది.

తి-అట్లయిన సంతోషమే. ప్రస్తుతము మన మేమి చేయవలయును? విజయసింహుని దప్పించుట కేదయిన యుపాయ మున్నదా?

రా-తమ్ముఁడా! మన మిటఁ జేయవలసిన పనుల నేకములున్నవి. అనంగసేనను దప్పింపవలెను. ప్రహరేశ్వర రామయమంత్రులను బంధించికొని పోవలెను. ముక్తాంబను విజయనగరంబునఁ జేర్పవలయును. రుద్రదేవునకును, దోఫల్ఖానునకును దగిన శిక్ష చేయవలయును. ఇక్కార్యంబులు సాధింపఁదగిన యుపా

యంబును మంత్రియే యుపదేశించెను. మనము జాగరూకు లమై వర్తించినచో మన మిన్నికార్యంబులు నెఱవేర్చుకొనఁ గలము. ఏదో యుపాయము పన్ని విజయసింహుని ముందుగాఁ దప్పింతుము. నీయుత్తరంబును సరభసంబునఁ గొనిపోయి యిచ్చిరమ్ము. ఇప్పటికి మహమ్మదీయ సైన్యములు సన్నద్ధములై లేవు. కావున వేగముగా వచ్చి రాయచూరును ముట్టడించినచో విజయము గాంచవచ్చు నని తెలుపుము. విజయసింహునకు వచ్చినయాపద తెలియఁ జేయుము. నీవు వచ్చునంతలో నేనును శంకరరెడ్డియునుఁ గార్యంబులు నెఱవేర్చు చుందుము.' అని చెప్పి పంపివేసెను. అనంతరము రామరాజు శంకరరెడ్డి కొకయుత్తరమిచ్చి యేమేమియో చెప్పి పంపి తాఁదన మందిరంబున కరిగెను. మరునాఁడుదయమునఁ దా నొకయుద్యోగివేషంబు ధరించి యహమన్నగరమంత్రియునఁ గంబరసేనుని మందిరంబున కరిగి నమస్కరించి యతనిసత్కృతులంది కూర్చుండెను. అప్పుడు వారికిర్వుర కిట్లు సంభాషణము ప్రవర్తిల్లె.

కం:-అయ్యా! మీ రెవ్వరు? ఎందులకై వచ్చితిరి. మీ నివాసస్థల మెచ్చట?

రా:-మంత్రిపుంగవా! మానివాసస్థల మీదుర్గమే. నేను తోఫల్ ఖాను మిత్రుండను. ఈదుర్గంబున రక్షకభటాధ్యక్షుండనుగా నున్నాను. ఇఁక నీయుద్యోగ్యము చేయవలెనని లేదు. మీనగరంబునకు వచ్చిన నాకేదయిన నుద్యోగ మిప్పింతురేమో

యని మీా దర్శనంబునకు వచ్చితిని.

కం:-ఇచ్చటియుద్యోగంబు నేల మానుకొనుచున్నావు? తోఫల్ ఖాను మిక్కిలి మంచివాఁడే!

రా-మొదట మంచివాఁడే, కాని యిప్పుడు రామయమంత్రి వాక్యంబులు విని క్రొత్తవాఁ డగుచున్నాఁడు. మునుపున్న యుక్తాయుక్తవివేకము నశించినది. మావంటి హితులుచెప్పిన యుక్తవచనంబులు వినక రామయమంత్రియుపదేశంబున విజాపురరాజ్యధ్వంసకరంబులైన పనుల నొనర్చుచున్నాఁడు. ఆరామయమంత్రి బహుకుటిలుఁడు. వాఁడు విజాపురరాజ్యమునకుఁ బరమశత్రువువలెఁ గన్పట్టుచున్నాఁడు. అతని వెడలఁ గొట్టవలయునని చెప్పిన నా హితవచనంబులు వినకపోవుటయే కాకుండ నాకు దుస్సహావమానము చేసియున్నాఁడు. అందుచే నిట నుండవలెనని లేదు.

కం-ఏమేమిా! నేఁడు క్రొత్తమాటలు వినుచున్నాను. రామయమంత్రి విజాపురరాజ్యంబును వర్ధింపఁ బ్రయత్నించుచున్నాఁడని మేము వినుచుండఁగా భేదింప యత్నించుచున్నాఁడందువేమి? ఇట్టి యహితవాక్యంబులు నీవు పల్కుచుండఁ దోఫల్కా నెట్లు వినఁగలఁడు.

శా-ఓ మంత్రిపుంగవా! మాదుర్గాధీశ్వరుండు నిట్లే పలుకుచుండును. మొదట నేను నట్లె తలంచు చుంటిని. కాని విజయనగరంబునుండి వచ్చిన నాస్నేహితునివలన రామయమంత్రి రహస్యంబుల నన్నింటిని దెలిసి కొంటి. ఈ రామయమంత్రి

విజాపురరాజ్యధ్వంసంబునకుఁ దోఁకచుక్క. ఒక్క విజాపుర రాజ్యంబునకే కాదు. తక్కిన మహమ్మదీయరాజ్యంబులకుఁ గూడ నట్టివాఁడే యని నమ్ముఁడు. తిమ్మరుసు ప్రేరణచే నిచ్చటికి వచ్చినాఁడఁట!

కం:-నీవచనంబు లాశ్చర్యాంబుధిలో ముంచుచున్నవి. రామయ మంత్రి తిమ్మరుసునకుఁ బరమశత్రువని వినుచున్నాము. అట్లుండ నీవిట్లు దెల్పుచుంటివేమి?

రా:-ఓ మహనీయా! మీరు విన్నది యసత్యము. రామయమంత్రి తిమ్మరుసున కాఱవ ప్రాణమఁట. ఇంతేకాదు. ముందు ముందు సహాయమంత్రిపదంబునుగూడ రామయమంత్రికీయ నెంచియున్నాఁడు. మీరందఱు నతని మాయలోఁ బడినారు. నాహితవచనంబులను వినరు. ఏమి చేయుదును?

కం-అసత్యము చెప్పుచుండిన నెవ్వరు నమ్మెదరు. నీవచనంబులు నాకును విశ్వాసపాత్రంబులుగా లేవు. రామయమంత్రి తిమ్మరుసునకు శత్రువే కానిచో విజయనగరమునందుఁ దిరిగి మహాపాయకరంబు లగుపను లేఁదుల కొనరించును?

రా-విజయనగరపువారితో విరోధ మున్నట్లు నటించినగాని మహమ్మదీయులు చేరదీయ రని తిమ్మరుసునుపదేశంబుననే రామయమంత్రి యట్లొనరించె. అవి మహాఅపాయకరంబులని పై వారికిఁ దోఁచునేకాని యం దొక్కటియు నపాయంబుఁ గల్గించునది లేదు.

కం-ఓయీ! నీవాక్యము విశ్వసనీయముకాదు. రామయమంత్రి

రుద్రదేవాదుల సాయంబునఁ దిమ్మరుసును జంప నెంచెనా లేదా? విజయసింహుండు రానిచో నామంత్రి యీదినముననే యమమందిరంబున కరుగవలసినదే కదా?

రా-తిమ్మరుసుపై నున్నకోపముచేత రుద్రదేవుండే కొండటి సాయమువడసి యతనిఁ జంపఁ దలచె. అంతేకాని రామయ మంత్రి వారినిఁ బంపలేదు. కాని వారిని జంపి మంత్రిని రక్షింపవలయునని విజయసింహు నంపెను.

కం:-నీవాక్య మీమాటు మఱింత విరుద్ధముగా నున్నది? రామయమంత్రికి మిత్రుఁడైన రుద్రదేవుని శత్రువునిగాను, శత్రునైన విజయసింహుని మిత్రునిగాను నిరూపించుచుంటివి! నీ వాక్యము బహుచిత్రముగా నున్నది.

రా:-రామయతిమ్మరుసుమంత్రివర్యుల బుద్ధిమహిమంబు నెఱుంగ నివారి కల్లియుండును. సాంతముగా నావృత్తాంతము మీకుఁ జెప్పినంగాని శత్రు లెవ్వరో, మిత్రు లెవ్వరో తెలిసికొనుట కష్టము. ఉదయగిరిదుర్గాధీశ్వరుని పుత్రిక ముక్తాంబ యను నొకయువతి గలదు. ఆమె పేరైనను విన్నారా? లేదా?

కం:-ఉదయగిరిరాజునకు సోమేశ్వరపాత్రుఁ డను కుమారుండు మాత్రమే కలఁ డని వినియున్నాను. వినియుండుటయే కాదు. మొన్నటిసభలోఁ బ్రత్యక్షంబుగాఁ జూచియున్నాను.

రా:-ఆసోమేశ్వరపాత్రుఁడే ముక్తాంబ. మహమ్మదీయు లామె కవమానము గల్గింతురేమోయని తలంచి యతండుచేసిన తంత్రము. రామయమంత్రి పనులన్నియునుజనమోహకరంబులే?

కం.-(ఆశ్చర్యముతో) ఇదియొక నూతనాంశము. దీనిని దరువాత యోజింతము. మొదటియంశము సాంతము కానిమ్ము.

రా.-ముక్తాంబ విజయసింహుని వరింప నెంచుచున్నది. రుద్రదేవుఁ డామెను వరింపఁ బాటుపడుచున్నాఁడు. అతనిచర్య లామెకుఁ గష్టముగా నుండుటచే నతని సంహరింపఁ దనమంత్రియైన రామయామాత్యుని కాజ్ఞాపించినది. అతఁడు దగినసమయము చూచి రుద్రదేవాదులు తిమ్మరుసునుఁ జూపఁ బోయినట్లు తెలిసికొని రుద్రదేవుని మట్టుపెట్టి మంత్రినిఁ విడిపింపఁ విజయసింహుని బంపెను. రుద్రదేవునకుఁ దనయందు నమ్మకము కల్గించుకొన విజయసింహునితోఁ బరమశత్రుత్వము వహించి నట్లు కనఁబడెను. కాని విజయసింహుని రామయమంత్రి తన ప్రాణమునువలెఁ బ్రేమించుచున్నాఁడు. ఇందులకు మీకొక దృష్టాంతము చూపెదను. నాఁడు పిచ్చివాని వేషంబున విజయనగరవీధిలో సంచరించుచున్న రామయమంత్రి నొక వృషభము పొడిచి చంప నుంకించుచుండె. అప్పుడాతని విజయసింహుఁడే రక్షించెనో రుద్రదేవుఁడే రక్షించెనో యాలోచింపుఁడు. కావున మీరు చెప్పినదానిని బట్టి రామయతిమ్మరుసులకు శత్రుత్వ మున్నట్లు నిశ్చయింపరాదు.

కం:-పోనిమ్ము. విజయసింహసంగసేనలకు సంబంధము గల్పించిన వాఁడు రామయమంత్రియే యని వినియున్నాను. దానికే మయినఁ గల్పించి చెప్పెదువా యేమి?

రా:-మంత్రివరా! కల్పించి మిమ్ము మోహసముద్రమున ముంచిన

నా కేమిలాభము? నావాక్యము నమ్మినను నమ్మకపోయినను నాచెప్పఁదలంచినది చెప్పెదను వినుఁడు. ఉంగరములను దార్మాలు చేయుటయు నుత్తరమునుగల్పించి యనంగసేనను చెడలఁ గొట్టించుటయు, గారాగృహమందున్న ముక్తాంబాదులను విడిపించికొని వచ్చుటయు నివి యన్నియును దిమ్మరుసు రామయమంత్రిచేఁ జేయించెను. అందువలన మహమ్మదీయులు రామయమంత్రిని విజయనగరపువారికి విరోధునిగా భావించి చేరఁ దీయుదురని తలంచి యిట్లు చేయించె.

కం-ఓయీ! కొండ త్రవ్వి యెలుకను బట్టికొనునట్లు మహమ్మదీయులు చేరఁదీసికొనుటకింత ప్రయాస పడనేల?

రా-దానికిఁ దగినంత ఫలంబు లేకపోలేదు. ఇదివఱకు విజాపురరాజునకును రాయలకును నత్యంతమైత్రి కలదు. అందుచే విజాపురరాజున కధీనమైన యీదుర్గంబును వశంబు గావించుకోవలె నని చిరకాలమునుండి రాయలు కోరుకొనుచుండెనఁట. ఏదో విరోధకారణము కల్పించి రాయలకోర్కె దీర్పఁగా దిమ్మరుసు రామయమంత్రిచే ముక్తాంబాదులను, ననంగసేనను, నిచ్చటకుఁ జేర్పించె. ఇప్పుడు తమవారిని సాధించుకొను నెపంబున నీదుర్గంబును స్వాధీనము కావించుకొనును. ఆ మీఁద మహమ్మదీయరాజ్యంబులను గ్రమముగా వశము గావించుకొను నఁట. రామయమంత్రి మహమ్మదీయులకు హితునివలెఁ జూపట్టుచు నహిత మొనర్ప నిచ్చటికేతెంచెను. అది సామాన్యులు గ్రహింపలేరు. రామయ

మంత్రితిమ్మరుసుల కుత్తరప్రత్యుత్తరంబులు రహస్యముగాఁ వచ్చుచుఁ బోవుచుండె నఁట! రామయమంత్రి చేసినపను లలో నొకటైనను నొకరి ప్రాణము దీసినట్లు లేదు. ఒకని కైన నపాయము కలిగినట్లు లేదు. రామయమంత్రి నిశ్చయ ముగా నపాయములే కల్గింపఁ దలంచిన బ్రదికిఁబోవ నెవండు సమర్థుండు?

క:-ఆనెగొందిదుర్గమునుదహించుటయపాయకరముకాదా యేమి?

రా:-మహావాయువు వీచుచున్నప్పు డగ్నియెగిరె యిండ్లను దహిం చెనఁట. అంతేకాని యతండు స్వయముగా దహింపలేదు. వేయేల? రామయమంత్రి మహమ్మదీయులను వంచించువాఁ డవునో కాఁడో, నిశ్చయింప స్త్రీఁబురుషవేషము వేయుచు టయె బలవత్తరప్రమాణము. ఈసందేహమును మనంబునఁ బెట్టుకొని చూచుచుండుఁడు. అప్పుడు మీకే తెలియఁ గలదు. నేను వేఱొకప్పుడు తమదర్శనంబునకు వచ్చెద నని చెప్పి వెడలి పోయెను.

అనంతరము కంబరసేనుండు తనమనంబునఁ జింతింపసా గెను. అయిన నందుంగూర్చి విచారింపవలె నని తలంచి యత్న ముచేయుచుండెను. వీరిట్లు సంభాషించిన మరునాఁటిసాయంకాల మునఁ దనమందిరంబునఁ గూర్చుండి వీధివైపు చూచుచు నేది యో యోజించుచుండెను. ఆసమయమున నొక పురుషుం డావీథి బడిపోవుచు నతనిం గాంచి నిలువఁ బడి 'అయ్యా! మీరిచ్చటి వారా! విదేశ వాసులా?' అని ప్రశ్నించె.

కం:-నీ ప్రశ్నమువలన నీవు పరదేశవాసి వని తెలియవచ్చుచున్నది. నీనివాసస్థలమెచ్చట?

పు:-మాకాపురము విజయనగరము. ఈదుర్గమందు నాకొక పని యున్నది. మీరిచ్చటి వారైనచో, నొక వృత్తాంతము తెలుపుదురా?

కం:-ఏమి కావలయునో, అడుగుము. నాకుఁ దెలిసినదైనఁ దెలిపెదను.

పు:-ఈదుర్గంబున రామయామాత్యుఁ డనెడి యొక యద్వితీయ పురుషుఁడున్నాఁడఁట! ఆతనిగృహంబునకు మార్గంబు దెలుపుదురా!

కం-'ఏమీ! నిన్నుఁ దిమ్మరుసు పంపెనా? ఏమి? అట్లయిన నది మిగుల రహస్యముగా నుంచవలెను. నేనే రామయమంత్రిని. ఒరులకుఁ దెలిసినప్రమాదము వాటిల్లును రమ్ములోపలికిరమ్ము త్వరగారమ్ము' అని పలికి వానిఁద్వరఁ బెట్టసాగెను. ఆసేవకుఁడు కంబరసేనుని వాక్యంబులు యదార్థంబులైనవని నిశ్చయించి లోపలికేగి నమస్కరించి యాయుత్తర మందిచ్చి ,ఓ మంత్రివరా! రామయామాత్యులవారు మీరేయని యెఱుఁగక పోతిని. అడఁబోయిన తీర్థ మెదు రాయె నన్నట్లు మీదర్శనాబు నిమిత్తము ప్రయత్నించుచుండ మీరే స్వయముగాఁ గానవచ్చితిరి. నా వచ్చినవేళ మంచిది. వేగముగా నాకుఁ బ్రత్యుత్తర మిచ్చి పంపుఁ డని మనవి చేసికొనెను. అంత కంబరసేనుండు నిర్భరానంద భరితుండై యాయుత్తరంబు నిట్లు చదువఁ దొడంగె.

ఓ రామయామాత్యశేఖరా!

నాచెప్పినచొప్పున ననంగసేనను, బ్రహ్మేశ్వరపాత్రుని ముక్తాంబను, రాయచూరునకుఁ జేర్చి తోఫల్‌ఖానున కనంగసేన నిచ్చెద నని నమ్మించి స్నేహముచేసి పరఁగుచున్నా వని విన్నందుల కమితానందము నొందుచున్నాను. ఆదిల్‌షాహ గూడ నీ వలలోఁ జిక్కెనని విని నీ సామర్థ్యంబును నుతించుచున్నాను. మహమ్మదీయరాజ్యంబుల మూఁటింటికిని సఖ్యము గల్గించి మన రాజ్యంబుపై కి దాడి వెడలుటకై సైన్యంబుల నన్నింటిని జేర్చుటమిక్కిలి మంచిపని. ఆ సైన్యంబు లొక్కచోఁ జేరఁగానే రహస్యముగా దెలిపెదవేని మేము కొన్ని సైన్యంబులతోఁ బోయి యహమ్మద్నగరంబును ముట్టడించుచున్నాము. మనచక్రవర్తి గోలకొండపై కరుగును. ఆ రెండురాజ్యంబులును మనకు వశమగునేని విజాపురరాజ్యంబు నొక్క గుక్కను మ్రింగవచ్చును. హిందూరాజ్యంబుతో విరోధించియున్న మహమ్మదీయ రాజ్యత్రయమును జయింపకున్న హిందూశౌర్యము వెలువడదు. మిక్కిలి చిన్నవైన తక్కినమహమ్మదీయ రాజ్యంబులను జయించుట మనకొక ఘనకార్యముకాదు. ఇట్లు చేసితిమేని దక్షిణహిందూస్థానంబున నున్న మహమ్మదీయుల వెడలగొట్టి నిష్కంటకముగాఁ బాలించుకొనవచ్చును. తోఫల్‌ఖా ననంగసేన కవమానము చేయకుండఁ గాపాడుచుండుము. రహస్యంబును బయలు పడనీయకుము. ఇట్లు మహామంత్రి, తిమ్మరుసు' అనియున్న యాయుత్తరముం జదివికొని సేవకునిం జూచి

'ఓరీ! నీవు ముం దరుగుము. నే నిందులకుఁ దగిన ప్రత్యుత్తరము వ్రాసి యొకసేవకునిచేఁ బుత్తెంచెద' నని చెప్పి బంపివేసె. అనంతరము కంబరసేనుండు తనడెందంబునఁ బలువిధంబులఁ జింతింపఁ జొచ్చెను. 'అక్కటా! మొన్న చెప్పిన యుద్యోగిపలుకులు నిక్కంబు లయినట్లు నేఁటి యుత్తరంబు స్పష్టపఱిచె. ఆదిల్‌షాహ వంటి బుద్ధిమంతునిగూడ మోసపుచ్చిన రామయమంత్రి తక్కిన వారిని మోసపుచ్చుట యొకఘనకార్యము కాదు. రామయమంత్రి మహామాయావి యని స్థాపించుటకు నొకయువతికిఁ బురుషవేషమువేసి యీదుర్గవాసుల నందఱిని మోసపుచ్చుటయే చాలును. ఈ యుత్తరములోఁగూడ ముక్తాంబనే యుదాహరించెను. సోమేశ్వరపాత్రుని పే రెత్తుకొనలేదు. కావున నిది సత్యము యుండవచ్చును. ఒకవేళ మేము సైన్యముతో నిచ్చటికి వత్తు మేని మారాజ్యంబు శత్రువులకు వశ మగును. పేరాస పడియున్నది చెడగొట్టుకొనుటకంటె నున్నది రక్షించుకొనుట మంచిది. మే మిఁక నీ కార్యమ్మునకుఁ గడంగుట మహాపాతకరంబని తోఁచెడి' అని తలపోసి యీయుత్తరంబు తిమ్మరుసు వ్రాసినదా కాదా యని సందేహించి యిదివఱకుఁ దిమ్మరుసు తనకంపిన యుత్తరమొకటి తన పెట్టెనుండఁగా నది పైకఁదీసి యారెండుత్తరంబులను బరికించి చూచెను. వాని యందలి యక్షరము లొక్క పోలికగా నుండుటచే వెనుకటి వృత్తాంతమును దృఢముగా నమ్మెను.

---

## ఇరువదియాఱవ ప్రకరణము

### మలమలఖాఁ

మలమలఖాను గోలకొండరాజ్యాధినేతయగు కుతుబ్ శాహీసైన్యంబున కధిపతి. ఇతనికిఁ బూర్వము సదరుద్దీ ననెడి యొక మహమ్మదీయపుంగవుఁడు గోలకొండసైన్యాధిపత్యము వహించి యద్వితీయపరాక్రమంబు చూపి గోలకొండరాజ్యంబును బ్రాణంబును బలెఁ గాపాడుచుండెను. క్రీ. శ. ౧౫౧౫ వ సంవత్సరమునఁ దిమ్మరుసుమంత్రి మహాసేనాసమేతుఁడై పానగల్లు మీఁదుగా గొండవీటిసీమకుఁ బోవుచుండ నీ సేనానాయకుఁడు మహా సైన్యంబుతోఁ గూడిపోయి యెదిరించెను. అప్పుడ మ్మంత్రిపుంగవుఁడు నిరుపమాన పౌరుషము చూపి యా సేనాధీశ్వరు నోడించి సకుటుంబముగాఁనతనినిబంధించి విజయనగరంబునకుఁ గొనిపోయి కారాగృహంబునునుంచె. కుతుబ్ శాహి తన కుడిభుజమువంటి సేనానాథుఁడు శత్రుహస్తగతుఁ డయి నందులకు మిక్కిలి వగచి ధైర్యశౌర్యాదిగుణములచే సదరుద్దీనునకుఁ గొంచెమేనియుఁ దీసిపోని యీమలమలఖానునకు సేనాధిపత్య మొసంగి తిమ్మరుసుపైఁ గసిదీర్చుకొన వలెనని యుండెను. ఇట్లుండ రామయమంత్రి గోలకొండకుఁ బోయి 'మహమ్మదీయ రాజ్యంబు లేకీభవించి విజయనగరమును రూపుమాపుట యుచిత కృత్య' మని పలుదెఱంగుల బోధించెను. కుతుబ్ శాహి యందుల

కంగీకరించి రాయచూరుమ్గంబున జరుగబోవు దర్బారునకు మలమలఖాను నంపెను. ఈఖానును దన బంధువుల కాపదగల్గించిన తిమ్మరుసునందును, రాయలయందును మిక్కిలి విరోధంబును వహించి రామరుమంత్రి స్నేహం బవలంబించి రాయచూరునకు వచ్చి దర్బారునందు బల్కిన పల్కులు చదువరులకు విదితములై యున్నవి. దర్బారు ముగిసిన తర్వాతఁ గొన్ని దినంబు లాదుర్గంబునం దుండి మలమలఖా నందలి వింతలను జూచి సంతోషించుచుండెను. అతఁడు పారసీకదేశస్థుఁడు. స్వచ్ఛమహమ్మదీయవంశస్థుఁడ నని యతనికిఁగర్వము గలదు. అతనికిఁ దనమతమం దెక్కువ మక్కువఁ గలదు. అతఁ డొకనాఁడు విహారార్థ మరుగుచుండఁగా నాఁడు సభాస్థలంబునకు విచ్చేసిన ఫకీ రెదురుపడియె. అంత నతఁ డతనికి సలాము చేసి తనమందిరంబునకుఁ గొనిపోయి యుచితాసనాసీనుఁ జేసి మహమ్మదీయమతాభివృద్ధిం గూర్చియు, మతరహస్యంబులం గూర్చియుఁ దానే యెక్కుడుగా నుపన్యసింపఁ దొడంగెను. ఫకీ రతనికేమియుఁ బ్రత్యుత్తర మీయక, విని యానందించుచు, నతనిప్రభావంబును నుతింప సాగెను. అతఁడు నుతించుకొలఁదిని నీఖాను మఱింత ప్రోత్సాహము వహించి యుపన్యసింప నారంభించెను. ఇట్లు కొంతతడ వయినపిమ్మట ఫకీరు మలమలఖానుతో నిట్లు ప్రసంగించెను.

ప-ఓ మహమ్మదీయావతంసా! నే మొదట నీవింతటి వాఁడ వనుకొనలేదు. మతమునందు నీకింత సామర్థ్యము గలిగినం

దుల కధికారానందము చెందుచున్నాను. నీవంటివానికిఁ బ్రభుత్వ మబ్బినచో మనమత మీజగతీతలంబున నద్వితీయమై యుండునుగదా!

ఖా:-మహనీయా! మీరన్నట్లు నాకుఁ బ్రభుత్వమే సంప్రాప్తమైన నీహిందువుల నందఱిని మహమ్మదీయులనుగా జేయుచుందునా? కాని నాకంతటి యదృష్టము పట్టునా?

ప:-ఏల యదృష్టము పట్టదు? మొట్ట మొదట నీమహమ్మదీయ ప్రభువుల పూర్వులు బహమనీరాజు క్రిందివారేకదా? వారు క్రమముగా దుర్గాధిపతులై ప్రత్యేకరాజ్యంబుల స్థాపించిరి. ఇట్లుండ నీవు మాత్రము రాజ్యస్థాపకుండ వేల కాఁ గూడదు?

ఖా:-ఓ మహాత్మా! మీవంటి మహాత్ములకు భవిష్యత్కాల వృత్తాంతంబులు దెలియునని వినియున్నాను. నాయందు దయయుంచి భవిష్యత్కాల మెట్లుండునో తెలియఁ జేయుదురా?

ప:-(అతని ముఖమును బరిశీలించి) ఓ యవనాగ్రణీ! నీ ముఖ లక్షణాదులను బరిశీలింప రాజ్యాధిపత్యము వహించి యపార సౌఖ్యంబును, గీర్తిని, బొందుదు వని తోఁచుచున్నది. నా వాక్య మమోఘము. తప్పక నీకుఁ బ్రాప్తించును.

ఖా-(సంతోషముతో) ఓ మహనీయా! నాకు రాజ్యాధిపత్యము లభించునా? ఏమో నాకు నమ్మకము లేదు. ఎట్లు వచ్చును?

ప-ఓ తురుష్కాగ్రణీ! నీ వట్లు సంశయింపం బనిలేదు. మాదృశు ల వచనములందు విశ్వాస ముంచి శక్తికొలందిని బురుషప్ర

యత్నము సలుపుదు వేని నీవు తప్పక రాజ్యంబున కధిపతివి కాఁగలవు. ఇందుల కెంతమాత్రంబును సంశయంబు లేదు.

ఖా-ఓ మాననీయా! మీవంటివారి వచనంబులు వితథంబులు కావని నాకు దృఢవిశ్వాసము కలదు. మీరేమి చేయుమన్న దాని నొనర్చెదను. సెలవిండు. మీరు నాయందు దయయుంచి తత్సాధనోపాయము జెప్పి సాయపడిన నొకవేళఁ గృతార్థుఁడ నగుదు నేమో?

ప:-యవనాగ్రణీ! రామయమంత్రి మిమ్మందఱి నేకీభవింపఁ జేసి మీసాయంబున విజయనగరంబును రూపుమాప నెంచుట పూర్వము కృష్ణరాయలు స్వాధీనము చేసికొనియున్న యుదయగిరిని స్వాధీనము చేసికొనుటకే కదా?

ఖా:-అవును. అందువలన మనకుఁ గలుగు లాభమేమి?

ప:-మీ మూవురాజ్యము లేకీభవించినచోఁ దప్పక విజయనగరంబును జయింతురు. ఉదయగిరి రాజ్య మప్పుడు స్వతంత్రమగును. ఆయుదయగిరి రాజింతకుఁ బూర్వము నశించెను. అతనికి ముక్తాంబ యనెడి యొక కుమారిక మాత్రము కలదు. ఆమె యద్వితీయ సౌందర్యవంతురాలు. ఉదయగిరి యామెకు లభించును. నీవు రామయమంత్రిని మంచిచేసికొందు వేని యాయువతిని నీ కిచ్చి తీఱును. అప్పుడు నీవాయువతికిని, రాజ్యలక్ష్మికిని గూడ నధిపతి వగుదువు. ఆరాజ్యంబు మొదటఁ జిన్నదైనను నీ బాహు పరాక్రమంబునఁ బరరాజ్యంబులఁ గెల్చి దాని వృద్ధి పొందింప వచ్చును.

ఖా:-మీరు చెప్పినది కొంత యుక్తముగానే యున్నది. కాని ఉదయగిరి రాజునకు సోమేశ్వరపాత్రుం డనెడి కుమారుండు గలండు. కాని కుమారిక లేదు. మీకు వారి వృత్తాంతము తెలియక యిట్లని రని తలంచెదను.

ప:-తురుష్కాగ్రణీ! మీరందఱును రామయమంత్రి మాయా వాగురం దవిలియున్నారు. ఆనెగొందెయందు ముక్తాంబయని పిలువంబడెడి యువతి యిప్పుడు సోమేశ్వరపాత్రుఁ డను రాకుమారుఁ డయ్యెను. రామయమంత్రి బుద్ధిచాతుర్యము స్త్రీలను బురుషులను జేయుచున్నది. ఉదయగిరిరాజునకుఁ గుమారిక గలదని చెప్పినచో మహమ్మదీయులయిన మీరు క్రౌర్యము వహించి యామెకుఁ బరాభవము గల్గింతు రని యట్లు చేసెను. నీ వందులకుఁ బ్రయత్నింతువేని తప్పక చరితార్థుండవు కాఁగలవు.

ఖా:-మహాత్మా! ఇది సత్యమా! నా కాశ్చర్యము కలుగుచున్నదే! నాఁడు సభలోఁ జూచి రాజకుమారుఁ డనియే భావించితిని.

ప:-నా వాక్య మసత్యమని తలంతువేని రామయమంత్రిని బిలిచి రహస్యముగా నడుగుము. తత్త్వము బయలుపడు. మొదట నేనును నీవలె భ్రమచెందితిని. కాని నా కొకస్నేహితునివలన నాగుట్టంతయును దెలిసెను.

ఖా:—నాకాయువతి నిచ్చుటకు రామయమంత్రి సమ్మతించునా? అతఁడొకవేళ సమ్మతించినను, నాయువతి సమ్మతించునా?

ఈకార్యము నెరవేరునని నాకు నమ్మకములేదు.

ప:-ఓ యవనేశ్వరా! నీ విట్లు నిరాశ చేసికొనకుము. ఇకార్యంబున నీవు సిద్ధిపొందుట కొక యుపాయ మున్నది. మీవలన నుపకారము పొందఁదలంచిన రామయమంత్రి మీకాపాటి ప్రత్యుపకారము చేయఁ దగదా! అతఁడంగీకరించిన ముక్తాంబయు నంగీకరించును. నీ విషయమై పట్టుదల వహించి ముక్తాంబను నీ కిచ్చుటకును, నీ వతనికె సాయపడుటకును నిర్ణయించుకొని నీవును రామయమంత్రియును వాగ్దానములు చేసికొనుటమంచిది. మొదట నిట్లు వాగ్దానము చేసియుండుటచే రామయమంత్రి కృష్ణదేవరాయలకుఁ బ్రియపత్నియయిన యనంగసేనను గొనివచ్చి తోఫల్ఖానున కిచ్చియుండలేదా? అట్లే నీ కోర్కెయును సిద్ధి పొందును.

ఖా:-తోఫల్ఖానున కనంగసేనను దెచ్చి యిచ్చెనా? ఇదిసత్యమా అని యాశ్చర్యముతో నడిగెను.

ప:-నీతో నసత్యమాడ నా కవసర మేమి? నేనొకమాఱు తోఫల్ఖానుతోఁ బోయి యామెను జూచితిని. ఆమె నిరుపమానసౌందర్యవంతురాలు. ఆమె యతని వరించుట కిష్టపడునట్లు తోఁచుచున్నది.

ఖా:-ఓ మహాత్మా! మీరు చెప్పినది సత్యమే యైనచో రామయమంత్రినాకు ముక్తాంబ నేల యర్పింపఁడో చూచెదనుఁగాక, అతఁడు నాయభీష్టము నెఱవేర్పనిచో నేనతని కేలతోడుపడుదును? ఇంతేకాదు. మాప్రభువు మనంబునుగూడఁ

ద్రిప్పివేసెదను. చూడుఁడు. నా మహిమ.

ప:-యవనాగ్రణీ! నీ వట్లు చేయుదు వేని నీకార్య మిప్పుడే నెఱ వేఱునని నమ్ముము. రామయమంత్రినిఁ బిలిచి యిప్పుడే దానిగూర్చి ప్రసంగింపుము. ఈవృత్తాంతము నేఁ జెప్పితి నని చెప్పకుము. నేను మఱియొకపర్యాయము వచ్చి నీసందర్శనము చేయుదు. అని చెప్పి యతని వీడ్కొని పోయెను.

అనంతరము ఖా నమితానందభరితుండై యొక సేవకు నంపి రామయమంత్రికి సందేశ మంపెను. అంత రామయమంత్రి సరభసముగనంబునవచ్చి యా మహమ్మదీయుం డిచ్చు మర్యాదల నంది యాసనంబునఁ గూర్చుండెను. అప్పుడు ఖాను మంత్రిం జూచి 'యమాత్యశిఖామణీ! నేవచ్చిన కార్యంబు ముగిసినది. ఇఁకనే మా నగరంబున కరిగెదను. సమయము వేచి మాకు సందేశము పుత్తురేని సైన్యంబులతో వచ్చి జన్యంబున మీకు దోడ్పడుదును. మొన్నటిసభలో మీ రాకుమారుండు పల్కిన వాక్కుల కమితానందంబు నొందితిని. అప్పటినుండియు నతనితో స్నేహంబు చేయవలెనని మనంబువ్విళ్లూరుచున్నది. అతని మావిడిది కొకమారుగాని రావలయును. లేక నన్ను మీమందిరంబునకు ర మ్మన్న వచ్చెదను.' అని పలికెను.

రామయమంత్రి యతని వాగ్ధోరణి విని సందేహాస్పద చిత్తుండై యతనిం గాంచి 'యవనాగ్రణీ! నీయభీష్టంబు నెఱ వేరుట కే మున్నది? కాని మా రాజకుమారుండు నేఁడు తల నొప్పితో బాధపడుచున్నాఁడు. మఱియొకప్పుడు గొనివచ్చెదను.

లెమ్ము ' అని మంత్రివల్కె.

'మంత్రివర్యా! మీరహస్యంబు నాకుఁ దెలిసినది. దాచి
నను దాగదు. మీస్నేహితుల మగుమావంటివారిని గూడ వం
చింప వలయునా? పోనిండు దాని కేమి. మీరాజకుమారికను
గంటకుల కంటబడకుండ నుంచుటకై మీరుచేసినది మిక్కిలియు
క్తముగా నున్నది. నేను మీకుఁ బరమాప్తుఁడను. ముందు మీకు
గొప్ప సాహాయ్యము చేయ నున్నాను. ఉత్తములు మిత్రులకా
ర్యంబులు సఫలము చేయుచుందురు. ఉత్తమోత్తములును,
మిత్రసత్తములును, నగు మీరు నాకార్యంబు నెఱవేర్పక పోదు
రా! మీస్నేహితుఁ డయిన తోఫల్ ఖానునికోర్కె నెఱవేర్ప
నెంతయో శ్రమంపడి యనంగసేనను దెచ్చియిచ్చితిరి కదా! అట్ల
మీమిత్రుండ నగు నాయందు దయయుంచి మీ రాకుమారికను
నా కిచ్చి వివాహము చేయ వాగ్దాన మొనర్పుఁడు. లేనిచో నిఁక
మీమైత్రి వదలి యిప్పుడే గోలకొండకుఁ బోయెదను.' అని
నిస్సందేహముగాఁ బలికెను.

ఆవాక్యంబులు రామయమంత్రి చెవులకు శూలములవలె
నాటెను. మూర్ఖులగు మహమ్మదీయు లిట్టి పట్టుదల వహింతు
రని యూహించియే తోఫల్ ఖానున కనంగసేనను సమకూర్చి
నట్లును, నుదయగిరిరాజునకు ముక్తాంబ యను పుత్రిక
యున్నట్లును, నెవ్వరితోడను జెప్పలేదు. తా నంతగుప్తముగా
నుంచిన యారెండువిషయంబులును నా ఖానున కెట్లు తెలిసెనో
యని యాశ్చర్యవిషాదములును, ఖానువచనంబులకు దుర్వార

మగు కోపంబును నుద్భవించి యుల్లంబున ముప్పిరి గొనుచున్నను వివేకంబున వానిఁ దొలంగించుకొని ఖానుం జూచి 'ఓ తురుష్కావతంసా! నీ కోర్కె మిగులఁ గష్టసాధ్య మైనది. కష్టపడినను ఫలించు నని తోఁచదు. ఆముక్తాంబ పూర్వాచారపరాయణురాలు. అన్యజాతికులోద్భవుండవయిన నిన్ను వరించునో వరింపదో తెలియదు. మఱియొకయువతిని గోరుకొందువేని నీయభీష్టము దప్పక నెఱవేఱ్తు' నని పల్కెను.

'మంత్రివర్యా! మఱియొకయువతి నా కక్కఱలేదు. నాయందు మీకు దయయున్నచో మీరాకుమారిక నర్పింపుఁడు లేనిచో మీరు శ్రమపడ నవసరము లేదు. మీరు చెప్పినమాటను ముక్తాంబ యతిక్రమించు ననినాకుఁ దోఁచదు.' అని ఖా ననెను.

రామయమంత్రియప్పు డేదియుఁ జెప్పలేక 'ముక్తాంబతో యోజించి చెప్పెద' నని పల్కి యటనుండి వెడలిపోయెను. మలమలఖాను దనకార్యము తప్పక సఫల మగు నని సంతసించుచుండెను.

రామయమంత్రి తనమందిరంబుచేరెను. మొదట నా వృత్తాంతా మాకాంతకుఁ దెలుపవలె నని తలంచెను. కాని తరువాత స్వాంతంబునఁ బరిశీలింప నపారవిచార మనివార్యమై చుట్టుముట్టెను. ఎట్టి పాపకార్యముల కైనఁ వెనుక దీయని రామయమంత్రికి నిర్మల మైన యుదయగిరిరాజవంశచంద్ర బింబంబునకు మ్లేచ్ఛసంబంధంబువలనఁ గళంకము గల్గింప నిష్టము లేదు. అతఁడు త న్నుద్దేశించుకొని 'ఓరీ! దుష్టా! రామయమంత్రి

హతకా! నీ రాజకుమారిక యగుముక్తాంబ కెంత కష్టము తెచ్చి పెట్టితివి? ఇంకఁ గొంతకాల మానెగొందెలో నుండిన రాయలు కనికరించి ముక్తాంబ కుదయగిరిరాజ్య మిచ్చి యుండును. ఇట్లు కించిత్కాలంబులో సఫలీకృతకార్య యగుచున్న ముక్తాంబను నీ వచనరచనలచే సంతసింపఁ జేసి మోహసముద్రంబున ముంచి వైచి నిరపాయస్థలంబున సురక్షితయై యున్నదానినిఁ గ్రూర శ్వాపదాలంబులమధ్యకుఁ దెచ్చి విడిచితివి. ఇదియా నీ రాజభక్తి. గతించినదానికి వగవక యిప్పుడు నీబుద్ధికరవాలమును మెఱయిం చుచు మృగబాధనుండి తొలంగించి యాయుత్తమరాలిని రక్షిం పుము. అన్నివిధంబులచేత నిన్నే నమ్మిన సుగుణకదంబ యగు ముక్తాంబతో మహమ్మదీయ వృత్తాంతము చెప్ప నీ కెట్లు నోరు వచ్చుచున్నది.' అని తన్నుఁ దిట్టికొనుచు మనంబున దుఃఖించుచు ముక్తాంబమందిరము ప్రవేశించెను. అంత ముక్తాంబ రామయమంత్రిముఖలక్షణంబుల గ్రహించి విచారాతిశయంబతనిం జుట్టుముట్టి బాధించుచున్నదని నిశ్చయించి 'ఓ రామయమంత్రీ! మహాపాయసాగరంబుల నవలీలఁ దరింపఁ జేసెడి నీబుద్ధినౌక నీ కెల్లప్పుడు సాయపడు చుండ నిట్లు విచా రంబునఁ గ్రుంకుచున్నా వేమి శత్రువులవలన నవమానం బెద్ది యైన జనించినదా యేమి? అట్లయిన మిగుల విచారించుచు న్నాను. లేక శుభదివసంబులు సంప్రాప్తమయ్యెనని సంతసించు చుండఁగా మఱేద నాపద యెద్దియైన సంభవింప నున్నదా యేమి? నీ విచారంబునకుఁ గారణము తెల్పి నాకుఁ గూడ

విచారంబును బంచి యిమ్ము ' అని యడిగెను.

రామయామాత్యుండా వచనంబులు విని కొంత ధైర్యం బుదెచ్చుకొని ' తల్లీ ! వీఁడు తొల్లింటి రామయమంత్రికాఁడు. నిన్ను నిష్కారణముగా గష్టముల పాలు చేసితిని. ఆనఁగొందిని సుఖవంతురాలవై యున్న నీకు భ్రమకలిగించి పశువులవలె బుద్ధిహీనులై యుక్తాయుక్తము లరయక మోటుతనంబున వర్తించు మహమ్మదీయాధముల మధ్యకుఁ గొనివచ్చి విడిచి నందుల కిప్పుడు మిక్కిలి విచారము నొందుచున్నాను. మొదట నేనిట్లు సంశయించియే నీకుఁ బురుషవేషము వేసి యిచ్చటివారి తో నిన్ను రాజకుమారునిగాఁ జెప్పి నమ్మింపఁ జేసితిని. అంద రును నమ్మిరి. మొన్న సభలోనైనను నిన్నుఁ బోల్పలేకపోయిరి. ఇచ్చటి వారందరును నిన్ను బురుషునిగానే తలంచుచున్నారు. కాని గోలకొండసేనా నాయకుం డగు మలమలఖాను మన రహస్యంబును గ్రహించెను. అందులకై విచారించుచున్నా ను.' అనిచెప్పి విచారాతిశయంబున నాపైది చెప్పలేక పోయెను. కొంచెము మాగి తిరిగి యిట్లు ప్రారంభించెను.

'అమ్మా! ముక్తాంబా! ఎంతమాటాడెను. ఆ దుర్వార్త నానోటితోననలేను.ఆతుచ్ఛాంత్యుఁడు సాయపడనిచో వాని తాతం తవాని మఱొకని గొనివచ్చును. ఆతుచ్ఛుఁడు నిన్ను జూడ గోరు చున్నాడఁట. నిన్నా తుచ్ఛునకిచ్చి వివాహము చేయ వాగ్దాన మియ్య వలెనఁట. పాలవలె స్వచ్ఛమైన నీకులంబునకుఁ గళంకము దెచ్చిపెట్టను. అత్యంత కోమలమైన నవమల్లికాకుసుమ సంతతి

కఱకుత్రాటికి గుఱిచ్చి సట్లుసజ్జన శ్లాఘాపాత్రంబులైన సద్గుణంబులు గల్గి మహాబుద్ధిశాలుల మని ప్రఖ్యాతి వహించి మావంటి మంత్రులకు హితము కార్యనిశ్చయోపాయంబు చెప్పునంతటి ప్రతిభావిశేషంబున నొప్పుచుచు, నిరుపమానసౌందర్యవంతురాల వయిన నిన్నామొఱకు కఱకు తురకకిచ్చుట కంగీకరింపఁ గలుగుదునా! కార్యసాఫల్యము నిమిత్తమే యైనను నట్టి యవాచ్యమగు వచనము నానోటితోఁ బలుకలేను. ఇది వఱకు నీకుఁగల్గించిన కష్టములకే వగచుచుంటిని. ఇప్పు డీ క్రొత్తకష్టము కల్గింతునా? నిన్ను వానికిచ్చి కులంబు మలినంబు గావించినపిమ్మట రాజ్యము సంపాదించినను నేమి లాభము? కులగౌరవంబుఁ గాపాడుచు రాజ్యంబు సంపాదించి నీ కొసంగ కుండిన నారాజభక్తి యేల? నాబుద్ధిచాతుర్య మేల? ' అని తన మనోవికారంబును సూచించుచుఁ బలికెను.

' మంత్రివరా! నీ వట్లు పలుకవలదు. నే నతని పెండ్లాడి నప్పుడుగదా కులగౌరవంబులు చెడును. ఈ స్వల్పకార్యమునకు విచారింతు వేల? నీ వింక విచారంబు వదలి అతనిపాలికిఁ జని నీ యభిప్రాయము నెఱవేఱవచ్చునని చెప్పుము. నీతివిశారదు డవైన నీవు నాయాలోచనమును త్రోసివేయక మన్నింతువని తలంచెద. ధైర్య మవలంబింపుము. నీకు మేము రాజనీతి యుపదేశింపఁ దగినంత వారమా? ' అని ముక్తాంబ దృఢంబుగాఁ బల్కె.

రామయమంత్రి మొదట సందేహించెను. కాని ముక్తాంబ

మిక్కిలి ప్రజ్ఞావంతురాలని యెఱిఁగి యామెవచనంబులవలన ధై ర్యం బవలంబించి తదీయానుమతి వడసి చని ఖానుం జూచి 'అయ్యా! మీకార్యము నెఱవేఱినది. ఆమంజులగాత్రి నీసద్గుణ పుంజ మెవ్వరివలన విన్నదో కాని నీయందు బద్ధానురాగయై యున్నది.' అని యతనికి సంతసము గొలుపుచుఁ బలికెను.

ఆ వచనంబులకు ఖా నమితానందము నొంది మంత్రిం జూచి 'ఓ మహానుభావా! మీకరుణారస ముండినఁ గృతా ర్థుల మగుట కేమి కొదువ? నేనిఁక గోలకొండ కేగెదను. యుద్ధం బునఁ దప్పక సాయపడుమను. మీరీ కార్యము చక్కఁ జేసి నందులకీ బహుమాన మందుకొనుఁడు.' అని పల్కి యతనికి బహుమతి యొసంగి పంపివేసె. అనంతరము ఖాను ముక్తాంబయు నుదయగిరి రాజ్యలక్ష్మియుఁ దనకు దక్కుట నిక్కం బని భావించి యమితానందము చెంది ప్రయాణోన్ముఖుండై తనకు భవిష్యద్వృత్తాంతంబును ముక్తాంబా సాధనోపా యంబును జెప్పినపకీరున కాశుభవార్త చెప్పకుండఁ బోవుట సము చితము గా దని యొకసేవకునిచే నతనిఁ బిలిపించెను. ఆ పకీరు వచ్చి యుచితాసన మలంకరించి యుండ ఖా నా శుభో దంతంబును జెప్పె. దాని కతఁడత్యంత సంతోషంబు చెంది 'ఓ మహమ్మదీయకులపావనా! నీకోర్కి సఫల మైనందులకు మిక్కిలి యానందించితిని. నే నన్నట్లు నీవు తప్పక రాజ్యాధిపతి వగుదువు. నేనొకటి నీకుఁ జెప్పవలసియున్నది. నీవు నేఁటికిఁ బ్రయాణము నిల్పి నిన్ను వలచిన యాకాంతామణిని సందర్శించి సరసముగా

సంభాషించి యొకబహుమతి యొసంగి సంతసింపఁజేసి పొమ్ము. నీవట్లుచేయనిచో సరసురాలయిన యామె నిన్ను మోటువానిగా భావించు' అని పకీరు పల్కెను.

అంత ఖా నావచనంబుల కానందంబు చెంది పకీరువచనమే తనకు యుక్తము యుండుటచేతను, నాసుందరాంగిని జూడఁదనడెంద మువ్విళ్ళూరు చుండుటచేతను, దద్దర్శనంబు చేసి పోవలెనని నిశ్చయించి పయనము మాని యచ్చటనే యుండెను.

---

## ఇరువదియేడవ ప్రకరణము

### ఆ స వా లు

రాజకీయవ్యవహారంబులు పెక్కులుండుటచేతను, ననంగసేన రోగపీడితయై యున్నట్లు తెలియుట చేతను, దోఫల్ ఖానను ననంగసేనమందిరంబునకరుగ గొన్నిదినంబులు మానెను. ఒకనాఁడనంగసేన దివ్యమంగళవిగ్రహంబును దలంచుకొని తదీయదర్శనంబు చేయ నిశ్చయించుకొని బయలు వెడలెను. నాఁడు పకీరును వెంటఁ బెట్టుకొని పోలేదు. అతఁడొక్కఁడే పోయెను. ద్వారపాలురం బిలిచి 'మీరు జాగరూకులరై రక్షించుచున్నారు గదా?' యని హెచ్చరించి సౌధాంతరము ప్రవేశించెను. ఇతఁడు ప్రవేశించు నప్పటికనంగసేన సుఖముగా నిద్ర పోవుచుండెను. మాలతి యామె శయ్యాతలంబునకు సమీపంబునఁ గూర్చుండెను. ఆ ఖానును జూచినతోడనే

మాలతి మేలిముసుంగునై చిక్కొని లేచి నిలువఁబడెను. ఖాను ద్వారబంధపుకమ్ములపైఁ దన రెండుచేతుల నాని నిలువఁబడి లోపలికిఁ జూచుచుండెను. వెనుక మాలతి పల్కిన వచనంబులు హృదయంబున నాటుటచే సాహసించి లోపలి కరుగ లేక పోయెను. మాలతి యది చూచి 'అయ్యా! రండు. వచ్చి యీయాసన మలంకరింపుఁడు' అని యత్యాదరంబుతోఁ బలికెను.

ఖా న్నావాక్యంబుల కమితానందంబు నొంది పోయి యాసనంబునఁగూర్చుండి తొంటివలె నిందింపక చనువిచ్చి మాటాడుటచే వారు తనకువశులగుచున్నారని నిశ్చయించి యాసుందరి పైఁ దన కడకంటిచూపులఁ బఱపి, 'ఓ యువతీలలామా! నీవును నీయాసనంబునం గూర్చుండుము. లేక నీ వట్లు నిలువఁబడిన కుసుమాతికోమలంబయిన నీశరీరము బడలికఁ జెందును. మీరు క్షేమముతోనున్నారా? మాదాసీజనంబులు తఱితప్పకుండ నాహారపదార్థంబుల గొనివచ్చి యిచ్చుచున్న వారలా? లేనిచో చెప్పుము. వారి నిప్పుడే శిక్షింతును. మీచెలి నిద్రించుచున్నదా యేమి?' అని వేడుకతోఁ నడిగెను.

'తురుష్కాగ్రణీ! ఆహారాదులందు మాకు సుంతేనియు లోపము లేదు. మీదయ మాయందుఁ బరిపూర్ణంబుగా నుండఁగా మాకు లోప మెట్లు కలుగును? ఇచ్చటి వసతియు మాకు సుఖకరంబుగనే యున్నది. కాని యొకయాపద వీతెంచి యానందంబును, సౌఖ్యంబును గలుగ నీయకున్నది. మీరు వెనుకవచ్చి చన్నదిమొదలు మాచెలియు రోగపీడితయై పలుబాధలఁ బడుచు

న్నది. ఆమెరోగము తగ్గి చనుటకుఁ దగినయౌషధ మీయవల యునని యెంచి పురంబులో వైద్యుని కడ కరుగుచుండఁగా మీ ద్వారపాలురు నిర్బంధించిరి. జ్వర మతితీవ్రముగా నున్నది. ఇప్పు డైనఁ ద్వరపడి తగిన మందీయనిచో నాసకియ బ్రదుకుట దుర్ఘ టము. మీకు మామరవస్థను దెలుపవలయునని భటులను గోరి తిని. వారు నాప్రార్థనమును నిరాకరించిరి. ఇట్లెన్ని ప్రయత్నము లుచేసినను మీదర్శనంబుగాని యౌషధంబుగాని లభించినది కాదు. ఏమి చేయుదు. జక్రవర్తికిఁ బ్రియురాలై యపార సౌఖ్యంబు లనుభవించియున్న కాంతాలలామ యిప్పట్టున మం దులేక ప్రమందవలసి వచ్చుచున్నది కదా యని నాడెందంబు క్రొం దల పడుచున్న దని పల్కి మాలతి ముత్తెపుకోవవలెఁ దెల్లని బాష్పబిందుసంతతిని గన్నులనుండి కురియించుచు నేడ్వసాగెను. ఆమె దీనాలాపంబులు విన్నప్పుడు ఖాను చెందిన దుఃఖంబునకు పారంబు లేదు. ప్రియబాంధవుఁడు మృతినొందినను, యుద్ధరంగం బున నని వార్యసౌర్యపూరితులయిన వైరివీరులకుఁ జిక్కి ప్రాణం బులు విడువ సిద్ధముగా నుండినను, జలింపని యతని చిత్తమ్ము డోలాందోళనము చెందసాగెను. దీనాతిదీనంబులైన మాలతి వచనంబులును, నామె ప్రవర్తనంబును, పాషాణ కఠోర మైన ఖానుహృదయంబును నవనీతసమానంబుగా జేసి విడిచెను. అప్పు డు ఖా నామానినింగాంచి 'సుందరీ! ఈకఠినహృదయుఁడు మి మ్మట నిల్పి మీక్షేమ మరయక వర్తించె. నాయపరాధంబు ఘన్నింపుము. కా ర్య భా రం బు న న్నుఁ గ్రిం ది

కడచి యడుగు దీసి యడుగు బెట్ట నీలేదు. కావున రాఁజాలక పోతిని. కాని యనురాగప్రపూర్ణములైన నీనాకటాక్షవీక్షణంబులఁ జూచి హృదయానందము కలిగించుచు, సుధారసంబునునిరసించు మృదుమధురవచనంబులచే వీనులకు విం దొనర్చుచు, నిలుకడ గన్న మెఱపుచందంబునఁ గాంతిపూర్ణములై శిరీషకుసుమకోమలంబులైన నీనా దివ్యమంగళవిగ్రహంబులఁ జూపి యనంతసుఖ మొందఁజేయుచున్న నీసన్నిధి నభిలషింపని మానుఁడు లోక మందుండునా? ఇఁకఁ గడచినదానికై వగవనేల? ప్రస్తుతము మీచెలియ యెట్లున్నదో చెప్పుము. ఆమెకుఁ దగిన మం దిచ్చి కాపాడవలయునేని వైద్యునిఁ బంపించెదను. అతఁడు దివ్యౌషధం బిచ్చి మీచెలినిఁ బ్రదికించితీఱును. అని పలికెను.

అయ్యా! వైద్యుండు రా నవసరంబు లేదు. మాసుందరి దివ్యగాత్రము ప్రతిమానవుని కంటను బడఁదగినది కాదు. కావున నాకు సెల వొసంగుదురేని నే వానిచెంతకుఁ బోయి మందు దెచ్చి యాకాంతను రక్షించుదు నని మాలతి పలికెను.

సుందరీ! అట్లయిన నే నొక యుత్తరము వ్రాసి యిచ్చెదను, దాని నావైద్యున కిమ్ము. అతఁడు నీకుఁ దగిన మం దిచ్చును. నిన్ను మా ద్వారపాలకులు నిర్బంధింప కుండునట్లు చేసెదను. అని ఖాను పల్కెను.

అతఁడట్లు చెప్పుచున్న యవసరంబున మాలతి దుఃఖించుచు, ననంగసేన చెంత కేగి చేతినాడి పరిశీలించి మగిడి వచ్చి యేడ్చుచు, ఖానుం జూచిఁ యవనాగ్రణీ! రోగ మతితీవ్రముగా

నున్నది. మానెచ్చెలి యారిపోవుచున్న దీపమువలె నున్నది. ఒకటి రెండు దినంబులు తప్ప జీవింప దని తోఁచుచున్నది. మీరు చెప్పిన వైద్యుం డనుభవశాలియే కదా? లక్షణంబులఁ జెప్పిన రోగంబునుబోల్చి మం దీయఁ గలుగునా? దాని కేమి. నే నాతనికిఁ దెలియకపోయినను నతనియొద్ద నున్నవానిలో మంచిమందును గొనివచ్చెదను. కాని మీ ద్వారపాలురబాధ మిక్కుటముగా నున్నది. వారు రెండేసిగంటలకు మాఱుచుండుటచే మీ రొక్కరితోఁ జెప్పినను దక్కినవారు నాయందు నమ్మిక యుంచి పైకిఁ బోనీయరు. వారిచే నిర్బంధింపఁ బడుదు నేని గార్యమంతయును జెడును. కావునభవన్నామాంకిత మగు నానవాలు నొకదాని నిత్తురేని దానిని వారికిఁజూపి నిరాటంకముగాఁ బోయి మందుఁ దెచ్చియిచ్చెదను. మీకు మా యనంగసేనవంటి యువతులు పెక్కురు లభింతురు కాన మీకంత విచారముండక పోవచ్చును. కాని నాకు విచారముండక పోదు. అని యేడ్చుచుఁ బలికెను.

సుందరీ! ఎంతమాటాడితివి? మీచెలి బ్రదుకనిచో నే బ్రదుకుదునా? చిరకాలమునుండి యామె స్నేహంబుచేసి వర్తించుచున్న నీకనంగసేనంగూర్చి యెంత విచారముండునో, యంతకు వేయిరెట్లు విచారమును నేఁ జెందుచున్నాను. మన్నామాంకిత మగు నీ యంగుళీయకమును దీసికొనుము. ఈ యుంగరంబును జూపితివేని నాభటులు నిన్నాటంక పెట్టరు. నీ విక్కార్యంబు నెరవేర్చుకొన్న తోడనే నాయుంగరము నాకిమ్ము. నీవామెను

గష్టపడి బ్రదికించి నాకుఁ గూర్చితివేని నీ కసామాన్యమగు బహుమాన మర్పింతును. అని చెప్పి యా యంగుళీయకమిచ్చి యామెను వీడ్కొని ద్వారముచెంతకు వచ్చి ' ఓరీ రక్షకభటు లారా! ఈ సౌధంబున మాలతి యనెడి యొక దానిని బురంబు లోనికిఁ బోవ నే సెలవిచ్చితిని. ఆనవాలుగా నా యుంగర మిచ్చితిని. ఆయుంగరమును జూపినప్పుడామెను వదలుఁడు. ఆమె నెచ్చెలి యనంగసేన సౌధమున నున్నది. ఆమె యా యాన వాలు చూపినను వదలవద్దు. ఒక్క మాలతిని మాత్రమే పోనిం డు, మీరు బహు జాగరూకులరై యుండవలెను. అని చెప్పి వెడలిపోయెను.

అనంతరము మాలతి నిర్భరానంద భరితురాలై, యనంగ సేననుస మీపించి ' చెలీ! అనంగసేనా! ఖాను బోయెను. నీవిఁక లేవవచ్చును. అని పలికెను. అప్పు డనంగసేన యమితానందంబు జూపుచు, ముసుఁగుతీసి పారవైచి, మాలతినిఁ గౌఁగలించుకొని మాలతీ! ఎంతదానవే! నీ చాతుర్యము నిరుపమానముగదవే ! నీ వచనరచలనచేఁ బాషాణ హృదయుఁడగు ఖాను నేడ్పించి నీ వలలో వేసికొంటివి. భగవంతుండు నీకింత ధైర్యంబును, నింత సాహసంబును నిచ్చినందులకు నే నమితానందము నొంది యతని నుతించుచున్నాను. సుందరీ! ఈ యుంగరము నా రోగము కుదు ర్చుకొనుట కుపయోగింపలేదు. కాని నీరోగము కుదుర్చుకొనుట. కుపయోగించుచున్నది. ఇఁక నీవు స్వేచ్ఛగాఁ బురంబునకరిగి నీకుఁ బరిచితుఁడైన వైద్యుని దర్శించి యానందించి రావచ్చును.

నీ విప్పుడు పరిచితుఁడైన వైద్యుని చెంత కేగుదువా? లేక ఖాను చెప్పిన వైద్యునిచెంత కేగుదువా?అని నవ్వుచుఁ బరిహాస వాక్యంబులు పలికెను.

అనంగసేన వాక్యంబులు విని మాలతి నవ్వుచుఁ నీ పరిహాసంబు లింకఁ జాలింపుము. దానికేమి? నాఁడు నీ వపాయంబున నుండఁగఁ దగిన మందిచ్చిన వైద్యున కెంత బహుమాన మిచ్చినను నాతని ఋణంబు దీర్చికొనలేము గదా! ఆతనికిఁ దగిన బహుమాన మొసఁగక పోవుటచే నాతని మొగంబు చూడలేకున్నాను. నీ నిమిత్తమె మందు తెచ్చితిని. కాన నీ వతనికేమి బహుమతి పంపుదువో చెప్పుము. అని మాలతి నవ్వుచు నడిగె.

చెలీ! నీవన్నది సత్యము. ఏమిచ్చినను నాతని ఋణంబు దీఱదు. నీవు నాదానవు కావున నావైద్యునకు నిన్ను బహుమతిగా నంపుచున్నాను. అందులకు నీ వంగీకరింతువా! అని నవ్వుచుఁ బలికెను.

దానికేమి? ఖానత్యాదరంబుతో నౌషధము తెచ్చుటకై నాకీ యుంగర మిచ్చి యున్నాఁడు ఇప్పుడే పోయి యౌషధము గొనివచ్చి నీ కిచ్చెదను. రోగము కుదుర్చుకొని సిద్ధముగా నుండుము. నే నీచే నతనితో మాటాడింతునేని నాకు గొప్ప బహుమానము లభించును. నీ వతనితో మాటాడి నాకాబహుమానము వచ్చునట్లు చేయుదువా? చేయవా? అని మాలతి పలికెను.

చెలీ! నీకు లభించు బహుమానమును నిష్కారణముగాఁ జెడగొట్టుదునా? అట్లె తప్పక బహుమానము గొనుము. నీవు

నన్నతనికిఁ గూర్చుటచే నాయుపకారంబున కతఁడు సంతసించి నీకు బహుమాన మర్పించి కృతజ్ఞతను దెలుపనున్నాఁడు. నాకా మహానుభావుని గూర్చుట కానందంబు గల్గించితివి. నేను నీకు బహుమాన మర్పింపవలదా! నీవు వచ్చునపుడు నిశాతకఖడ్గ మొకటి కొనిరమ్ము. నానిమిత్తము బహు శ్రమచెందుచున్న నీకు ఖాను ప్రాణంబును బహుమానముగా నర్పింతును. ఖానిచ్చెడి బహుమానంబుకంటె నేనిచ్చెడి ఖానుప్రాణమే నీకెక్కువ సంతోషమును గల్గించునని నమ్మెదను. అని కోపపరిహాసముల వెల్లడించుచు ననంగసేన బల్కె.

అమ్మా! నీకింత యాగ్రహంబేల? శాంతింపుము. నీవేమియుఁ జేయనవసరములేదు. సర్వకార్యంబులను నెఱవేర్ప నేనుండఁగా నీకింత శ్రమయేలా? అని మాలతి పల్కి సంతసింపఁ జేసెను.

అనంతరము జాముర్రాత్రియైన పిమ్మట మాలతి యనంగసేన యనుమతిని పడసి, యా యుంగరంబును బట్టుకొని యా సౌధంబునుండి నిర్గమించె. ఆమె మెల్లమెల్లఁగా ద్వారపాలుర చెంతకువచ్చి యా యంగుళీయకమును జూపి బయటఁబడెను. ఆయువతీలలామ ద్వారపాలుర నిర్బంధంబును బాసి గట్టును ఖండించుకొని సరభసంబునఁబోవు మహానదివలె నిరాటంకంబుగా బోవ సాగెను. కాని గాఢాంధకారబంధురమైన యా నిశాసమయంబున నావీధిని నొంటిగాఁబోవ భయంబును జెందక పోలేదు. ఆమె హృదయము దడదడ

కొట్టుకొన సాగెను. ఎవ్వరైనవచ్చి తనకవమానము కలిగించిన దిక్కులేదనియు, నట్టి భయంకరసమయములందు సాహసించి వచ్చుట మిక్కిలి ప్రమాదకరమని యప్పు డామెమదికిఁ దట్టినది అయినను గంతవ్యస్థానంబును ద్వరగాఁ జేరవలెనని నిశ్చయించుకొని కొంతదూరము పోయెను. తాఁబోఁదలచిన స్థలమచ్చట నున్న దేమోయని నలుదిక్కులు తరికించెను. కాని చీఁకటిలో నేమియుఁ గానరాలేదు. తాఁబోయెడి మార్గమున కుభయపార్శ్వములందును దరు బృందంబులు దట్టంబుగా నుండుటచే నామార్గము మఱింత చీఁకటిగల్గియుండె. అప్పుడా కాంత యచ్చట నిలువబడి దారి తెలియక యిట్టటు నడయాడు చుండెను. ఆసమయంబున నాచెట్లలోనుండి యొకపురుషుండు నిశ్శబ్దంబుగా వచ్చి యామె బుజముపై చేయివైచెను. ఆమాలతి భయంబునఁ ద్రుళ్ళిపడి యాచేతినిఁ ద్రోసివేసి వికృత నినాదంబు సల్పుచుఁ నేలఁ గూలఁ బడియెను. ఆచుట్టుపట్ల నిండ్లుండినచో నామె వికృతనినాదము విని యెవ్వరైనవచ్చి రక్షించియుందురు. కాని యచ్చటఁ జెట్లుతప్ప నేమియును లేవు. అంత నాపురుషుండామెచేతిని బట్టుకొని 'సుందరీ! ఏల భయప డెదవు. నేను నీ ప్రాణవల్లభుఁడనగు శంకరరెడ్డిని.' అది విని తన నాయకుని కంఠధ్వనింబట్టి పోల్చి మిక్కిలి సంతసించి తన భర్త పాదములపైఁబడి నమస్కరించెను. అంత నా శంకరరెడ్డి యా యువతిని దేవాలయంబునకుఁ గొనిపోయి యొకచోఁ గూర్చుండి తనప్రక్క నామెను గూర్చుండఁ బెట్టుకొనెను. అప్పుడు మాలతి

తన హృదయవల్లభుని హస్తంబును దన హస్తంబునఁ గీలించి 'నాథా! నాయపరాధంబు మన్నింపుము. మనబంధువులలో నొక రితోనైనను జెప్పకుండ వచ్చుట గొప్ప తప్పిదంబని యిప్పుడు తెలిసికొంటిని. నన్నుఁ దన యాఱవ ప్రాణంబువలెఁ జూచుకొను చున్న యనంగసేన దుఃఖంబును జూచి సహింపలేక యట్లొనర్ప వలసి వచ్చెను. అనంగసేన దుఃఖంబును జూచుట వలన నా యుక్తాయుక్తజ్ఞానమంతయును నశించిన దేమిచేయుదును? నే నీ యాపదలో నామెకు సహాయ భూతనై యుండనిచో దుఃఖాతి శయంబున నామె ప్రాణంబులు విడిచి యుండు. రాయలామెపై దోషారోపణముచేసి తూలనాడిన నాఁటి రాత్రి యనంగసేన ప్రాణంబులు గాచుటకై నా పడిన కష్టము భగవంతుని కెఱుక. నేనొక్క క్షణమైన విడిచి యుండిన యెడల నామె ప్రాణంబు విడుచుట నిశ్చయము. నాఁటి రాత్రి రెండు యామము లతిక్ర మించు నంతవఱకును విజయనగరంబున నుంటిమి. అప్పు డనంగ సేన యవమానభరంబు సైపలేక మృతినొంద సిద్ధపడఁగా బోధించి యామె పుట్టింటికి బోవ నొడఁబడునట్లు చేసితిని. ఆ రాత్రియే యామె పైనమై పోవుచుండ నాయాపద్దశయం దామె నొంటిగా విడనాడుట ధర్మము కాదని తదనుచారిణినై వచ్చితిని అందుచేఁ బూజ్యులైన యత్తమామల యొద్దనైన సెలవు గొనకుండ వచ్చితిని. ఆనా యపరాధంబు క్షమించెద నని నీవు వాగ్దానంబుచేసినఁ గాని నామనం బూరట చెందదు. నేను నిర్దో షినని ప్రమాణముచేసి చెప్పుచున్నాను. కావున నన్ననుగ్రహించి

తొంటిదయ చూపుమని కన్నీరుకాఱ నేడ్చుచు గద్గద స్వరం బుతోఁ బలికెను.

ఈ శంకరరెడ్డి విజయనగరపురవాసి. ఇతఁడు రాయల కొలువులో నుండెను. మల్లుపోరాటముఁనాడు రుద్రదేవునిచేదు రొక్కన్న వాఁడితఁడె. అదిజరిగిన మరునాఁడే సార్వభౌముని యాజ్ఞ తలఁదాల్చి మైసూరు రాజప్రతినిధి యొద్ద కొక కార్యము నిర్వహింపఁబోయెను. ఇతఁడు తన భార్యను ప్రాణాధికనుగాఁ జూచి ప్రేమించుచుండె. అందుచే నామెను విడిచిన యొక క్షణ మొక యుగముగా భావించుచుండెను. అయినను శంకరరెడ్డి కార్య భారంబునకుఁ దోడు ప్రియా వియోగభరము తోడయి బాధింప నెట్టకేలకు సహించుకొని పోయి యక్కార్యంబు నెఱవేర్చుకొని తన హృదయవల్లభను గనుగొన విజయనగరంబునకు వచ్చె. వెంటనే తన మందిరంబునకుఁ బోయెను. అంత నతని తల్లి యత నిం జూచి యేడ్చుచు నివ్వార్తను వినిపించి విచారపరీతను జేసెను. కోడలిపైఁ దప్పులెంచుట యత్తగారి నైజము. కాన యామె యంతతో నూరకుండక యామె దుశ్చరిత్రురాలని యును, దుష్టురాలైన యనంగసేన సేవచేయుటచేతనే యామె కిట్టి దుర్బుద్ధి పుట్టెననియు, నిట్లున్నవి కొన్ని లేనివి కొన్ని కల్పించి యతనికామెపైఁ గోపము గల్గించె. అనంతరము కొన్ని దినంబులకు దిమ్మరుసు నానతి చొప్పున రామరాజునకు సహాయభూతుండై రాయచూరునకు వచ్చె. ఇచ్చటికి వచ్చిన పిమ్మట మాలతి కొక యుత్తరము కఠినముగా

వ్రాసి మందులవాని వేషంబునఁ బోయినప్పుడిచ్చె. అది చూచు
కొని యామె మిగుల వగచుచు, దన నిర్దోషత్వమును స్థాపిం
చుచు నితని కొక యుత్తరము వ్రాసెను. శంకరరెడ్డి యా
యుత్తరమును రామరాజునకుఁ జూపఁగా నతఁడు మాలతి మహా
బుద్ధిమంతురా లనియు, సచ్చరిత్ర యనియు సద్గుణము లందును,
ధైర్యసాహసంబు లందును, నిరుపమానురా లనియు బోధించెను.
అంత శంకరరెడ్డికి దొంటికంటె నెక్కుడు ప్రేమ ముదయించెను.
అందువలన నామె పూర్వపుచేష్టను డెందంబునఁ దలంచుకొనుచు
నామెతో సంభాషింప నువ్విళ్లూరుచుండె. అట్లుండఁ దన ప్రియ
కాంతవచ్చితనపాదంబులపైఁబడియున్నప్పుడతనికిఁగల్గు నానందమె
ట్లుండునోయెవ్వరుచెప్పఁగలరు? అంతశంకరరెడ్డితనయడుగుదమ్ము
లపై ముఖముంచియేడ్చుచున్నప్రియకాంతనులేవనెత్తి తొడపై గూ
ర్చుండబెట్టికొనిఓసుందరీ!నీసత్ప్రవర్తంబునకు,నీపతిభక్తికిని మిక్కిలి
సంతసించితిని. నీ యధిపురాలిపై నీకుండు ప్రేమము నిరుపమాన
మైనది. అట్లుండుట మిక్కిలి మంచిది. విజయనగరంబున
గొందఱు చెప్పిన వచనంబులు విని నీచరిత్రము దుష్టమైన దని
భావించి నీ కట్లు కఠినముగా నుత్తరంబు వ్రాసితిని. ఆ తప్పు
క్షమింపుము. నీ సచ్చరిత్రంబును, నీ సద్గుణాదులను రామరాజా
దు లుగ్గడింపగా విని మిక్కిలి యానందించితిని. నీవలన నుంతే
నియు నేరము లేదు. రాజభక్తికధీనురాలవయివిదేశీయులపాలయి
పలుబాములఁబడుచున్ననిన్నుములుకులవంటి పలుకులచేబాధించిన
నాయపరాధమునుపై చితొంటియనురాగంబునిలుపుమనియాదంప

తులు సంతోషసాగరంబున నోలలాడుచున్న సమయమున నొక పురుషుం డచ్చటికి రయంబున వచ్చె. అతఁడు వచ్చుటం జూచి శంకరరెడ్డి లేచి 'మిత్రమా! మాలతి వచ్చినది. మన మను కున్నంత పని చేసికొని వచ్చినది. ఈ మాలతి నిచ్చటనుంచి మన మనంతర కార్యంబున కరుగుదమా!' అని యడిగెను.

రామరా జదివిని 'మిత్రమా! ఇట్టిసమయంబున మాలతి నిటనొంటిగా నుంచరాదు. ఆ కార్యంబునకు మన మిద్దరమును నరుగవలసినయవసరంబు లేదు. నాకీ దినము మిక్కిలి శ్రమ పొడము చున్నది. నీవు పోయి కార్యము నెఱవేర్చుకొని రమ్ము. అనంతర కార్యమునకు నేఁ బోయెదను.' అని చెప్పి పంపి తా నచ్చట నుండెను.

---

## ఇరువది యెనిమిదవ ప్రకరణము



### విముక్తి

శుకశారికాది పక్షులను బంజరంబున బంధించి పెంచుచుఁ గొందఱు వానిం జూచి యధికానందంబు నొందుచుందురు. రసాలాదితరుజాలంబులఁ బరిభ్రమించుచుఁ, బండిన పండ్లు దిని యథేచ్ఛగా విహరించు పక్షులకంటె మార్జాలాదుల వలన నపాయంబులు గలుగకుండుటకై పంజరంబునం దుంచి తఱిఁ దప్పకుండ నాహార జలంబు లిచ్చి సర్వకాలంబులందును దా మత్యంత ప్రేమముతోఁ బెంచుచున్న పక్షులే యధిక సుఖం బనుభవించు

చున్న వని కొందరు తలంతురు. కాని తిండికై ఫలాదులు లభింపక పోయినను, రసాలాది తరురాజంబులందు విహరించుచున్న పక్షుల కున్న సంతోషము పంజరబద్ధంబులైన ఖగంబులకు సంభవింప దని నిశ్చయముగాఁ జెప్ప వచ్చును. ఇయ్యది కారాగృహబద్ధులగు వారి కనుభవసిద్ధంబు. స్వేచ్ఛకంటె మించినది లోకంబునం దేదియును లేదు. ఇంతేకాక పంజర బద్ధంబులగు పక్షులతో వినోదించు వా రొకప్పుడు దైవ వశంబునఁ గారాగృహబద్ధు లగుదు రేని, వారు వెంటనే తమ యభిప్రాయంబు మార్చుకొనక పోరు. అక్కటా! కారాగృహవాసి శౌర్యధైర్యాది గుణంబులు వ్యర్థంబులుకదా? ఘోరసంగ్రామములందు ధైర్యసాహసాదులను జూపి చూపఱచే మెప్పుగొనుచు విహరింపఁ గుతూహలులగు వారికిఁ గారాగృహవాసము మహా భరము కదా! అక్కటా! నా కీ చెఱ తొలంగు విధంబు గానరాదు.' అని విజయసింహుండు పరిపరివిధంబులఁ జింతింప నారంభించెను. ఇంతియ కాక యా కారాగృహము నరక కూపంబున కెన వచ్చుచుండెను. చిరకాలంబునుండి సమార్జింపఁ బడక పోవుటచేఁ గబ్బిలపు పెంటచే నిండి దుర్గంధము గొట్టుచుండెను. పూర్వ మొకఁడా కారాగృహంబునుండి తన దుస్థితికి వగచుచు దుఃఖాతిశయంబును సహింపలేక తల గోడను బెట్టి కొట్టుకొనఁగా వాని తల రెండు చెక్కలై రక్తము చివ్వునఁ బైకి స్రవించి నేలను దడిపెనఁట. ఆ నెత్తుటి మచ్చ లింక జూపఱ కసహ్యతను గల్గించుచుండెను. పూర్వకాలమున నచ్చట జరిగిన ఘోరకృత్యంబులను

గూర్చి కారాగృహరక్షకులు చెప్పుచుండ విని విజయసింహుండు మిక్కిలి సంతాపము చెందఁ జొచ్చెను. 'విజయనగర కారాగృహంబున బద్ధుఁడనై నను, వధ్యస్థానంబునకుఁ గొనిపోఁ బడినను, ముక్తాంబ దయవలన జీవింపఁ గలిగితిని. కాని ఇప్పు డెవ్వరి దయవలన బైటఁబడఁ గలను? నాప్రాణదాతయగు ముక్తాంబ సందర్శనము తిరిగి నాకెన్నఁడైన లభించునా' యనుచు విచారించుచుండును.

విజయసింహుఁడు ముక్తాంబాదులందఱును రాయచూరునం దున్నట్లు వినియే రాయబారిగా నిచ్చటకు వచ్చెను. తనకుఁ బరమ శత్రువులగు రామయామాత్యాదులు రాయచూరునం దుండుటచేఁ దా నచ్చట కేగుట విపద్దాయకం బగునని తెలిసికొన్నను, ముక్తాంబ సందర్శనంబు చేసికొని తనయం దనురాగంబును నెలకొల్పుకొనవచ్చునన్న తలం పొకటి యుద్భవించుటచే నాప్రయాణ మానందదాయక మగు నని తలంచి యచ్చటికి వచ్చెను. అతనికి ముక్తాంబ సందర్శన మొసపిమ్మటఁ దన కట్టి కష్టము సంప్రాప్తమైన విచారింపక పోవును. ఇపుడు కష్టమేకాని ముక్తాంబ సందర్శనంబు లభింపలేదు. అందుచే నతఁడు దుస్సహ విచార పీడితుం డగు చుండెను. 'ఆదిల్‌షాహా సాధుస్వభావము గలవాఁడై నా సందేశమునకు సంతసించి బహుమానము చేసి యున్నాఁడు. నామీఁదఁ గోపమే యుండిన నతఁ డట్లు బహుమాన మీయఁడు. అతఁడు నన్నుఁ గౌరవించి పంప వలయునని తోఫల్‌ఖానుతోఁ జెప్పియుండును. కాని య్యా దురా

త్మ్రుఁడు నాకుఁ బరమశత్రు వయిన రామయమంత్రి బోధనచే నా కిట్టి దుష్ఫలంబు గల్గించియున్నాఁడు. నాదురదృష్ట మెప్పుడు నొక్క రీతిగి నేయున్నది. ఎప్పుడునుగష్టములపాలెయగుచున్నాను. పాపముముక్తాంబయెన్ని పర్యాయములురక్షించియున్నది. ఆ మెరక్షించు కొలఁదిని నా కపాయంబులు పెచ్చుపెరుగు చున్నవి.' అని యిట్లు విజయసింహుండు పలువిధంబుల విచారించుచుండఁగా నొక పురుషుఁ డచ్చటికి వచ్చెను. ఇదివఱకు విజయసింహునిఁ జంపుఁ డని కారాగృహపాలకులకు బోధింప వచ్చిన రుద్రదేవుం డని యచ్చటివా రనుకొనిరి. కాని వీని యాకారలక్షణంబుల నరసి క్రొత్తవాఁడని నిశ్చయించుకొని కోపమువహించి యిట్లు సంభాషింప నారంభించిరి.

కా:-ఓయీ! నీ వెవ్వండవు? ఇంతరాత్రివేళ వచ్చుటకు గారణం బేమి?

పు:-నేను తోఫల్ ఖాను నాంతరంగిక భృత్యుండను. తదనుమతినిఁ బడిసి యిప్పు డిచ్చటికి వచ్చితిని.

కా:-ఎందులకై వచ్చితివి? నీవు క్రొత్తవానివలెఁ గన్పట్టుచున్నాఁడవు. విశ్వాస పాత్రులగు భటులను బంపక యభినవాగతుఁడవగు నిన్నుంపనేల?

పు:-మీరు కారాగృహంబునుఁ దప్ప నేమియు నెఱుంగరు. అందుచేఁ గారాగృహవాసులును, మీరును తాము మాత్రమే ప్రపంచమునం దున్నా మని తలంచుచుందురు. మీ రెఱుంగ నంతమాత్రంబున క్రొత్తవాఁడని తలంచుట తప్పు.

సిగ వేసినప్పటి నుండియు ఖానుని సన్నిధానవర్తినై యున్నా ను. అధిక ప్రసంగము మాని ప్రభు శాసనంబును నిర్వర్తింతురా లేదా?

కా:-అదేదియో చెప్పుము.

పు:-విజయసింహుని నాతో శీఘ్రముగా నంపుమనియె.

కా:-మేమీ వచనము నమ్మము. ఖాను స్వయముగా వచ్చినప్పుడుగాని యతనినుండి తగిన యానవాలును గొనివచ్చి నప్పుడుగాని విడుతుము. అంతేకాని నీ బోడిమాటలు విని పంపము. పొమ్ము.

పు:-నేఁ బోడిమాటలు చెప్పలేదు. ఇదిగో తోపల్ ఖాను నీయుంగరంబును మీకానవాలుగాఁ బంపెను. ఈమాటైన నమ్మి పంపింతురా? (అని చేతికిచ్చెను!)

కా:-(చూచి) ఇంత రాత్రివేళ విజయసింహుని యావసర మేమున్నది? ప్రభువిప్పు డెచ్చట నున్నాఁడు?

పు:-మన ప్రభువువా రిప్పుడా రామమందిరంబున ననంగసేన చెంత నున్నారు. వారిరువురికి నొక ప్రసంగము జరుగుచున్నది. అందులో మన ప్రభువువారి పక్షమున నీతఁడు సాక్ష్యమీ వలసి యున్నది.

కా:-ఆ ప్రసంగ మేమి?

పు:-మన దుర్గాధీశ్వరుండు తన్ను వరింపు మని యనంగసేనను గోరెను. కాని యనంగసేన కృష్ణరాయుని దక్క మఱొక్కని వరింప నని పలికెను. అది విని ఖాను విజయసింహు నెల్ల

ప్రేమించితి వని యడిగెను.అది వట్టికల్లయని యామెచెప్పెను. అంతఁ బకీరు విజయసింహు 'డిచ్చటనే యున్నాఁడు అతని రప్పించుతురేని నీవృత్తాంతము స్పష్టమగును' అని పల్కెను. ఖా నదివిని విజయసింహుండు తనతో సంబంధమున్నట్టు చెప్పిన నన్ను వరింతువా? అని ఖానడిగెను. ఆమె యందుల కంగీకరించెను. ఇక్కార్యంబు నెఱవేర్చుకొనఁ బ్రభువు వారీతని గొనిరమ్మని పంపెను.

కా:-కృతాపరాధుఁడైన విజయసింహుని వలన మన ప్రభువున కేమి యుపకారము కల్గును?

పు:-కలుగవచ్చును. వీఁడిప్పుడు మనకు విరోధియైనను మనము చెప్పినట్లు విని తీఱును. ఇప్పుడు విజయసింహుఁడు ఖానున కనుకూలముగా సాక్ష్యమిచ్చిన నితని విడుదలచేయఁ దలంచి యున్నాడు.

కా.-ఇది కొంత యుక్తముగా నున్నది. విజయసింహుం డిట్లుచేసినఁ జేయవచ్చును. అయిననతని నడిగి చూతము రమ్మని చెప్పి యతని పాలికిఁబోయి 'ఓయీ! విజయసింహా! నీకు శుభదినంబులు వచ్చినవి. నీ విప్పుడు ఖానున కనుకూలముగాఁ జెప్పితివేని నిన్నతఁడు వెంటనే కారాగృహవిముక్తునిగాఁ జేయును.

విజ:-అదేదియూ చెప్పుఁడు. నా మనసొప్పుకొన్నచో నట్లే చెప్పెదను.

కా:-నీకును ననంగసేనకు సంబంధమున్నదా? లేదా? లోకులు

చెప్పెడిదానిలో నెంత సత్యమున్నది.

వి:-ఛీదురాత్ములారా! నోరుమూయుఁడు. పతివ్రతయైన యామె యందు దోషారోపణము చేయుదురేని మీనాల్కలు శతథాభిన్నంబు లగును. ఆ సాధ్వీమణి మొగంబైన నెన్నండు నెఱుంగను. లోకులు కాకులవంటివారు. తప్పు లెంచుటయే వారిపని. అందలి సత్యము భగవంతునికే తెలియును.

కా:- పోనిమ్ము! నిశ్చయముగా ననంగసేనకును నీకును సంబంధము లేక పోవచ్చును. అయిన నీవిప్పు డొప్పుకొందువేని మా దుర్గాధీశ్వరుఁడు నిన్నిప్పుఁడే కారాగృహ విముక్తునిగా జేయును. ఈసమయము చెఱిచి కొనకుము.

వి:-ఓరీ! తుచ్ఛులారా? అసత్యము పలుకు మని నాకు బోధించుచున్నారా? నా నాలుక గోసినను నే నసత్య మాడను. వలసిన జీవంబులను వదలెదను. నాతో నీ ప్రసంగము తేకుఁడు.

కా:-ఓయీ! నీవాగ్రహం బుడుగుము. అతనికిఁ గోపము తెప్పింపకుము. కావున నావాక్యములు పలికి ప్రాణంబులఁ గాపాడుకొనుము. నీవిట్లు బద్ధుండవైన నీకేమి లాభము.

అదివిని విజయసింహుం డేదియో యోజించుచు "ఆహా! అనుకూలమైన సమయము వచ్చినది. నే నీ మాట యన్నంత మాత్రంబునఁ బెద్దనరక కూపంబునఁ బడిపోనుగదా. ఆత్మరక్షణకై చేసిన దెద్దియును బాపంబునకుఁ గారణము కాదని పెద్ద లందురు. కావున నన్ను రక్షించుకొనుట కొక అసత్యమాడినను దప్పుండునా? నాశౌర్యాదులను వ్యర్థముచేసి యిందు బడి

చచ్చుటకంటె నొక్క యసత్యము బలుకుటయే శ్రేయస్కరము గదా?' యని యొక నిమిషమాత్ర మతని మనము చెలింపం దొడఁగెను. గాని యంతలోఁ దెలివి దెచ్చుకొని 'అయ్యో, యెంత యజ్ఞానిఁగుచున్నాను. సత్యము పలికి హరిశ్చంద్రునివలె లోకంబున వన్నెకెక్కుట కాశింపక తుచ్ఛజీవంబుల కాసించి యసత్యము పలుక యోజించుచున్నా నేమి' యని తన్ను దూషించు కొనుచు వారింజూచి 'ఓరీ దుర్బుద్ధులారా! మీ వచనంబులు విని యనృతమాడు వాఁడనుగాను. ఖాను గోపించిన, గోపింపనీ, చిత్రవధచేసిన చేయనీ! యతనిపక్ష మవలంబించి యసత్యము పలుకను.' అని వారి వచనంబులఁ దిరస్కరించెను.

అతని ధైర్యవచనంబుల కచ్చటివా రందఱు నచ్చెరు వడిరి. అప్పుడు కారాగృహాధిపతి యా పురుషుంజూచి 'ఓయీ! ఇట్టి విజయసింహుని వలన మనఖానున కేమి యుపయోగించును? కావున నీవరిగి యీప్రసంగము తెల్పు' మనిపల్కెను.

పు:-ఓయీ! అట్లుకాదు. అచ్చట మహాప్రభావశాలియైనఫకీ రున్నాఁడు. అతఁడెట్లయిన వీనిచే నసత్య మాడింపఁ గలఁడు. కావున నాతోఁబంపుము. నీకు నమ్మకము లేనిచో నీవురమ్ము లేనిచో నీకు విశ్వాసపాత్రుఁడయిన యొకసేవకునిఁ బంపుము. ప్రభుశాసనమును మన్నింపక పోవుట మనవారికిఁ దగదు.

కారాగృహాధిపతి యా వాక్యంబులు విని యాపురుషుఁడు తెచ్చిన యానవాలునుజూచి తనకు నమ్మకమైన యొక భృత్యుని సాయమిచ్చి విజయసింహు నంపెను. అప్పు

డు వారిరువురును ఖడ్గపాణులై చెఱియొక పార్శ్వం బున నడుచుచు విజయసింహునిఁ గారాగృహంబునుండి కొని పోవుచుండిరి. ఆ పోవు నప్పుడు విజయసింహుఁ డెవ్వ రేమి చెప్పు మని బోధించినను నసత్యము చెప్ప రా దని నిశ్చయము చేసికొనుచుండెను. వారొకవీధింబడి కొంతదూరము పోయిరి. అప్పుడు కారాగృహరక్షకభటుఁడు వానిఁ జూచి 'ఓయీ! ఆరా మమందిరంబున కిది మార్గము కాదు. నీ కీమార్గము తెలియ దేమోఁ ఇదిగో నీ మార్గంబునం బోదు మేని సుఖముగా నారా మమందిరంబునకుఁ బోఁ గలము!' అని చెప్పెను.

'ఓయీ! నా కామార్గము తెలియక పోలేదు. దేవాల యంబున కెదుటనున్న మసీదులో ఫకీ రున్నాఁడు వచ్చునప్పు డతని వెంట గొనిరావలయునని చెప్పియున్నాఁడు. అందుచే నిట్లు పోవలసియున్నది. మాఱుమాటాడక తిన్నగా నడువు' మని చెప్పి దేవా లయంబునకు గొనిపోవు చుండెను. అప్పుడు మహమ్మ దీయుఁ డూరకుండక మసీదునకుఁబోవుటకుబదులుగా హిందూదే వాలయంబునకు గొనిపోవుచున్నా వేమి? అనిగంభీరస్వరముతోఁ నడి గెను.అప్పటికివారా దేవాలయుసమీపంబునకరిగిరి.ఈవాక్యంబులు విని దేవాలయమునం దున్న రామరాజు కడువడి వచ్చి వాని తలపై నొక్క మోదు మోదెను. అంత వాడు స్మృతితప్పి నేలఁ గూలెను. అది చూచి విజయసింహుం డత్యాశ్చర్యము చెందఁ జొచ్చె. అది స్వప్నమో, ఇంద్రజాలమో తెలియక త్రొక్కులాడ సాగెను. విజయసింహునకు శంకరరెడ్డితోఁ బరి

చయము లేదు. అందుచే నతని గుర్తింపలేక పోయెను. అప్పుడు వారిర్వురును విజయసింహుని దేవాలయంబులోనికిఁ గొనిపోయిరి. శంకరరెడ్డి యతని బంధనంబుల వదలించెను. అంత రామరాజతని జూచి 'విజయసింహా! ఏమియు మాట లాడకున్నావు. ఏ మాలోచించుచున్నావు? లేక చిన్ననాఁటనుండియు నలవాటుపడి యుండుటచేఁ గారాగృహవాసంబును వదల నిష్టము లేక విచారించుచున్నావా?' అని పరిహాసము లాడెను.

విజయసింహుండు కంఠధ్వనిచే రామరాజును గుర్తించి 'రామరాజా! నీవా? ఎట్లిక్కడికి వచ్చితివి? ఎప్పుడు వచ్చితివి వీరెవ్వరు?' అని యచ్చెరువడుచు నడిగెను.

రా—విజయసింహా! నీకంటె ముందుగనే మే మీరాయచూరునకు వచ్చితిమి. ఇతఁడు మనమిత్రుఁడు శంకరరెడ్డి! ఈమె యాతని యువతి మాలతి! నిన్ను విడిపించుటకై మే మందర మిచ్చటఁ జేరితిమి?

విజయసింహుఁ డత్యాశ్చర్యంబు నొంది శంకరరెడ్డిని గాఁగలించుకొని 'మిత్రులారా! నేఁ డెట్టి ఘనకార్య మాచరింపఁ గల్గితిరి. ఇఁకఁ బ్రియమిత్రుల మంజులాలాపంబులు విని సంతసించు భాగ్యము నాకు లే దని మిక్కిలి విచారింపసాగితిని. నేఁడు నా కట్టిభాగ్యము కల్గించిన ముకుందు పాదారవిందంబుల కభివందనంబులు చేసెదను.' అని హృదయానందంబును వెలిపుచ్చెను.

'విజయసింహా! ప్రియమిత్రుల మంజులాలాపంబులు

వినునప్పుడే నీకింతయానందము కల్గుచున్నప్పుడు ప్రియకాంత మంజులాలాపంబులు విన్నప్పు డెట్టియానందము కల్గించునో, తాదృశసంతోషముఁ గూర్చిన భగవంతున కెట్టి వందనంబు లాచరింపవలయునో కదా? ' అని రామరాజు పరిహాసపూర్వకంబుగాఁ బలికెను.

' ఏమిా! విజయసింహునకుఁ బ్రియకాంతమంజులవాక్యంబులు వినునట్టి భాగ్యంబు కల్గునా? వీఁడు దురదృష్టవంతుఁడు. వీని కెందుల కట్టియాశ గొల్పెదవు? ' అని నిట్టూర్పు పుచ్చి విజయసింహుఁడు పలికెను.

' విజయసింహా! ఇప్పుడు నీ యదృష్టము ప్రియాలాపముల వినునట్లు చేయలేదు. బాహాబలంబును ధైర్యసాహసంబులును నున్నయెడల నీప్రియురాలి మధురవచనంబులు వీనులవిందుగా వినఁగలవు? నీ వేమాత్రము జంకినను లాభములేదు. ' అని రామరాజనెను.

' ఏమేమిా! ధైర్యసాహసాదులఁ గూర్చి నాకు జెప్పవలయునా? నాప్రియురాలైన ముక్తాంబవిషయమై నా ప్రాణములైన నర్పించెదను. ఇఁక నంతకంటె సాహసమున్నదా? మిత్రమా! రామరాజా! ముక్తాంబ యెచ్చట నున్నదో చెప్పుము. ఆసుందరీమణి సందర్శనంబు నాకుఁ గల్గింతు వేని నీ మే లెన్నటికిని మఱవను. ' అని విజయసింహుండనెను.

' ఓయీా! ముక్తాంబ కొక యాపదవచ్చియున్నది! ఆమె నొక తురక ప్రేమించుచున్నాఁడు. వాఁ డామెను దనకుఁ భార్య

గాఁ గోరుకొనెను. తనకార్యంబు చక్కఁ జేసికొనుటకై ముక్తాం బ వానిసందర్శనమునకు సమ్మతించిన దఁట '—అని యేదో చెప్పుచుండ, విజయసింహుండడ్డు వచ్చి „ ఏమీ! ముక్తాంబకు మహామ్మదీయసందర్శనమా! అట్లయిన నాకీ జీవనమేల? ' అని తొందరపడుచుండ రామరాజు వారించి „ ఓయీ! మిత్రమా! అట్లు తొందర పడెదవేల? ముక్తాంబ మనం బెప్పుడు నట్టి మార్గంబు ద్రొక్కదని నమ్మెము. తనకార్యంబు నెరవేర్చుకొను నంతవరకును వాని సమాధాన పరచుకొని పిమ్మట నామహామ్మ దీయునకుఁ దగినట్లు బుద్ధిచెప్పి పంపవలెనని నిశ్చయించుకొనియే యంగీకరించి యుండును. ఆమె మనలనందరను మించిన యుక్తి పరురాలు. కాని యీ మహామ్మదీయుండు మహాబలిష్ఠుఁడు. వానికీడయిన వాఁడ వీవేయని నిశ్చయించి యుపాయంబు లఁ బన్ని నిన్నుఁ గారాగృహంబునుండి తప్పించితిమి? నీ విప్పుడు నీ ధైర్యసాహసాదులం జూపి ముక్తాంబగౌరవము కాపాడవలసి యున్నది. ' అని పలికెను.

'అక్కటా! ఆకాంత కెట్టికష్టము సంప్రాప్తమైనది! ఒక వేళ నా దుష్టతురుష్కుండామె కవమానము కల్గించి యుండఁ డుకదా? మనము త్వరపడుట మంచిది.' అని విజయసింహుం డాత్రతతోఁ బలికెను.

'విజయసింహా! ఆసంభాషణము తేపు జరుగును? నీవు యాదిల్ షాహాసభలోఁ బల్కినవాక్యంబులకు ముక్తాంబ యమి తానందంబు నొందెను. పిమ్మట నీకు వచ్చిన కారాగృహావాసం

బునుగూర్చి మిక్కిలి వగట చెందెను. ఇట్లు ముక్తాంబ నీకష్టసుఖంబులను దనకష్టసుఖంబులుగా నెంచుకొని సతతమును ఖేద మోదంబులఁ జెందుచు నీసందర్శనంబున కువ్విళ్లూరుచున్నది. ఆమెకు నేనొకయుత్తరము పుత్తెంచితిని.ఆమెయుఁ దనకష్టంబులం గూర్చి మొఱపెట్టుకొనుచు నొక యుత్తరము వ్రాసి పంపినది. ఇప్పుడే యామెయున్న స్థలంబునకుఁ గొనిపోయెదను రమ్ము!' అని రామరాజు పల్కెను. ఆవాక్యంబులకు విజయసింహుం డమందానందంబు చెందెను. ఔరా! దుర్గంధముతోఁ గూడిన కారాగృహంబుననుండి జీవంబులపై నిరాశ చేసికొన్న విజయసింహుం డిప్పుడు నిర్భరానందభరితుండై తనప్రియురాలి సన్నిధి కేగుచున్నాఁడు. కాలగతి యమేయము కదా! అనంతరము రామరాజు శంకరరెడ్డిం జూచి 'మిత్రమా! నీ విఁకఁబోయి నీప్రియ కాంతను యథాస్థానంబునకుఁ జేర్చిరమ్ము. నేను ముక్తాంబ సన్నిధిక విజయసింహుని జేర్చి వచ్చెదను.' అని చెప్పి వారినిఁ బంపివేసి విజయసింహునితోఁ గూడ నొక రహస్యమార్గం బనుసరించి పోయెను.

---

## ఇరువదితొమ్మిదవ ప్రకరణము

### సందర్శనము

ముక్తాంబ నివసించిన మందిర మొకప్రాకార మధ్యంబున నున్నది. ఉన్నతమైన యాప్రాకారకుడ్యంబున కుత్తరదక్షిణంబు

లందు రెండు ద్వారంబులు గలవు. ఉత్తరద్వారంబునఁ బడి పోయినచో గొప్పమందిరంబులు గానవచ్చును. ఆ మందిరంబుల లోనే ప్రమాదేశ్వరరుద్రదేవాదులు నివసించుచుందురు. ఆ మందిరములకు దక్షిణంబున నున్నతప్రాసాదము కలదు. దానికావలఁ జిన్న పూవులతోటయును, నం దొకదివ్యమందిరంబును గలదు. దక్షిణద్వారంబునఁ బ్రవేశించువారు ముందుగా నామందిరంబులోనికిఁ బోదురు. దాని నతిక్రమించి సోపానపంక్తి రోహించిన మేడపైకిఁ బోవచ్చును. ఆమార్గంబున నేమి జరిగినను నుత్తరమందిరము లందున్నవారికిఁ దెలియదు. ఆ దక్షిణద్వారకవాటంబును దెఱచుటకును బంధించుటకును ముక్తాంబకు మాత్రమే యధికారం బున్నది. ముక్తాంబ వర్తకవేషంబున వచ్చి శంకరరెడ్డి యిచ్చిన యుత్తరంబును జదువుకొన్నప్పటినుండియు దఱచుగా నిశాసమయములందు దక్షిణద్వారముచెంతనే విహరించుచుండును. ఒకనాఁటిరాత్రి రెండు యామములతిక్రమించెను. కాలము మలయమారుతాదులచే మిక్కిలి సుఖదాయకంబై యుండెను. ఆసమయంబున ముక్తాంబ యాప్రాసాదముపై శయనించెను. కాని నిద్రపట్టలేదు. మహమ్మదీయుఁడు తనతో సంభాషింపగోరెనని విన్నప్పుడు దనబుద్ధిచాతుర్యంబుచేఁ దన కవమానము కలుగకుండఁ జేసికొనవచ్చును గదా యని యామె దలంచి రామయమంత్రి తనతో నీ ప్రసంగము తెచ్చినప్పుడు „ అ దెంతపని ? అవలీల నెరవేర్చెద ’ నని సమాధానము చెప్పెను గాని యా మహమ్మదీయుండు రహస్యప్రదేశం

బునఁ దనతో సంభాషింపం గోరివచ్చినప్పుడు తన యుపాయము వలన తప్పించుకొనుటకు మహాబలుని సాయము కావలసి యుండెను. రామయమంత్రితో నిందువిషయమై చెప్పిన రుద్రదేవుని గాని ప్రహరేశ్వరునిగాని యామెను రక్షింప నియమించి యుండును. ముక్తాంబబుద్ధిచాతుర్యంబు నెఱింగి యున్న వాఁడు కాన యతఁడిందుల కింతేని భయము వహింపలేదు. రుద్రదేవుని రహస్యంబుగాఁ బిలిచి తనయభీష్టము తెలిపినఁ జేతులు కట్టుకొని సాయముచేయును. ఆమె కోరకపోయినను రుద్రదేవుం డట్టి సమయంబున నెట్టిపనికైన సమకట్టును గాని యతని కావృత్తాంతము తెలియలేదు. ముక్తాంబ రామరాజుయొక్క ధైర్యసాహసముల స్వయముగ నెరిగియున్న దగుటచేతను తనయాలోచన రామయామాత్యునకు రుచించక పోవచ్చునను సందేహముచేతను తన యభీష్టము నెఱవేర్పుటకు రామరాజు మిక్కిలి తగియుండునని యెంచి యాతనికిఁ బత్రికాముఖంబునఁ దెలుపఁగా నతండు తప్పక సాయపడుదు నని మగుడ నుత్తరము వ్రాసెను. అది చూచి ముక్తాంబ ధైర్యంబు చెందియుండెను. కాని యా తురుష్కుఁడు వచ్చు సమయంబునకు రామరాజాదులు వత్తురో రారో యని విచారింప నారంభించె. అట్టి యవస్థలో నున్న ముక్తాంబకు నిద్రవచ్చు టెట్లు? ఆ సమయంబున నా యువతి శయ్యాతలంబుననుండి లేచి యొక కరవాలంబు పట్టుకొని మెల్లమెల్లగా సోపానపంక్తి నవతరించి దక్షిణద్వారము చెంతకు వచ్చి యందుండి శబ్దమేదైన వినవచ్చుచున్న దేమో

యని జాగరూకతతో వినెను. కాని యేమియును వినరాలేదు. మరలి వచ్చి వేదికపైఁ గూర్చుండి యేదియో యోజించుచుం డెను. కొంత తడవైన వెనుక నాద్వారంబునుండి టకటక మనెడి నినాద మేతెంచి యామె చెవులకు సోకెను. అదివిని యా యువతి మందగమనంబున నట కేగి 'ఎవరా పిలిచెడివారు? సోదరా! రామరాజా? వచ్చితివా!' అని పలుక రించెను.

రామరా జది విని 'సోదరీ! నేను రామరాజనే తలుపు దీయుము' అని సమాధానము చెప్పెను.

ముక్తాంబ యది విని యుత్తరంబున వ్రాసినట్లు రామ రాజు వచ్చినందుల కమందానందము చెంది తలుపు తెఱచి లోపలికి ర మ్మనెను. అంత రామరాజు విజయసింహునితోఁ బ్రవేశించెను. ముక్తాంబ రెండవవానిం జూచెను. కాని చీఁక టిలో విజయసింహుఁడని తెలిసికో లేకపోయెను. కారాగృహ మందున్న విజయసింహుం డిం కెప్పటికైనను విముక్తుండు కాఁ డని నిరాశచేసికొనియున్న ముక్తాంబ యతని విజయసింహుండని యె ట్లనుకొనును? అంత ముక్తాంబ? రామరాజా! ఇతఁ డెవండు? ఇంతమందికిఁ దెలిసిన మనరహస్యంబు దాగుట కష్టము కదా? యని యడిగెను.

'సోదరీ! నీ వట్లు శంకింప వలదు? ఇతఁడు మనకుఁ బర మాప్తుండు, మహాబలవంతుఁడు. తగినసమయము వచ్చెనేని నామహామ్మదీయుని నిర్బంధించునంత శక్తి కలవాఁడని యితని గొనివచ్చితిని. ఈస్థలంబును జూడఁ గోరినందునఁ దీసికొని

వచ్చితి. ఇతఁడు మనరహస్యంబును బైటఁ బెట్టు చపలచిత్తుండు కాఁడు' అని రామరాజు పలికెను.

ముక్తాంబ యందులకు మూఁ జూడక కవాటము బంధించి వారితో నమ్మందిర వేదికపైఁ గూర్చుండెను. అప్పుడు ముక్తాంబ 'రామరాజా? బోనులోజిక్కిన సింహము నీ పర్యాయము తప్పించుట కష్టసాధ్య మని తలంచెదను. కష్టసాధ్యమును గాదు. అసాధ్యమే? అతనిఁ దప్పింప నా కేమియుఁ దోఁచలేదు? క్రూరమనస్కుఁడైన మహమ్మదీయునిచేతిలోఁ జిక్కినందులకు మిక్కిలి వగచుచున్నాను. ఈ తోఫల్ ఖానే యింత చేసెనని తలంచెదను. ఆదిల్ షాహ యిట్టి యక్రమకృత్యము చేయునా?' అని యడిగెను.

'సోదరీ! ఆదిల్ షాహ సామాన్యుఁ డనుకొను చున్నావా యేమి? అతఁడును రామయమంత్రియు నిప్పని యొనర్చినారు. పాప మా తోఫల్ ఖానున కీయభిప్రాయమే లేదు? నాఁడు సభలోనుండియు ని ట్లందువేల?, అని రామరాజనెను.

'రామరాజా! విచారాతిశయంబున నతిచపలమయిన నా చిత్తమప్పటివాక్య మప్పుడే మఱచి పోవుచుందును. నాకు జ్ఞప్తికి దెచ్చితివి. నాఁడు సభాంతమున నాదిల్ షాహ చెప్పియున్నాఁడు. రామయమంత్రి బలపఱిచెను. కృష్ణరాయుల కాసభావృత్తాంతము తెలియకుండ నుండుటకై యట్లు చేయ నిశ్చయించిరి. కాన విజయసింహునికిఁ బ్రాణభయముండఁ గూడదు.' అని ముక్తాంబ యనెను.

'ఆదిల్‌షాహా కట్టి తలంపులేదు. నిశ్చయము. కాని విజయసింహునితో బద్ధశత్రుత్వము వహించిన రామయాదులు ఖానునకు మిత్రులు. ఖాను మిత్రవాక్యంబును బాటించుచుండును. విజయసింహునిప్రాణము లాఖానుచేతిలో నున్నవి. ఏమి జరుగునో తెలియదు ' అని విచారించుచుఁ బలికెను.

,, అట్లయిన మిక్కిలి కష్టమే! రామయమంత్రి నాకెన్నియో హితకరంబులగు పను లొనర్చుచుండెను. కాని యికార్యంబులో మాత్రము విరోధి యగుచున్నాఁడు. నే విజయసింహుని మనసార వరింప నుండగాఁ దా నన్ను రుద్రదేవున కీఁ దలంచుచుండెను. రుద్రదేవుం డెంతమాత్రము నా కభీష్టుఁడు కాఁడు. ఈ విషయమున రామయమంత్రితోఁ గట్టిగాఁ జెప్పిన నతఁడు విమనస్కుఁడై తక్కిన కార్యంబులలో గూడ విమనస్కుఁడగు నేమోయని భయ మగుచున్నది. పాప మావిజయసింహున కెన్నికష్టములు సంప్రాప్తమగుచున్నవి! ఆతఁడు మిక్కిలి దురదృష్టవంతుఁడు ' అని యామె విచారంబుతోఁ బలికెను.

ముక్తాంబ తనయందు దృఢానురాగము వహించియున్నం దుల కమితానందము చెంది ,, ఏ సుందరి యసాధారణమేధావిశేషము మహామతిమంతులైన మంత్రివరేణ్యులనుసైత మతిక్రమించుచున్నదో యట్టి నీ దృఢానురాగంబునకును గరుణాకటాక్షవీక్షణంబులకును, బాత్రుండనై ఎట్లుదురదృష్టవంతుండనగుదును? అదృష్టమన్న నాదే యదృష్టము. ధన్యుఁడ నన్న నేనే ధన్యుఁడను. ' అని విజయసింహుం డంతరంగంబున నున్న సంతోష

మును వెలిపుచ్చుచుఁ బలికెను.

ముక్తాంబ యతనికంఠధ్వనిని బట్టి విజయసింహుండని నిశ్చయించి యానందంబును నాశ్చర్యంబును, భయసంభ్రమంబులను బొంది నిశ్చేష్టురాలై యుండెను. అంత రామరాజా మెం జూచి 'అమ్మా! తిమ్మరుసుమంత్రి చెప్పిన యుపాయంబుల సాయంబున మేము పరిశ్రమచేసి విజయసింహునిఁ దప్పింపఁ గల్గితిమి. అని యుపాయంబులను, దమపరిశ్రమను సాంతముగాఁ జెప్ప ముక్తాంబ విని యధికానందంబు నొందెను.

అప్పుడు విజయసింహుండు ముక్తాంబం జూచి ' సుందరీ! నాఁడు నీవు చేసిన ప్రాణదానంబున కమితానందంబు నొందితి. నీవట్లు చేసి నన్ను ఋణబద్ధునిగాఁ జేసితివి. ఆఋణంబు దీర్చుకొను నంతవఱకును నాకు నిద్దుర పట్టలేదు. నాకృతజ్ఞతా సూచకవచనంబులను నీ కందఁ జేయవలెనని యెంతప్రయత్నించినను నవకాశము చిక్కలేదు. క్షమింపుము. ' అని పలికెను.

ఓ మనోవల్లభా! నాయిచ్చినఋణ మతిస్వల్పము. ఆ ఋణంబును దీర్చికొని మగుడ నన్ను ఋణపాశబద్ధురాలినిగాఁ జేయఁజాలిన యవకాశము భగవంతుఁడు నీకు గలుగఁజేసెను లెమ్ము. అని ముక్తాంబ పల్కె.

రామరాజాసుందరింజూచి 'సోదరీ! ఎంతటి సాహసకృత్యంబునకుఁ గడంగితివి? నీవు వ్రాసినప్రకారం బంతయు నెరవేర్చుటకు, మేము సిద్ధముగ నున్నాము. కాని ఆ మహమ్మదీయుని సంతసింపఁజేసి సాయంబు వడసి విజయనగరము దండెత్తు

టకుఁ గదా నీ విట్టి పనుల కంగీకరించితివి. నీ విట్లు సంతోషపెట్టినను వాఁడు మీకు సహాయుఁ డగు నను తలంపు విడువుఁడు. అతనికి రామయమంత్రిపైఁ గోపము వచ్చుటకు మహామంత్రి తిమ్మరు సెన్నియో యుపాయంబులం బన్నియున్నాఁడు. తల్లీ! నీ విట్లు వ్యాకులపడెద వేల? ఎన్ని ఖద్యోతంబు లేకీభవించినను సూర్యుని గవయగలుగునా? అట్లె యెన్ని రాజ్యంబు లేకీభవించినను, విజయనగరంబును జయింపఁ గలుగునా? వట్టిభ్రమ! చిరకాలమునుండి పరిశ్రమచేసి రామయమంత్రిచేసిన మహమ్మదీయరాజ్యత్రయసంధి క్షణమాత్రంబుననే తిమ్మరుసు భేదించివచ్చె. అహమదునగరరాజు విజాపురరాజుతో గలిసి మీకు సాయమొనర్చునని తలంపకుము. మలమలఖాను గూడఁ దుదకు సాయపడఁడు. రామయమంత్రికిని నీ దుర్గాధ్యక్షునకు విరోధము కల్పింప నొకయుపాయము పన్నె. ఇక నీ వాయాశ వదలిపెట్టుము. ఆతురకతో సంభాషింప నంగీకరింపుము. వానిని రేపిచ్చుటకి రప్పింపుము. కాని రాజ్యలబ్ధికి నీ వీమార్గము వదలి వేఱొకమార్గ మవలంబింపుము.' అని రామరాజనేని.

ఆవచనంబులు విన్నప్పుడు ముక్తాంబచిత్తము మిక్కిలి తత్తఱపడఁ జొచ్చెను. రామరాజు తన్ను మోసపుచ్చుటకై యట్లు చెప్ప దని యెఱుంగును. ఇఁక గార్యంబు రామయామాత్యునియత్నంబునఁ గొనసాగ దని నిశ్చయించి విచారాతిశయంబునఁ గొంతసే పేమియు మాటాడలేక యట్లే యుండి, రామ

రాజుం జూచి, అన్నా నిన్ను నాతోఁబుట్టువుగ నెంచి యున్నా నని నీవెరుంగుదువు. అని పలికెను.

సోదరీ! పెడమార్గంబు ద్రొక్కక నాచెప్పిన మార్గమను సరింపుము. నే నెల్లప్పుడును నీ హితమునే కోరుచున్నా నని నమ్ముము. ఇఁక నీవు సామంబునఁ గార్యంబు నెరవేర్చుకొనుటయే యుక్తమము. అదియే నీకన్నివిధంబులచేతను శ్రేయస్కరమైనది! ఇఁకఁ గొలఁదిదివసంబులలో మేము కృతకృత్యులమై యీ దుర్గం బును విడిచిపోవుదుము. అప్పుడు నీ వసహాయవై యిక్కడ నుండవలసి వచ్చును. అందువలన నీకు మహమ్మదీయులవలన నెట్టి కష్టములు మూడునో! నీ వెవ్వరితోడను జెప్పకుండ బయలు దేరి మాతోరమ్ము. నిన్నీదుర్గంబునుండి దప్పించి వేరొక నిరపాయస్థలంబు చేర్చెదను. అని రామరా జనెను.

రామరాజా! ఈ రామయమంత్రి నన్ను నమ్మి నానిమిత్తము నానాశ్రమలం బడుచున్నాఁడు. అతని విడిచి వచ్చుటకు నా కెంతమాత్రము నిష్టము లేదు. రామయమంత్రి యిచ్చట నున్నంతకాలంబును నే నిచ్చటనే యుండెదను. ఇందులకు మీయభిప్రాయ మేమి? అని యడిగెను.

అందులకు రామరాజేదియో యోజించుచుండగా విజయసింహుం డామెను జూచి ‘ యువతీ లలామా! నీ నిష్కపటప్రవర్తనమునకును, నీ మంత్రి యెడ, జూపుచున్న కృతజ్ఞతకును మిక్కిలి సంతసించితిని. నీ వంతకాలము నిచ్చటనే యుంధుము. కాని ముందుగాఁ బ్రార్థించుచుఁ దిమ్మరుసున కొకయు

త్తరముఁ వ్రాసి పంపుము. తక్కినకార్యము మేము సాధింతుము.'
అని పల్కెను.

రామరాజందుల కంగీకరించి ముక్తాంబం జూచి 'అమ్మా! ఈవిజయసింహు నతికష్టముచేఁ గారాగృహవిముక్తుం జేసితిని. ఇతనివృత్తి మెవ్వరికిం దెలియరాదు. సమయము వచ్చు వఱకు నితని నిచ్చట దాఁచుము. ఇతని నీదుర్గంబునుండి పంపిన తరుణమునకు రాఁజాలఁడు. కనుక నితని దాఁచెడిభారము నీదే' అని పల్కెను.

అన్నా! ఎట్లు దాఁచుదును? నామందిరంబున వర్తించు చున్న ప్రహరేశ్వరాదులకుఁ దెలియక పోవునా? తెలిసి యితనిఁ జంపఁ బాటుపడక మానుదురా? అని యామె చెప్పె.

అట్లు కాదు. ఇతనికిఁ గారాగృహనివాస మతిప్రీతికరము. కావున నితని నీమందిరంబున బంధింపుము. బహుజాగరూకులయి యుండుఁడు. నేను రేపటిదినము శంకరరెడ్డి నిచ్చటకుఁ బుచ్చెదను. ఆతండును మీకార్యంబునకుఁ దోడ్పడును. అని చెప్పి రామరాజు వెడలి పోయెను. అనంతరము ముక్తాంబావిజయసింహు లతిసంతసమునఁ దమతమ వృత్తాంతంబుల చెప్పికొని యనురాగంబులఁ బ్రకటించుకొను చుండిరి.

ఆమరునాఁడురాత్రి యామమాత్ర మతిక్రమించినపిమ్మట మలమల ఖాను పకీరుతోఁగూడ నా దక్షిణద్వారముచెంతకు వచ్చెను. పకీ రట్టి కార్యంబులందు సంబంధము కల్గించుకొన

నిష్టములేనివాఁడై నను ఖానుబలాత్కారముచే వచ్చెను. అచట వారిరువురు నిట్లు సంభాషించిరి.

ఖా—మనరాక యాకాంతకుఁ దెలియఁ జేయు టెట్లు? మన మి చ్చటఁ జాలసేపు వేచియుండుట తగవు కాదు గదా! నీ వా మెతో మాట్లాడితినని చెప్పితివిగదా? ఆమె హృదయము నాయెడ విపరీతముగా లేదుకదా?

ప—ఆయువతీ లలామ సరళహృదయ. నీయందెక్కు డను రాగంబుతో వర్తించుచున్నది. అట్లు కానిచో వివాహము కాక పూర్వము నీతో సంభాషింప నంగీకరించునా?

ఖా—రామయమంత్రి కపటరాజనీతివిశారదుఁడు. అతఁడు మొ దట నాకోరిక నిని సంశయాస్పదమనస్కుం డయ్యె. కాని సంతోషపూర్వకముగా నంగీకరింపలేదు. అతం డేదయిన నా కవమానము చేయ నెంచునేమో యని సందేహించు చున్నాను.

ప— నీ విందులకై సందేహింపకుము. నీవలన నుపకారంబు బొందఁ బాటుపడుచున్న రామయమంత్రి నీ కవమానంబుఁ గల్గించి తనకార్యంబు చెఱచుకొనునా! అతఁ డంత బుద్ధి హీనుండు కాఁడు.

అతనిమాటలు ఖానునకు ధైర్యంబు గొల్పినవి. కార్యా ర్థియైన రామయమంత్రి తన కవమానము కల్గించు ననెడి సంశ యము తిరోధాన మయ్యె. కావున ఖాను ముక్తాంబసుందర రూ పంబును గాంచి మంజులాలాపంబులు వినవలెనని కుతూహలుం

డై యుండెను. అప్పుడు పకీరు ముక్తాంబచెప్పిన చొప్పున తలు పుతట్టె. ఏమియుఁ బ్రత్యుత్తరంబురాలేదు. నాల్గయిదు నిమిసంబు లట్లు యుండి మరలఁ దట్టెను. అంత వచ్చుచున్నాను. ' అను ధ్వనియొకటి వినవచ్చె. వారట్లునిలువఁబడియుండ ముక్తాంబవచ్చితలుపుతీసెను. అప్పుడుపకీరుఖానుంజూచి 'నేనునీతో వచ్చి నచో ముక్తాంబసిగ్గు విడిచిమాటాడదు. కావుననీవు లోపలి కరుగుమునే నీద్వారము చెంత నిలిచియుందు' అనిచెప్పిలోపలికిఁ బంపె. ఖా నట్లు నిర్భయంబున నాసీనుండై మేలిముసుంగుతో నొప్పుచు దనయెదుటఁ గొంచెము దూరంబున నిల్చియున్న ముక్తాంబం జూచి యిట్లు ప్రసంగించె.

ఖా-యువతీలలామా! నీదయను సంపాదింప సర్వకాలంబులందు బాటుపడుచున్న నాపై నీకడకంటిచూపులఁ బఱపి యానందింపఁ జేయుము.

యు:-అబలల మగు మాదయవలన నీ కేమి లాభము? సబలులయిన మీదయ మా కభ్యర్థనీయము. మీదయ నెంతొకాలమునుండి కోరుచున్నాము. ఇప్పటికైన మాపైఁ బూర్ణంబుగా నున్నదో లేదో తెలియ కున్నది.

ఖా-లలనామణీ! ఎంత మాటాడితివి! నీ సేవకులయెడ నీ వట్లు పలుకరాదు. రామయమంత్రి నిన్ను సోమేశ్వరపాత్రునిగాఁ గాక ముక్తాంబ యని చెప్పినచో నీకార్యమింతకుముందే నిర్వహింపఁబడి యుండు. ఇప్పుడయినఁ గార్యంబు చెడలేదు. నేను, మారాజును బ్రోత్సాహపరచి యొప్పించి వచ్చి

శత్రువుల జయించి నీ మనోరథం బీడేర్చెద. అప్పుడు నీ వితని కేమి బహుమాన మిత్తువో?

య:—యవనాగ్రణీ! నీవు సత్యసంధుండవై నీప్రతిజ్ఞ నెఱవేర్తు వేని నీకోరిన బహుమానం బిచ్చెదను. దాఁచనేల? నిన్నుఁ దప్పక వరింతును.

ఖా:—ఓ ముక్తాంబా! నే మిక్కిలి సంతసించితిని. నీ వచనామృతంబును శ్రవణపుటంబులఁ గ్రోలిక్రోలి నాచిత్తము పరాయత్తమైనది. నాకర్ణంబు ధన్యంబులైనవి. ఇఁక నీ దివ్యసుందరవదనారవిందంబును జూపి నా నేత్రంబుల నానందపాత్రంబులనుగాఁ జేయుము.

యు:—నీవరం బిప్పు డాదరణీయంబు గాదు. వివాహము కాక పూర్వము వధువుముఖంబును వరుఁడు ప్రత్యక్షముగాఁ జూచు నాచారము మాకులంబువారికి లేదు. కావున మాకు లాచారము నతిక్రమింప నామనం బొప్ప కున్నది.

ఖా: మహమ్మదీయుని వరింపఁ బోవు నీకు నీకులాచారంబులతోఁ బనియేమి? అయిన నందులకై బలాత్కారంబు చేయను. నీ హస్తకమలంబు నొక్కపరి ముద్దుపెట్టుకొన నిమ్ము. ఇది నీ కులాచారంబునకు విరుద్ధము కాదు.

యు.-కాకేమి? వివాహంబునకుఁ బూర్వము వధూపాణిని వరుండు గ్రహింపరాదు. ఆకార్యంబునందే యట్లొనరించుటచే దానికిఁ బాణిగ్రహణం బని నామంబు గల్గినది. అయిన నీ వన్నదెల్ల నిషేధించిన నీ యుల్లంబు చిన్నవోవు. వచ్చి యభిలాష

దీర్చుకొనుము' అని ముసుఁగులో నుండి హస్తంబు పైకిఁజాచెను.

అంత ఖా నత్యంతసంతోషము నొంది వినయవినమితగా త్రుండై మెల్లమెల్లన సమీపించి యాహస్తంబును దనహస్తం బుతోఁ బట్టుకొని సుకుమారగాత్ర యగుముక్తాంబహస్తకమల మింతకఠినత్వ మవలంబించి యుండుట కామె యాయుధ విద్యాపరిశ్రమమే కారణం బని నిశ్చయించి యత్యాదరంబున ముద్దుపెట్టుకొనుచుండ నాముద్దియ గుండెలవఱకు వ్రేలాడుచున్న యతనిగడ్డమును బట్టుకొని ముందునకు లాగగా నేమరుపాటున నున్న ఖాను నేలఁ బడెను. ఖానా సమయంబున నేదో పలు కుచుండెను. కాని యామె యాపట్టు విడువలేదు. అంత లోపలి నుండి విజయసింహుండు వచ్చి చావఁగొట్టి తనకరవాలంబున నతని గడ్డంబును గొరిగి పాఱవైచి విడిచిపెట్టెను. అప్పుడు ఖా నవమానభరంబు బాధించుచున్నను, ప్రాణంబులు దక్కినందుల కానందించి చివ్వున ద్వారంబు దాఁటి పైకివచ్చెను. అప్పుడు పకీరానందంబుతో ఖానును సమీపించి 'ఏమాయెను. ఏమా యెను. నీయభిలాష నెఱవేరినదా' అని యడిగెను. ఖా నది విని దుఃఖించుచు నచ్చటివృత్తాంతము వినిపించెను.

ప—యవనేశ్వరా! ఎంతప్రమాదము! ముక్తాంబ చెప్పినవాక్యం బులు యథార్థంబు లని భావించితిని. పోనిమ్ము. అల్లా దయవలన నీప్రాణంబుల కపాయము కలుగ నందులకు సంత సించుచున్నాను.

ఖా—ఓ మహానీయా! నీయందు సుంతేనియు లోపంబు లేదు.

ముక్తాంబ యొకపురుషునకు వేషమువేసి యిట్లు మోసపు చ్చినది. అక్కటా! ఈ యవమానము నెట్లు సహింతును ?

ప.—ముక్తాంబను రుద్రదేవుండు ప్రేమించి యున్నాఁడు. వాఁడే యీవేషమువేసి నీ కీయవమానము గల్గించె. నీ సాయము గోరుచుండియు, నీ కీయవమానము కల్పించుట నా కద్భుత ముగా నున్నది. ఇట్టి వారికి నీవెట్లు తోడుసూపెదవో తెలి యఁ జాలకున్నాను.

ఖా—నే నంత వెర్రివాఁడను గాను. నా కంఠములో జీవము లుండ నే వీరికి సాయము చేయను. చేయనీయను. ఇఁక నీ దుర్గంబున నుండుట చిన్నతనముగా నున్నది. ఇఁక నెవ్వరి తోను జెప్పనవసరములేదు. మీరు నావిషయమై మిగుల శ్రమపడినందులకు సంతసించుచున్నాను. ఇఁక నాకు సెల విండు. ఈ పట్టునఁ బోయి గోలకొండ చేరెదను. అని పకీరు నుబంపి తా గోలకొండకుఁ బోయెను.

అట ముక్తాంబ లోపలినుండి వచ్చి సిగ్గుజెందుచు వేష ము మార్చుబూనుచున్న శంకరరెడ్డిని జూచి .' ఓయీ! నీవు ఖానుతో సల్పిన ప్రసంగమతిచిత్రముగా నున్నది. నా నిమిత్తము మీరిద్దఱు మిగుల శ్రమపడితిరి. ' అని యుక్తవాక్కుల వారిని సంతసింపఁజేయుచు నిచ్చట జరగిన సమాచారమంతయు వినిన యెడల రామయామాత్యుఁ డేమనుకొనునోయని భయముజెంది తాను వెంటనే బోయి యంతయు గప్పిపుచ్చిచెప్పెదనని యెంచి వీరలను వేగిరము పంపివేయ నుద్యమించి విజయసింహునితో

'హృదయేశ్వరా! నీవు దూరమునం దున్నను నన్ను రక్షించు భారము నీదే. నన్ను మఱవకుము.' అని చెప్పుచు వారలబంపి కవాటము బంధించి ప్రాసాద మధిరోహించె.

---

## ముప్పదియవ ప్రకరణము

### యుద్ధము

ఒకనాఁడు తోఫల్‌ఖాను తనమందిరంబున నొంటిగాఁ గూర్చుండి మనంబున నేమేమియో యోజించుకొనుచుండె. ఆసమయంబున పకీరు వచ్చి తదనుమతి వడసి లోపలికిఁ బోయి యుచితాసనంబునఁ గూర్చుండి ఖానుంగాంచి 'ఓ యవనాగ్రణీ! కార్యాలోచనాభారంబున ఖిన్నుండవై నట్టు తోఁచుచున్నది. ఆభారంబులో నాకొక కొంతయిచ్చి నీ శ్రమంబును గొంత యడంచుకొనుము.' అని పలికెను.

అది విని ఖాను ముదితుండై 'ఓ మహాత్మా! రాజకీయ వ్యవహారంబులు చిక్కుగా నున్నవి. ఇఁక కొలందిదినంబులలోనే విజయనగరంబుపైఁ దాడివెడలనిశ్చయించి యున్నాము. ఇట్టిసమయంబుల మనరహస్యంబులు పరులకుఁ దెలియకుండ నుంచుట యత్యావశ్యకము. అట్లు చేయుటకు నే నెంతో శ్రమపడుచున్నాను. విజయసింహుని కారాగృహప్రవేశము శత్రువులకుఁ దెలియకుండ నుంచవలె నని విశ్వప్రయత్నంబు చేసితిని. అది యంతయును వ్యర్థం బయినది. మన శత్రువు లావార్త తెలిసికొని వచ్చి

కారాగృహాధికారిని మోసపుచ్చి విజయసింహుని విడిపించుకొని పోయిరి. కారాగృహాధికారి ద్రోహబుద్ధి గలవాఁడు కాఁడు. వాఁడసత్య మాడఁడు. నా విశ్వాసంబునకుఁ బాత్రులగువారిలో వాఁడే మొదటివాఁడు. ఒకపురుషుఁడు నా యుంగరంబును గొని పోయి నేను విజయసింహునిఁ గోరుచున్నట్లు, చెప్పి తప్పించుకొని పోయెనఁట. ఆ కారాగృహాధికారి అప్పటికిని నమ్మక తన భటునొకని విజయసింహునితోఁ బంపెఁ నఁట! ఆ శత్రువులు వానిని పాడుదేవాలయముచెంత చావదన్నిరఁట. ఆ వృత్తాంత మంతయు నాలోచింప నా కాశ్చర్యము కలుగుచున్నది. నాయుంగరము శత్రువుల కెట్లు చేరియుండును? మాలతికి నా యుంగర మిచ్చితిని. ఆమె వారి కిచ్చియుండును. లేకపోయిన నింతపని పుట్టదు. మాలతి శత్రువులతో నేకీభవించి నట్లున్నది. ఇప్పుడు మాలతిని బట్టుకొని బాధించినచో రాజద్రోహులజాడలు బయలు పడక మానవు. ఈ పని యొనరించుట యుచితము కాదా?' అని పకీరు నడిగెను.

'ఓ దుర్గాధీశ్వరా! ఈ కార్యము జాగరూకులమై సూక్ష్మబుద్ధితో నాలోచింప వలసి యున్నది. రాజద్రోహు లంతలేసి పను లాచరించు చున్నప్పుడు నీవు వారి నారసి బంధించి తగిన దండనము విధించుట యవశ్యకృత్యము. నీ వట్లు చేయనిచో వారు నిరంకుశులై నీ ప్రభుత్వంబును సాగనీయరు. కారాగృహంబున నున్నవారు దప్పించుకొని పోవుట వలన రాజశాసనపద్ధతి యసమగ్రమైన దని లోకంబునకుఁ దెలియును. అందువలనఁ బ్రజలు

విచ్చలవిడి చరింప నారంభింతురు. కావున నీ వన్నట్లు వారిం బట్టు
కొని దండింపుము. మాలతి మిక్కిలి చతురురాలు. ఆమె యా
యుంగరంబును శత్రువుల కిచ్చిన నిచ్చియుండును. అయిన మన
మిప్పు డామెను బాధించుట మంచిది కా దని తలంచెద. మన
మట్లు చేసిన నా యువతి యాకోపంబును మనంబున నుంచికొని
నిన్ను వరింప నున్ముఖి యగుచున్న యనంగసేనమనంబును విఱిచి
నీమనోరథంబును వితథంబుగాఁ జేయునేమో యని సందేహింప
వలసి యున్నది. ఫలోన్ముఖ మగుచున్ననీకోర్కి విఫలము గా
వించుకొనుట యుచితంబు గా దని భావించెదను. కావున రాజ
ద్రోహులను బట్టుకొన మఱియొకమార్గ మాలోచింప వలయును.
మీ కీ విషయములో నాశక్తికొలంది సాయము చేసెదను.' అని
పకీరు దృఢముగాఁ జెప్పెను.

'ఓ పూజనీయా! మీవాక్యములు నా కమందానందము
గల్గించినవి. కేవలరాజకార్యాధీనచిత్తుండనై కర్తవ్యమును
మఱచి మాలతిని బాధింపఁ దలంచితిని. ఆమెను బాధించిన మన
కార్యంబు చెడుట నిక్కంబు. మిక్కిలి చక్కనివచనంబులు చెప్పి
తిరి!' అని యతని మెచ్చుకొని యేదియో సంభాషించు
చున్న యవసరంబున ద్వారపాలకుం డొక్కఁ డరుదెంచి 'దేవా!
అహమ్మనగరంబునుండి యొకసేవకుండు వచ్చి తమదర్శన
మపేక్షించుచున్నాఁడు.' సెల వైన గొనివచ్చెద నని విన్న
వించెను. అప్పుడు ఖానతని గొనిర మ్మనవుడు వాఁడట్లొనరించె.
ఆసేవకుఁడు వంగి ఖానునకు సలాముచేసి రెండుపత్త్రంబు లతని

కర్పించె. ఖానాయుత్తరంబుల నందుకొని వానిలో నొకదాని నిట్లు చదువ దొడంగె.

'ఓ రాయచూరు దుర్గాధీశ్వరా!

పయోముఖవిషకుంభము వంటి యాబ్రాహ్మణాపసదు నెట్లునమ్మితివో తెలియఁ జాల కున్నాము. వాఁడు శత్రువుల కాంతరంగికమిత్రుండు. మన మహ్మదీయరాజ్యంబుల నశింప వీఁ డిట్లు చేరియున్నాఁడు. మే మాతనివలలోఁ బడకమునుపు కను గ్గొని తప్పించుకొన్నందుల కానందించుచు నీకీవార్త నంపితిమి. ఇఁక రామయమంత్రి శత్రుకోటిలోని వాఁడని నిశ్చయించుటకు తిమ్మరుసు రామయమంత్రికి వ్రాసిన యీయుత్తరమే చాలును. ఈయుత్తరవృత్తాంతమునుగూర్చి మిక్కిలిప్రయత్నించి పెక్కం డ్రను గనుగొంటిని. వారందఱు నది నిశ్చయ మని చెప్పిరి. మీరును జాగ్రత్త వహించియుండుట మంచిదని తలంచెద.'

అని కంబరసేనుండు వ్రాసిన యుత్తరంబు చదువుకొని తిమ్మ రుసు నుత్తరంబునుగూడ సాంతముగాఁ జదివెను. అంతట ఖానుచిత్త మాలోచనామగ్నంబయ్యె. అప్పుడు పకీరతనిఁ జూచి 'ఓ యవనేశ్వరా! ఆయుత్తరంబులసంగతులు యథార్థంబు లనియే నాయభిప్రాయము. ఈపురంబులోఁ గొందఱివలన నే నీ విషయంబును జెవులార వింటిని. కాని రామయమంత్రియందుఁ దమకున్న స్నేహమును నే నేల చెడ దీయవలె? అని యూరకుంటిని. ఆతనిచర్యలు పరిశీలించినఁ గొన్నిచర్యలు విపరీతంబులుగా లేక పోలేదు.' అని పలికెను.

'ఓ మహనీయా ! రామయమంత్రి యట్టి కపటియా? నన్నుఁ దన ప్రాణమువలెఁ జూచుచున్న రామయామాత్యుండు నాకు శత్రు వెట్లగును? నాయందత్యంతాదరంబు గలదు. లేకున్నఁ బరపురుషునకుఁ జొరఁ దరముగాని యంతఃపురంబున నున్న యీ యనంగసేనను మిక్కిలి ప్రయాసపడి తెచ్చి నా కొసంగ నేల? కావున నీయుత్తరంబు శత్రుకల్పితం బేమో యని యనుమాన మగుచున్నది.' అని ఖా ననెను

'ఓ దుర్గాధీశా! నావచనము నీవు నమ్మినను నమ్మకపోయినను నాచెప్పవలసినది మానను. రామయమంత్రి శత్రుకోటిలోనివాఁడు. ఈమాట మనంబున నిడుకొనుము. కొలఁదిదినంబులలో నీకే తెలియును. నే నొక మాట చెప్పెద నాలింపుము. మహమ్మదీయరాజ్యధ్వంసము చేయఁ దలఁచి యిచ్చటికి వచ్చి యుండె. లేనిచో నీతివిశారదుండును, బుద్ధిమంతుడును, నగు రామయమంత్రి స్వజాతివారితో విరోధించి శత్రువుల చేరఁడు. ఇది నిశ్చయము. అని పకీరు పల్కెను.

ఇట్లు తోఫల్ ఖానును బకీరును గలసి సంభాషించుచున్న యవసరంబున ద్వారపాలకుం డరుదెంచి 'ఓ మహాప్రభూ! గోలకొండసేనానిచేఁ బంపఁ బడిన యొకసేవకుండు వచ్చి తమదర్శనంబు గోరుచున్నవాఁ డని మనవిచేసి తదనుమతివడసి లోపలికిఁ గొనివచ్చిన నాసేవకుఁడు ఖానునకు నమస్కరించి యొకయుత్తర మందిచ్చెను. ఖాను దానిని విచ్చి యిట్లు చదివె.

‘ఓ దుర్గాధీశ్వరా! మేఁకవన్నె పులివంటి యీ బ్రాహ్మణ ఘాతకుఁడు నీ కెట్లు విశ్వాసపాత్రుఁ డయ్యెనో తెలియఁజాల కున్నాను. ఆదురాత్ముఁడు నా కొక సుందరీ లలామ నిచ్చెద నని చెప్పి కొనిపోయి దుర్భరపరాభవంబు చేసి పంపె. పరాభవ ఖిన్నుండనైన నేను మీమొగంబు జూడ సిగ్గుపడి మీసెలవు గైకొనకుండ వచ్చి నందులకు క్షమింపుఁడు. ఒకవేళ మీకు నట్టి పరాభవము సంభవించునేమో యని విచారించుచు నీ కిది వ్రాసితిని. కృతఘ్నుండైన రామయమంత్రికి సాయ మొనర్ప మీతో మే మేకీభవింపము.

ఇట్లు మలమలఖాను.’

అనియున్న యీయుత్తరంబు చదువుకొని ఖాను రామ యమంత్రిని గూర్చి సంశయాస్పదచిత్తుండయ్యె.

అనంతర మతఁడు పకీరుం జూచి ‘ఓ మహాత్మా! ఈ యుత్తరంబుచూడ నా కాశ్చర్యము పొడముచున్నది. ఇందుఁ జూపిన స్త్రీయెవ్వతెయై యుండును. నాకుఁ బరాభవము సంభ వించునేమో యని విచారించుచున్నాఁడఁట. ఎట్లుసంభవించును? రామయమంత్రి యతని కొనర్చినపరాభవ మేమయి యుం డునో?’ అని ప్రశ్నించెను.

‘ఓ తురుష్కాగ్రణీ! ఆస్త్రీలలామ మెవ్వరో యని యడుగనేల? ఆమె యనంగసేనయే కావచ్చును. వేఁటకాఁ డెఱ చూపి మృగంబుల నాకర్షించి మోసపుచ్చి పట్టుకొనునట్లు వీఁడును, ననంగసేనను జూపి మీవంటి మహమ్మదీయులను మోస

పుచ్చు నెంచుచున్నట్లున్నది. ఈ రామయమంత్రి మలమలఖా నును సంతసింపఁ జేయ ననంగసేన నిచ్చెదనని వాగ్దానము చేసి యుండును. ఆఖాను దాని నమ్మి పోయి యనంగసేనను గూర్చి బలాత్కారము చేసి యుండును. ఆమంత్రి దానిని సహింపక పరాభవము చేసి పంపియుండు. నీవు అనంగసేనం గోరుచున్న వాఁడవు కాన యాతఁడు నీకుఁ గూడఁ బరాభవము గల్గించు నేమోయని యిట్లు వ్రాసియుండును.' అని పీరు వివరించి చెప్పె.

'మహనీయా! రామయమంత్రి నన్ను మోసపుచ్చు నని తోఁచదు. నానిమిత్తమె యాకాంతనుగొనివచ్చియున్నాఁడు. నాయభిలషితకాంతను గోరినవాఁడు కావున మలమలఖానునకు రామయమంత్రి చేసిన దండనము యుక్తమెనదే. రామయమంత్రి దయ దలఁచి యతనిఁ బ్రాణంబులతో వదలెను. గాని నేనే యైనచో వానిశిరంబును వెంటనే ఖండించి యుందును. ఇది యుక్తమగునా? కాదా?' అని ఖా నడిగె.

'దుర్గాధీశ్వరా! మన మొకటి యోజింప వలసియున్నది. తిమ్మరుసు తన వ్రాసిన యుత్తరములో ననంగసేనకుఁ బరాభవము గల్గకుండఁ గాపాడుచుండవలెనని వ్రాసియున్నాఁడు. రామయమంత్రి యా యంశమును మనంబున నుంచుకొని యనంగసేనను బరాభవించుచున్న ఖానుని బరాభూతునిఁగాఁ జేసియున్నాఁడు. కాన నీకు నట్టి పరాభవము చేసినఁ జేయఁగలఁడు. రామయమంత్రి నిన్ను కనికరించు నని యనుకొను చున్నావా? రామయమంత్రి శత్రుకోటిలోని వాఁడగుట సత్యము. వాఁడు

నిన్ను మోసపుచ్చి పరాభవించుటకే యామెను గొనివచ్చి యున్నాఁడు.' అని ఫకీరు పలికెను.

ఖా నామాటల కాగ్రహోయత్తచిత్తుండయి 'అయ్యా! రామయమంత్రి నాకుఁ బరాభవము గల్గించి మెచ్చుటకెఁ బోఁ గలఁడు? నన్ను వరింపకుండ ననంగసేన మెచ్చుటకెఁ బోఁ గలదు? ఇప్పుడే రామయమంత్రినిఁ బిలిచి యతనియెదుట ననంగసేనను నిలువఁబెట్టి యడిగెదను. వారు సందేహించినను, వికటముగా మాటలాడినను వెంటనే సంహరించెదను. ఇఁక నాకుఁ బరాభవ మెట్లు వచ్చునో, చూచెదను గాక' అని కోపముతోఁ జెప్పు చుండెను.

'యవనాగ్రణీ! కోపమువహించిన నేమిలాభము? కోపము సర్వకార్య నాశనకరము. రామయమంత్రి నీకుఁ బరమశత్రువై నను, నీవు మనంబునఁ గొంతశాంతము వహించి యతనిఁ జంప వెనుకటి స్నేహముతోనే వర్తించుచుండుము. లేక యతని స్నేహంబును విఘటించితివేని మహామాయావి యగు రామయామాత్యుండు మాయోపాయముల పన్ని యనంగసేన నిటనుండి కొనిపోవును. అట్లయిన మనకార్యముచెడును. అనంగసేనంగూర్చి రామయమంత్రితోఁజెప్పక నీయుంటనీవే యామెచెంతకుఁబోయి వేఁడుకొనుచుండుము. మునుపటికంటె నిప్పుడామె నీయందు వల పూనుచున్నట్లు వినుచున్నాను. ఇఁక గొన్నిదినంబులలో నీ యభీష్టంబు నెఱవేరును. అనంగసేన నీకు వశమైన పిమ్మట రామయ మంత్రి నేమి చేసినను జేయవచ్చును. అతఁడు మహాత్మ్యదీయుల

కుఁ బరమశత్రువని యిప్పుడైన నమ్ముదువా? లేదా? ' అని పకీ రడిగెను.

' పూజనీయా! ఆ రామయమంత్రి శత్రుకోటిలోవాఁడని యిప్పటికిఁ దట్టినది. వాఁడు చేసినపని యేదియును గొనసాగలేదు. మహమ్మదీయరాజ్యములు మగుడ భేదంబును బొందెను. ఏది యేమయినను ననంగసేన నాకుఁ దక్కినది. అంతే చాలును. నీవు చెప్పినట్లు ననంగసేన నాకు వశమగునంత కాలంబును వీనితో స్నేహము చేసియే యుందును. పిమ్మట బంధించి కారాగృహంబున నుంచెదను. '

అని వీరు సంభాషించుచున్న సమయంబున నుద్దామమగు స్వనంబొకటి వీతెంచి వారి మనంబుల నాకర్షించె. అది యెటనుండి వచ్చుచున్నదో తెలియ లేదు. ఝంఝామారుతమువలనఁ గల్లోలితమైన సముద్రపుఘోషవలె వినవచ్చుచుండె. నాలుగైదునిముసంబులు వా రట్లె వినుచుండిరి. ఆభీకరనినాదము క్రమక్రమముగా సమీపించి చెవుల బ్రద్దలు చేయుచుండె. అది విని పురజనులు కలంగఁ జొచ్చిరి. దుర్గరక్షకభటులు కొందఱు దుర్గద్వారంబులు మూసి జాగరూకులై యాయుధహస్తులు రక్షించుచుండఁ గొందఱు ఖానుని సమీపించి 'యొక మహాసైన్యము మనదుర్గంబును సమీపించుచున్న' దని చెప్పిరి. అంత ఖాను రయంబున లేచి వారితోఁగూడ దుర్గగోపురంబు పైకిఁ బోయి చూచి అది మొదటఁ దన ప్రభువగు నాదిల్‌షాహ సైన్యంబని యనుకొనెను. కాని యావచ్చెడి సైన్యమందు

మహోన్నతమై కాన వచ్చుచున్న ధ్వజంబునుబట్టి యది శత్రు రాజగు కృష్ణదేవరాయల సైన్యమని తెలిసికొని తత్తరపడఁ జొచ్చెను. శత్రువులు తమదుర్గంబును ముట్టడించినవార్తను తన ప్రభువునకు తెలియఁజేయుట యుక్తమని భావించి యిరువురు భటులఁ బిలిచి వారికిఁ గొన్ని యుత్తరంబు లిచ్చి విజాపురంబు నకుఁ బంపెను. అనంతర మతఁడప్రమత్తుఁడై పురంబునఁ దిరుగుచు యోధాగ్రేసరు లగువారిని దుర్గరక్షణమున నియోగించుచు నచ్చటచ్చట నున్న భటులను హెచ్చరించుచు, నెట్టిసైన్యము వచ్చినను దుర్గంబును సాధింపలే రని మొదట భావించెను. కట్ట నతిక్రమించి పొరలి వచ్చుచున్న సముద్రంబువలె నున్న యా సైన్యంబును జూచినప్పుడు భాను చిత్తంబున భయ మందక పోలేదు. ఆ మహాసైన్యము శత్రుభయంకరంబై వచ్చుచుండెను. శుండాదండంబులచే మార్గమధ్యంబున నున్న తరువులను, విఱిచికొని తినుచు, మదపుటేనుఁగులు నడగొండలవలెఁ జూపట్టుచు వచ్చుచుండె. ఉత్తుంగతురంగంబులు హేషాధ్వనులచే దిక్కులఁ బిక్కటిల్లఁ జేయుచు, ఖరతరఖురపుటంబులచే, క్షుణ్ణంబైన క్షోణీస్థలంబునుండి బయలువెడలిన రజఃపటలంబులు నభోమండలంబున వ్యాపించునట్లు చేయుచు వచ్చుచుండె. పదాతులు మదోద్ధతులై తమకరతలంబుల వెలయు ఖడ్గంబుల సూర్యకాంతిలో ధగధగ లాడునట్లు చేయుచు నొకరి నొకరు ప్రోత్సాహంబు చేసికొనుచు రాయచూరున కభిముఖులై యేతెంచుచుండిరి. ఆమహాసైన్యము పెక్కుభాగంబులుగావిభజింపఁబడియె.

ఆ సైన్యములో వీరాగ్రేసరు లగు వాఁడొకొక్కఁడొక్క భాగంబున కాధిపత్యము వహించి నడపుచుండెను. అందు కామా నాయకుఁడు వివిధాయుధంబులఁ దాల్చిన ముప్పదివేల పదాతివర్గముతోడను, వేయి వారువంబులతోను, బదునాఱు మదగజంబులతోను ముందుగా నడచుచుండె. ఆతని పిఱుందన యేఁబది వేల కాలరులును, రెండువేల వాజిరాజంబులును, నిరువది కరీంద్రంబులును దన్నుఁ గొల్చుచుండఁ ద్ర్యంబకరా వనెడి శూరాగ్రేసరుఁ డరుదెంచుచుండె. అనంతరము తిమ్మప్పనాయకుం డనెడి యోధవరుఁ డరువదివేల కాల్బలంబుతోడను, మూఁడువేల యెదువందల సైంధవంబులతోడను, ముప్పది మాతంగంబులతోడను, వైభవంబు చెలంగ నేతెంచుచుండె. అటు తర్వాత ఆదెప్ప నాయకుండను మహావీరుండు, లక్షపదాతి వర్గంబుతోడను, నైదువేల హయంబులతోడను, నేఁబది గజ రాజంబులతోడను, శత్రు భయంకరుండై యేతెంచుచుండెను. అతనివెనుక లక్షయునిర్వదివేల భటులతోడను, నాఱువేల వారువంబులతోడను, నలువదిసామజంబులతోడను, గొండారెడ్డి పఱతెంచుచుండె. పిమ్మట నెనిమిదివేల పదాతులతోడను, రెండువేలయేఁబది యశ్వంబులతోడను, నలువది మత్తగజంబులతోడను, గొండారెడ్డి పుత్త్రుం డరుదెంచుచుండె. తదనంతరంబున ముప్పదివేల కాల్బలంబుతోడను, వేయిహయంబులతోడను, పది మత్తేభంబులతోడను, తిమ్మరుసు తమ్ముఁడగు సాళువ గోవిందరా జేతెంచుచుండెను. అతని తర్వాతఁ బదు

నైదువేల కాలరులతోడను, రెండువందల యశ్వంబులతోడను, మధురనాయకుండు వచ్చుచుండెను. అతని వెనువెంట మైసూరు మండలాధిపతియగు కుమారవీరశ్యామలరాయ లెనిమిదివేల భటులతోడను, నన్నూఱు తురంగంబులతోడను, నిరువది గజంబుల తోడను, ఏతెంచుచుండెను. అటుపిమ్మట వెంగాపురాధ్యక్షుండును, నరపతివంశసంభవులగు క్షత్రియవీరులును, మొదలగు వారు సమర సముత్సాహులై వచ్చుచుండిరి. కృష్ణదేవరాయలకుఁ బ్రేమాస్పదుఁడైన ఖోజాలు నలువదివేల కాల్బలంబులతోడను, వేయి తురంగంబుల తోడను, పదునైదు కరులతోడను, బఱతెంచుచుండిరి. అనంతరము నలువదివేల పదాతులతోడను, నారువేల తురంగంబులతోడను, మున్నూఱేనుంగులతోడను, గూడికొని విజయనగరసామ్రాజ్యలక్ష్మీధురంధరుండగు, కృష్ణదేవరాయలు సమస్తరాజలాంఛనంబులు మెఱయ సకలసేనానియంతయై పఱతెంచుచుండె. అమ్మహాసైన్యంబున నెత్తఁబడిన పతాకంబులు వాయువేగంబునఁ దపతప కొట్టుకొనుచు శత్రువులడెందంబుల కెన వచ్చుచుండెను. పదాతుల సంభాషణంబులచేతను, హయంబుల హేషానినాదంబులచేతను, గరీంద్రంబుల బృంహితంబులచేతను, సేనానాయకుల యాజ్ఞావచనంబులచేతను, వీరుల వీరాలాపంబులచేతను, గకుబంతంబులు నిండుచుండెను. రాయ లిదివరకుఁ బ్రవర్తిల్లిన యేయుద్ధంబునకైన నింతసైన్యంబును గూర్చియుండ లే దని చరిత్రకారులు వర్ణించియున్నారు. మహమ్మదీయరాజ్యంబులు మూడు

ను నేకీభవించి త న్నెదిరించు నని యెంచికృష్ణరాయలింత మహా సైన్యంబును గూర్చెను. ఇట్లు రాయ లుద్దామచతురా సమూహంబులతో వచ్చి రాయచూరును ముట్టడించె. అతని సైన్యంబునఁగల వీరులు చిరకాలంబునుండి సంగ్రామమ్ములు లేమిఁ దిమ్మిరి పట్టిన యవయవంబుల మాంద్యము వదలునట్లు సమరమెప్పు డెప్పుడో యని మహా ప్రోత్సాహంబునఁ గయ్యము నకుఁ గాచ్చియుండిరి.

---

## ముప్పదియొకటవ ప్రకరణము.

### ప రా జ య ము.

దక్షిణహిందూస్థానంబున విజయనగరరాజ్యంబు తర్వాత నన్నివిధంబుల చేతను సంపన్నంబైనది విజాపురరాజ్యంబు. విజాపురరాజ్యంబునకు మూలపురుషుఁడు యూసిఫ్ ఆదిల్‌షాహా యనెడి మహమ్మదీయకులావతంసుండు. ఇతఁడు తురుష్క స్థానంబులో నొక యున్నత మహమ్మదీయ కుల మందుద్భవించి క్రీ. శ. ౧౪౫౯వ సంవత్సరంబున హిందుస్థానంబునకు వచ్చి దక్కనులో సుప్రసిద్ధుఁడైన మహమ్మదగవాను దయను సంపాదించి విజాపురంబునకు నాయకుఁడుగా నియమింపఁబడి బహామనీవంశసంభూతుఁ డగు మహమద్‌షాహా మృతిచెందినతోడనే స్వతంత్రుఁ డయ్యెను. అతఁడు విజాపురంబులో సుందరమందిరంబులు నిర్మించి దానికి వన్నెపెట్టి మిక్కిలి ప్రసిద్ధి గాంచెను.

అతండు జీవితకాలమంతయును సమరంబు లొనరించి రాజ్యం బును వృద్ధి పొందించెను. పశ్చిమసముద్రప్రాంతమున నున్న గోవాపట్టణంబును పోర్చుగీసువారివలనఁ దీసికొని వాసి గాం చెను. ఇట్లమితమగు రాజ్యంబును, గీర్తియు సంపాదించి యు మ్మహమ్మదీయ ప్రభువు క్రీ. శ. ౧౫౧౦ వ సంవత్సరంబునఁ గాలధర్మంబు నొందె. అతని కుమారుఁ డిస్మాయిల్ ఆదిల్‌షా హా! ఇతఁడు రాజ్యంబునకు వచ్చు నప్పుడు తొమ్మిది వత్సరం బుల ప్రాయమువాఁడై యుండెను. కమాల్ ఖా ననెడి మహా మ్మదీయుం డితనిఁ జంప సమకట్టెను. కాని రాజమాత యాదు రాత్ముని జంపి బాలుని రక్షించెను. ఇతఁడు ప్రాయంబునఁ జిన్నవాఁడైనను జ్ఞానబలంబున వృద్ధుఁడయి రాజ్యాంగంబులను సమర్థతతోఁ గడుఁ జక్కఁగఁ బాలించుచుండె. ఒకప్పుడు వరాడ రాజును,బేదరు రాజును,నహమన్నగర రాజును, బహమనీ రాజు తోఁ గలిసి తనపైకిరాగా మహామతిమంతుఁడగు నితఁడు యుక్తి బలంబున వారిలో వారికి మిత్రభేదము గల్పించి యోడించెను. మన వ్రాయుచున్న కథాకాలము నాఁటి కతని కించుమించుగాఁ నిరువది వత్సరంబు లుండును. ఇతఁడు లేఁ బ్రాయపువాఁడై నను భోగాసక్తుండు గాక ప్రజానురంజకంబుగా బాలించుచుం డెను. అతఁడు రాయచూరునకువచ్చి మహమ్మదీయరాజ్యం బు లేకీభవించి నందులకు సంతసించి మరలి విజాపురంబునకువచ్చి వారి సాయంబున విజయనగరంబు నోడింపనెంచి సమరసన్నా హంబులు చేయుచుండెను.

ఒకనాఁ డాదిల్‌షాహ కొలువుదీర్చియుండఁగా నొక సేవకుఁ డరుదెంచి కొన్ని యుత్తరంబు లిచ్చెను. అందొక యుత్తరంబును, రామయమంత్రి శత్రుకోటిలోని వాఁ డనియు, నతఁ డవమానపఱిచి నందున సహింపలేక గోలకొండా హామన్న గర రాజ్యములవారు యుద్ధంబున మనకుఁ దోడ్పడరనియు రాయ లుద్దండ సైన్యంబుతో వచ్చి రాయచూరును ముట్టడించెననియుఁ దగిన సైన్యమును బంపనిచో రాయచూరు మనకుఁ దక్కుట కష్టమనియుఁదోఫల్ ఖాను వ్రాసెను. తక్కిన వానిలో రెండు కంబరసేన మలమలఖానులు రాయచూరు దుర్గాధ్యక్షు నకు వ్రాసినది. మఱియొకటి తిమ్మరుసు రామయమంత్రికి వ్రాసి నది. పకీరువచనంబులవలన రామయమంత్రి శత్రువని నమ్మి తన ప్రభువును నమ్మించుటకై తోఫల్‌ఖా నావిషయ ముత్తరమున లిఖించి తా వ్రాసిన దాని కుపబలముగా నాయుత్తరంబులు పం పెను. ఆదిల్‌షాహ యాయుత్తరంబులు పరికించి సంఘీభవించు చున్న మహమ్మదీయరాజ్యంబులను విఘటించుటకే తిమ్మరు సిట్లు వ్రాసియున్నాఁ డనియూహించి తక్కిన రాజ్యముల వారును, దోఫల్‌ఖానుండును బుద్ధిహీనులై మోహమంది సం ధిచెఱిచి రని మిక్కిలి విచారింప సాగెను. అనంతర మతఁడు రామయమంత్రి వంటి బుద్ధిశాలి లోకంబున మఱియొక డుండఁ డనియు, తొందరపడి యతని కవమానము కలుగనీయక తొంటి గౌరవంబుతోఁ జూచుచుండ వలయుననియు సైన్యంబులతో రాయచూరుదుర్గరక్షణంబుకై వచ్చుచున్నా ననియు నొక

యుత్తరము వ్రాసి యాభటున కిచ్చి పంపివేసెను. అతఁడు రామ యమంత్రి, సామర్థ్యంబు నెరింగి తిమ్మరుసు మంత్రి కెనవచ్చువాఁ డితఁడే కాని మఱియొకఁడు లేఁడని మెంచి యతని దనపక్షము నకుఁ ద్రిప్పుకోవలెనని యూహించి యట్లు తా వ్రాసెను. అది వఱకు సమరసన్నాహం బొనర్చిన వాఁడు గావున నా సైన్యం బులతోఁ బోయి రాయలసైన్యము నెదుర్కొని జయింపవచ్చు నన్న ధైర్య మతకిఁ గలిగినది. కావున సర్వసేనాధిపత్యము వహిం చి తా నరుగుటయె యుక్తకార్యమని నిశ్చయించె. ఇట్లతఁడు మహాధైర్యంబుతో సైన్యంబులఁ గదలించికొని రాయచూరు నకుఁ బోవుచుండె. మహాపరాక్రమశాలియైన తమప్రభు వగ్రగా మియై నడచుచుండుటచే సైనికు లమితోత్సాహపూరితులై మిత్తినెత్తినైన మత్తునియలు సేయ సిద్ధపడి యుండిరి. అతడు తనసైన్యంబులో గుఱ్ఱపుదళములు ముందుగాను, దరువాత హాస్తిబలంబును, బిమ్మటఁ బదాతివర్గంబును, నడుచునట్లు చేసి కృష్ణానదిని దాటి రాయచూరును సమీపింప వచ్చుచుండెను. ఆసైన్య మట్లుకొంతదూరంబు పోవునప్పటికి ముందు భయంకరం బగురజఃపటలంబు గానవచ్చె. ఆమహమ్మదీయ సైనికులు దాని సరకుగొనక మఱికొంతదూర మరుగు నప్పటికి 'టక టక' యనెడి ధ్వనులు వినవచ్చె. ఆదిల్‌షాహా యది చూచి ముం దేమి జరుగ నున్నదో తెలిసి కొనకుండఁ బోవుట మంచిదికా దని సైన్యము నచ్చట నిలువ నాజ్ఞ యిచ్చెను. వారట్లచ్చటఁ గొంతసే పుండఁగా స్వల్పసంఖ్యగల యాశ్విక సమూహంబు

వారికిఁ గోచర మయ్యె. ఆదిల్‌షాహ తన సేనానాయకునిఁ బిలిచి యాశ్వికసైన్యంబుతో శత్రువులపైఁ బడుమని యానతిచ్చె. అంత నా సేనానాయకుఁడు వారిని బ్రోత్సాహించి శత్రువులపై గలసి పోరసాగెను. కాని యంతలో రిపుల యాశ్వికసంఖ్య యమితమై చూపట్టె. కృష్ణదేవరాయలు రాయచూరు రక్షణార్థము సైన్యములతో నాదిల్‌షాహ వచ్చుచున్నాఁడని చారుల వలన విని ముం దతని మద మడంచి వచ్చుట కర్తవ్య మని భావించి తనసైన్యంబును గృధ్రవ్యూహంబుగాఁ బన్ని యత నికెదురుగా నడిపింపఁ జొచ్చె. ముఖంబున స్వల్పసంఖ్యగల సైనికు లుందురు గాన శత్రువులు సాహసించి సమరంబుచేయ సమకట్టుదు రనియు, నంత రెండు ప్రక్కలం దున్నవారు శత్రువులఁ జుట్టుముట్టి సులభంబుగా నోడింపఁ గలుగుదు రనియు దలంచి యిట్టి వ్యూహంబును బన్నె. నాలుగువేల యాశ్వికు లును, గొన్ని యేనుంగులును గొంత పదాతివర్గంబును ముఖ ముగా నేర్పడిరి. అందు ముఖ్యుఁడ శూరవరుండగు కామానా యకుఁ డుండెను. నేత్రములందు నిరుపమానపరాక్రమశాలులైన త్ర్యంబకరాయ . తిమ్మప్పనాయకు లుండిరి. ఆదెప్పనాయకుఁ డును గొండారెడ్డియు, దమతమ సైన్యంబులతో నొక ప్రక్కగా నేర్పడిరి. గోవిందరాజ మధుర నాయ కులు తమతమ సైన్యంబులతో రెండవప్రక్కగా నేర్పడిరి. వెంగాపురాధ్యక్షుండును, నరపతివంశజులైన క్షత్రియు లును ఖోజాలును దమతమ బలంబులతోఁ బుచ్ఛం

పై రి. తక్కినసైన్యంబులతోఁ గృష్ణరాయలు. కుక్షియం దుండి నలువలంకుల గలసైన్యంబులకుఁ బ్రోత్సాహ మొసంగుచుండెను. రాయలు తలంచినట్లు శత్రువులు ముఖంబున నున్న వారిని జూచి స్వల్పసంఖ్యాకమైన సైన్యం బని భావించి పోరాడసాగిరి. ముఖంబునఁ దక్కవమందియున్నను నప్రతిమపరాక్రమశాలులు గాన శత్రువులకుఁ దీసిపోకుండఁ బోరాడు చుండిరి. అంత రాయ లయాజ్ఞచొప్పున తెక్కలనున్న వీరాగ్రేసరులు ముందుల కరుగఁ జొచ్చిరి. ఇట్లు రెండు తెక్కలందున్న వారును రిపు సైన్యంబుల కుభయపార్శ్వంబులఁ దాఁకి సమర మొనర్చుచుండిరి. వీరలను జూచియే శత్రువులసంఖ్య హెచ్చుగానున్నదని మహమ్మదీయులు భావింపఁ జొచ్చిరి. ఇట్లు మూఁడుదిక్కుల రాయల సైన్యంబును, నాల్గవ దిక్కున నడగొండలవలె నున్న తమ హస్తి సమూహంబులును నిర్బంధించుటచే నాదిల్‌షాహ యాశ్విక సైన్యంబున కెల్లు పోవుటకును వీలులేక పోయెను. విచ్చల విడిగాఁ దమ హయంబులంబరువెత్తించి శత్రువులపైఁ బడుటకైనను వీలులేక పోయెను. అందుచే శక్తి యున్నంతవఱకుఁ బోరాడి క్రిందఁ బడుచుండిరి. విజాపురరాజు మహోపద్రవంబును జూచి పదాతివర్గంబును, హస్తిబలంబును వెనుకకు రప్పించి రాయలసైన్యంబునకు వెనుక భాగంబున దాక నాజ్ఞాపించెను. వెనుక భాగంబున సామాన్యు లుందురు కాన తన సైనికులు బోయి వారిని దాకి యోడింతురనియుఁ, దమ యాశ్వికబలములు విచ్చలవిడిగాఁ జరించి తమపరాక్రమంబు చూపి పోరాడ నవకాశము

గలుగు ననియు నూహించి సాహ యత్నము చేసె. అతఁ డూహించినట్లు నాశ్వికబలంబులకు స్వేచ్ఛ యలవడెను గాని రాయల సైన్యంబునకుఁ బశ్చాద్భాగంబునఁ బరాక్రమ నిధు లుండుటచే నట దాఁకఁబోయిన పదాతివర్గంబునకు హస్తిబలంబునకు నాను కూల్యము సంభవింపలేదు. అచ్చట నున్న వీరుల పరాక్రమంబున కోర్వలేక తమసైన్యము మరలివచ్చుచుండ మహమ్మదీయ ముఖ్యసేనాని వారికిఁ బ్రోత్సాహము గల్గింప యుద్ధంబునకు దార సిల్లిరి. ఇట్లుభయసైన్యంబులును దమతమబలంబులు చూపి కొంతకాలము సంకులసమరం బొనర్చిరి. తక్కిన చోట్లనున్న మహమ్మదీయులు రాయల సైనికుల కోడి పాఱుచుండిరి. కాని మహమ్మదీయాశ్వికసైన్యమంతయు నొక్కచో నుండుటచే ముఖంబుననున్న రాయల యాశ్వికులను వెనుకకుఁ దఱిమిరి. తన సైన్య మిట్లు వెనుకకుఁ మరలివచ్చుచుండుట చూచి రాయలు సమరవిముఖులై నవారిని సంహరించెద నని శాసించుటచే మగుడ వారు యుద్ధాభిముఖులుకాఁ జొచ్చిరి. ఇంతేకాక రాయలు తన కంగరక్షకులైన వీరులనుఁ గొందఱను బంప వారు వారికి సహాయభూతులై జీవంబుల కాసింపక పోరి మహమ్మదీయసైన్యంబులఁ జెక్కు చెండాడివైచిరి. అంతశత్రువులు చేయునదిలేక కొందఱు శత్రువులకుఁ జిక్కిరి. మఱికొందఱు శత్రువులచే దఱుమబడి కృష్ణానదిలో గూలి చచ్చిరి. ఇట్లాశ్వికులు త్రోవ యిచ్చినతోడనే రాయలసైన్యంబు లొక్కుమ్మడి నాదిల్‌షాహపైఁ బడెను. మహమ్మదీయముఖ్యసేనాని యది చూచి చేయు

ిచి తనవారిని బిలిచి తమప్రభువునకు మాఱుగా బోరాడ నాజ్ఞ యిచ్చె. మహమ్మదీయవీరు లుసురులకాసింపక నైరివీరుల నెదుర్కొని హోరాహోరని బోరి తమప్రభువుగండమును దప్పించిరి. వా రట్లు రానిచో నాదిల్ షాహ నాఁడు శత్రువాహినీ మధ్యంబున మునిఁగి యుండును. తన వీరు లట్లు సమరంబు సలుపుచుండఁ జూచి విజాపురరాజు ప్రాణంబుల దక్కించుకొన నదే సమయ మని భావించి తన గజంబుపై గూర్చుండి కృష్ణానదిం దాఁటి పోయెను. అయిన నతని ముఖ్యసేనాని సైన్యంబుల కుత్సాహము కల్గించి ఘోరయుద్ధంబు చేయుచుండెను. కాని శత్రువీరు లతని నోడించి స్వల్పకాలంబులోనే కట్టివైచిరి. తమ ప్రభువు రణరంగంబును విడుచుటచేతను, దమ సేనానాయకుఁడు శత్రుహస్తగతుఁ డగుటచేతను, మహమ్మదీయవీరులు ధైర్యంబు వదలి నానాముఖంబులఁ బర్విడ నారంభించిరి. కొందఱు మహమ్మదీయు లెటుపోవుటకును వలను పడమిచే శత్రువులకుఁ జిక్కి వారల కత్తిదెబ్బల కోర్వలేక దీనాతి దీనంబుగా విలపింపఁ జొచ్చిరి. దయార్ద్రహృదయుండగు కృష్ణరాయధరణీశ్వరుండవు తన సైనికుల వారించి శత్రుసైనికుల కభయ మిచ్చి రక్షించి విడువగా వారు నిర్భయులై తమ యిచ్చ వచ్చిన మార్గంబులఁ బడిపోయిరి. శత్రువు లట్లోడి యుద్ధభూమిని విడిచి చనుటచే, వారి యేనుంగులును, హయంబులును, యుద్ధ సామగ్రియు, ధనంబులును రాయలకు వశ మయ్యె. శత్రువు లోడుటయే కాక

వారి ద్రవ్యం బెక్కుడుగా దనకు లభించుటచే రాయ లధికా నందము నొంది తన సైనికుల కుచితరీతిని బహుమానము లర్పించి సంతసింపజేసి యా బడలిక దీర్చుకొనిపోయి రాయచూరును ముట్టడింప నెంచి కృష్ణానదీ తీరంబున విడిసి యుండెను.

---

## ముప్పది రెండవ ప్రకరణము.

### పరాభవము.

మహావాహినీసమేతుఁడగు కృష్ణభూపాలుఁడా కస్మికముగా వచ్చి రాయచూరును ముట్టడించిననాఁడు తద్వాస్తవ్యులగు ప్రజలెంత చింత చెందిరో, యతఁ డాస్థలంబు విడిచి చన్ననాఁ డంతసంతసంబు చెందిరి. రాయలు రాయచూరును విడిచిపోవుటకుఁ బలువురు బలువిధంబులు యోజింప నారంభించిరి. కొందఱు రాయలు భయపడి పర్వోడెనని తలంచిరి. మరికొందఱు దుర్గం బసాధ్యం బైనదని తెలిసికొని నిరాసచేసికొని పోయెనని నిశ్చయించిరి. ఒక కొంద ఱాదిల్‌షాహాతో దనకుఁ గల స్నేహానుబంధంబును భేదింపలేక వెడలిపోయెనని తలంచిరి. అంతేకాని తమకు సాయము చేయవచ్చుచున్న యాదిల్‌షాహ

నోడించి వచ్చుట కేగెనని భావింపలేక పోయిరి. ఇఁక రాయలు రాఁడనియే సంతసింపఁజొచ్చిరి. ఆదుర్గాధ్యక్షుండును రాయలు విడిచి పోయినందులకు సంతసించెను. రాయలు కొలఁది దినం బులలోనే మగిడివచ్చి తమదుర్గంబును ముట్టడింతు రనెడి విశ్వాసమతనికిఁ బూర్తిగానున్నను, నతఁడు వచ్చి ముట్టడించు నంతలో సమస్త వస్తుజాతంబులతోను దన దుర్గంబును నిండించు టకును, దుర్గరక్షణమందు దగిన వీరులను నియమించుటకును, తన ప్రభువు సైన్యంబుతో వచ్చి తనకుఁ దోడ్పడుటకును దగి న యవకాశ మొదవుటచే నధికానంద మతఁ డందక పోలేదు. అతఁ డిట్లధికధైర్యంబుతో సర్వము సన్నద్ధము చేయుచుండ దన భటులు వచ్చి తమ ప్రభు వోడిపోయెనని చెప్పిరి. అది విన్నతోడనే యిదివఱకున్న ధైర్యోత్సాహంబులు తఱిగి పోయెను. మహాసేనాసమేతుం డగు నాదిల్ షాహావంటి పరా క్రమశాలియే శత్రువుల పరాక్రమమున కోర్వలేక పోరాటంబున బాహాటంబుగా నోటమి నొందినప్పుడు స్వల్పసేనాసమేతుఁడైన తనకోటమి సంభవించునని వేర చెప్పవలయునా! అంతటి మహా సైన్యమే వైరివీరుల కోడెనని తెలిసినప్పుడు ఖాను మానసం బత్యాకులమయ్యె. ఇట్లతని చిత్తంబు రాఁబోవు నాపదకై భ యాకులం బగుచున్నను, నతనికి ధైర్యంబు గొలుపు సాధన మొకటి యలవడియున్నది. అది దక్షిణ హిందుస్థానంబునఁ బ్రఖ్యాతి వహించిన తన కాశ్రయభూతమైన రాయచూరు దుర్గము. అది శత్రువులకు దుర్భేద్యంబనియు నట్టి దుర్గబు

నాశ్రయించుకొన్న నెంతటి మహాసైన్యంబునునైన దైన్యం బొం
దింప వచ్చుననియు నతనికి ధైర్యము కలిగినది. తాను స్వల్ప
సేనాసమేతుఁడైనను దుర్గాశ్రయుఁడగుటచేఁ దనప్రభువువలెనోటమి
చెందనన్ననమ్మక మప్పు డతనికిఁగలిగినది.దుర్గాశ్రయుడైననూర్వుర
వీరులతోఁ బైటనున్నవారు రెండువేల సైనికులయినను బోరి జయ
మొందలేరని యతనికిఁబూర్వానుభవము.అందువలన ఖానుడెందంబు
ను దృఢపఱిచికొని తన శక్తినంతయు వినియోగించి దుర్గంబును
గాపాడవలెనని నిశ్చయించుకొనెను. మఱియు నతఁడు యుద్ధం
బున కనుకూలింపని పురుషులను, బాలకులను, నున్నత వంశ
సంభూతలగు స్త్రీలను దుర్గంబును విడిచిపోయి పొరుగూ
ళ్ళయందుండు నట్లాజ్ఞాపించెను. ఇందువలన నాహారపదార్థం
బులు వేగంబుగా వ్యయంబుగాక పోవుటయె కాక దుర్గం
బొకవేళ వైరులపాలఁ బడినప్పుడు స్త్రీల గౌరవంబు పో నవస
రంబులేదు. దుర్గాధీశ్వరుఁడు చాటించినతోడనే పెక్కండ్రు తమ
తమ ద్రవ్యంబులతోను బదార్థంబులతోను బోయి దుర్గసమీపస్థ
గ్రామంబులందు నివసించిరి. కొందరు స్త్రీలును దమగౌరవంబు
దక్కించుకొనుటకై గ్రామాంతరంబుల కరిగిరి. కాని శౌర్య
వంతురాండ్రగు కొందఱు స్త్రీలు తమ భర్తలతో యుద్ధమున
నేయుండ కుతూహలము గలిగియుండిరి. దుర్గంబును విడిచిపో
వువారి సంభాషణములచేతను, విడిచిపోవు వారచ్చటనుండిన
ప్రియబాంధవులను గూర్చి పలికెడి విచారకరవచనంబులచేతను
బ్రోత్సాహ పూరితంబులగు వీరుల వీరాలాపంబులచేతను నా

దుర్గంబు వహ్నిం పదరము గాని స్థితియందుండెను. ఆ సమయంబున వనారామమందిరంబున వసించుచున్న యనంగసేనయు మాలతియు నిట్లు సంభాషించిరి.

అ:-చెలియా—ఆ కలకల మేమి?

మా:-దుర్గవాసులు రాఁబోవు నపాయంబునుండి తమధనంబులను, స్త్రీలను, రక్షించుటకు గ్రామాంతరంబుల కంపుచున్నారు.

అ:-సార్వభౌముఁ డీదుర్గంబును ముట్టడించియు నేల విడిచి పోయెను?

మా:-ఈ దుర్గంబును గాపాడవచ్చుచున్న యాదిల్‌షాహ నోడించుటకు.

అ:-అచ్చటి వృత్తాంత మేమి?

మా:-రాయలు జయ మందె.

అ:-రాయలు మగుడ నీ దుర్గంబును ముట్టడించునా యేమి?

మా:-ఒకటి రెండు దినంబులలో వచ్చును.

అ:-అతఁ డిటకు వచ్చులోపున మన మీస్థలంబును విడిచి పోఁగలమా?

మా:-నీకు స్థలాంతరంబునకుఁ బోవలెనని కోర్కె యుండిన నది యిప్పుడే నెఱవేరవచ్చు.

అ:-రాత్రిందివంబులు భటులుగాచుచుండ నెట్లు దాఁటిపోఁగ ము? నా కంతటి యదృష్టము పట్టునా?

మా:-ఎంతమంది కా పున్నను నిన్నిప్పుడే తప్పింతును. ఇంతరాత్రి వేళ నెచ్చటికిఁ బోవుదము?

అ:-ఎచ్చటికా? సమీపగ్రామంబునకుఁ బోవుదము. రాయ లిచ్చటికి వచ్చినతోడనే సందర్శించి యతని యనుగ్రహంబును సంపాదించి నిరపాయులము కావచ్చును. మనల నీ మార్గమధ్యంబున రక్షించుటకు మీవైద్యుని గొనివత్తువా?

మా:-తప్పక గొనివచ్చెదను.

అ:-మన మీ సమయంబునఁ బోవుదుమేని దుర్గద్వారపాలకులకు భయమంద నవసరములేదు. మనల నీదుర్గంబునుండి వెడలి పోవుచున్న స్త్రీలనుగా భావించి విడుతురు.

మా:-అవును. చక్కగా నూహించితివి. అట్లె పోవుదము.

అ:-ఈ భూతములనుండి యెట్లు తప్పించుకొనఁ గలము?

మాలతి విని 'అమ్మా! నే నుండ నీ కావిచారమేల? నా చెప్పినట్లు చేయుము. అని గమనోపాయంబు నామె కుపదేశించుచుండెను. అప్పటికి నాల్గుగడియల రాత్రి కావచ్చినది. ఆ సమయంబునఁ బరిచారిక భోజనపదార్థంబులను గొనివచ్చెను. ఆ పరిచారిక యచ్చట నుండగనే తా నొక మాఱు పురంబులోనికిఁ బోయి తమ గమనంబునకు సిద్ధముచేసి వచ్చెను. అనంతరము దాసి యా పదార్థంబుల నచ్చటనుంచి పోవుటకు లేచెను. మాలతి దాని నిలిపి తమతో భోజనంబుచేయు మన్న నదియు వారితోఁగలిసి సంతృప్తిగా భుజించె. అప్పుడు మాలతి యనంగసేనతో నిట్లు సంభాషించె.

మా:-అమ్మా! తఱిదప్పకుండ మనకు భోజన పదార్థంబులు గొనివచ్చుచున్న యీపరిచారికకు దగిన బహుమాన మీయవలదా?

అ:-ఈయునిచోఁ గృతఘ్నురాల ననిపించుకొనవా? ఏ మీయును?
మా:-నీవు ధరించెడి మంచి చీరె నిచ్చితివేని బా గుండును?
అ:-ఈ చీరె మిక్కిలి విలువఁ గలది. అయిన నిది చిరకాలము
నుండి మనకు భోజన పదార్థంబులు తెచ్చి పోషించుచున్నది.
కాన దీనినే యిచ్చెదను. (అని చీరె నిచ్చెను)
మా:-(పరిచారికం జూచి) ఓసీ! నీ వెంతయదృష్టవంతురాల వే?
నేఁ జిరకాలంబునుండి సేవించుచున్నను ననంగసేన నా కిట్టి
చీరె యొసంగలేదు.

పరిచారిక యావచనంబులు విని యమందానంద మొంది యాచీరెను బుచ్చుకొని ,అమ్మా! నాకు సెల విందు పోయి వచ్చెదను. అని పల్కెను. అది విని యనంగసేన ఓసీ! నేనిచ్చిన చీరెను దాల్చి మాకానందము కల్గించిపొమ్ము. దానిధరింపకుండఁ బోవుటతగవుకాదు. అని పల్కెను. ఆదాసి యాచీరెనుగట్టుకొని సంతోషాతిశయంబునఁదన్నుమఱచిపోయెను.అప్పు డనంగసేనయు మాలతియు దాని యందంబును వర్ణించి సంతోషము నినుమడింపఁ జేసిరి. అంతట నాపరిచారిక పాత్రాదులను బట్టుకొని ప్రయాణ మయ్యె. కాని యనంగసేన ,ఓసీ! పోవుదువు గాని లెమ్ము. మీ యిల్లెచ్చటికిని బాటిపోదు లెమ్ము. ఒక గడియ యిచ్చటనుండి యీపుర వృత్తాంతంబులను దెలిపి మాకు సంత సము గల్గింపవా? రాత్రి మీరినచో నీరాత్రి యిచ్చటనే శయ నింపవచ్చును. అని పల్కెను. తన కమూల్యవసనం బిచ్చి యధిక గౌరవంబు చేయుచున్న ననంగసేన వచనము నతిక్రమించి పోవుట

మోటుగా నుండునని భావించి యాపరిచారిక యచ్చటఁ గూ ర్చుండి దుర్గాధ్యక్షుని యంతఃపుర రహస్యంబులను, నా పురం బునఁ గల ధనికస్త్రీల రహస్యంబులను సరసముగాఁ జెప్పి నవ్విం చుచుండెను. వా రిట్లు మాట్లాడుచుండ రాత్రి చాలభాగ మతి క్రమించెను. అంత ననంగసేన తన శయ్యాతలంబునఁ జేరి దాని నారాత్రి యిచ్చట శయనింపుమని పలికి నిద్రించెను. మాలతి తన శయ్యను జేరెను. ఆపరిచారిక వేఱొక శయనంబున నిద్రిం చెను. కొంతసేపటి కా ముగ్గురిలో నొక స్త్రీలలామ లేచి కొన్ని వస్తువులను మూటఁగట్టి యెవ్వరితోడను జెప్పకుండ మేడ దిగి ద్వారముచెంతకు వచ్చెను. ఆసమయమున ద్వారపాలకుఁ డాయు ధహస్తుఁడై ద్వారంబును రక్షించుచు నావచ్చుచున్న మగువం గాంచి కోపంబున.

'ఆ పోయెడి వా రెవ్వరు? ఇంత రాత్రివేళ నెచ్చటికి బోవుదువు? నీ విచ్చటనుండి కదల వలనుపడదు. నిన్నుఁ బోనీ యను' అని పలికెను.

'మగువ-ఓయీ! ద్వారపాలా! నీ వెవండవు. ఇదివఱకున్న వాఁ డవా! లేక క్రొత్తవాఁడవా?

ద్వా-నేనుఁ గ్రొత్తవాఁడనే, పూర్వ మిచ్చట నుండువారు దుర్గ రక్షణంబుకై నియమింపఁబడిరి.

మ-కావుననే యట్లడుగు చున్నావు. నేను మాలతిని, లోపలికిని బైటికిని బోవుటకును వచ్చుటకు దుర్గాధ్యక్షుండు నాకు

సెలవిచ్చి యున్నాఁడు. చూడుము. ఇదిగో నాతని యుంగరము. అని చూపెను.

ద్వా-(చూచి) నీవు మాలతివా! అట్లయినఁ బోవచ్చును. పొమ్ము. అని పలికెను. ఆయువతి నిరాటంకంబుగాఁ బోయెను. ఆ ద్వారపాలకుఁ డట్లు జాగరూకుఁడై రక్షించుచుండె. అంత మఱికొంత తడవునకు మఱియొక యంగనామణి యామెచెంతకు వచ్చుచుండెను. ద్వారపాలుఁ డామెను నిలిపి యిట్లు ప్రసంగించెను.

ద్వా-ఆపోయెడి వా రెవ్వరు? నిలువుము. నీవు పైఁటనఁబోవ వలనుపడదు.

అంగన-ఓయీ! నీవు క్రొత్త వానివలెఁ జూపట్టు చున్నావు? నేను దుర్గాధ్యక్షుని దాసిని. ఈమందిరంబున నున్న స్త్రీల కాహారపదార్థంబులు గొనిపోయి యిచ్చి వచ్చుచున్నాను.

ద్వా:-ఓ సుందరీ! మాలతి యిప్పుడే యీ మార్గంబునఁ బోయినది. నిన్నుఁ జూచి యనంగసేన యనుకొని నిల్పితిని. క్షమింపుము. ఇఁక నీవు నడువుము.

అం:-నా వేషంబును, నీపాత్రలను జూచియైన బోల్ప వలదా!

ద్వా:-అనంగసేన లోపల నున్నదియా!

అం:-నిద్రించుచున్నది.

ద్వా:-ఇంత రాత్రివఱకు నిచ్చట నేమి చేయుచున్నావు?

అం:-అనంగసేనతోఁ బ్రసంగించుచుండ నిద్రపట్టినది. ఇప్పుడు లేచి వచ్చుచున్నాను. అనంగసేన లోపల నొంటిగానున్నది.

జాగరూకుఁడవై యుండుము. ఇట్లు సంభాషించి యాయువతి యటనుండి కదలిపోయెను. ద్వారపాలకుఁడు జాగరూకుఁడై రక్షించుచుండెను. నిద్రాదేవి వచ్చి యా ద్వారపాలుని శిరోరంగంబున నృత్యంబుచేయ నారంభించె. అందుచే వీఁడొక్కొకమాఱు నిద్రాతిశయంబునఁ బ్రక్క కొరుగుచు వెంటనే తెలివితెచ్చికొని, నలుదిక్కులఁజూచుచు మగుడ నిద్రించుచునుండెను. వాఁ డొకమాఱు కన్నుమూసి తెఱచునప్పటికి వాని దృష్టిపథంబున భయంకరరూపుండగు నొకపురుషుఁడు ప్రత్యక్షమయ్యె. ఆ పురుషుని చేతిలో భీకరఖడ్గంబు ప్రకాశించుచుండె. వాఁడు సుంతేనియు జంకక ద్వారంబు దరికివచ్చుచుండఁగా నా ద్వారపాలకుఁడు వెంటనేలేచికరవాలంబు కేల గీలించి 'ఆవచ్చెడి వా రెవ్వరు? అక్కడనే నిలిచి ప్రత్యుత్తరమిమ్ము. సమాధానము చెప్పకుండ నొక్కయడుగు ముందునకుంచి తేని నీ కుత్తుకనునాక త్తి కెఱచేసెదను.' అని భయంకరంబుగాఁ బలికి ఖడ్గంబు సారించి నిలువఁబడియె.

"ఓయీ! పరులెవ్వరును కారు. నేను దుర్గాధ్యక్షుండను. తోఫల్‌ఖానుండను.' అని యాపురుషుఁడు బదులిచ్చెను.

తన సైనికులు జాగరూకులై దుర్గంబును రక్షించుచున్నారో లేదో చూచుట కాదుర్గాధిపతి యాయాస్థలంబులకుఁ బోయి చూచుచు, నాదుర్గంబు రెండవప్రక్కకుఁ బోవుచు మార్గమధ్యమందున్న యాస్థలంబునకు వచ్చెను.

ఆద్వారపాలకుఁ డామాటలు విని భయాతిశయంబున గడగడ వడఁకుచు, నతని పాదములపైఁ బడి తన యపరాధం బును క్షమింప వేఁడుకొనెను. అంత ఖా నతనింజూచి "ఓయీ! నీ వేమియు నపరాధము చేయలేదు. నీ విహితకృత్యంబును నీ వాచరించితివి. నీ కార్యంబును నీవప్రమత్తతతోఁ జేయుచున్నం దుల కానందించితిని. ఇందున్న స్త్రీలు సురక్షితలై యున్నవారా? మనదుర్గంబున రాజద్రోహులు దిరుగుచున్నారు. నీవు జాగరూ కుండవై యుండవలెను. అని పల్కెను.

"ఓమహాప్రభూ! నేను బహుజాగరూకుండనై యు న్నాను. నే నిచ్చట నుండగాఁ బరిచారిక యగుమాలతి తమ యంగుళీయకము జూపి మందుకై పురంబునకుఁ బోయినది. ఇం కను రాలేదు. తమపరిచారిక యాహారపదార్థంబుల నిచ్చి యిప్పుడే యిట్లు పోయినది. లోపల ననంగసేన యొంటిగా నున్న దని యాద్వారపాలకుఁడు మనవి చేసెను.

తోఫల్ ఖా ననంగసేననుఁ జూడఁబోయి నప్పుడెల్ల మా లతిసన్నిధానవర్తినియై యుండుట మాటాడసాహసింపలేక్రమరలిప చ్చుచుండె.మాలతి నిర్భయంబుగాను, యుక్తియుక్తంబుగానుసం భాషించుచుండదానికిఁ బ్రత్యుత్తరమీయలేక వెడలిపోవుచుండె. ఇంతేకాకయామాలతియేదోమాయోపాయము పన్ని యనంగసే నతో మాటలాడ నీకుండఁ జేయుటయే కాక కన్నులార నామె రూపంబును నైనను జూడనీకుండెను. తన కోర్కె కాటంకము పెట్టుచున్న మాలతి లేకపోవుటచేఁ దగినసమయము లభించిన

దని సంతసించెను. అనంగసేన యొక్క తెయే మందిరంబున నున్నది. కాన తనశక్తి ని వినియోగించి మాటలాడింప లేకపోయి నను, దత్సుందరరూపంబును గన్నుల విందుగాఁ జూడనైనఁ జూడవచ్చును గదాయని యూహించి, మాలతి యొకవేళ వచ్చి నను రాకుండఁజేయ ద్వారపాలకున కాజ్ఞాపించి సౌధాంతరంబున కరిగెను. ఖా నట్లు మెలమెల్లగా దన సౌధం బధిరోహించి యనంగసేన మందిరంబు ప్రవేశించె. అటఁ దీపములు కాంతి మంతములై ప్రకాశించుచుండె. ఆదీపప్రకాంతులలో ననంగసేన చీరెజలతారు తళతళ మెఱయుచుండెను. ఖా నా మందిరంబు ప్రవేశించియచ్చటచ్చటఁ గొంచెముసేపు నడయాడుచు నామె మేల్కొనుటకై చడిచేసెను. కాని యామె మేల్కొనలేదు. అంత ఖాను మెల్లగా నాస్త్రీ శయ్యచెంతకుఁ బోయి "సుందరీ! అనంగసేనా! అని రెండు మూడు సారులు పిలిచెను. వాని కేమి యుఁ బ్రత్యుత్తరము రాలేదు. ఆమె గాఢనిద్రాసక్త రా లయి నట్లు భావించి మరలఁ దొంటి యట్ల రెండు మూడు సారులు పిలిచెను. అందులకుఁగదలుట తప్పఁ బ్రత్యుత్తరంబు రాలేదు. అప్పుడు ఖానాసుందరి నిద్రావస్థయం దున్నప్పుడే తదీయ చంద్ర బింబమును గన్నులారఁ గాంచవచ్చునని నిశ్చయించి మొగముపై నున్న ముసుంగును వెడలించి చూడఁగా నాఁడు కొండపల్లి దుర్గం బునఁ జూచిన యాసుందరాంగిమొగంబునకును, నీమెవదనంబునకు మిక్కిలి తారతమ్యము కాన వచ్చుచుండెను. అందుచే నాయు వతి యనంగసేన యగునాకాదా! యని మొదట సందేహించెను.

ఆ దుర్గంబునకు వచ్చిన పిమ్మట ననంగసేన మొగమ్మును స్పష్ట ముగాఁగాంచుట కదియె మొదటి పర్యాయము. కాల క్రమంబు నఁ దొంటి రూపంబునకంటె నిప్పటి రూపము మాఱి యుండుటచే గుర్తింపలేక పోవుచున్నానా, లేక రామయమంత్రి నన్ను మోసపుచ్చుటకై వేఱొక యువతిని గొనివచ్చి యనంగ సేన యని చెప్పి నన్ను భ్రాంతి పెట్టుచున్నాఁడా! అని పలువిధం బుల నితర్కించుచు, మఱియొకపర్యాయ మాయువతి వదన మును వీక్షింపఁగా నది తనకుఁ బరిచితమైనట్లేగన్పట్టు చుండెను. తుద కతఁడు సాహసించి చేతితోఁ దట్టి మేల్కొల్పెను. అంత నాసుందరి మెల్లన కన్నులు విచ్చి యొడలు విఱిచికొని తల్పం బునఁ గూర్చుండెను. అప్పుడు ఖా నాగ్రహోయత్త చిత్తుండై, "ఓసీ! దాసీ! నీచురాలా! అనంగసేన వస్త్రంబులు దాల్చి యిందేల నిద్ర వోవుచున్నావు. తత్వము వచింపుము. లేనిచో నీతల ఖండించెదను" అని ఖడ్గంబు చూపి గంభీరస్వరంబులతోఁ బలుక నారంభించెను.

ఆమాటలు దాసి విని త్రుళ్లిపడి తన ప్రభువని నిశ్చయింౘి భయకంపితగాత్రియై యట్టిటు చూచి యనంగసేనాదులు లేకపోవుటకు మనంబున నాశ్చర్యంబు చెందుచు, నతనిపాదముల పైఁ బడి "ఓ మహాప్రభూ! నాకభయమిత్తురేని ప్రవర్తిల్లిన వృత్తాంత మంతయును దెల్పెదను. అని గద్గద స్వరముతో ననెను. అంత ఖాను దానిని రక్షించెదనని వాగ్దానము చేసిన పిమ్మట దాసి తా నచ్చటకు వచ్చినది మొదలు నిద్రించి నంత

వఱకు జరిగిన వృత్తాంతంబును సాంతంబుగాఁ జెప్పెను. అది విని ఖాను దాసిని ద్వారపాలకులను మోసపుచ్చి తప్పించుకొని పోయి రని మిక్కిలి వగచి యా దాసిని ద్వారపాలకుని క్షమించి దుఃఖా విలచిత్తుండై పోయెను.

---

## ముప్పదిమూడవ ప్రకరణము.

### రుద్ర దేవుఁడు

తిమ్మరుసు పన్నిన యుపాయంబులు రామరాజు, చెప్పి నప్పుడే రామయమంత్రి యత్నంబు కొనసాగ దని ముక్తాంబ నిశ్చయించుకొనెను. ఇప్పుడు రాయ లాదిల్‌షాహ నోడించి రెం డుమూడుదినంబులలో రాయచూరును ముట్టడించునని విన్న ప్పుడు దానివిషయమై పూర్తిగా నిరాశ చేసికొనెను. రామయా మాత్యుని బిలిచి కర్తవ్యాంశమును నిర్ణయింప మొదటఁ దలంచు కొనెను. కాని విచారావిలచిత్తుఁడయిన రామయమంత్రి కార్యనిశ్చ యము చేయఁ జాలకపోవుట యేకాక రామరా జుపదేశించిన విధమునేఁ దాఁ జేయఁబోవు కార్యంబున కంగీకరింపఁ డని ముక్తాంబ యెఱుంగును. కాన నందుల కై ప్రయత్నము వదలెను. అంత ముక్తాంబ యొక యుత్తరము వ్రాసి వేఱొక కాగితంబున దానిఁ గప్పిపుచ్చి రహస్యముగాఁ గృష్ణరాయునకుఁ బుత్తేరఁ బ్రయత్నించుచుండెను. కాని విశ్వాసపాత్రుఁ డైన వాఁ డెవ్వం డును గానరాలేదు. ఇట్లుండ రుద్రదేవుం డామెను సందర్శింప

రాఁగా నతని లోపలికిఁ బిల్చి యతనిచే నప్పని చేయింప నెంచి "ఓ వీరవరేణ్యా! ఎంతకాలంబునకు దర్శనం బొసంగితివి? ఏమీ! ననుమఱచితివా? లేక రామయమంత్రి నన్నుఁ జూడవలదని నిషేధించెనా?" అని ముక్తాంబ పలికెను.

"సుందరీ! నీ మనోహరరూపమును సర్వకాలసర్వావస్థలయందును నామనోదర్పణంబునఁ బ్రతిఫలించియుండఁ, నిన్నెట్లు మఱవ నేర్తు? నిన్నుఁ జూడకుండ నే జీవించుటెట్లు? నేఁ బ్రతిదినంబును వచ్చుచుంటిని. కాని నీసందర్శనంబు చేయఁజాలక వగచుచుఁ బోవుచుండెడివాఁడను." అని రుద్రదేవుండు పల్కెను.

రుద్రదేవునివచనము సత్యము. అతఁడు దినదినంబును దద్దర్శనంబునకై వచ్చుచుండెను. కాని ముక్తాంబ యతనితో ప్రశంసింప నిష్టంబులేక యేదియో మిషపెట్టి యిప్పుడు వలను పడదని దాసిచేఁ జెప్పించి పంపుచుండెను. అయిన నిప్పు డామె యతని వశము కావించుకొన నిట్లు పలుకుచుండెను.

రుద్రదేవునివాక్యంబులు విని ముక్తాంబ యమితానందంబు చెంది "రుద్రదేవా! పరిహాసార్థము పలికినవచనంబుల యదార్థంబుగాఁ బరిగణింపకుము. నాయందు నీకెంత యనురాగం బున్నదో నీచందంబున కెఱుక. దాని కేమి? రామయమంత్రి ప్రయత్నము లె ట్లున్నవి? ఎప్పటి కయినను మనకష్టంబులకుఁ దగిన ఫల మనుభవింపఁగలమా? లేమా?" అని యామె విచారించుచుఁ బల్కెను.

'తరుణీమణీ! రామయమంత్రి బుద్ధిమంతుఁడే. అతండు సర్వ కార్యంబులలోఁ బురుషకారలోపం బింతేనియును లేదు. కాని దైవము తోడ్పడమిచే నేమియు ఫలంబు గలుగకున్నది. అతఁ డతిప్రయత్నంబుచేసిన మహమ్మదీయరాజ్యత్రయసమ్మేళనము విఘటితమయ్యె. బందీకృతుఁ డయిన విజయసింహుండు తప్పించుకొని పోయె. అయిన రామయమంత్రి యూరకుండు వాఁడు కాఁడు. కార్యము ఫలించినందాక పట్టినపట్టు వదలఁడు.' అని యతఁడు ధైర్యము కొల్పెను.

"వీరవరా! నీవు చెప్పినది నిశ్చయము. రామయమంత్రి యిట్టివాఁడే. అతని యత్నంబులో నింతేనియు లోపంబు లేదు. కాని కార్యంబు నెఱవేరక పోవుటచే నే నుభయభ్రష్ట నైతి. యుద్ధప్రయత్నంబు చెడినది. విజయనగరంబుతోఁ గలహించి యాదిల్‌షాహ తనరాజ్యంబు నే చక్కఁజేసికోఁగలఁడో లేఁడో యని సందేహింపవలసి యున్నప్పుడు మనకుఁ దోడుపడ నెట్లు సమర్థుఁ డగును? ఇంతేకాక యతఁడు మిత్రభావము నొందియున్నవారి కలహంబునకుఁ గారణమైన మన కపకారము చేయునేమో యని వగచుచున్నాను. కావున నీ స్థలంబును విడిచి స్థలాంతరమునకుఁ బోవుట ముఖ్యకార్యము. ఇందులకు నీ వేమందువు?" అని యామె యడిగెను.

"లలనారత్నమా! కార్యాకార్యవివేచనాశీల వగు నీకు నే నాలోచన చెప్పెడి పాటివాఁడనా! అయినను మన మీస్థలము విడిచిన నెచ్చటికిఁ బోఁగలము? మిమ్ము విజయనగరసార్వభౌ

ముని చెఱసాలనుండి తప్పించి తెచ్చితిమి. రాయ లాగ్రహంబుచే మనలఁ బట్టుకొని పోవుటకై వచ్చియున్నాఁడు. ఇప్పుడు మన మెచ్చటికిఁ బోయినను, నచ్చటికి వచ్చి చుట్టుముట్టక మానఁడు. మనము విజయనగరంబునకుఁ బోయిన మఱింత కష్టముల పాలగుదుము. ఇంతేకాక వారికిచేసిన యపరాధంబుల కెట్టి దండనము విధింతురో తెలియదు. వారు మనపై నధికకోపము వహించినట్టు వినియున్నాను. ఇప్పుడు మనము వారియొద్ద కేగుట కుందేలు వంటయిల్లుసొచ్చిన తెఱంగగును. కావున మన మిప్పుడు విజాపురరాజుపక్ష మవలంబించి విజయనగరముతో దురము చేయుటయే యుక్తకార్యము" అని రుద్రదేవుండు చెప్పెను.

"రుద్రదేవా! నీ వన్నది యుక్తము కా దని నే ననలేను. కాని విజయనగరంబువారితోఁ బ్రతిఘటించి పోరి గెల్చుట దుస్సాధ్యము. ఇప్పుడైన విజయనగరమువారిని శరణు చొచ్చి యపరాధంబు మన్నింపుఁ డని వేఁడుకొనుట యుక్తముకాని యిప్పుడు మఱికొన్ని యపరాధము లొనరించి వారి కోపాగ్నిని మండింపఁ జేయుట తగదు. కావున నీవిక వారికోపాగ్నిని జల్లార్పఁ బ్రయత్నింపవలయు. ఈసమయంబున నీ వొక్క యుపకారము చేయవలసి యున్నది." అని ముక్తాంబ పలికెను.

"సందియమేలా! చెప్పుము. సాధ్యమైన దేనినైనను దప్పక యొనరింతు నని నమ్ముము." అని యతఁడనెను.

"రుద్రదేవా! నీవు చేయవలసినది యసాధ్యమైనది కాదు. నే నొక యుత్తరము వ్రాసి యుంచితిని. అది నీవు కొని

పోయి కృష్ణదేవరాయలకు నొసంగి రావయును. అంతకంటె నీవు చేయవలసిన పెద్దపని మఱియేమియు లేదు.” అని యామె చెప్పెను.

“రమణీమణీ! ఇది కష్టసాధ్యం బనియే భావించెదను. ఇంతవఱకును రాయల ముఖ్యమిత్రులకును రాయలకును మహోప కారంబు లొనర్చియుంటిని. ఇప్పుడు వారిచెంతకుఁబోయిన నా ప్రాణంబు నుండనిత్తురా? ’ అని సంకోచించుచుఁ బలికెను.

‘ వీరవరేణ్యా! నీ కట్టి సందియ ముండినచో నీవు పోవల దు. మొదట నీవు ధైర్యవంతు లాడెడి వచనంబులు పల్కుటచే నిన్నుఁగోరితిని. కేవలవీరవరేణ్య సాధ్యంబగు నికార్యము మీ వంటి సామాన్యులకు మహాభరంబుగదా! ఈ కార్యం బొనరిం చు వారెవ్వరైన నుందురు. అట్టి సాహసము విజయసింహునకే చెల్లును. పరమశత్రు మండలిచే నిండినసభామండపంబున నతం డెల్లు నిర్భయంబుగాఁ బల్కెనో చూడుము. ’ అని ముక్తాంబ పల్కెను.

రుద్రదేవున కావాక్యలు కర్ణకఠోరంబులయ్యె. ముక్తాం బచిత్తంబు కలుషితమగుటకు విచారాక్రాంతస్వాంతుం డయ్యె ను. తనకు శత్రువగు విజయసింహుని నభినందించుటవలన మ ఱింత విచారంబు చెందెను. ఆసమయంబునఁ దన కెంతలేసి కష్టంబులు రానున్నను నోర్చి యకార్యం బాచరింపనిచో దదీయానురాగంబునకుఁ బాత్రుండ నగుట దుర్ఘటం బని తలం చి యామెం జూచి ‘ ఓ నారీతిలకమా! ఇఁక నన్ను మాటలచే

నొప్పింపకుము. ఎంతకష్టమైనను నిప్పని తప్పక యొనర్తుము. శత్రువుల చేతులకుఁ జిక్కిన నన్నుఁ గూర్చి మీరు విచారింతు రేమోయని సంశయించి కాని నాప్రాణంబులు కాపించికాదు.' అని రుద్రదేవుండు పల్కెను.

'రుద్రదేవా! నీవెన్ని యుపకారంబులు చేసినను దూత వై పోవుచున్న నిన్ను ధర్మశీలుఁడైన యీసార్వభౌముండు నిన్ను విడిచిపుచ్చక మానఁడు. కావున నీవీయుత్తరము గొని సార్వభౌముని కర్పించి రమ్ము. ఈయుదంతము రామయమంత్రికిఁ దెలియ నీరాదు.' అని చెప్పి పంపివేసెను. రుద్రదేవుం డామెను వీడ్కొని తననివాసంబున కరిగి యెవ్వరితోను జెప్ప కుండ నారాత్రియే బయలుదేరి రాయలుచెంతకుఁ బోవుచుం డెను. మొదట దుర్గ ద్వారపాలురు నిర్బంధించిరి. కాని యతఁ డు దుర్గాధీశ్వరునాజ్ఞచే విజాపురంబునకుఁ బోవుచుంటి నని చెప్పెను. వారదివఱ కతని నెఱుగుదురు కాన మా ఱాడక విడిచిపెట్టిరి. ఇఁకనతఁడు నిరాటంకంబుగాఁ బయనము చేయుచు కృష్ణానదీతీరంబున నున్న రాయల యొద్దకుఁ బోవుచుండెను. దుర్గంబు దాఁటి యొక క్రోశదూరంబు నడచెను. అప్పటికి నాల్గు గడియల రాత్రికావచ్చెను. చీఁకట్లు దట్టముగా నుండెను. అట్టి సమయంబునఁ బ్రయాణంబు సలుపుట కష్టమని యెంచి యచ్చ టికి సమీపంబున నున్న పల్లెయందారాత్రి పుచ్చి మరునాఁటి వేకువనే పయనముచేయ నిశ్చయించు కొనెను. ఇట్లాలోచించు కొనుచు నాలుగు బారలదూర మేగునప్పటికి వెనుకనుండి యెవ్వఁ

డో యొకపురుషుండు వచ్చుచున్నట్లు లనుమానము కలిగెను. రుద్రదేవుండు వెనుకఁ దిరిగి చూచి నిలువఁ బడెను. ఆపురుషుఁడు తనన్నే పునకే వచ్చుచుండెను. వానిచేతిలో నాయుధము కాని కఱ్ఱకాని లేదు. రుద్రదేవుఁడు వాని నొక భాటసారియని నిశ్చయించి యిట్లు ప్రసంగించె.

రు-ఓయీ! నీ వెవండవు? ఎచ్చటి కేగెదవు?

బా-మానివాసస్థలము ముందు గానవచ్చెడి పల్లె. కార్యార్థము రాయచూరునకుఁ బోయి వచ్చుచున్నాను. మీరెవ్వరు? ఎచ్చటికిఁ బోయెదరు?

రు-నేను! రాయచూరు నివాసిని. రాజకీయవ్యవహార మొకటి నెఱవేర్చుటకై రాయల సన్నిధికిఁ బోవుచున్నాను. ఈరాత్రి యాపల్లెయందు నివసించి తెల్లవాఱుజామునఁ బోవలెనని యున్నది. నానివాసమున కనువగు స్థలంబు లభించునా?

బా-లభించును. మీ రేకులమువారు? చెప్పుఁడు మీ కెక్కడ మంచిస్థలంబు లభించునో చెప్పెద.

రు-నేను రెడ్డివంశంబునకుఁ జెందినవాఁడను. నే నిప్పు డిటిస్థితిలో నున్నాను. కాని మాపూర్వులు దురాధిపత్యంబు వహించి యుండిరి.

బా-రెడ్డివీరుల ప్రఖ్యాతి నే వినియున్నాను. మాపల్లెయందు మీకులంబునకుఁ జెందినవారే యున్నారు. వా రేదోకార్యము నిమిత్తము కొలఁదిదినంబుల క్రిందటనే వచ్చి యున్నారు.

మీరు నేటిరాత్రి యచ్చట యాతిథ్యంబు గొనిపోవుట
సముచిత మని తలంచెదను.

రు-నన్ను వారిమందిరంబునకుఁ గొనిపోఁ గలవా ?

బా-తప్పక గొనిపోయెదను రండు.

అని చెప్పి ముందునకు నడవఁ జొచ్చెను. రుద్రదేవుం డప్పురుషుని వెంబడించి పోయెను. వా రట్లు గ్రామము ప్రవేశించి నాల్గైదిండ్లు గడచిన పిమ్మట నచ్చట నిలిచిరి. అప్పు డాబాటసారి రుద్రదేవుం జూచి "అయ్యా! నాచెప్పిన దీమందిరమే. ఆ యింటి వారందఱును మంచివారు. ధనవంతులు. ఎక్కుడుగా నాదరింతురు. మీరట్లు చనుఁ" డని చెప్పి యాబాటసారి తన మార్గము బట్టెను. రుద్రదేవుఁడు మెల్లమెల్లగా నమ్మందిరంబు చెంతకుఁ బోఁగా నచ్చట నిరువదేండ్ల ప్రాయముగల యొకయువతి యచ్చట నిలువఁబడి యుండెను. ఆమె వెనుకకు దిరిగి యెవ్వరితోనో మాటలాడుచుండుటచే నీతనిఁ జూచియుండలేదు. మొదట నామెను సమీపింప సంకోచించెను. కాని తరువాత ధైర్యము తెచ్చుకొని సమీపమునకుఁ బోయి నిలిచెను. అప్పుఁడామె యతనిం జూచి లోపలికిఁ బోయి కవాటముచెంత నిలువబడి "మీరెవ్వరు? ఎందునిమిత్తమే వచ్చితిరి?" అని యడిగెను.

'నేను రుద్రదేవుఁడను రెడ్డికులజుండను. ఈరాత్రి యిచ్చట విశ్రమించి పోవుటకై వచ్చితిని" అని యతఁడు బదులు చెప్పెను.

"రుద్రదేవా! సోదరా! నీవా? ఇట్టి రాత్రివేళ నచ్చట

నుండి వచ్చుచున్నావు? ఎందాకఁ బోయెదవు? మే మిచ్చట నున్న ట్లెవ్వరు చెప్పినారు? వచ్చి కూర్చుండుము. మీబావ గ్రామాంతరంబునకు వెళ్లి యుండెను. కొంచెము కాల మోర్చి తివేని యతండు వచ్చి నీకు విశేష గౌరవంబు చేయును." అని యా యువతి వినయపూర్వకముగాఁ బలికెను.

రుద్రదేవుం డావచనంబులు విని యత్యాశ్చర్యముచెంది నిశ్చేష్టితుఁడై చూచుచుండెను. మేలిముసుంగుతో నుండుటచే నామె యెవ్వతెయో గుర్తింపలేక పోయెను. కాని యామెకంఠ ధ్వని తనకుఁ బూర్వము పరిచిత మైనట్లుండెను. అతఁ డిట్లాలో చించి 'అమ్మా! నీ వెవ్వరుకవు? నిన్ను గుర్తింపజాల కున్నా డను. కంఠధ్వనిమాత్ర మెచ్చటనో విన్నట్లున్నది. నీవృత్తాం తము చెప్పి నాసందియము తొలంగింపుము." అని యతఁ డాశ్చ ర్యముతోఁ బలికెను.

"అన్నా! నీవు మఱచితివి. కాని నేను నిన్ను మఱతునా? మాం పుట్టిల్లు బెల్లముకొండదుర్గము. నేను రామారెడ్డి కుమారికను. కార్యార్థమీ గ్రామమువచ్చి యున్నాము. కార్యము ముగిసిన తోడనే మాయత్తిల్లున్న చంద్రగిరి చేరెదము." అని యామద వతి బదులు చెప్పెను.

రుద్రదేవుండు రామారెడ్డి నెఱుంగును. అతనికుమారి కను జంద్రగిరిలో నున్న యొకధనవంతున కిచ్చినట్లును నెఱుం గును. కాన యామె వచనంబులకు సంతసించి "చెల్లెలా! ఇప్ప టికిఁ దెలిసినది. నాకుఁ జాలసంతస మయ్యెను. నీవు బెల్లముకొం

డకుఁబోయి రెండువత్సరంబు లయ్యెను. అందుచే మన వారి వృత్తాంత మేమియును దెలియలేదు. వారందఱు క్షేమముగా నున్నారా?" అని సంతోషముతో నతఁడు పలికెను.

"సోదరా! అందఱును క్షేమముతో నున్నారు? ఇప్పు డెచ్చటికిఁ బోవుచు నిచ్చటికి వచ్చినావు?" అని యా సుందరి యడిగెను.

"చెల్లెలా! ఒక కార్యము నెఱవేర్చుకొను నిమిత్తము కృష్ణానదీతీరమున విడిసియున్న రాయలయొద్దకుఁ బోవుచున్నాను. రాయచూరునుండి వచ్చుచున్నాను." అని యతఁడనెను.

"అన్నా! వివాహప్రయత్నము చేయుచున్నావా? లేదా? మావదినగా రెచ్చట నున్నారో! యిప్పటి కేమియును దెలియదు." అని యామె యడిగెను.

"వివాహము స్థిరపడినట్టె. ఉదయగిరిదుర్గాధీశ్వరుని కుమారికను బరిణయమాడ నున్నాను." అని రుద్రదేవుఁడు పలికెను.

"ఆ సుదరి విజయసింహుని వరించినట్లు వినుచున్నామే? మీయిర్వురను బెండ్లాడునా యేమి?" అని యా సుందరి నవ్వుచుఁ బరిహాసమాడెను.

"విజయసింహుని పేరే యామెకుఁ గిట్టదు. అతనియందనురాగ మెట్లుదయించును? అతని నెన్నోపర్యాయములు చంపఁ దలంచినది. అట్టివానిని వరించునా?"

"ఆయువతియే నీకు లభించిన నీ వదృష్ట వంతుండవు?

దాని కేమి? రాత్రి యతిక్రమించుచున్నది. లేచి భుజించి శయ నింపుము." అని చెప్పియతనికిఁ దగినట్లు భోజనపదార్థములు వడ్డింపఁగా దిని రుద్రదేవుం డమితానందంబునొంది తృప్తిగా భుజించి యామె చూపిన మందిరంబు చేరి సుఖనిద్ర చేయుచుండెను. అంతఁ గొంతవడి కచ్చటి కొక పురుషుండు వచ్చెను. అతఁడా గృహంబున కధిపతియె. ఆయువతి యతని కెదురుగాఁ బోయెను. అంత వా రిట్లు సంభాషించిరి.

పు:-మాలతీ! నేడు నీవు కడుసంతసముతో నున్నావు. శుభోదంత మేమయినం జెప్పెదువా యేమి? వేగము చెప్పుము.

మా:-ప్రాణేశ్వరా! చెప్పుటకే వచ్చుచున్నాను. పక్షి బంధింపఁబడెను. దేనిని బంధింప మనము యత్నము చేయుచున్నామో యాపక్షి తనంతట తానే వచ్చి మన పంజరంబును ప్రవేశించినది.

పు:-అది నాకు జెప్పవలయునా?

అని వారిరువురును సంభాషించుచుండ రామరాజు వచ్చెను. "రామరాజా! విశేషము లేమి?" అని యడిగెను.

శం:-శంకరరెడ్డి విశేషముల కేమి? రుద్రదేవుని నిచ్చటికిఁ గొని వచ్చితిని. తగినట్లు లుంచితిరా?

శ:-అతని మంచి మాటలాడి మోసపుచ్చి మాలతి గదిలో బంధించిన దఁట!

రా:-విజయసింహుని కోర్కె సఫలమైనది. ముక్తాంబతో విజయసింహుండు రాయల కొకయుత్తరము వ్రాసి పంపు మని

చెప్పెను. ముక్తాంబకు రుద్రదేవుఁడు తప్ప మఱియొక స్నే హితుఁడు లేఁ డనియు, నామె యతని కుత్తరమిచ్చి రాయ లయొద్దకుఁ బంపి నప్పు డతని బంధింప వచ్చు ననియు నూహించి యట్లుపదేశించె. అతఁడు తలంచినట్టుగానే జరి గినది. అతనిఁ బోనీయక కాపాడు చుండుము. అతనిని బం ధించితిరా!

మా:-లేదు బంధింపలేదు. పరపురుషుని నే నెట్లు ద్రాఁకుదును. మీా రాపని గావింపుఁడు.

రామరా జామాటలు విని దృఢతరపాశంబులు గొని పోయి శంకరరెడ్డిని దోఁడుగాఁ జేసికొని యతని బంధించి యచ్చోటు గదలి పోయెను. అనంగసేన యాదురాత్ముం డు పట్టువడినందులకు మిక్కిలి యానందించెను.

---

## ముప్పదినాల్గవ ప్రకరణము

### రా మ య మ ం త్రి

తోఫల్‌ఖానునకుఁ బకీరువచనములం 'దెక్కుడువిశ్వాస ముదయించెను. రామయామాత్యుండు నిశ్చయముగాఁ దమ రాజ్యంబును ధ్వంసంబు గావించుటకే తమచెంతఁ జేరె నని తలంచెను. తానసంగసేనకుబలాత్కారమున నవమానము గల్గింతు నేమోయని యెంచి రామయామాత్యుండే యామెను దప్పించుకొ నిపోయెనని నిశ్చయించెను. 'గోముఖవ్యాఘ్రంబువలెఁ గాన

వచ్చుచు నా బ్రాహ్మణుఁడు మృదుమధురవచనంబులు పలికి నా కభీష్టయగు కాంతను దెచ్చి నమ్మించి సంతసింపఁ జేసి తుద శాశాభంగంబు గల్గించెను. ఆ తుచ్ఛున కెట్టిదండనము చేసినను జాలదు.' అని నిశ్చయించి విశ్వాస పాత్రుడయిన యొకసేవకు నిఁ బిలిచి రహస్యముగా నిట్లు చెప్పెను.

'ఓయీ! వీరాగ్రేసరా! నీవు నాకు విశ్వసనీయుండవు. ఈదినంబున నీకొక యుపకారము చేయవలసి యున్నది. ముందు సంగ్రామమహోత్సవ మొకటి కానున్నది. అందు నీకు జయంబు గల్గించుటకుగా నీ కరవాలంబున నొక బ్రాహ్మణాపసదుని బలి యీవలసి యున్నది. రణరంగంబున శత్రువీరుల శరీరరక్తధారలు కడువడిఁ గోల నీతరవారి కిప్పటినుండియు నభ్యాసంబు గల్గింపు ము.' అని ఖాను చెప్పెను.

ఆ మహమ్మదీయుఁడు కఠోరహృదయుఁడు. యుద్ధమున వెనుదీయని వాఁడు. పెఱవారి గ్రీవానాళంబుల భేదింప నెంతయో కుతూహలత్వము గలవాఁడు. వాఁ డా మాటలు విని నిర్భరానందభరితుండై, 'ఓ మహాప్రభూ! నాఖడ్గంబు మిక్కిలి దప్పి గొని యున్నది. వధ్యుండగు వానిఁ జెప్పితి రేని వాని వెంటనే ఖండించి తద్రక్తధారలచే నాకత్తి కుత్తుకను దడిపెదను. విలంబము చేయక చయ్యన విన్న వింపుఁడు.' అని వాఁడ త్యాదరంబునఁ బలికెను.

'ఓయీ! నీవచనంబులు నాకు సంతసము గొల్పినవి. కాని యుకార్యము మిక్కిలి రహస్యముగా జరుగవలెను. మన

దుర్గంబున నున్న రామయమంత్రిని జంపవలెను. వాఁడు బహుక్రూరుఁడు. మనకు హితునివలెఁ గన్పట్టుచున్నను మన రాజ్యంబును ధ్వంసము గావింప వచ్చిన శత్రువు. వాని మనము జంపినట్టు లెవ్వరికిం దెలియరాదు. దుర్గాధ్యక్షులరైన మీ రేల భయపడవలె నని యడుగవచ్చు. ఆ రామయమంత్రి తన నీతి విశారదత్వము చేతను, బుద్ధి విశేషముచేతను, దుర్గప్రజల యనురాగంబును సంపాదించియున్నాఁడు. అతఁడు రహస్యముగాఁ జేయు క్రూరకృత్యంబుల నెవ్వరు నెఱుఁగరు. అతనిచావు ప్రజలు విని లోలోపలనన్ను నిందించి రాజభక్తి విముఖు లయ్యెదరు. కావున వాని నామందిరంబునకుఁ బిలిపించి ప్రసంగించు చుండెదను. నీ వా సమీపమునందే దాగియుండి నేను 'అల్లా మహామ్మద్' అను నప్పుడు వాని శిరంబు ఖండింపుము. తరువాత నాశవము ను రహస్యముగాఁ బూడ్చవచ్చును. ఇదియె యుత్తమ మార్గము. ఇప్పని యీ రాత్రియే జరుగవలెను. సాయంసమయంబున కాయుధపాణివై వచ్చి వేచియుండు' మని పంపెను. తో ఫల్ఖాను రాత్రి తటిగిన తోడనే రామయమంత్రికి సందేశమం పెను. ఆ రామయమంత్రి యనంగసేన తప్పించుకొని పోయిన పిమ్మట ఖానును జూచియుండలేదు. ఖాను పకీరువచనంబుల వలనఁ దనపైఁ గోపము పూనియున్నాఁ డని యతఁ డెఱుంగఁడు. కావున నొకమారు ఖాను సందర్శనంబుచేసి యుక్తవచనజలంబున ననంగసేనావియోగాగ్నిసంతప్తుండగు నతని కూరట గల్గింప నిశ్చయించిపోయెను. రామయామాత్యుని హితులు కొందఱు

నీ విప్పుడు ఖాను సందర్శనంబునకుఁ బోవలదు. అతఁడు నీయెడ మిక్కిలికోపము వహించియున్నాఁడు. నీ వట కేగుదువేని నీ ప్రాణంబులు దక్కవని ' యుపదేశించిరి. కాని యతఁడు వారిమాటలు సరకుగొనక ' లోషల్ ఖాను నాకాప్త మిత్రుఁడు. నా మిత్రుని దర్శనంబునకుఁ బోయినఁ బ్రాణము లేలపోవును ? నా కతఁ డపకారంబు చేయఁ డని త్రికరణశుద్ధిగాఁ జెప్పఁగల ' నని పల్కి పోయెను. వారందఱును రామయమంత్రి చచ్చుట సిద్ధంబని భావించిరి. రామయమంత్రి యట్లు చని నిర్భయంబుగా ఖానుమందిరంబు ప్రవేశించెను. ఖానతనికిఁ దొంటి విధంబున మర్యాద లొనరించి యుచితాసనా సీనుం జేసెను. రామయమంత్రి యది చూచి తన హితు లసత్యము పలికిరని భావింపఁ జొచ్చెను. ఖా నొకయున్నతాసనంబునఁ గూర్చుండెను. రామయమంత్రి ఖానున కభిముఖముగా గూర్చుండెను. ఆమహామ్మదీయుఁడు భీకర ఖడ్గంబును దాల్చి రామయామాత్యునకు వెనుకభాగంబున నిల్చియుండెను. వాఁడు ఖానునకు మాత్రమే గానవచ్చుచుండెను. వారిరువురునుఁ బ్రసంగింప నారంభించిరి. ఆ భటుఁడు సంసిద్ధుఁడై యుండి యాసంకేతవచనము తన ప్రభువు వదనమునుండి యెప్పుడు వచ్చునో యని ప్రతీక్షించి యుండెను. ఖానతని వీక్షించి "ఓ రామయామాత్యా! నీ ప్రయత్న మెట్లున్నది? ఇప్పటి కొక్కటియును ఫలింపలేదు. నీ విపరీతప్రవర్తనంబువలన నే కంబరసేన మలమలఖానులు ప్రయుక్తులయి సాయముచేయ నొల్లక తమతమ దేశంబుల కరిగిరి. నా

నిమిత్తము ననంగసేనను గొనివచ్చితి నని చెప్పి నమ్మించి యెచ్చటి కోపంపి నా కాశాభంగము గలిగించితివి. నీకాశ్రయ మిచ్చుట వలన విజాపురరాజు పెక్కులాపదలపాలు గావలసివచ్చెను. మహామ్మదీయ రాజ్యంబులు తోడ్పడునని యెంచి మారాజు విజయ నగర సార్వభౌమునితో నున్న స్నేహము వదలుకొని పోరాటంబునకుఁ దొడంగె. రాయలవలన విజాపుర రాజు పెద్దపరాభవంబును జెందెను. అంతతో సరిపడునని తలంచను. నేఁడో రేపో వచ్చి యీదుర్గంబును బాడ ముట్టడింతురు. ఈ ముప్పు తప్పించుకొనుట దుర్లభంబని తోఁచెడి. ఇట్టి మహాపదలు సంభవించినందులకు ముఖ్య కారణమవు నీవే! ఇందుల కేమిప్రత్యుత్తర మిత్తువు ! అని ఖాను ప్రశ్నచేసెను.

రామయమంత్రి యతనివాక్యములు విన్నప్పుడు మీఁది ప్రాణంబులు మీఁది కెగిరిపోయెను. మనంబు సంచలించె. కొంత వఱకు నేమియుఁ జెప్పలేకపోయెను. బుద్ధిమంతుఁడు కాన తుదకు ధైర్యం బవలంబించి "ఓ తురుష్కాగ్రణీ! నేఁడు మీనోటినుండి విపరీతవచనంబులు వినుట కచ్చెరు వందుచున్నాను. మీరు శత్రువుల కాశ్రయ మిచ్చి వారివచనంబులు నమ్మి నామంత్రంబు నెడ ననాదరణంబు చేయుటచే నింత వచ్చె. పలుశ్రమలు పడి నీ నిమిత్త మనంగసేనను దెచ్చి మీ కప్పగింపఁగా నీ విట్టు పలుకుటకు డెందంబు గుందెడిని. నాప్రయత్నంబు లేమి ఫలింపలేదు? నాశక్తియంతయు ధారవోసి మహామ్మదీయరాజ్యంబుల కైకీభావ మలవఱచితినిగదా? అది యానాఁటి సభలో మీ మ్రోలనే

కదా! నిర్ణీత మైనది. మీ కోరిన యంగనామణిని దెచ్చి యిచ్చి తిని గదా. పాకంబు చెడకుండఁ బచనంబు గావించి పదార్థంబుల సిద్ధంబు చేసి మ్రోల నుంచితిని. ఆ పదార్థంబు లనుభవించునం తటిశక్తి మీకుఁ జాలనప్పుడు నేనేమి చేయుదును? తాను దిన లేక వంటవానిఁ గోపగించుట యుచితమా! ఇప్పుడైన నామం త్రంబును మన్నించి వర్తింతురేని కార్యంబు లన్నియును జక్కఁ బడును. నాచెప్పినట్లు మీరు నడచిన పిమ్మట నాకార్యంబులు ఫలింపనిచోఁ దగిన శిక్ష విధింపవచ్చును.' అని ధైర్యంబున పలి కెను.

రామయమంత్రి వచనంబు లన్నియును సత్యములేయై నను, బకీరువచనంబులు విన్నవాఁడగుటచే ఖానునకు విరుద్ధంబు లుగాఁ దోఁచెను. న్యాయోపేతంబులగు మంత్రివచనంబు లత నికిఁ బైత్యరోగికిఁ బంచదార చందమాయె. కోప మనివా ర్యంబై పొడసూపె. అయిన దాని నడంచుకొని 'ఓయీ! ఇఁక నీ కపటవాక్యములకుఁ జిక్కువారము కాము. నీవు తిమ్మరు సుతో స్నేహం బవలంబించి పైకి విరోధించుచున్నట్లు నటించి మమ్ముఁ జేరి మాయావాగురం జిక్కించికొని పగతుర కప్పగింప వలెనని చూచుచున్నావు. కాని మాయదృష్టంబువలన నీచరి త్రంబును దెలిపెడి యుత్తరంబు మాకు లభించినది. అక్కటా! కపటమైన నీయాలోచనము వినుటవలన విజాపురరాజ్యం బంత యును గృష్ణరాయుని ప్రతాపాగ్నికిఁ బూర్ణాహుతిగాఁ దగి యుండె. నీ విట్టి దుష్టుండవని యెఱుంగక చేరఁదీసితిమి. నీవు

తిమ్మరుసునకు మిత్రుండ వగుదువా? కావా? సత్యము వచింపుము. లేనిచో నీప్రాణంబులు నీకుఁ దక్కవు.' అని ఖానుగ్రుండై పలికెను.

"మహమ్మదీయ వతంసా! మీ మానసంబున కిట్టి వృత్తి కలుగుటచేతనే యింతవఱకు వచ్చినది. నాయందు మీకేల యిట్టిసందియంబు కలుగుచున్నదో తెలియకున్నది. తిమ్మరుసుతో ననివార్య వైరం బూని తన్నామరూపంబులు లేకుండఁజేయ సమకట్టుచున్ననే నతని కెట్లు మిత్రుండ నగుదునో, శత్రువ నగుదునో, మీరే యూహింపుఁడు. మీరు శత్రువుల కాశ్రయ మిచ్చి వారి మాటలు వీనులవిందుగా వినుచుండుట నిశ్చయము. మీరిప్పుడైన నాయందు దయయుంచి యట్టి దుష్టులను దుర్గంబునుండి వెడలఁబుచ్చుట యుచితంబు. మీ రట్లు చేయుఁడు. అప్పుడు నే నన్నంత కార్యంబును జేయుదునో లేదో మీకే తెలియును." అని నిర్భయంబుగాఁ బలికెను.

క్రమక్రమంబుగా నభివృద్ధి చెందుచున్న ఖానుకోపంబున కీవచనంబులు మరిగిన తైలంబునకు నీటి బిందువులవంటివయ్యె. ఆ ఖా నుద్భూతం బగుచున్న కోపంబును నివారించుకొనలేక పోయెను. ఖండితమైన వాని శిరంబు కన్నులారఁ గాంచినఁ గాని తనకోపంబు నివారింపఁబడదని నిశ్చయించె. ఒకమారు మహమ్మదీయ భటునివంకఁ జూడ వాఁడును దనపని యొనర్ప సిద్ధంబుగా నుండె. ఆ సమయంబున నొకసేవకుండు ప్రవేశించి యుత్తర మొకటి యీయఁగా, దీపముచెంత మెల్లఁగా జదువ కొనెను.

తోడనే ఖాను భావంబులు మాఱిపోయెను. కోపము తఱిగి చని యె. అతని కేమాత్ర ముపకారం బొనరించినను దమప్రభువునకు గోపంబు వచ్చు నని నిశ్చయించి " రామయామాత్యా! పోని మ్ము. గతించిన దానికి వగవఁ బనిలేదు. ప్రస్తుత మేమి చేయ వలయునో యోజింపుము. అసంగసేన యెట్లు తప్పించుకొని పో యెనో యెచ్చటి కేగెనో, తెలియునా? ఆమె నెటులయిన గొని వత్తు వేని నీకు మాయందు భక్తియున్న దని [illegible] డను." అని ఖాను పలికెను.

"దుర్గాధీశ్వరా! మీరసంగసేనను బ్రతి దినంబును జూచు చున్నారనియు, నామెయు మీయం దనురాగంబు పూనుచున్న దనియు విని మిక్కిలి సంతసించితిని. మీకార్యంబు సఫలమైన దనియే భావించుచుంటిని. అట్లుండనిట్టి విపరీతకృత్యము సంభవిం చెనని విని నేనును మిగుల విచారించుచున్నాను. ఆమెను మన శత్రువులు గొనిపోయి యుందురు. ఆమె యెచ్చట నున్నదో తెలిసికొని యెట్లయిన సాధించి తెచ్చి నీ కిచ్చి సంతసంబు గల్గిం చెదను." అని యతఁడు చెప్పుచుండఁగా నచ్చటికిఁ బకీ రేతెం చెను. అంత ఖానతని కుచిత మర్యాదలు గావించి యాసనోప విష్టుం జేసె. పకీరతనింగాంచి "ఓదుర్గాధీశ్వరా! ఇకరాయలీదుర్గం బును ముట్టడింప నున్నాఁడు. ఈసమయంబున నీవు మహాధైర్యం బవలంబించి జయంబును గాంతు వేని నీ కీర్తి లోకంబున నజరా మరంబై యుండును. నీ విప్పట్టున మహోత్సాహ పూరితుండవై యుండియు నితరులకుఁ బ్రోత్సాహంబు గల్గించుచుండవలెను.

ఇట్లుండ విషణ్ణవదనుండవై యుండుటకుఁ గత మేమి?" అని ప్రశ్న చేసెను.

"ఓ మహానీయా! నా డెందంబును హరించిన సుందరి రక్షక భటులను వంచించి మెచ్చటికో పోయెను. ఆమె పోవున ప్పుడు నామానసంబును గొనిపోయె. నామానసంబు నాచెంత నుండమి ని ట్లుంటిని. ఆమె మగుడ నా పురంబునకు వచ్చినచో నామానసంబు న్నుఁ జేరును" అని యతండు విచారముతోఁ బలికెను.

"తురుష్కాగ్రణీ! ఇందులకై విచారింపకుము. నే నీదుర్గంబునకు వచ్చుచుండ నిచ్చటికి సమీపంబున నున్న యొక పల్లెయం దామెను జూచి యున్నాను. కాని నీవు వారిని విడిచితి వేమో యని తలంచి యూరకుంటిని. నీ కామెను జేకొనవలెనన్న తలం పున్నచో నిప్పుడే మన మరిగి యత్తన్విని గొనివచ్చుట యుత్తమము. రాయల సైన్యంబులు రేపు వచ్చి మన దుర్గంబును ముట్టడించును. కానఁ బిమ్మట మన మీకార్యముచేయుట యసంభవమని పలికెను.

ఖా నా వచనంబుల కానందముచెంది. "ఓ మహాత్మా! మీరు నిశ్చయంబుగా ననంగసేనను జూచితిరా? ఆమె యిచ్చటి కై నఁబోయి యుండదుకదా? మన మిప్పుడు పోయినఁ బట్టికొని తీసికొని రాఁగలమా?" అనిపలికి యా మంత్రింజూచి "మంత్రి పుంగవా? నీ వతిచతురుండవు. ఎట్లయిన నికార్యము సాధింపఁ గలవా?" అని పలికెను.

"ఓ తురుష్కాగ్రణీ! అట్లయిన మీరిఁక విచారంబు విడువుఁడు. నా బుద్ధిచాతుర్యంబున నామెను మోసపుచ్చి తెచ్చి మీకర్పించెదను. నా మహిమంబు మీరు చూతురుగాక" అని రామయామాత్యుండు పలికెను.

"ఓ యమాత్యపుంగవా! నీవెంతకైన సమర్థుండవే? నీవు త్వరగాఁబోయి యిక్కార్యంబు నెఱవేర్చుకొని రమ్ము. ఈ పకీరు నీతో వచ్చి సాయపడును. ప్రయాణసన్నద్ధుండవై రమ్ము" అని పల్కియతనిఁ బంపెను. అంతఁ బకీరు ఖానుంజూచి 'అయ్యా! ఈ బ్రాహ్మణునితో నేనొక్కండను బోయిన లాభము లేదు. వీఁడు మహామాయావి. వాని మాయోపాయంబులు నాకుఁ దెలియవు. వీఁ డీసమయంబున దుర్గంబు దాఁటగనే నన్ను వంచించి పాఱిపోక మానఁడు. అప్పుడు నీవు విచారింపవలసివచ్చును. ఒకవేళ మే మనంగసేనను వంచించి గొనివచ్చుచున్నప్పుడు శత్రువు లడ్డగించిన మాప్రాణములు వదలుకొనవలసినదే! నీవును ఖడ్గపాణివై మాతో వత్తువేని తెల్లవాఱకమునుపే కార్యంబు నెఱవేర్చుకొని రాఁగలము.' అని పకీరు పల్కెను.

ఖానున కావాక్యంబులు హితకరంబు లయ్యెను. పకీరన్నట్లు శత్రుహస్తగతమైన యనంగసేన లభింపకపోవుటయే కాక మాయోపాయ విశారదుండయిన నీరామయమంత్రియుఁ దప్పించుకొని పోవునేమో? అని తలంచి తానును బ్రయాణాభిముఖుండై యుండెను.

రామయామాత్యుం డరిగి యట్టి సాహసకృత్యములం

డుఁ దన కుపాయము చూపుచున్న రుద్రదేవుండు లేకపోవు టకు మిగుల విచారించి ప్రహరేశ్వరునిఁ దోడుగాఁ గైకొని పోయెను. రామయమంత్రి యట కేగి తాను గూడ వచ్చుచు న్నట్లు విని సంతసించి వారితోఁ బ్రయాణము చేయుచు ' ఓ దుర్గాధీశా! మున్ను నేను విజయనగరంబున నాచేసిన చర్యలు మీకుఁ బరోక్షంబున వర్తిల్లుటచే నానందము గొలుపకపోవ చ్చును. కాని నేఁడు మీ కన్నులయెదుట నొనర్చెడి నాచర్య లు మీకు మహానందంబు గొలుపకపోవు. ' అని యతం డేమే మియో చెప్పుచుండఁగా విని వారందఱును సంతసించుచుండిరి. వీ రట్లు కొంతదూరము చని యా పల్లెం జూచిరి. అంతట రామయామాత్యుండు వైదికబ్రాహ్మణవేషధారియై వారలకు సేవకవేషంబులు వేయించి వారితో నాపల్లె చేరి యనంగసేన మందిరము ప్రవేశించెను. అప్పుడు మాలతి లోపలినుండి పైకి వచ్చుచు వారింగాంచి నిలువఁబడి ' అయ్యా! మీ రెవ్వరు? ఎవ్వరినిమిత్త మిచ్చటికి వచ్చుచున్నారు. ' అని యడిగెను.

'యువతీ! నేనొక బ్రాహ్మణుండను. కొండపల్లినివాసిని మాన్నేహితుని కుమారిక యనంగసేనను దుష్టుఁడైన కృష్ణరా యుండు వెడలఁగొట్టెననియు, నామె పుట్టింటికి వచ్చుచుండఁ గా రామయమంత్రి యనెడి యొక టక్కరికాఁడు మోసపుచ్చి రాయచూరుదుర్గాధీశ్వరున కొప్పగించినట్టును, తన స్నేహితు రాలైన మాలతి చాతుర్యంబుచే నానిర్బంధంబును దప్పించి కొనివచ్చి యిచ్చట నున్నట్టును విని యామె జనకుం డామెను

గొనిరావలయునని ప్రార్థించుచు నీ సేవకులను సాయ మిచ్చి పంపఁగా వెదకుకొనుచు నిచ్చటికి వచ్చితిమి. నీవు మాలతివా?' అని యడిగెను.

'అవును. నేను మాలతినే. మాయనంగసేన లోపల నున్నది. రండు.' అని చెప్పి యూతనిఁ గొనిపోయి యనంగసేన యెదుటఁ బెట్టి తద్వృత్తాంతంబును సాంతముగాఁ జెప్పెను.

అనంగసేన యది విని యావిప్రుం జూచి "ఓ విప్రోత్తమా! మా జనకుండు పంపిన నిన్నుఁజూచుటవలన మిక్కిలి సంతసము గలుగుచున్నది.' ఈ సమయంబున మనము బయలు వెడలిన మాయావిప్రుఁడైన రామయమంత్రి యెల్లయినను నన్నుఁ గొనిపోకమానఁడు. అంతవఱకును మీ రిచ్చట శయనింపుఁడు" అని యాదరముతోఁ బలికెను.

అది విని రామయమంత్రి నిర్భరానందభరితుండై యిఁక దనకార్యంబు ఫల మగుట నిక్కం బని యెంచి పైకివచ్చి దుర్గాధిపతికిఁ జెప్పి సంతసింపఁజేసి వేశ్వేరుశయ్యాలం గల్పించుకొని కొంత సేపేదియో ప్రసంగించుకొని నిద్రించిరి. రామయమంత్రి యనంగసేనామాలతులు మాత్రమే యచ్చటనున్నారనియుఁ దనవచనంబులు వారు పూర్తిగానమ్మిరనియు, నిశ్చయించినిస్సంశయంబుగా నచ్చటశయనించెను. అంతటఁ బకీరు మెల్లగాలేచి లోపలికరుగగా శంకరరెడ్డితిరుమలరాయ లెదురుగా వచ్చిరి. వా రేమియో సంభాషించుకొని ప్రత్యేకముగా నొకస్థలంబున శయనించి యున్న రామయమంత్రినిఁ బ్రహరేశ్వరుని బంధించికొనిపోయి యొకచోం

దిరంబుననుంచి కవాటము బంధించిరి. ఆచర్య చూచి రామయ మంత్రి వెలవెలపోయెను. ఏమియుఁ జేయఁజాలక యాశ్చర్యంబున నిర్నిమేషలోచనుండై యుండెను. రామయమంత్రి యామందిర ము ప్రవేశించునప్పటికి దృఢశరపాశబద్ధుండై దుఃఖాతిశయం బున ముఖకాంతి తొలంగిన జీవచ్ఛవంబువలె నున్న రుద్రదేవుం డం దుండెను. మంత్రి యతనిఁజూచి యచ్చెరు వొంది "రుద్ర దేవా! నీవు వీరి కెట్లు చిక్కియున్నావు? ని న్నేరీతిగా గొనివచ్చి బంధించిరి? ఇట్లు చేసినవా రెవ్వరో నీకుఁ దెలియునా?" అని యడిగెను.

"మంత్రివర్యా! నిన్న నేనొక కార్యార్థం బరుగుచుం డఁగా మాయోపాయంబునఁ గొనివచ్చి యిచ్చట బంధించిరి. ఇప్పని రామరాజాదులు చేసినట్లు తోఁచుచున్నది. నీవు పై నుం డుటచే నిదివఱకును నీవలన నెప్పటికైన బంధవిముక్తుండ నగుదు నని తలంచుచుంటిని. కాని యిప్పు డాశ తొలంగినది. నీవంటి మహాబుద్ధిమంతుండుకూడ నీమాయవాగురం జిక్కుట యత్యా శ్చర్యకరంబుగా నున్నది. అక్కటా! ఇఁక మనకు మరణంబు తప్పదు. ఎంతకష్టము! ఎంతకష్టము. పాపము ముక్తాంబగతి యే మగునో!"యని విచారించుచుండెను. రామయామాత్యాదులును నేమియుఁబల్కలేక విచారపరీతహృదయులై యుండిరి. అనంత రము పకీరు వేషముతో నున్న రామరాజు తక్కిన వారితోఁ బోయి ఆ దుర్గాధీశ్వరునకు శరీరమున రక్తము చిమ్మునట్లు ప్రహా రము లర్పించి పాఱఁదోలి వచ్చి రామయమంత్రి ప్రభృతు లున్న

మందిరంబు సొచ్చి "ఓ రామయమంత్రీ! మీదుర్గాధీశునిఁ బ్రాణావశేషునిఁగా జేసిదయఁ దలఁచి విడిచి పుచ్చితిమి. ఇక వాఁడు బుద్ధితెచ్చుకొని యనంగసేన యందలి మనంబును లాగికొని దుర్గంబునకుఁ బాఱి పోయెను. నేను రామరాజను. నేనునునామిత్రులునుదిమ్మరుసునానతితలదాల్చివచ్చి మిమ్మందఱ నిటి బంధించితిమి. మహామంత్రియగు తిమ్మరుసును జంప నెంచి మహాపరాక్రమశాలియైన విజయసింహుని సంహారింప సమకట్టి, పతివ్రతయగు ననంగసేనకు దుస్సహదుఃఖంబులు బరాభవంబును గల్గించియున్న పాపాత్ములరగు మిమ్ముల నేమిచేసినను దోషముండ దని పల్కి- కవాటము బంధించి వెడలిపోయెను. రామయామాత్యాదు లతనివచనంబులకు మఱింత విచారంబు చెందఁ జొచ్చిరి.

---

## ముప్పదియయిదవ ప్రకరణము

### దుర్గప్రవేశము

తోషల్‌ఖాను పకీరు చేసిన యుపదేశంబు విని సమీపస్థ గ్రామంబున కరిగి రామరాజాదులచే మర్దింపఁబడి శల్యావశేషుఁడై యతికష్టంబునఁ బురంబునుజేరెను. తత్పరాభవాగ్నిహోత్రంబువలనఁ గలుగు సంతాపమును సహింపలేక కాలుకాలినపిల్లివలె నల్గడలఁ జరింప నారంభించెను. తా విశ్వసించిన పకీరు తమ్ము మోసపుచ్చుటకై వచ్చిన వైరివీరుండని యప్పు

దుగ్రహించె. తన ప్రభువు చెప్పినట్లు రామయామాత్యుం డెంత కైనను సమర్థుండనియు, రాజనీతివిశారదుం డనియు, దలపోయ నారంభించె. మహామతిమంతుఁడగు నమ్మంత్రి కట్టియపాయము సంభవించుటకుఁ దానే కారణమని మిక్కిలి వగచి వారి నెట్ల యిన విడిపించి శత్రువులమద మడంచుట యుచితంబనిభావించి యొక మహమ్మదీయవీరునిఁ బిలిచి ' ఓయీ! నీవేఁబది రౌతు లతో వెంటనే యిచ్చటికి సమీపంబున నున్న పల్లెనుఁ బోయి యచ్చట నున్న శత్రువులను జంపి వారి శిరంబులఁ గొనిరండు. బద్ధులై యున్న రామయామాత్యాదుల విముక్తులం గావించి తీసి కొనిరండు. అనంగసేనను దాని చెలిని బంధించికొనిరండు. తెల్ల వారిన కార్యంబు చెడును. సోమేశ్వరపాత్రునికి యుదంతము చెప్పి యతనింగూడఁ గొనిపొండు." అని యాజ్ఞాపించెను.

అంత నాభటులును రణోపకరణంబుల ధరించి యున్న తాశ్వంబుల నధిష్ఠించి, తమ ప్రభువునొద్దకు వచ్చి "ఓ మహా ప్రభూ! సోమేశ్వరపాత్రుండింట లేఁడు. సాయంసమయంబుననే యెచ్చటికో పోయె నఁట! శత్రువులగీ టడంప మేము చాలమా? సోమేశ్వరపాత్రుండు రాకపోయిన నష్ట మేమి?" అని వారు విన్న వించు కొనిరి.

' చాలుదు. ఎట్లయిన నవ్వీరులు జంపి రావలయు. తక్కిన మనకార్యంబులు నెఱవేర్చిరావలెను. అచ్చటనున్నవారు నల్గురైదుగురుకంటె నెక్కువమందిలేరు. అయిన వారు మహా వీరులవలెఁ గన్పట్టుచున్నారు. వారు కొలఁదిమంది యని యు

శ్రద్ధతో నుండరాదు. చిన్న పామునైనను బెద్దకఱ్ఱతోనే కొట్ట వలయు నను సంశయము తలంచుకొని పోరాడ వలయును. ’ అని వారిని బంపెను. అంత నాభటు లతని వీడ్కొని యాపల్లె కభి ముఖులై పోవుచుండిరి.

ఆ పల్లెయందున్న రామరాజును శంకరరెడ్డియును, దిరుమలరాయుఁడును నిట్లు సంభాషించుచుండిరి.

‘ సోదరా! తిరుమలరాయా! మన మంత్రివర్యుండు చెప్పిన పనులన్నియును నెరవేర్చితిమి. తోషల్ ఖానునకు దగిన ప్రాయశ్చిత్తమైనది. రామయామాత్యాదులను బంధించితిమి. అనంగసేనను నిరపాయముగాఁ దప్పించుకొని వచ్చితిమి. మహమ్మదీయులకు భేదము కల్గించితిమి. ఇప్పుడు మన మేమిచేయుదము? వీరలనుదీసికొని సార్వభౌమునిఁ జేరఁ బోవుదమా ? ’ అని రామరాజడిగెను.

“సోదరా! తెల్లవాఱు నప్పటికి మనసార్వభౌముఁడు సైన్యములతో రాయచూరును ముట్టడింప వచ్చుచున్నాఁడు గదా!. కావున మన మిచ్చటినుండి కదలవలసిన యవసరము లేదు తెల్లవాఱు నంతవఱకును మనము జాగరూకులమై రక్షించుచుండినం జాలును. ఉన్నవారము ముగ్గురము. బద్ధులైన రామయామాత్యాదుల నెట్లు గొనిపోఁగలము? అబల లగు ననంగసేనాదుల నేరీతిని గొనిపోఁగలుగుదుము? వీరలతో మనము నిరపాయంబుగాఁ బోఁజాలము. కావున వీరల నీమందిరంబున నుంచి ద్వారమునుగాపాడుచుందుము.”అనితిరుమలరాయుఁడుపలికెను.

"తమ్ముడా! నీవన్నదిసత్యమే. కాని యీ స్థలంబున నుండినను మనము నిరపాయంబుగా నుందుమని తోఁచదు. ఆతోఁ ఫల్ ఖానునకు మఱువరాని పరాభవంబును జేసి పంపితిమి. వాఁడందుల కోర్వఁజాలక మనలఁ బట్టుకొనుటకై కొంతసైన్యంబును బంపక మానఁడు ఆసైన్యంబు వచ్చినచో మన మెంత బలవంతుల మయినను వారితోఁ బోరాడి గెల్చు టకష్టము సంశయాస్పదమగు జయము నపేక్షించుటకంటె నీస్థ లంబు విడిచిపెట్టి నిరపాయంబుగా నుండుట యుక్తకార్యము." అని రామరాజు పలికెను.

"సోదరా! మన మీవిషయమై సూక్ష్మబుద్ధితో నాలో చింప వలసి యున్నది. ఇచ్చట నున్న నొక లాభమున్నది. స్థలాం తరము కరిగిన వేఱొక లాభ మున్నది. మన మిచ్చట నున్నప్పుడు శత్రువులు చుట్టుముట్టినచో వారితోఁ బోరాడుట తప్పఁ జేతఁ జిక్కిన శత్రువులను, ననంగసేనను, రక్షింపఁ బాటుపడ నవసరంబు లేదు. మనము స్థలాంతరంబున కరుగ సమకట్టినచో శత్రువు లతోఁ బోరాడుటయే కాక రామయామలను శత్రువులకుఁ జిక్క కుండ నుండునట్లు చేయుటకుఁగూడఁ బాటుపడవలసి యున్నది. మనము వీరితో బయలుదేరి యెంతోదూర మరుగలేము. కా వున శత్రువులకుఁ గనఁబడకుండఁ బోఁ గలుగుదు మని నిశ్చయ ముగాఁ జెప్పఁ జాలము. అందుచే నీ రెండింటిలో నేది యుక్త మన్నో యాలోచింప వలసి యున్నది" అని తిరుమలరాయుండు పలికెను.

'సోదరా! నీవు చెప్పినది మిక్కిలి బాగుగా నున్నది. మన మెంత శ్రమపడియైనను రామయామలను బరులకుఁ జిక్కకుండఁ గాపాడవలెను. మన మొకతప్పిదము కావించితిమి. తోఫల్ ఖానుని విడిచి పెట్టకుండ నుండిన మనకెట్టి శ్రమయుం గలుగక పోవును? వెనుక ముందు లాలోచింపకుండ వాని వదలి ముప్పు తెచ్చి పెట్టుకొంటిమి. గతించిన దానికై వగవనేల? మన మిచ్చటనే జాగరూకులమయి యుందము.'

అంతట 'టకటక' అను నినాదంబులు వినవచ్చెను. వారది విన్నతోడనే శత్రువుల గుఱ్ఱపుడెక్కల నినాదంబు లని పోల్చికొని జాగరూకులై యుండిరి. నాఁడు పరిపూర్ణప్రతాపంబు చూపనిచోఁ జిరకాలమునుండి పడుచున్న ప్రయాస మంతయును విఫల మగు నని నిశ్చయించుకొనిరి. వా రట్లాలోచించుచున్న సమయంబునఁబదుగురాశ్వికులాద్వారంబుచెంతకు వచ్చిరి. అక్కడ పదుగురకంటె నెక్కువమంది యచ్చటికిఁ బోవ నవకాశము లేదు. అందుచే నచ్చటికి వచ్చినవా రేఁబండ్రయినను ధారొక్కని యుద్ధంబు చేయువారుఁ బదుగు రేయగుచుండిరి. వీరాగ్రేసరులయిన రామరాజాదులు తమ యవక్రవిక్రమంబును జూపి వారిని వెనకకు దఱుముచుండిరి. ఉభయపక్షంబులవారికిని ఖడ్గఘాతంబులు మెండుగాఁ దగులుచుండెను. ఇట్లిరు వాగుల వారును ఘోరంబుగాఁ బోరుచుండుటచే నెవ్వరికిని జయంబు గలుగలేదు. అంత వారు వెనుకకుఁ బోయి తమ యశ్వంబుల నట వదలి యాయేఁబండ్రు నొక్కుమ్మడి వచ్చి యాయోధ

త్రయంబునుదాఁకిరి. రామరాజాదులు ధైర్యంబున దీసిపోక వైరివీరు
లతోఁ బోరుచుండిరి. అట్లు కొంతవడి యుద్ధంబుచేయఁగాఁ గ్రమ
క్రమంబుగా రిపువీరుల బలంబు హెచ్చుచుండెను. ఇఁకఁ దమవీ
ర్యంబు శత్రువులయొద్దఁ బనికిరా దని గ్రహించిరి. ఇఁక వారికి,
రామయాదులను శత్రువులకుఁ జిక్కకుండఁ జేయఁగల యున్న ధైర్య
ము నశించినది. తమ కష్టంబంతయును వ్యర్థం బయ్యెనని వగవ
సాగిరి. అయినఁ దమ ప్రాణము లున్నంత కాలంబును శత్రువుల
లోనికిఁ బోనీ రాదని నిశ్చయము చేసికొని స్థలమును విడు
వక మఱింత ధైర్య మవలంబించి కొంతసేపు యుద్ధంబు చేయు
నప్పటికి శత్రువులలోఁ గొందఱు కూలిరి. అయినను దక్కిన
వారూరకుండక ఘోరంబుగాఁ బోరక పోలేదు. అంత నాశత్రు
వీరుల వెనుకప్రక్కనుండి హేషాధ్వనులు వినవచ్చె. వా రదివిని
తమహయంబుల ధ్వనులనియనుకొనిరి. కాని యది నిశ్చయము
కాదు. ఒక మహావీరుండు హయారూఢుండై తమ దిక్కు
వచ్చుచున్నట్టు గన్పట్టెను. అది వెన్నెలరాత్రియైనను నామహ
మ్మదీయు లావీరునిఁ బోల్పలేకపోయిరి. కొందఱు వెనుకకు దిరిగి
యా వీరునిఁ జూచుచున్నను దక్కిన వా రాముష్కరులతోను బో
రాడుచునే యుండిరి. ఆమహావీరుండు తన హయంబు నామహ
మ్మదీయులపైకిఁ బఱపి యిర్వుర శిరంబులను ధరపై దొరలఁ
జేసెను. ఆ మహోపద్రవంబును జూచి యామహమ్మదీయ వీరు
లీతని డాసిపోరాడఁ జొచ్చిరి. స్వల్పకాలంబులోనే యావీరుల
శరీరంబులు రక్తసిక్తంబు లయ్యె. అంత నా మహమ్మదీయులు

రెట్టించినకట్టల్కతో నావీరుని సమీపించి యొక్క పెట్టునఁ దాఁకి యతనిహయంబును గూల్చి వైచిరి. అది చూచి యావీ రాగ్రేసరుండు మహాక్రోధంబు వహించి సింగపుఁగొదమభంగి వైరివారణంబులపై కుటికి పొలియించు చుండెను. ఆయోధ త్రయంబునకును మఱింత ధైర్యంబు గల్గ ఘోరముగా సమరము చేయుచుండెను. ఇట్లొక గడియకాలం బతిక్రమించు నప్పటికి వైరివీరులు పెక్కండ్రు హతు లైరి. తక్కినవారు వారి శౌర్యం బున కోర్వఁజాలక హతాశులై పాఱిపోయిరి. ఆ సమయంబున రామరాజా వీరుని సమీపించి "ఓ విజయసింహా! తగిన సమ యంబునకు వచ్చి సాయపడినందుల కమందానందంబు చెందు చున్నాము. నీవురానిచో మాకష్ట మంతయును వ్యర్థంబయి యుండును. ముక్తాంబ యెచ్చట?" అని యడిగెను.

"రామరాజా! నీవు చెప్పినట్లు నేఁటివఱకును వేచియుండి నేఁటి సాయంకాలంబుననే ముక్తాంబతో బయలువెడలి యెట్ట కేలకు దుర్గంబు దాఁటితిని. నే నీస్థలంబును దెలిసికోలేక పోవుట చేతను; ముక్తాంబ త్వరగా నడిచి రాలేక పోవుటచేత మెల్లమెల్ల గా నడుచుచు వచ్చుచుంటిమి. మొదట మేము మఱియొక పల్లె కుఁ బోయి యచ్చట లేనట్లు తెలిసికొని యిచ్చటికి వచ్చితిమి." అని చెప్పునంతలో నంతవఱకు నచ్చటనే యొక యింటిపంచ నొదిగి యుద్ధంబు చూచుచున్న ముక్తాంబ యచ్చటికి వచ్చెను. ఆమెను జూచి వారందఱును సంతసించి మగుడ శత్రువులు వత్తు రేమోయని కొంద ఱా ద్వారంబు నొద్ద నుండి తక్కినవారు లోపలకుఁ జనిరి.

హతశేషులైన మహమ్మదీయులు దుర్గంబు ప్రవేశించి ఖాను నకా యుదంతంబును చెప్పిరి. అది విని వాఁడు మండిపడి మరల మఱికొంత సైన్యంబును బంప నిశ్చయించుకొనెను. కాని శ్రవణకఠోర ధ్వనులు విన వచ్చె. అది ఖాను విని శత్రువుల దుర్గంబును ముట్టడింప వచ్చుచున్నారని తెలిసికొని, యట్టి సైన్యంబును రామయూపుల నిమిత్త మంపిన దుర్గంబును రక్షించుట కష్టంబని భావించి దుర్గద్వారంబును మూయించి తగిన వీరుల నచ్చటచ్చటగా పుంచి తా సర్వదా యప్రమత్తుఁడై కోట నలుప్రక్కలకుఁబోయి భటులను బ్రోత్సహించుచుండెను.

సూర్యుండు తూర్పుకొండదండ చూపట్టి జగంబును బ్రకాశింపఁ జేయ నారంభించె. అంత కృష్ణరాయుండును తన మహాసైన్యంబుతో వచ్చి రాయచూరు దుర్గంబుచెంత ప్రతాపంబును బ్రకాశింపఁజేయఁజొచ్చె. మిడతల దండువలె రాయల సైన్యంబును దుర్గంబును జుట్టుముట్టిరి. సైనికులు చుట్టును విడిసిరి. నూతన నిర్మితంబు లగు పటకుటీరంబులచే వెలయు నాసేనా నివేశ మొక పురంబువలెఁ జూపట్టసాగె. కొంతకాలము రాయలట్లువేచియుండి దుర్గంబును భేదింప సైన్యంబుల కానతిచ్చె. అంతరాయల సైనికులు లగల కెగఁబ్రాకుచుండిరి. కాని శత్రువులు పైనుండి పాషాణంబులను నిప్పుకలను బడవేయుచుండుటచేఁ దాళఁజాలక యా ప్రయత్నంబులనుండి మరలిరి. ఆ దుర్గప్రాకార మత్యున్నతమై బలిష్ఠమై యుండుటచే సామాన్యముగా భేదింప వలను పడకుండెను. అంత రాయల వీరులు కొందఱు

మహాగజంబులను దుర్గద్వారంబు చెంతకు దోలుకొనిపోయి కవాటంబుల భేదింపఁ బురికొల్ప సాగిరి. ఆయేనుంగులు పర్విడి వచ్చి గభేల్ గభేల్ మనెడి నినాదంబులు వెడలునట్లా యినుపతలుపులు బొడుచుచుండెను. కాని లాభంబులే దయ్యె. వానికిఁ బొడు గయిన యినుప చీలల బిగించి యుండుటచే దదగ్రంబులు మాతంగంబుల తలలకు గ్రుచ్చుకొనఁ జొచ్చెను. అందుచేనొక్క మారు పొడిచిన యేనుఁ గెంతప్రోత్సాహము చేయుచుండినను వెనుదీయుచుండెను. కాని యొకటియైనను రెండవసారి పొడువ లేదు. ఇట్లు దుర్గకవాటంబులు భేదింపఁజేసిన గజసాధనంబు వ్యర్థంబయ్యె. ఇట్లిరువది దినంబులు దుర్గంబు భేదింపఁ బ్రయత్నంబులు సలిపిరి. కాని ప్రయోజనము లేకపోయెను. అంతరాయల సైన్యంబులో ఫోర్చుగీసుసేనా నాయకుఁడగు క్రిస్తొవిడిఫ్ గరీడో యనువాఁడు తా నాదుర్గంబును భేదించెదనని పలికి ప్రాకారపు గోడకుఁ గన్నము ద్రవ్వింప నారంభించెను. సైనికులు మహాప్రోత్సాహంబు వహించి త్రవ్వుచుండిరి. ఆపని కంతరాయము గల్పింప నెంచి కోటలోని వారు పైనుండి యగ్నివర్షింపజొచ్చిరి. అందుచేఁ గొందఱు శరీరంబులు కాలుటచే ఖననసాధనంబులు విడిచి వెనుకకు రాఁగా మఱికొందఱా పని నిర్వహించుచుండిరి. రాయలసైనికులు కొందఱు విలునమ్ములు పూని గోడపైకి వచ్చినవారిని గొట్టుచుండుటచే వారు నిర్భయంబుగా వచ్చి కుడ్య భేదనాక్రియ కంతరాయము కల్పింప లేకపోవుచుండిరి. సైనికులు నిర్విఘ్నంబుగాఁ దమపని నొనర్చుచుండిరి. అంతఁ గోటలోని

వారు భయాక్రాంతులై తక్కిన స్థలంబులఁ గాచుచున్నవారిలోఁ గొంద ఱీస్థలంబునకు వచ్చి తమశక్తికొలంది నప్పనికి విఘ్నమొన ర్చుచుండిరి. ఈ సమయంబున విజయసింహుండు రామరాజా దుల సాయంబున నున్నతమగు నిచ్చెన యొకటి వేరొక ప్రక్కకుఁ గొనిపోయి, పైనుండి రక్షకభటులు వారించుచున్నను సరకుగొ నక మహోదగ్రుఁడుగు నీటెతో వారిని గ్రుచ్చి తొలంగించుచు నతి సాహసంబున గోడపై కెక్కి యచ్చట నున్న రక్షకభటు లను బాఱఁదోలెను. వారు పోయి మఱికొందఱను గొనివచ్చు నప్పటికి రామరాజతిరుమలరాయలు పై కెక్కి విజయసింహునకు దోడ్పడ నిలచిరి. ఈవార్త తెలిసి రెండవప్రక్కనున్న దుర్గాధ్య క్షుఁడు కొంతసైన్యముతో వచ్చునప్పటికిఁ బెక్కండ్రు పై కెక్కి వచ్చిరి.అంతతోషల్ ఖాను,సహింపక వారితోయుద్ధంబొనర్పనారం భించెను. ఇట్లిచ్చట తుములసమరంబు ఘోరంబుగా జరుగు చుండె. అట ఫోర్చుగీసు సేనానాయకుఁడు సిద్ధమొనర్న్నములోఁ దుపాకిమందు కూరి యంటించెను. అది పెద్ద ధ్వని చేయుచు, గోడను బ్రద్దలు గావించె. అంత సైనికులాగోడను రయంబునఁ బడఁద్రోచి లోపలఁ బ్రవేశించిరి. వీరట్లు నిరాటంకంబుగా కోట నలువంకలఁ బర్వెత్తుచు గానవచ్చిన శత్రువులతోఁ బోరాడి గెల్చుచు మెల్లమెల్లన బోయి దుర్గద్వారంబులు తెఱచి వైచిరి. ఆ దుర్గంబు రాయల సైన్యంబులతో నిండిపోయెను. తోషల్ ఖాను చేయునదిలేక రాయలకు వశుఁడయ్యెను. రాయ లతనిని, నతనిముఖ్యసహచరులను బట్టుకొని బంధించి విజయనగరంబున

కంపివేసెను. రాయలు తన సైనికులు కోటలోని ధనవంతులధనం
బుల నపహరించుచుండ వారిని వారించి వారిధనంబుల వారి
కిప్పించి గౌరవించెను. అటనుండి వెడలి పోయెద మనువారిని
వారివస్తువులతోఁ గూడ వెడలిపోనిచ్చె. అందుండెద మన్నవా
రిని దగువిధంబున నాదరించి సంతసింపఁజేసెను. రాయ లిట్లు
ధర్మపరుండై వర్తించుటను జూచి ప్రజలత్యానందంబు చెందిరి.
రాయ లనంగసేనకై యందు వెతకించెను. కాని యెచ్చటను
గానరాలేదు. రామరాజాదులు రాయల కెంతవరకును గానరా
లేదు. జయలక్ష్మి వచ్చితన్ను వరించి కైదండ నొసంగి సంత
సింపఁజేయుచున్నను, ననంగసేన లేకపోవుటచే విచారం బందక
పోలేదు. రాయచూరు వశమైన నాఁటిరాత్రి సంగ్రామాయాస
ఖిన్నులై యుండుటచే సైనికులు సుఖనిద్ర చేయుచుండిరి. ఆ
సమయంబున రాయల పటకుటీరంబులోని కెవ్వరో మువ్వురు
మనుష్యులు పోవుచుండిరి. ద్వారపాలకులు మేల్కని యున్నను
వారి నిర్బంధింపలేదు. వా రట్లు నిరాటంకంబుగా లోపలఁ బ్రవే
శించిరి. రాయ లింకను నిద్రచెందక యేదియో యోజించుచుం
డెను. ఆకస్మికముగా ననంగసేన పోయి రాయల పాదపద్మంబు
లపైఁ బడి యేడువ నారంభించెను. రాయ లామెను లేవఁదీసి
సమీపమునఁ గూర్చుండఁబెట్టుకొని "ప్రియురాలా! నిరపరాధు
రాలవయిన నిన్ను నిందించితిని. ఆతప్పు క్షమించి వెనుకటి యను
రాగంబు నాపై నుంచి వఱలుము." అని పలికెను.

"సార్వభౌమా! మీవాక్యంబులు నా కచ్చెరువును

బుట్టించుచున్నవి. మీరు తప్పు చేసితిరా! ఆతప్పును క్షమింపవ లెనా? మీరు చనువిచ్చి మాగర్వంబును వర్ధింప నెంచుచు న్నారు. కాని మీరు చనువిచ్చుచున్న కొలఁదిని నేను భయం బుతో వర్తించుచుండు. మీ దాసురాలిచెంత నట్టి మాటలాడ రాదు. ఎవరి నిగ్రహానుగ్రహంబులు రాజ్యాధిపతులను బిచ్చఁ గాండ్ర గాను, బిచ్చఁగాండ్రను రాజ్యాధినేతలనుగాను జేయఁజా లునో, యట్టి మీ యనుగ్రహంబు నాయం దుండవలయును. కాని మా యనురాగంబుతోఁ బనియేమి? కావున నిప్పట్టున నీ దాసురాలి తప్పును మన్నించి తొంటిరీతిని ప్రేమంబుతోఁ జూడుఁడు.” అని యామె కన్నీరు విడుచుచుఁ బలికెను.

“ప్రేయసీ! నీయందు సుంతేనియు లోపంబులేదు. నే నే తప్పొనరించితిని? నీ చరిత్రంబును దెలిసికొనిన పిమ్మట మిక్కిలి విచారించితి. ఈ రాయచూరునం దున్నప్పు డెప్పటి వృత్తాంత మప్పుడే రామరాజాదులవలన దెలియుచున్నది. నీ సత్ప్రవర్తనకు మిక్కిలి యానందించితిని.” అని యాదరించెను. తరువాత రామ రాజు మంత్రి పన్నిన యుక్తులను, వానిని దా ముపయో గించిన విధంబులనుజెప్ప రాయ లానందముచెంది మూడవనాఁటి సాయంకాలంబునకు మహావైభవంబుతో విజయనగరంబునకరిగె.



## ముప్పదియాఱవ ప్రకరణము

### సంతోషము

కృష్ణదేవరాయలు రాయచూరును వశంబు గావించుకొని విజయనగరంబు చేరిన మఱునాఁడు జయోత్సవమును జేయ నిర్ణయించెను. ఈ మహోత్సవంబు జరుపు భారంబంతయు నీ తిమ్మరుసుమంత్రి వహించి యుండెను. నాఁటి మధ్యాహ్నము నాల్గుగంటలకు దర్బారు నిర్ణీతం బయ్యె. ఆదర్బారునకు, నానా దేశాధీశ్వరులును, దుర్గాధీశ్వరులును, సేనానాయకులును, నప్పురంబున నున్న మహాపురుషులును వచ్చి సభామందిరంబున నిర్ణీతవిష్టరంబుల నుపవిష్టు లైరి. రెండువేలమంది కూర్చుండ దగినంత వైశాల్యంబుగల సభాభవనంబు జనంబుచే నిండి కిటకిట లాడుచుండెను. అంతఁ గృష్ణరాయలు తన ముఖ్యమంత్రియగు తిమ్మరుసుతో నే మేమియో మాటలాడుచు, వందిమాగధులు నుతించుచుండగా మహావైభవంబుతో సభామందిరంబు ప్రవేశించి. యతిభక్తితో లేచి నమస్కరించుచున్న సభాసదుల వందనంబులఁ గొనుచు, నవరత్నఖచితంబగు సింహాసనంబున నాసీనుం డయ్యె. సభాసదులును దమ తమయాసనంబుల నాసీనులైరి. అప్పుడు తిమ్మరుసు లేచి సభాసదులం జూచి "ఓ సభ్యులారా! చిరకాలంబునుండి కోరుచున్న రాయచూరు దుర్గముజయింపఁ బడినందుల కమందానందంబు నొంది సంగరంబున శరీరంబుల కాసింపక పోరినవీరాగ్రేసరులకుఁ దగిన బహు

మానంబు లర్పింప నీసభ చేయఁబడినదని చెప్పుచుండఁగా బద్ధు లైన కొందఱఁ బురుషుల వెంటఁ బెట్టుకొని నలువురు వీరులు సభామధ్యంబునుఁ బ్రవేశించిరి. తిమ్మరుసు వారిని గౌరవించి యాసనంబునఁ గూర్చుండ నియమింపఁగా విజయసింహుండును, రామరాజును. తిరుమలరాయలును, శంకరరెడ్డియుం గూర్చుం డిరి. అప్పుడు మంత్రి తాఁ జెప్పినచొప్పున వర్తించి కార్యంబు సాధించుకొని వచ్చినవారిని మిక్కిలి గౌరవించి నుతించెను. మఱియు దుర్గసాధనంబున విజయసింహుండు చూపిన సాహ సంబును గడుంగడు మెచ్చుకొని నుతించి యతని సంతసింపఁ జేసెను. రామయమంత్రియుఁ, బ్రహ్మేశ్వరుండును; రుద్రదేవుం డును, దృఢతరపాశబద్ధులై యవనతవదనులై యెవ్వరిం జూడఁ జాలక మిక్కిలి పరితాపంబు చెందుచుండిరి. అప్పుడు తిమ్మరుసు సార్వభౌముం జూచి “ఓ చక్రవర్తీ! ఓ సభాసదులారా! బద్ధులై వచ్చిన పురుషులను గూర్చి మీకుఁ గొంచెము తెలుప వలసి యున్నది. ఈతఁ డుదయగిరి దుర్గాధీశ్వరుని మంత్రి. ఇతని పేరు రామయామాత్యుండు. ఇతఁడు మన పురంబునఁ బిచ్చివా నివేషంబున వర్తించుచుఁ జేసినకృత్యంబు లందఱకుం దెల్లంబె. ఇతఁడు తమదుర్గంబును జయించుట వలనఁ గల్గిన కోపంబును మనంబున నుంచికొని మనకుఁ దగిన ప్రతీకారము చేయఁదలంచి మహమ్మదీయుల కేకీభావ మ్మలవడఁజేసెను. కాని నే నది తెలిసి కొని రామరాజాదులఁ బంపఁగా వారు, మహమ్మదీయులకు భేద ముకల్గించి యనంగసేనమానంబు గాచి యీరామయామాత్యు

దులను బంధించికొనివచ్చిరి. ఇంక నెన్నియో యద్భుతకృత్యంబు లొనరించిరి. రామయమంత్రిచేసిన యపాయకర కృత్యంబుల విఫలంబులంజేయుటయే కాక నాప్రయత్నంబులనుబూర్తిగా ఫలింపఁ జేసినభగవంతున కెన్నియో వందనంబు లర్పించెదను. ఆరామయ మంత్రియు నతని సహచరులును బద్ధులై నీకు వశులై యున్నారు. నిగ్రహానుగ్రహంబులును, వారి జీవనంబులును, నీయధీనములు. రాజద్రోహంబు లొనర్చిన వీరికేమి శిక్ష విధింపవలయునో, దేవరయే సెల వొసంగ, దగు." అని పలికి యూరకుండె.

సభాసదులందఱును రాయలు విధించెడి శిక్ష కెదురు చూచుచుండిరి. అప్పుడు చక్రవర్తి వారిబంధనంబులు విప్పించి యాసనంబులఁ గూర్చుండ నాజ్ఞయిచ్చి, రామయమంత్రిం జూచి ఇందులకు నీ వేమి చెప్పుకొందు వని యడిగెను.

అప్పుడు రామయమంత్రి లేచి సార్వభౌమున కభిముఖుండై, "ఓ వసుంధరాధిపా! నాకు రాజభక్తియే ముఖ్యము. దానికి విరుద్ధంబుగా నున్నవారల నభిముఖులనుగాఁజేయ సమకట్టుచుందు. దానిఁ బ్రతిబంధించు వారిప్రాణంబులఁ దప్పకహరింతును. నే నట్లు ప్రయత్నించియు నక్కార్యంబు నెఱవేర్ప లేకపోయిన నాప్రాణంబులు విడువవలసినదే! నేలేని సమయంబున వచ్చి మాదుర్గంబును జుట్టుముట్టి ధ్వంసంబు గావించితిరి. చిరకాలంబునుండి యుదయగిరివారి ద్రవ్యంబు తినుచున్న నేను నాయాపద సహింపలేక యీసమయంబున రాజభక్తి వెల్లడి యగునట్లు శత్రువులనుండి మాదుర్గంబును దీసికొన నెంచి యున్నిప

నుల నాచరించితిని. తిమ్మరుసును జంపిన మీ రాజ్యంబు సుల భసాధ్యంబని యెంచి యట్లు చేసితిని. మహమ్మదీయుల సంతసిం పఁజేసి వారిసాయంబు చెందుటకై వా రభిలషించిన యనంగ సేనం గొనిపోతిని. తిమ్మరుసును జంప యత్నించిననాఁడు నాయనుచరులను బాధించుటచేతను, నితఁ డుండఁగా నాహితుం డగు రుద్రదేవుని ముక్తాంబ వరింపదన్న భయంబుచేతను విజయ సింహునిఁ జంప సమకట్టితిని. ఆ పనులు నేను చేయ రానివే. అయినను, రాజభక్తి న న్నావేశించి మదోన్మత్తునింగాఁ జేసి నాచేఁ జేయించినది. అవి యన్నియును దుష్టకార్యంబు లయి నను రాజభక్తిపరవశుండనగు నాకుఁ బుణ్యకార్యంబులుగానే చూపట్టు చున్నవి. మిమ్ముల యాచించి రాజ్యంబు చెందఁగల నను ధైర్యంబు నా కున్నను బ్రార్థనాలభ్యంబగు దానికంటెఁ బౌరుషలభ్యంబైనదే ముఖ్యంబని యెంచి యట్లు చేసితిని. వేద శాస్త్ర పురాణాదులను, దదధ్యయనపరులగువారిని రక్షించు సత్ప్రభువులగు మిమ్ముల నాశ్రయింపక విమతస్థులగు మ్లేచ్ఛుల నాశ్రయించుట యకృత్యం బయినను నాకది సత్కృత్యంబుగానే కానవచ్చుచుండె. మారాజకుటుంబము నిమిత్త మింతపనికిఁ జేసితిని గాన నాప్రాణంబులు మీ రకర్షించినను విచారం బుం డదు.” అని గంభీరస్వరముతోఁ వాక్రుచ్చెను.

అది విని సభాసదు లందఱును నాశ్చర్యము నొందుచుం డిరి. ఆరాజమంత్రు లిర్వురును, నామంత్రివర్యుని బుద్ధిచాతుర్యం బునకును, రాజభక్తికిని, నిరర్గళగంగాప్రవాహమువంటి యుతని

వాగ్ధోరణికిని, మిక్కిలి సంతసించిరి. అంత తిమ్మరుసు "ఓ రామ యామాత్యా! మంత్రిపదంబున కెంతయుం దగియున్నవాఁడవు. నీవునాకు శత్రువవైనను నీగుణంబులు వందనీయములే యగుచున్నవి. పెక్కు సంవత్సరంబులనుండి మంత్రిపదంబున వర్తించుచు, రాజనీతికోవిందుడనై యెక్కుడనుభవంబుగల నావంటివానిని సైతము గడగడలాడించిన నీమేధావిశేషంబు వర్ణనీయమైనది. ముక్తాంబసాయము లభింపనిచో నీవు నీకార్యంబులను సాధించియుందువు. నీ వసాధారణ ప్రజ్ఞావంతుడవు" అని పలికి సార్వభౌముం జూచి "ఓ రాజాధిరాజా! వీరికేమి శిక్షవిధింతురో సెలవిండు" అని పలికెను.

అది విని రాయ లాలోచించుచు విజయసింహుని వైపు చూచెను. ఎక్కుడపకారంబుచేసిన రామయామాత్యునిఁ గూర్చి యతని యభిప్రాయ మెట్లుండునో తెలిసికోవలె నని యతని యభిప్రాయము. అప్పుడు విజయసింహుండు లేచి "ఓ రాజేంద్రా! కార్యావసరంబునుబట్టి నాకితఁడనేకాపదలు గల్గించినను వందనీయుఁ డనినామతము. ఇట్టి యప్రతిమ ప్రతిభావంతుని ప్రాణంబులు దియించిన నీదేశంబున కొకలోపము సంభవించునని చెప్పఁగలను." అని పల్కెను.

ఆ వచనంబులు రామయమంత్రి విని యత్యానందంబు నొంది యతని యుదారగుణంబుల నగ్గింపసాగెను. అనంతరము రాయల యనుమతివలనఁ దిమ్మరుసు లేచి "ఓ రామయమంత్రీ నీవు వధ్యుండవైనను రాజనీతిపరాయణుండైన చక్రవర్తి నీకెట్టి

ముపకారంబును జేయఁదలంచి యుండలేదు. నీవు మాకు వశుండ వైతివి. మాయిష్టాను సారముగా నిన్నేమిచేసినఁ జేయవచ్చుఁ గాన సహాయమంత్రి పదంబున నిన్ను బంధించెదము. విజయ నగర రాజ్యలక్ష్మి నిరపాయురాలుగా నుండుటకు నీబుద్ధి నూతగా నిచ్చుచుందుము.” అని పలికెను.

అది విని సభలోనివారందఱును మిక్కిలియాశ్చర్య మొందిరి. మహాపకారం బొనర్చినవానికి మహోద్యోగం బిచ్చుట యయుక్తమనియు, నిక నందఱు నిట్టి పనులొన ర్చుటకే ప్రయత్నించి రాజ్యంబునకు వినాశంబు గల్గింతు రనియుఁ గొందఱు గుసగుసలాడ నారంభించిరి.

అంత రామయమంత్రి లేచి “ఓ మంత్రిపుంగవా! నీ ప్రతిభావిశేషంబు ముందట మావంటివారి బుద్ధులు దివిటీ ప్రోలనున్న దీపంబుల చందంబున నుండును. నీతో సమానులు లోకంబున లేకపోవుటయే కాక నీ సుగుణంబులఁ జక్కఁగఁ దెలిసికొనువాఁడైన నుండ రని నిక్కముగా వక్కాణింపఁగలను. నిన్నుఁ జంపఁదలంచిచంపలేకపోతినికానినన్నునీవు నిశ్చయంబుగాఁజంపితివి. నామనంబున నున్న శత్రుత్వమును బూర్తిగా నశింపఁజేసి నన్నొక క్రొత్తరామయమంత్రినిగా నొనర్చితివి. నా శరీరము మీకు వశ మైనను నా మానసంబు మీ కధీనముకాదు. అందుచే నది మీ యాజ్ఞను దిరస్కరించు చున్నది. ఏమిచేయుదును? నారాజభక్తి ని వ్యర్థముచేయలేను. చేసిన మాప్రభుకుటుంబమునొద్దనే మంత్రి త్వముచేయవలెను లేనిచో మునివృత్తి నవలంబింపవలెను. మహాత్మ

భురాజ్యంబును స్థాపింపలేకపోతిని కాని యట్టి యసమర్థుండ నగు నాకు మునివృత్తియే యుచిత మైనది.” అని పలికెను.

తిమ్మరు సతని వచనంబులకు సంతసమంది సభాసదులలో నున్న విజయసింహుని జూచి “ ఓ వీరవరేణ్యా! నీవు దృఢతర రాజభక్తియుతుండవై మాకు పెక్కు లుపకారంబు లొనరించి రణరంగంబున నెక్కుడుసాయ మొనర్చిన నీకు మాకుస్వాధీనులై యున్న మణాంబను బహుమతిగా నొసంగితిమి. నీకొక వరమి చ్చెద నని రాజేంద్రుండు చెప్పియున్నాఁడు. ఇఁక నేమికావల యునో యిప్పుడే కోరుము.” అని యడిగెను.

“ ఓ మంత్రిసత్తమా! మీ కధీనురాలై యున్న ముక్తాం బను బహుమతిగానొసంగినందుల కానందము చెందితిని. రామ యమంత్రి మీ కధీనుఁడై యున్నాఁడు. ఉదయగిరి మీకు స్వా ధీన మైయున్నది. రామయమంత్రియుతమయిన యుదయగిరి రాజ్యంబు నిచ్చి సంపన్నుంతఁ జేయుము. ఇదియే నాకోరిక.” అని విజయసింహుండు కోరెను.

అందులకు సభాసదు లందఱును సంతసించిరి. అనంత రము తిమ్మరుసు “ఓరామరాజా! నీకు జక్రవర్తిపుత్రికయైనతిరు మలాంబను గానుకగానిచ్చుచున్నాము. ఓ తిరుమలరాయా!నీకు రాజపుత్రికయగు వెంగళాంబను గానుకగా నొసంగుచున్నారము. శంకరరెడ్డి! నీకు సేనాధిపత్య మిచ్చినారము.” అని పల్కి వా రిని సంతసింపఁ జేసె. అనంతరము తిమ్మరుసు సేనా నాయకులకుఁ దగిన బహుమానములిచ్చి సంతసింపజేసెను. రుద్రదేవునకుఁ

దము సైన్యములో నుద్యోగ మిచ్చెను. ఆ బహుమతులకు సభా
సదులందఱును మిక్కిలి యానందించిరి. తరువాత నొక శుభము
హూర్తంబున సమ్మూర్మడు వివాహంబులను మహావైభవంబు
తో నొనర్చిరి. తిరుమలరాయ రామరాజులు కృష్ణరాయలకు
భుజములవలె నొప్పాఱుచుఁ దదనంతరంబునఁ గూడఁ జరిత్రంబు
లమిక్కిలివిఖ్యాతి గాంచిరి. విజయసింహుఁడు ముక్తాంబతోడను
రామయమంత్రి ప్రహరేశ్వరులతోడను నుదయగిరిఁ బ్రవేశించి
ప్రజారంజకముగా రాజ్యంబును బాలించుచు సుఖంబు లనుభ
వించు చుండెను.




శ్రీచింతామణీ ప్రెస్, రాజమండ్రి.